# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 13 సంచిక : 10 హైదరాబాద్ 171 అక్టోబర్ 2015 పేజీలు : 68 రూ. 20

- తెలంగాణలో ఎన్‌కౌంటర్ హత్యలు
- సంక్షోభానికి చిహ్నం రైతు ఆత్మహత్యలు
- మతోన్మాద అసహనం - కల్బుర్గి హత్య
- తెలంగాణ అధ్యయనం ఎందుకు, ఎలా?
- సంక్షేమం పేరుతో మద్యానికి ప్రోత్సాహం
- ముగింపులేని పెట్టుబడిదారీ సంక్షోభం
- అలన్ కుర్ది మృతదేహం కన్నీటి కడలి అల




## 2008లో వీక్షణం నుంచి విడుదలైన ప్రామాణిక గ్రంథం
## Fifty Years of Andhra Pradesh 1956-2006
## కు కొనసాగింపుగా




# సమగ్ర తెలంగాణ



# ఆర్ ఎస్ రావు స్మారకోపన్యాసం, సదస్సు

### నవంబర్ 14-15, 2015 శని, ఆదివారాలు
### హైదరాబాదులో ఉండడానికి తయారు కండి!
### ఆర్.ఎస్. రావు స్మారకోపన్యాసం, సదస్సులకు హాజరు కండి!

అరుదైన మార్క్సిస్టు మేధావి, రాజకీయార్థిక శాస్త్రవేత్త, ప్రజాఉద్యమాల సహచరుడు ప్రొ. ఆర్.ఎస్. రావు (1937–2011) సంస్మరణలో ఆర్.ఎస్. రావు మిత్రులు, వీక్షణం సంయుక్తంగా గత నాలుగు సంవత్సరాలుగా ఏటేటా స్మారకోపన్యాసం, స్మారక సదస్సు జరుపుతున్న విషయం మీకు తెలిసిందే. ఆర్.ఎస్. రావుకు ఆసక్తి ఉండిన, ప్రజా ఉద్యమాలకూ, సామాజిక చలనానికీ కీలకమైన అంశాల మీద లోతైన విశ్లేషణలు చేసేందుకూ, పంచుకునేందుకూ, విస్తరించేందుకూ ఈ స్మారక కార్యక్రమం జరుగుతున్నది.

ఈ సంవత్సరం కార్యక్రమ ఇతివృత్తం – గ్రామీణ ప్రాంతాల నుంచి వలసలు, ఆర్థిక వ్యవస్థలో పరివర్తన. ఆర్.ఎస్. రావు ఈ విషయం మీద విస్తృతంగా ఆలోచించి ఎన్నో రచనలు చేశారు. అట్టడుగు గ్రామీణ ప్రాంత అనుభవాల నేపథ్యం నుంచీ, సిద్ధాంతస్థాయి రాజకీయార్థిక శాస్త్ర అవగాహనల నుంచీ కూడ ఈ సమస్యపై అన్వేషించవలసిందీ, ఆలోచించవలసిందీ, సిద్ధాంతీకరించవలసిందీ, ఆచరణకు అన్వయించవలసిందీ ఎంతో ఉంది. ఆ దిశగా ఒక చిన్న ప్రయత్నం ఈ సంవత్సరం ఆర్.ఎస్. రావు స్మారకోపన్యాసం, సదస్సు కార్యక్రమాలు.

అందరూ ఆహ్వానితులే.

171 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

అక్టోబర్ 2015
సంపుటి : 13
సంచిక : 10





**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ - డి. విజయభాస్కర్; కరీంనగర్ - ఎస్.తిరుపతి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ - ఎం. నర్సయ్య; రంగారెడ్డి - వి. శంకరయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్న వారు ఎస్. వెంకటేశ్)



**‘వీక్షణం’ పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై ‘veekshanam’ అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ - **01391101002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2015 ఆగస్టు నెలలో వచ్చిన విరాళాలు - యాళ్ళ సూర్యనారాయణ, పార్వతీపురం, విజయనగరం - రు. 1000, సి. పటేల్, గుంటూరు - రు. 1000, ఎస్. రాజు, హైదరాబాద్ - రు. 10,000. మిత్రులందరికీ కృతజ్ఞతలు- సం.**

సెప్టెంబర్ వీక్షణంలో 'అదనపు విలువ గురించి మార్క్స్' అన్న వ్యాసంలో రచయిత ఏమి చెప్పారో, ఏమి చెప్పదల్చుకున్నారో సరిగా అర్థం కాలేదు. మార్క్స్ 'కాపిటల్' నుండి చాలా ఉటంకింపులున్నాయి గానీ, ఆ ఉటంకింపులకూ, వ్యాసం మొదటి పేరాలో ఆయన ప్రకటించిన లక్ష్యానికీ సంబంధం అర్థం కాలేదు.

'మార్క్సిజాన్ని కొందరు మేధావులు ఇచ్చవచ్చినట్లు వక్రీకరిస్తున్నారు. విలువ నియమం భంగం కాకుండా మార్క్స్ అదనపు విలువని శాస్త్రీయంగా వివరించినప్పటికీ అది తప్పనే వారు ఏర్పడ్డారు – అదీ 'మార్క్సిస్టు' ముద్రతో' అని ప్రారంభించిన ఆయన ఆ మేధావులెవరో, పోనీ ఆ మేధావులు ఏ రచనలో అలాంటి వాదనలు చేశారో వివరించలేదు.

'అలాగే, సమాన విలువలు మారకం అవుతూనే అదనపు విలువ వస్తుంది. ఇది మార్క్స్ శాస్త్రీయంగా రుజువు చేసిన విషయాలు. వీటిని తప్పన్నా, వక్రీకరించినా అది మార్క్సిజం అవదు. మహా అయితే మరొకరిజం కావచ్చు' అన్నారు వ్యాసకర్త.

అదనపు విలువ గురించి మార్క్స్ చెప్పిన దాన్ని తప్పన్న ఆ మరొకరి రచనలో వాదనలను పేర్కొని, అవి ఎలా తప్పో వివరించి ఉంటే, మార్క్సిజం అభిమానులకు ఆ మరొకరి ఇజాన్ని తిరస్కరించే శక్తి వచ్చేది. ఇప్పటికైనా ఆ వాదనలున్న రచనల రెఫరెన్సు ఇస్తే, నా బోటి ఆసక్తి ఉన్న విద్యార్థులకు ఉపకరిస్తుంది.

**– ఎన్. లెనిన్‌బాబు**
జె.ఎన్.యు. న్యూఢిల్లీ

వీక్షణంలో వస్తున్న వ్యాసాల్లో భాషా శైలి సామాన్య పాఠకులకు అర్థం అయ్యే విధంగా ఉండడంలేదు. అట్లాగే వ్యాసాల్లో ఎక్కువ సమాచారం ఉంటుంది. ఇంకా కొంచెం లోతైన విశ్లేషణాత్మకంగా ఉంటే బాగుంటుంది.

**– రాజేశ్వరి**
విజయవాడ

నిత్య చైతన్యంతో నిర్విరామంగా కొనసాగడానికి వీక్షణం నిర్వహిస్తున్న వార్షిక సమావేశానికి ఎలాగైనా రావాలని ఉత్సాహపడ్డాను. కాని ఈ నెల 4న తండ్రి మరణంతో హాజరుకావడం సాధ్యం కాలేదు. కాబట్టి ఉత్తరం రాయాల్సి వస్తున్నది.

నా అరెస్టు అనంతరం 8 సంవత్సరాల జైలు జీవితంలో వీక్షణం పాఠకుడిగా ఉంటూనే ఎత్తైన నాలుగు గోడల మధ్య నలిగిపోతున్న ఖైదీల సమస్యలను బయటి సమాజం దృష్టికి తీసుకురావడం కోసం నేను చేసిన ప్రయత్నాలకు వీక్షణం అందించిన సహకారం మరువలేనిది. నేనేకాదు వేరువేరు జైళ్లల్లో నుండి మరికొద్ది మంది రాసిన అనేక రచనలను ప్రచురించడం ద్వారా ఇతర రాష్ట్రాల జైళ్లలోని ఖైదీల దయనీయ పరిస్థితులు వెలుగులోకి తేవడం ఆహ్వానించదగ్గ పరిణామం. ముఖ్యంగా దేశ, విదేశాల్లో జరిగే అనేక పోరాటాలపై విశ్లేషణాత్మక వ్యాసాలతో పాటు సంఘటనల సమాహారాన్ని సేకరించి ప్రచురించడంలో వీక్షణం బాధ్యతాయుతమైన పాత్ర నిర్వహించడం ఎంతైనా అవసరం. ఎందుకంటే లాభార్జన వెంట పరుగులు తీస్తున్న ప్రధాన స్రవంతిలోని మీడియా సామాజిక బాధ్యతతో నిర్వహించాల్సిన అనేక కర్తవ్యాలపై దృష్టి పెట్టడం క్రమంగా తగ్గిపోతున్నది. ఇటీవల విప్లవ రచయిత చలసాని ప్రసాద్ గారి హఠాన్మరణం అటు కర్ణాటకలో సాహితీవేత్త కలబుర్గిని కాషాయ మూకలు హత్య చేశాయన్న వార్తలు నన్ను కూడా కలచివేశాయి.

మతతత్వ శక్తులు అధికారంలో ఉన్నాయని తెలిసి కూడా కులతత్వం, మతతత్వంపై పదునైన వ్యాఖ్యలు చేస్తూ శాస్త్రీయ బావజాల వ్యాప్తికి కృషి చేయాలంటే ఎంతో సాహసంతో పాటు కమిట్ మెంట్ ఉంటే తప్ప సాధ్యం కాదు. నేను కర్ణాటక జైళ్లో ఉన్నప్పుడు సాహితీ వేత్త కలబుర్గి చేసిన వ్యాఖ్యలు కొన్ని పత్రికల్లో చదివాను. కేంద్రంలో అధికారం చేజిక్కించుకున్న కాషాయ మూక నుండి ప్రగతిశీల శక్తులకెలాంటి ప్రమాదం పొంచి ఉన్నదో నిన్నటి కలబుర్గి హత్యా సంఘటనే సాక్ష్యం. మతం మత్తుతో పాటు అధికార మత్తు నెత్తికెక్కిన మోడీ మూకల ఆగడాలను అడ్డుకోవడానికి ఉద్యమ శక్తులన్నీ సంఘటితంగా ఉద్యమించడం మినహా మరో మార్గం లేదేమో!

**– ఎ. కొండయ్య**
కడప

వీక్షణంలో ప్రతి నెల కూడా విజ్ఞానయుతంగా చాలా మంచి వ్యాసాలే వస్తున్నాయి. ఏ ఒక్కటి కూడా వదలిపెట్టదగినదిగా లేదు. పత్రికను ఎక్కువ మందికి చేరవేయవలసిన బాధ్యత కూడా మన అందరి మీదా ఉన్నది. చందాదారులు మాత్రమే చదివి ఊరుకుంటే ప్రయోజనం లేదని, ఎంతో మందికి చదివి వినిపించాలని నా కోరిక.

**– కడియాల సుబ్బనాచారి**
నెల్లూరు

మిత్రులు కొంత మంది వీక్షణం పత్రిక గురించి చెపితే విని మిత్రులు పి.వి. రమణ ద్వారా 'వీక్షణం' ఫిబ్రవరి 2015 నుంచి పాత పత్రికలు సైతం ఇమ్మంటే, రమణ ఫిబ్రవరి పత్రిక లేదంటూనే అందులో 'రంగనాయకమ్మ వ్యాసం' జిరాక్స్ కాపీతో పాటు ఆగస్టు సంచిక వరకూ ఇచ్చారు. అన్నీ చదివాను. ముఖ్యంగా వీక్షణం పత్రికలో ఉన్న ప్రత్యేకతా, నిష్పాక్షికతా, దాని నిర్వాహకుల నిజాయితీనీ రుజువుచేస్తున్నది. ఎలా అంటే, పత్రికా నిర్వాహకుల్ని నిర్లక్ష్యంగానూ, బాధ్యతారహితంగానూ, అవివేకంగానూ, కువిమర్శలు చేసిన వారి వ్యాసాల్ని కూడా, ఏమాత్రం వివక్షతా, అసహనం చూపకుండా ప్రచురించడం నిజమైన మార్క్సిస్టు నిజాయితీ లక్షణం. పాఠకుల అసహనాన్ని, అవివేకాన్నీ, పసలేని విమర్శల్ని కూడా ప్రచురించడమే పత్రిక నిజాయితీకి ప్రత్యక్ష సాక్ష్యం. ఈ గుణంతో పాటు, ఏమాత్రం అలక్ష్యం, వివక్షత లేకుండా అందరికీ స్థానం కల్పించడంతో పాటు, మార్క్సిజం తాలూకు అసలు భావాలు పాఠకులకు అందించేందుకు తగిన విధంగా, జాతీయ, అంతర్జాతీయ విషయాల్ని అందించడం, తదితర విషయాల పట్ల నాకు ఎంతో సంతృప్తినిచ్చింది. కనుక నేను ఇక నుంచి శాశ్వత పాఠకుడిగా వీక్షణానికి ఉండాలని నిర్ణయించుకున్నాను. అయితే ఇదే సందర్భంలో మరొక విషయం. మన తపాలా సేవలు నేడు తప్పుదారి పడుతున్నాయి. నా మిత్రులకు నేను ఎన్నో ఉత్తరాలు రాశాను అందలేదు. అలాగే పుస్తకాలు పంపాను అందలేదు. అందువలన పోస్టల్ వాళ్లను నమ్మితే పత్రిక అందుతుందనే గ్యారంటీ లేక, మిత్రులు రమణ గారికి నెలవారీ చందా చెల్లించి, ఆయన ద్వారా పత్రిక పొందాలని నిర్ణయించుకుని, గత మార్చి సంచిక నుంచి, నేటి ఆగస్టు సంచిక వరకూ తీసుకున్నాను. వీక్షణం సంపాదకులు కొంచెం శ్రద్ధా, అభిమానం చూపగలిగితే 2015 జనవరి, ఫిబ్రవరి సంచికలు కూడా నాకు పంపిస్తే చాలా సంతోషం.

**– బి.ఎ. నారాయణరావు,**
విశాఖపట్నం

2015 జూన్, జులై నెలలో రంగనాయకమ్మ రాసిన వ్యాసాన్ని విమర్శిస్తూ 2015 సెప్టెంబర్ సంచికలో ఇ.ఎస్. బ్రహ్మచారి రాసిన వ్యాసానికి స్పందన, ఇది. అయితే అతను తన వ్యాసంలో రంగనాయకమ్మ పేరును ప్రస్తావించలేదు, ఎందుకోమరి? ఇ.ఎస్. బ్రహ్మచారి వ్యాసంలో విమర్శించదగ్గ విషయాలు చాలా ఉన్నాయి. నేను అసలు విషయానికి మాత్రమే పరిమితమవుతున్నాను.

'శ్రమ శక్తి'ని గురించి మార్క్స్ పొరపాటుగా రాసిన విషయాన్ని, ఇ.ఎస్. బ్రహ్మచారి, మార్క్సిస్టు ముసుగు ధరించి బూర్జువా ఆర్థిక శాస్త్రాన్నే తిరిగి చెప్పడానికి ఉపయోగించుకున్నాడు. ఐదు పేజీలను మార్క్సిస్టు పదజాలంలో నింపి చివరన 'ఆ కాలంలో తయారైన సరుకులు యజమానివే' అన్నాడు. తను ఏదో పరిశోధించి నిరూపణ చేసి తేల్చిన విషయం కాదు, అది. 'అదనపు విలువ' యజమానికి చెందుతుంది అనడానికి కారణం ఏమంటే అది యజమాని అదృష్టం, అట! 5 పేజీలలో తను చెప్పిన ఏముక్కా అతడు చెప్పిన దాన్ని సమర్థించడానికి ఉపయోగపడదు. అందుకే చివరికి 'అదృష్టాన్ని' పట్టుకున్నాడు, సమాధానంగా.

అదనపు శ్రమ కాలాన్ని పొడిస్తే, అది కార్మిక ప్రయోజనాలను దెబ్బకొట్టి వర్గపోరాటానికి దారితీస్తుందనీ, వందల ఏళ్ల పాటు సాగిన పోరాట ఫలితంగా మామూలు పనిదినాన్ని తేల్చడం జరిగిందని కొంత సత్యాన్ని ఒకపక్క చెబుతూ, ఇక వర్గ పోరాటాలు అవసరం లేదని మరోపక్క తేల్చి చెబుదామనుకుంటున్నాడు.

(మిగతా 38వ పేజీలో...)

వీక్షణం సెప్టెంబర్ సంచికలోని అసహజ మరణాల సూచి వివరాలు జూలై 1 నుండి జూలై 31 వరకు అని ఉండాల్సినదానికి బదులు ఆగస్టు 1 నుండి ఆగస్టు 31 అని పొరపాటుగా వచ్చింది. – సం.

# డిజిటల్ ఇండియా ప్రజలది కాదు, బహుళజాతి సంస్థలది

ప్రధానమంత్రి నరేంద్ర మోడీ అమెరికా వెళ్లి ఐక్యరాజ్య సమితి భద్రతా మండలిలో భారత ప్రభుత్వానికి శాశ్వత సభ్యత్వం ఇమ్మని మరొకసారి కోరాడు. ప్రపంచంలోని పెద్ద ప్రజాస్వామ్య దేశాలలో ఒకటిగా, ప్రపంచ ఆర్థిక వ్యవస్థ చోదక శక్తులలో ముఖ్యమైనదిగా భారత ప్రభుత్వానికి భద్రతా మండలి శాశ్వత సభ్యత్వం కోరడానికి అధికారమూ అర్హతా ఉన్నాయని అన్నాడు. ఈ కోరిక సమంజసమైనదేననీ తాను సమర్థిస్తాననీ అమెరికా ప్రభుత్వం కూడ హామీ ఇచ్చింది. ఈ గంభీరమైన మాటల దౌత్య అర్థాలను విప్పిచెప్పుకుంటే, సామ్రాజ్య వాదానికీ, బహుళ జాతి సంస్థలకూ తాను నమ్మిన బంటుగా ఉంటానని, తనకు పెద్ద దళారీ పాత్ర ఇమ్మనీ భారత ప్రధాని భిక్ష కోరాడు, గతంలో భారత ప్రభుత్వాలు అలీనోద్యమం అంటూ సామ్రాజ్యవాదాన్ని నామమాత్రంగానైనా ఎదిరించిన, బేరసారాలు ఆడిన అనుభవాలను పునరుక్తం చేయనని, 'జీ హుజూర్ జో హుకుం' అని బుద్ధిగా పడి ఉంటానని హామీ ఇచ్చాడు.

ఆ హామీకి కొనసాగింపుగా రెండు మూడు రోజుల్లోనే కాలిఫోర్నియాలోని సిలికాన్ వ్యాలీలో ఐటి బహుళజాతి సంస్థల సిఇవో లతో సమావేశం జరిపి వాళ్లు కోరినవీ, కోరనివీ వరాలెన్నో ప్రకటించాడు. మీ దేశం మీరేలండి అని బహుళ జాతి సంస్థలకు ఎర్ర తివాచీ పరిచాడు. తాను ప్రారంభించిన డిజిటల్ ఇండియా కార్యక్రమంలో ఇంకా ఎక్కువగా పాల్గొనమనీ, భారతదేశంలో పెట్టుబడులు పెట్టమనీ, భారత మార్కెట్లో ఇంకా ఎక్కువ ప్రవేశించమనీ కోరాడు. ప్రపంచ పెట్టుబడిదారులకు భారతదేశం పట్ల విశ్వాసాన్ని పెంచడానికి తాను చర్యలు తీసుకుంటున్నాననీ, సులభంగా వ్యాపారం చేసే అవకాశాలు కల్పిస్తున్నాననీ ప్రకటించాడు. 'కొన్ని దేశాల దగ్గర డబ్బులున్నాయి, అవి ఎక్కడ పెట్టుబడి పెడితే లాభాలు వస్తాయో వారికి తెలియడం లేదు. ఇదిగో, మీకు లాభాలు వచ్చే చిరునామా నేను ఇస్తున్నాను, అదే భారతదేశం' అన్నాడు. ఐటి కంపెనీలకు భారత దేశం ఎంత విశాలమైన మార్కెటో చెప్పడానికి 125 కోట్ల ప్రజలను కనెక్ట్ చేయడమే తన లక్ష్యం అన్నాడు. ఐదు లక్షల గ్రామాలకు బ్రాడ్‌బ్యాండ్ సౌకర్యాలు కల్పిస్తానన్నాడు. 500 రైల్వే స్టేషనలో ఉచిత వైఫై కల్పిస్తానన్నాడు. ప్రాంతీయ భాషల్లో డిజిటల్ అక్షరాస్యత కల్పిస్తానన్నాడు. ఇలా దేశాన్ని తాకట్టు పెట్టడానికి, తమ సరుకులూ సేవలూ సులభంగా అమ్ముకునేలా దేశాన్ని తమకు స్వాధీనం చేయడానికి వచ్చిన ఈ మహాదళారీని, మహాతలారిని సంతోషపెట్టడానికీ, తమ మార్కెట్ ను విస్తరించుకోవడానికీ ఈ పనులలో కొన్ని తామే చేస్తామని బహుళ జాతి సంస్థలు హామీ ఇచ్చాయి. భారత దేశంలో తమ దళారీలను ఏర్పాటు చేయడానికి వెయ్యి కోట్ల రూపాయలు పెట్టుబడి పెడతామని ఒకరు, రైల్వేస్టేషన్ల వైఫై తాము కల్పిస్తామని, భారతీయ భాషల కంప్యూటర్ సేవలు తాము తయారు చేస్తామని మరొకరు, గ్రామాలకు బ్రాడ్ బ్యాండ్ సౌకర్యం కల్పిస్తామని మరొకరు పోటీలు పడ్డారు. అబ్బ, ఈ పెద్దన్నలకు భారత ప్రజల మీద ఎంత ప్రేమ!

అది భారత ప్రజల మీద ప్రేమ కాదు, తమ సరుకుల, సేవల అమ్మకాల అవకాశాల మీద ప్రేమ. అరవై కోట్ల ప్రజలు దారిద్ర్యరేఖ దిగువన ఉన్నారని తన ప్రభుత్వమే చెపుతున్న లెక్కలు పక్కనపెట్టి 125 కోట్ల ప్రజలకు కనెక్టివిటీ ఇస్తానని చెప్పడం ఇటు ప్రజలనూ, అటు బహుళ జాతి సంస్థలనూ మోసం చేయడమే. 2012 నాటికి భారతదేశంలో ఆరు కోట్ల కంప్యూటర్లున్నాయని, ఫోన్ ద్వారా ఇంటర్నెట్ వినియోగించేవారిని కూడ కలుపుకుంటే 2013లో ఇంటర్నెట్ వినియోగదారుల సంఖ్య పదహారు కోట్లు అని గణాంకాలు చెపుతున్నాయి. మొబైల్ ఫోన్ల సంఖ్య వంద కోట్లు దాటి ఉండవచ్చుగాని అవన్నీ వ్యాపారానికి ఉపయోగపడేవి కావు. జనాభా అందరికీ కనెక్టివిటీ ఇస్తానని మోడీ వాగ్దానం చేస్తున్నాడు గాని, అక్షరాస్యుల సంఖ్య ఎనభై కోట్లు దాటలేదు. అందులో కంప్యూటర్ వినియోగించే ఇంగ్లిష్ తెలిసిన విద్యావంతులు నలభై కోట్లు కూడ ఉండరు. మళ్లీ అందులో సగభాగానికన్న తక్కువైన మధ్యతరగతికి అమ్మడానికి మాత్రమే డిజిటల్ ఇండియా కల. అయితే, ఇరవై కోట్ల మార్కెట్ అయినా ఇతర దేశాల మార్కెట్లతో పోల్చినప్పుడు చాల పెద్ద మార్కెట్ గనుక మోడీ ప్రగల్భాలకు నవ్వుకుంటూనే బహుళ జాతి సంస్థలు పరుగెత్తుకొస్తున్నాయి. రాజధిరాజ, రాజమార్తాండ అని మోడీని పొగుడుతున్నాయి.

ఐదు లక్షల గ్రామాలలో అన్నార్తులైన ప్రజలకు, మంచినీటి సౌకర్యం లేక అల్లాడుతున్న ప్రజలకు దిక్కు లేదు. వేలాది గ్రామాలలో కంప్యూటర్లకు అవసరమైన విద్యుత్ సౌకర్యం లేదు. విద్యుత్తు ఉన్నచోట్ల ఎన్ని గంటలు ఉంటుందో, ఎప్పుడు వస్తుందో, ఎప్పుడు పోతుందో తెలియదు. కాని అన్ని గ్రామాలకూ బ్రాడ్ బ్యాండ్ సౌకర్యం ఇస్తానని ఉత్తరకుమార ప్రగల్భాలు వినిపిస్తున్నాయి. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ సరుకులూ సేవలూ ప్రస్తుతం ఇంగ్లిష్‌లోనే ప్రధానంగా ఉన్నాయి గనుక చిన్న మార్కెట్ ఉందనీ, వాటిని ప్రాంతీయ భాషల్లోకి మార్చి విశాలమైన మార్కెట్ కల్పిస్తాననీ నమ్మబలుకుతున్నాడు.

ఈ డిజిటల్ ఇండియా కలను విని ఎగువ మధ్యతరగతిలోకి ఎగబాకదలచుకున్న విద్యావంతులు కొందరు మురిసిపోవచ్చు. కాని ఈ ప్రగల్భాల సారం విప్పిచూస్తే ఇవి భారతప్రజల కలలు కావు, బహుళ జాతి సంస్థల కలలు. వాళ్ల లాభాపేక్షల వ్యూహాలు. ఎక్కడ చౌక శ్రామికులు దొరుకుతారో, తమ సరుకులకూ, సాంకేతిక పరిజ్ఞానానికీ ఎక్కడ విశాలమైన మార్కెట్ దొరుకుతుందో వెతుకుతున్న బహుళ జాతి సంస్థలకు మోడీ ఈ కలలను అమ్మజూపుతున్నాడు. వారు మరిన్ని లాభాల కలలు కనడానికి అవకాశం ఇస్తున్నాడు.

మోడీ ఒకపక్క బొంకరా బొంకరా అని సామెత చెప్పినట్టుగా ఈ ఆకుకు అందని పోకకు పొందని ప్రగల్భాలు పలుకుతూనే మరొక పక్క తనకు అలవాటైన నటనాచాతుర్యం కూడ ప్రదర్శించాడు. అంట్లు తోమి బతుకుతూ తమను పోషించిన తల్లి గురించి చెప్పి నాటకీయంగా కన్నీళ్లు పెట్టుకున్నాడు. బుడిబుడి ఏడుపులు ఏడ్చాడు. నిజంగా తన తల్లి వంటి తల్లుల, కోట్లాది భారత మాతృమూర్తుల, కుటుంబాల వేదనామయ జీవితాల్లో వెలుగులు నింపాలంటే జరగవలసిన పని దేశాన్ని బహుళ జాతి సంస్థల మార్కెట్ క్రీడాస్థలిగా మార్చడం కాదు. ఈ దేశ ప్రజల సార్వభౌమాధికారాన్ని, స్వావలంబనను కాపాడడం. అది ఈ పాలకవర్గాలు ఎలాగూ చేయగలిగింది కాదు. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# బంగారు తెలంగాణ అంటే పాశవిక హత్యాకాండేనా?

'శిశుహంతక రాజ్యం ఇది, పశుసంతతి పాలన ఇది' అని చెరబండరాజు నాలుగు దశాబ్దాల కింద అన్నమాటను అక్షరాలా నిజం చేస్తూ తంగెళ్ల శ్రుతి, మనికంటి విద్యాసాగర్ రెడ్డి అనే ముక్కుపచ్చలారని పిల్లలను తెలంగాణ ప్రభుత్వ పాలన పొట్టన పెట్టుకున్నది. ఆంధ్రప్రదేశ్ పాలనలో ఆరు దశాబ్దాల పాటు తెలంగాణ ప్రజలు అనుభవించిన దోపిడీ పీడనలు రద్దు కావాలనీ, గతంలో లాగ రాజ్యాంగబద్ధమైన ప్రాథమిక హక్కులు అమలు కాని స్థితి ఉండగూడదనీ తెలంగాణ ప్రజలు ప్రత్యేక రాష్ట్రం కోరుకున్నారు. పాలకులు పదే పదే 'బంగారు తెలంగాణ' నినాదం ఇస్తున్నప్పుడు ప్రజలు తమ అర్థం తాము చెప్పుకున్నారు. పాలకులు స్పష్టంగానే ఎన్‌కౌంటర్లు లేని తెలంగాణ సాధిస్తామని చెప్పినప్పుడు ప్రజలు నమ్మారు. తెలంగాణ ఉద్యమం సగౌరవంగా స్మరించుకునే కాళోజీ 1977లో తార్కుండే కమిటీ సభ్యుడిగా ఉన్ననాటి నుంచి 2002లో చనిపోవడానికి కొద్దిముందు పద్మాక్షమ్మ గుట్ట ఎన్‌కౌంటర్‌ను ఖండించేదాకా నిరంతరం ఎన్‌కౌంటర్ హత్యల వ్యతిరేక ఆందోళనలో పాల్గొన్నారు. తెలంగాణ సిద్ధాంతకర్తగా పేరుతెచ్చుకున్న జయశంకర్ పౌరస్పందన వేదిక సభ్యుడిగా ఎన్‌కౌంటర్ హత్యలు ఆగిపోయే మార్గంగా ప్రభుత్వానికీ నక్సలైట్లకూ చర్చల ప్రయత్నాలు చేశారు. ఇక తెరాస అధ్యక్షుడి నుంచి సాధారణ కార్యకర్తల వరకూ తెలంగాణ వస్తే ఎన్‌కౌంటర్లు, రక్తపాతం ఉండవని నమ్మబలికారు. తెరాస అధ్యక్షుడు తానే పౌరహక్కుల సంఘానికి నాయకత్వం వహిస్తానన్నాడు. మొదటిసారి మిశ్రమ మంత్రివర్గంలో స్థానం సంపాదించుకున్న తెరాస మంత్రులు 2005లో జరిగిన ఎన్‌కౌంటర్ హత్యలకు నిరసనగా పదవులకు రాజీనామాలు చేశారు. కాళోజీ, జయశంకర్‌ల పేర్లు నిత్యం స్మరిస్తున్న తెరాస ప్రభుత్వాధినేతలు తాము చెప్పిన మాటలకూ, చేసిన పనులకూ చెల్లుచీటీ ప్రకటించి అత్యంత దుర్మార్గమైన ఎన్‌కౌంటర్ హత్యలకు తెరతీశారు. శ్రుతి, విద్యాసాగర్ రెడ్డిలను రెండు రోజుల ముందు పట్టుకుని, అతి భయంకరమైన చిత్రహింసలకు గురిచేసి, చంపి శవాలు అడవిలో పడేసి ఎన్‌కౌంటర్ కట్టుకథలు అల్లిన పోలీసులకు తెరాస పాలకులు బాసటగా నిలుస్తున్నారు. పాలకుల 'బంగారు తెలంగాణ' అర్థమేమిటో వందలాదిగా జరుగుతున్న రైతుల ఆత్మహత్యలు, ప్రాథమిక హక్కుల ఉల్లంఘన మాత్రమే కాదు, అత్యంత పాశవికంగా జరిగిన ఈ ఎన్‌కౌంటర్ హత్యలు బహిర్గతం చేస్తున్నాయి. తనను తాను నిన్నటిదాకా ఉద్యమ పార్టీగా అభివర్ణించుకున్న రాజకీయ పక్షం అధికారానికి వచ్చి పదహారు నెలలు గడవకముందే ఇంత వాగ్దానభంగానికీ, ప్రజాద్రోహానికీ పాల్పడడం ఆ పార్టీ భవిష్యత్తుకు కూడ మంచిది కాదు. ప్రజల విశ్వాసాన్ని కోల్పోతే, ప్రజలకు ఇంతగా దూరమైతే, ప్రజల నమ్మకాన్ని ఇంతగా వమ్ము చేస్తే ఆ పార్టీ ప్రజాక్షేత్రంలో ఉండగలుగుతుందో లేదో ఆలోచించుకోవాలి. హింసకు అలవాటు పడిన భద్రతా బలగాలనూ, భజనకు అలవాటు పడిన పిడికెడు మంది ఆశ్రితులనూ నమ్ముకుని అధికారం చలాయిస్తే ఏమవుతుందో హిట్లర్ నుంచి ఇందిరాగాంధీ నుంచి చంద్రబాబు నాయుడు దాకా ఉన్న పాఠాలను వినదలచుకోకపోతే తెరాస నరహంతక నిజాం వారసురాలిగా చరిత్రలో మిగిలిపోతుంది. ఇప్పటికైనా తన బంగారు తెలంగాణకు అర్థం రాజ్యాంగ బద్ధమైన, ప్రజాస్వామికమైన తెలంగాణ అని తెరాస ప్రభుత్వం రుజువు చేసుకోవలసి ఉంది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# రైతుల సమాధుల మీద రాజధాని పునాదులు

అలవి కాని భారీ పథకాలు ప్రకటించి అవి తమ శక్తికి మించినవి సాధారణ ప్రజలను భయపెట్టి, బహుళ జాతి సంస్థలకు, కార్పొరేట్ శక్తులకు, సంపన్నులకు ఆ పథకాలను కట్టబెట్టడం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు వెన్నతో పెట్టిన విద్య, ప్రపంచ బ్యాంకు శిక్షణలో నేర్చుకున్న కళ. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఆయన ప్రకటించిన శ్వేత పత్రాలు, విజన్ 2020 ఆ విద్యకు నిదర్శనాలు. విభక్త ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఆయన అదే విద్యను మళ్లీ ప్రదర్శిస్తున్నారు. కొత్త రాష్ట్రపు రాజధాని ఎక్కడ ఉండాలని వచ్చిన అన్ని సూచనలనూ, వికేంద్రీకరణ జరపాలని వచ్చిన సలహాలనూ తోసిరాజని, తన ఆశ్రితుల ప్రయోజనాల కోసం రాజధానికి గుంటూరు జిల్లాలో అమరావతి కేంద్రంగా నిర్ణయించి, దానికి అమరావతి అని పేరు పెట్టి రాజధాని ప్రాంత అభివృద్ధి సంస్థ అనే ఒక "స్వతంత్ర" సంస్థకు సర్వాధికారాలు అప్పగించారు. రాజధానికి ముప్పై వేల ఎకరాల భూమి కావాలని, దాన్ని 29 గ్రామాల నుంచి సేకరిస్తామని ఏడాది కింద ప్రకటించిన ప్రభుత్వం క్రమక్రమంగా రియల్ ఎస్టేట్ వ్యాపారుల ప్రయోజనాల కోసం ఆ అంకెలను పెంచుతూ వచ్చి, తాజాగా కృష్ణా గుంటూరు జిల్లాలలోని 153 గ్రామాలను సిఆర్‌డిఎ పరిధిలోకి తెచ్చింది. ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఇప్పుడు రాజధాని పరిధి 8,352 చ.కి.మీ. (రెండు లక్షల ఆరు వేల ఎకరాలు) కి విస్తరించనుంది. ఈ రాజధాని నగర నిర్మాణంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజల అవసరాలు, ప్రయోజనాలు అనే ప్రస్తావనలే రావడం లేదు. "అంతర్జాతీయ ప్రమాణాల నగరం" అనే మంత్ర జపం మాత్రమే వినబడుతున్నది. నగరం అంతర్జాతీయ ప్రమాణాలది గనుక దాని రూపకల్పన చేయగల మేధావులూ, శాస్త్రవేత్తలూ ఆంధ్రప్రదేశ్ లోనూ భారతదేశంలోనూ దొరకరు. అందువల్ల సింగపూర్ వెళ్లవలసిందే. రెండువేల ఏళ్ల కింద రాజధాని ఉన్నచోట, ఆ పేరుతోనో పునర్నిర్మాణమవుతున్న రాజధానిని నిండా నాలుగు వందల సంవత్సరాల చరిత్రలేని నగర శిల్పులు నిర్మిస్తారు. దీనికి అవసరమైన భూమి సేకరణలో జరిగిన అవకతవకలు, అక్రమాలు, బుజ్జగింపులు, రంగురంగుల కలలు, బెదిరింపులు, హింస అన్నీ అయిపోయి, రైతుల సమాధుల మీద, వందల సంవత్సరాలుగా సస్యశ్యామలమైన పంటలు అందించిన పంటపొలాలను కాంక్రీటు అరణ్యాలుగా మార్చడానికి అక్టోబర్ 22 న భూమి పూజ, శంకుస్థాపన జరగబోతున్నాయి. తొమ్మిదిన్నర కోట్ల రూపాయల ఖర్చుతో జరిగే ఈ భూమి పూజ కార్యక్రమ నిర్వహణ కూడ ప్రజల వోట్లతో ఎన్నికైన ప్రభుత్వ బాధ్యత కాదు, ఒకానొక కార్పొరేట్ సంస్థ బాధ్యత. జీవితాలను భగ్నం చేసి రూపొందుతున్న ఈ నగర శంకుస్థాపన నరేంద్ర మోడీ చేతులమీద జరగాలని చంద్రబాబు అనుకుంటున్నాడట. ఎంత కవితా న్యాయం. జీవన విధ్వంసం గురించి అంతగా తెలిసిన, అంత అరత ఉన్న మనుషులు మరెవరైనా ఉన్నారా? ఈ భూమి పూజకు విజయదశమి ముహూర్తం నిర్ణయించడం కూడ సముచితంగా ఉంది. జమ్మిచెట్టు మీది నుంచి ఆయుధాలు దించి, ఆయుధపూజ చేసి ప్రత్యర్థుల మీదికి యుద్ధానికి సిద్ధమైన రోజునే రైతుల జీవితాల మీద యుద్ధానికీ, మొత్తంగా ప్రజల మీద యుద్ధనిర్ణయాలకూ కేంద్రస్థానానికి భూమి పూజ జరగనున్నదన్నమాట. వీ

# కొత్త ఆశాకిరణం జెరిమీ కార్బిన్

పెట్టుబడి ఎక్కడ విజయం సాధించిందో చెప్పకుండా సోషలిజం విఫలం అయిందనే అభిప్రాయాన్ని బలవంతంగా మనుషుల మెదళ్లలో చొప్పిస్తున్న సందర్భంలో లాటిన్ అమెరికా, యూరప్ దేశాలలో వామపక్ష ప్రజా పార్టీలు సాధిస్తున్న రాజకీయ విజయాలు ప్రపంచ ప్రజానీకానికి ఊరటను, ఉత్తేజాన్ని కల్గిస్తున్నవి. బ్రిటన్ లేబర్ పార్టీ నాయకుడుగా గత మూడు దశాబ్దాలుగా పార్లమెంట్ సభ్యునిగా కొనసాగుతున్న సోషలిస్ట్ జెరిమీ కార్బిన్ ఎన్నిక కావటం సోషలిస్ట్ రాజకీయాలకు కొత్త ఊపునిస్తున్నది. అనామకునిగా బరిలోకి దిగిన కార్బిన్ దాదాపు 60 శాతం ఓట్లతో విజయబావుటా ఎగురవేశాడు. ఎప్పుడూ తిరుగుబాటు దారునిగా ఉన్న కార్బిన్ ఇవాళ బ్రిటన్‌లో అమలౌతున్న ఆర్థిక విధానాలతో మౌలికంగా విభేదిస్తున్నాడు. బ్రిటన్‌లో ఏనాడో అన్ని రంగాల్లో వేళ్లూనుకున్న ప్రైవేట్ వ్యవస్థనే సవాలు చేస్తున్నాడు కార్బిన్. కార్మికోద్యమాల నుంచి పురుడు పోసుకున్న లేబర్ పార్టీ దాని మౌలిక సూత్రాలను ఎప్పుడో వదిలేసింది. ప్రతిపక్షంగా ఉన్నప్పుడు మాత్రమే సూత్రబద్ధంగా ఉంటుందని అధికారంలోకి రాగానే కన్సర్వేటివ్ ధోరణులనే అనుసరిస్తుందనే విమర్శకు గురైంది. ఈ నేపథ్యంలో సోషలిస్టు కార్బిన్ నాయకుడు కావడం ప్రాధాన్యత కల్గిన అంశమే. అందరికి ఇల్లు, ప్రైవేటీకరించిన అనేక రంగాలను మళ్లీ జాతీయీకరించడం, అందరికి ఉపాధి అవకాశాలు, పర్యావరణ పరిక్షణ, సార్వత్రిక శిశు సంరక్షణ, వయోజన విద్య నిధుల పెంపు, విశ్వ విద్యాలయాల్లో ట్యూషన్ ఫీజు రద్దు, లింగవివక్షను రూపుమాపటం వంటి విధానపర హామీలు మాత్రమే కాక రక్షణ రంగ ఉద్యోగాల తగ్గింపు, అణు నిరాయుధీకరణ, నాటోలో సభ్యత్వం రద్దు, ఇరాక్ నుంచి సైన్యం ఉపసంహరణ లాంటి అనేక అంశాలను ప్రజల ముందుంచాడు కార్బిన్. ట్రేడ్ యూనియన్ బిల్లును, సిరియాపై బ్రిటన్ జోక్యాన్ని తీవ్రంగా నిరసిస్తున్నాడు. యూరోపియన్ యూనియన్ నుండి బయటికి రావాలని కూడా ప్రతిపాదిస్తున్నాడు. భారత్ లాంటి దేశాల్లో నెలకొన్న అసమాన సామాజిక వ్యవస్థపై, ప్రత్యేకించి దళితుల సామాజిక ఆర్థిక స్థితిపై నిరసన తెలిపాడు. కార్బిన్‌కు లేబర్ పార్టీ ఎంపీలందరూ ఏకపక్షంగా మద్దతు ఏమీ ఇవ్వడం లేదు. పేరుకు లేబర్ పార్టీ అయినా ఆ పార్టీ నాయకులందరూ సోషలిస్టులు కాదు. కార్బిన్ కూడా ప్రైవేట్ ఆస్తిని రద్దు చేయాలనో, కార్మిక నియంతృత్వాన్ని ఏర్పర్చాలనో కోరుకోవటం లేదు. ప్రతికూల పరిస్థితులను అధిగమించి బ్రిటిష్ సాధారణ ఎన్నికల్లో పార్టీని విజయ పథాన నడిపిస్తాడా, ప్రజల్లో మోసులెత్తిన కొత్త ఆశల్ని సజీవంగా ఉంచేందుకు ప్రయత్నిస్తాడా లేదా వేచి చూడవలసిందే. భవిష్యత్తు ఏమైనా ఒక కీలకమైన సామ్రాజ్యవాద దేశంలో ప్రధాన ప్రతిపక్ష నాయకుడిగా, బహిరంగంగా సోషలిస్టు విధానాలను ప్రకటిస్తున్న నాయకుడు ఎన్నిక కావడమే దానికదిగా ఒక విజయం. ఆ విజయం మరింత గుణాత్మకంగా ఎదిగి, విద్రోహానికి గురికాకుండా స్థిరపడితే ప్రపంచానికి ఒక ఊరట. **- బైరెడ్డి సతీష్**





❖ **చరిత్ర రచనపై బాలగోపాల్** – హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ – 227 పేజీలు, 1/8 డెమీ, రు. 130



❖ **నది పుట్టిన గొంతుక** – (జైలు కవితలు) – బొజ్జా తారకం – జనపద ప్రచురణలు – 88 పేజీలు, 1/8 డెమీ, రు. 60



❖ **నేను కమ్యూనిస్టుని** – సీకే జీవిత చరిత్ర – హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ – 86 పేజీలు, 1/8 డెమీ, రు.30

పై రెండు పుస్తక ప్రతులకు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 006; ఫోన్: 23521849 www.hyderabadbooktrust.blogspot.com



❖ **ప్రియమైన... మీకు గుప్పెడు...** – కవిత్వం – గండికోట వారిజ – 72 పేజీలు, 1/8 డెమీ, రు. 170, ప్రతులకు: పలమనేరు బాలాజి, 6–219, గుడియాత్తం రోడ్డు, పలమనేరు–517 408, చిత్తూరు జిల్లా; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **ఆధునిక హైదరాబాద్ చరిత్ర – సాలార్‌జంగ్ సంస్కరణలు** – మొదటి సంపుటం – హైదరాబాద్ (దక్కన్) అండర్ సర్ సాలార్‌జంగ్ – ఇంగ్లిష్ మూలం: మౌల్వి చిరాగ్ అలీ, తెలుగు అనువాదం: డా. గాజుల దయాకర్ – అడుగుజాడలు పబ్లికేషన్స్ – 286 పేజీలు, 1/8 డెమీ, రు. 200, ప్రతులకు: అడుగుజాడలు పబ్లికేషన్స్, ఫ్లాట్ నం. 302, వైష్ణవి నెస్ట్, తిరుమల మ్యూజిక్ సెంటర్ వెనుక, మూసారాంబాగ్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ – 500 036



❖ **గ్లోబలి** – కవిత్వం – డా. చింతం ప్రవీణ్ కుమార్ – ఇండస్ పబ్లికేషన్స్ – 95 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: చింతం యాదవ్వ, 16–10–236, శివనగర్, వరంగల్ – 506002; సెల్: 9346886143; ఈమెయిల్ dr.praveen.kuc@gmail.com; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **ఆంధ్ర బౌద్ధం** – (అమరావతి కేంద్రంగా ఆంధ్ర బౌద్ధం ఆవిర్భావం) బౌద్ధ పండితుడు, సాహితీవేత్త డా. జివి కృష్ణారావు (1914–2014) శతజయంతి ప్రచురణ – టి. రవిచంద్ – మిళింద ప్రచురణలు – 30 పేజీలు, 1/8 డెమీ, రు. 20



❖ **సంస్కృతి పథంలో సంజీవదేవ్** – (సంజీవదేవ్ జీవితంపై యథేచ్ఛా చింతన) – సంజీవదేవ్ శతజయంతి (2014) సమాలోచనలో సమర్పించిన పత్రం – టి. రవిచంద్ – మిళింద ప్రచురణలు – 36 పేజీలు, 1/8 డెమీ, రు. 25

పై రెండు పుస్తక ప్రతులకు: టి. రవిచంద్, ఇంటి నం. 11–5–4, నాళం వారి వీధి, బాపట్ల – 522101 గుంటూరు జిల్లా, సెల్: 9966134406



❖ **హంద్రీగానం** – కావ్యం – జి. వెంకటకృష్ణ – స్ఫూర్తి ప్రచురణలు – 54 పేజీలు, 1/10 డెమీ, రు. 50, ప్రతులకు: జి. వెంకటకృష్ణ, 87–1287–1, సోమిశెట్టి నగర్, కర్నూల్ – 518002

సెల్: 9440254730; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **అమూల్య** – కథలు – కె. సుభాషిణి – స్ఫూర్తి ప్రచురణలు – 191 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: కె.సుభాషిణి, డోర్ నం. 87–1287–1, సోమిశెట్టి నగర్, కర్నూల్ – 518002,

సెల్: 9440254730; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా** – మూలం: లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్, స్వేచ్ఛానుసరణ: గౌరవ్ – సెంటర్ ఫర్ డెమోక్రటిక్ సొసైటీ ప్రచురణ – 24 పేజీలు, 1/8 డెమీ, చందా రు. 10, ప్రతులకు: సమత ఇంప్రెషన్స్, 9492244586; గౌరవ్ – 9032094492



❖ **ప్రాణహిత–చేవెళ్ల ప్రాజెక్టు విభజన** – వేములపల్లి వెంకట్రామయ్య – సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసీ తెలంగాణ రాష్ట్రకమిటీ –32 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: సిపిఐ (ఎంఎల్) న్యూ డెమోక్రసీ, మార్క్స్ భవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్ – 500 044; ప్రజాశక్తి, నవోదయ; విశాలాంధ్ర



❖ **నూతన విద్యా విధానం – సర్కార్ స్కూళ్లకు మంగళం** – కరపత్రిక – 7, స్నేహ ప్రచురణలు, 21 పేజీలు, 1/8 డెమీ, రు. 5



❖ **పేదరికం అంటే?** – కరపత్రిక – 9 – ఆంగ్లం: మోహన్ గురుస్వామి, రొనాల్డ్ జోసఫ్ అబ్రహం, తెలుగు స్వేచ్ఛానువాదం: ఎనిశెట్టి శంకర్, స్నేహ ప్రచురణలు, 17 పేజీలు, 1/8 డెమీ, రు. 6



❖ **స్టేటస్ ఆఫ్ ఇంప్లిమెంటేషన్ ఆఫ్ ఆర్‌టిఇ 2009** – కరపత్రిక – 12 – ఎనిశెట్టి శంకర్, స్నేహ ప్రచురణలు, 12 పేజీలు, 1/8 డెమీ, రు. 5

పై మూడు పుస్తక ప్రతులకు: ఎనిశెట్టి శంకర్, స్నేహ ప్రచురణలు, 502, గంగా హైట్స్, గంగాస్థాన్ ఫేస్–2, గూపన్‌పల్లి, ముబారక్‌నగర్, నిజామాబాద్ జిల్లా – 503003; సెల్: 9866630739



❖ **అనాథలు – అనంత ప్రముఖులు** – (మంచికి – చెడుకు) – ఆర్ఫన్, సెమి ఆర్ఫన్, అబాండన్డ్‌కు చెందిన గొప్ప వ్యక్తుల జీవిత చరిత్ర – ఒక ఆశ – ఒక స్ఫూర్తి – స్నేహ పబ్లికేషన్స్ – గాదె ఇన్నయ్య (ఇన్నారెడ్డి) – కూర్పు: ముత్తన్నగారి రాజేందర్ రెడ్డి – 82 పేజీలు, 1/4 క్రౌన్, రు. 95, ప్రతులకు: జఫర్‌గఢ్ మం., వరంగల్ జిల్లా – 506316; సెల్: 9866216680, 9989185709

# రాష్ట్రాల మధ్య కుక్కల కాట్లాటకు ఎగసన

భారతదేశం నామమాత్రంగానైనా సమాఖ్య రాజ్యంగా ఉండడం, వేరువేరు రాష్ట్రాల్లో వేరువేరు ప్రభుత్వాలు ఉండడం, సహజ వనరులనూ ముడిసరుకులనూ దోచుకోవడానికి దేశమంతా ఒకే రకమైన విధానాలు కాకుండా వేరు వేరు రాష్ట్రాల్లో వేరువేరు విధానాలు ఉండడం, దేశమంతటా సరుకులు అమ్ముకొని ఇబ్బడి ముబ్బడిగా లాభాలు సంపాదించడానికి దేశవ్యాప్త మార్కెట్‌లో ఒకే రకమైన విధానాలు లేకపోవడం ప్రపంచీకరణ శక్తులకు చాల చిరాకు కలిగిస్తున్నాయి. 1990ల నుంచీ కూడ చట్టాల మార్పుకు, విధానాల మార్పుకు అనేక ఆదేశాలు ఇస్తున్నప్పటికీ దేశంలోని పాలకవర్గ ముఠాల మధ్య తగాదాలు ఆ ఆదేశాలకు అడ్డంకిగా మారుతున్నాయి. చట్టాల రద్దులు, మార్పులు, సరళీకరణలు చాల మందకొడిగా సాగుతున్నాయి. ప్రపంచీకరణ శక్తులు కోరుకున్నంత వేగంగా జరగడం లేదు. ప్రపంచీకరణ శక్తులు, బహుళ జాతి సంస్థలు, ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, ప్రపంచ వాణిజ్య సంస్థ ఇస్తున్న ఆదేశాలను పాలకవర్గాలు సాధారణంగా అమలు చేస్తూనే ఉన్నాయి గాని వేరువేరు రాష్ట్రాల పాలకవర్గ ముఠాల మధ్య తగాదాలు, కేంద్ర ప్రభుత్వం లోని ముఠాల మధ్య తగాదాలు ఆ ఆదేశాల అమలుకు చిన్న చిన్న అవరోధాలు కల్పిస్తున్నాయి. ఆలస్యం చేస్తున్నాయి. నిజానికి ఆ ప్రపంచీకరణ విధానాల వల్ల బతుకులు చిన్నాభిన్నమవుతున్న, వాటికి వ్యతిరేకంగా పోరాడవలసిన విశాల ప్రజా రాశుల పోరాటాలు ఇంకా చెదురుమదురుగానే, అనైక్యంగానే ఉన్నాయి. ప్రస్తుతానికైతే ప్రపంచీకరణ శక్తులకు ఇంకా ప్రజల గురించి కన్న పాలకవర్గ ముఠా తగాదాల గురించి చిరాకే ఎక్కువగా ఉన్నది.

ఈ నేపథ్యంలో విభిన్న రాష్ట్ర పాలకవర్గాల మధ్య, రాష్ట్ర ప్రభుత్వాల మధ్య పోటీ సృష్టించడానికి, తగాదాలు పెంచడానికి, వారిని కుక్కల కాట్లాటలోకి ఈడ్వడానికి ప్రపంచీకరణ శక్తులు ప్రయత్నిస్తున్నాయి. ఆ పాలకవర్గ ముఠాలకు అభివృద్ధి భావజాలం మప్పి, వారిలో కొందరిని చేరదీసి, ఆదర్శంగా చూపి, ఇతర రాష్ట్రాల పాలకులందరూ ఆ విధానాలను అమలు చేస్తేనే అభివృద్ధి అని చెప్పే ప్రచార యంత్రాంగాన్ని ప్రపంచీకరణ శక్తులు పెద్ద ఎత్తున సృష్టించాయి. ప్రపంచ బ్యాంకు, దాన్ని సమర్థించే ప్రచార సాధనాలు 1996-2003 మధ్య కాలంలో చంద్రబాబు నాయుడును, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విధానాలను ఎలా ఆకాశానికి ఎత్తాయో తెలుగు బుద్ధిజీవులందరికీ తెలుసు. అభివృద్ధి - హిందుత్వ నినాదాలతో కలిపి ప్రపంచీకరణ విధానాలను మరింత దూకుడుగా ముందుకు తీసుకుపోతానని హామీ ఇచ్చిన నరేంద్ర మోడీని ప్రపంచీకరణ శక్తులు ఇప్పుడు అలాగే ఆకాశానికి ఎత్తుతున్నాయి. అవే శక్తులు ఇప్పుడు మోడీ వత్తాసుతో మరొకసారి రాష్ట్రాల మీద, రాష్ట్ర ప్రభుత్వాల మీద పడడానికి ఏర్పాట్లు చేసుకుంటున్నాయి.

ప్రజల మీద ఈ కొత్త దాడికి, లేదా రాష్ట్రప్రభుత్వల మధ్య కుక్కల కాట్లాట వంటి పోటీని రెచ్చగొట్టడానికి తాజా ఉదాహరణ ప్రపంచ బ్యాంకు ఇటీవల (సెప్టెంబర్ 2015) విడుదల చేసిన 'అసెస్ మెంట్ ఆఫ్ స్టేట్ ఇంప్లిమెంటేషన్ ఆఫ్ బిజినెస్ రిఫార్మ్స్' అనే నివేదిక. ఆయా ప్రాంతాల్లో వ్యాపారం చేయడం ఎంత సులభమో లేదా ఎంత కష్టమో వివరించడానికి, బహుళ జాతి సంస్థలకు సూచనలు ఇవ్వడానికి ప్రపంచ బ్యాంకు, ఇతర అంతర్జాతీయ ద్రవ్య, వ్యాపార సంస్థలు ఎప్పటికప్పుడు ఇటువంటి నివేదికలు ప్రచురిస్తూనే ఉంటాయి. ఆ నివేదికల లక్ష్యం ప్రజల అవసరాలేమిటి, అవి తీర్చడమెట్లా, పర్యావరణ విధ్వంసానికి, కాలుష్యానికి, అక్రమాలకు, చట్ట ఉల్లంఘనలకు పాల్పడకుండా ఆ ప్రజా అవసరాలు తీర్చడమెట్లా అని సలహాలు ఇవ్వడం కాదు. పెట్టుబడిదారులకు ఎక్కడ సులభంగా, చౌకగా భూమి దొరుకుతుంది, ఎక్కడెక్కడ ఏయే వనరులు దొరుకుతాయి, ఎక్కడ ప్రభుత్వ ఆంక్షలు, విధినిషేధాలు తక్కువగా ఉంటాయి, ఎక్కడ తనిఖీలు లేకుండా వ్యాపారం చేసుకోనిస్తారు, ఎక్కడ ఎంత అక్రమం చేసి అయినా ఏ చట్టానికీ దొరకకుండా తప్పించుకోవచ్చు వంటి అంశాల మీద పరిశోధనలు జరిపి ఆ నివేదికలు రాస్తారు. ఆ నివేదికల్లో రాసేదంతా పెట్టుబడిదారులు మరిన్ని లాభాలు ఎలా చేసుకోవచ్చు, ఎన్ని అక్రమాలు చేసి అయినా ఎలా తప్పించుకోవచ్చు, ఏ ప్రభుత్వం గులాంగిరి చేయడానికి సిద్ధంగా ఉంది అని మాత్రమే. కాని 'ఇదంతా మీ బాగు కోసమే, మీ అభివృద్ధి కోసమే. మీ ఆర్థిక వ్యవస్థ స్థూల ఆదాయ పెరిగి తలసరి ఆదాయం పెరగడం కోసమే' అని రాష్ట్ర ప్రభుత్వాల పాలకులను నమ్మిస్తారు. ఇక ఆ పాలకులు ఆ పాటలకు పల్లవి పాడుతూ 'ఇదంతా మీ కోసమే, చూడండి మీ తలసరి ఆదాయం పెరిగింది' అని తమ ప్రజలను నమ్మించడానికి ప్రయత్నిస్తారు.

భారత ప్రధానిగా నరేంద్ర మోడీ అధికారం చేపట్టగానే అంతర్జాతీయ మార్కెట్లలో పోటీ పడడానికీ, ఎగుమతుల ఉత్పత్తిని పెంచడానికీ భారతదేశం ఏంచేస్తే బాగుంటుందో సూచించమనీ, ఆ పనిలో సహకరించమనీ తమను అడిగారని ప్రపంచ బ్యాంకు భారత అధిపతి (కంట్రీ డైరెక్టర్ అంటారు) ఒన్నో రుహ్ల్ ఈ నివేదిక ముందుమాటలో రాశాడు. భారతదేశంలో వ్యాపారం పెరగాలంటే ఎన్నో రంగాలలో కలిసికట్టుగా చర్యలు తీసుకోవాలనీ, మౌలిక సౌకర్యాలు పెంచాలనీ, పెట్టుబడి మార్కెట్లను పెంచాలనీ, వ్యాపార అవకాశాలను సరళీకరించాలనీ, నైపుణ్యాలను పెంచాలనీ తాము చెప్పామనీ, కాని భారతదేశం వ్యాపారం సాగించడానికి కష్టతరమైన ప్రాంతమనేది ఒక కఠోర వాస్తవమనీ రుహ్ల్ రాశాడు. అందుకు కారణం వ్యాపారాల మీద ప్రభుత్వానికి మితిమీరిన నియంత్రణాధికారం ఉండడమేనని అన్నాడు. అందువల్లనే వ్యాపార అవకాశాలు సులభంగా ఉన్నాయా, కష్టతరంగా ఉన్నాయా అని ప్రపంచ బ్యాంకు 189 దేశాలను పరిశీలిస్తే, ఆ జాబితాలో భారతదేశం 142 స్థానంలో ఉందని రుహ్ల్ రాశాడు.

ఇక్కడ ప్రపంచ బ్యాంకు సూచించిన ఐదు చర్యలకూ నిజమైన

అర్థాలను గ్రహించవలసి ఉంది. మౌలిక సౌకర్యాలు కల్పించడం అంటే విద్యుత్తు, నీరు, భూమి, ముడిసరుకులు, రవాణా, కమ్యూనికేషన్ వంటి సౌకర్యాలు కల్పించడం. అంటే వాటి కల్పనలో, అభివృద్ధిలో, పంపిణీలో, వ్యాపారంలో బహుళ జాతి సంస్థలకు అవకాశం కల్పించడం. వాటిని ఉచితంగానో, తక్కువ ధరలకో, రాయితీలతోనో అందించడం. పెట్టుబడి మార్కెట్లను పెంచడమంటే ప్రతి రంగంలోనూ స్టాక్ మార్కెట్ల జూదాన్ని ప్రవేశ పెట్టడం, విదేశీ పెట్టుబడులు ఏ రంగంలోకైనా ప్రవేశించడానికీ, లాభాలు చేసుకోవడానికీ, తరలించుకుపోవడానికీ అవకాశం కల్పించడం. వ్యాపార అవకాశాలను సరళీకరించడమంటే, ఇప్పటికి నామమాత్రంగానైనా ఉన్న ప్రజా సంక్షేమ, కార్మిక సంక్షేమ, ప్రభుత్వ నియంత్రణా చట్టాలను తొలగించడం, తగ్గించడం. నైపుణ్యాలను పెంచడమంటే విద్యా, శిక్షణా రంగాలను బహుళ జాతి సంస్థలకు అప్పగించడం లేదా, తమకు అవసరమైన నైపుణ్యాలకు మాత్రమే ప్రాధాన్యత ఇవ్వడం. నియంత్రణాధికారం తగ్గించడమంటే పరిశ్రమలూ, వ్యాపారాలూ ప్రభుత్వానికీ, ప్రజలకూ జవాబుదారీగా ఉండని స్థితి కల్పించడం.

ఈ ఆదేశాలన్నిటినీ అమలు చేయడానికి భారత పాలకులకు ఏమీ అభ్యంతరం లేదు. ప్రభుత్వం తాము చెప్పిన పనులు చేయడం మొదలుపెట్టిందనీ, అందువల్ల దాని స్థానం పైకి ఎగబాకిందనీ కూడ రుష్లో రాశాడు. అయితే ఈ పనులు కేంద్ర ప్రభుత్వ స్థాయిలో చేస్తే సరిపోదనీ, రాష్ట్ర ప్రభుత్వాల స్థాయిలో కూడ అమలు చేయాలనీ ప్రపంచ బ్యాంకు సూచిస్తున్నది. దానితో కేంద్ర ప్రభుత్వం 2014 డిసెంబర్ లో అన్ని రాష్ట్రాల ప్రధాన కార్యదర్శులతో ఒక సమావేశం ఏర్పాటు చేసి, సులభంగా వ్యాపారం చేయడం గురించి వారికి ఒక 98 అంశాల కార్యాచరణ ప్రణాళికను ఇచ్చింది. ఆ ప్రణాళిక అమలు తీరు మీద జూన్ 2015లో సమీక్ష చేసింది. ఇలా రాష్ట్రాలకు కర్తవ్యాలు నిర్దేశించి వారి మధ్య పోటీ పెట్టడం నిజమైన సమాఖ్య తత్వం అనీ, దీన్ని పోటీ సమాఖ్య తత్వం అనాలనీ రుష్లో రాశాడు. అలా జరిగిన సమీక్షే ఇప్పుడు ఈ నివేదికగా వెలువడింది.

1. వ్యాపార సంస్థను నెలకొల్పడం, 2. భూమి కేటాయింపు, నిర్మాణ అనుమతులు సంపాదించడం, 3. పర్యావరణ నిబంధనలతో వ్యవహరించడం, 4. కార్మిక నిబంధనలతో వ్యవహరించడం. 5. విద్యుత్తు వంటి మౌలిక సౌకర్యాలు సంపాదించడం. 6. పన్నుల వ్యవస్థలో నమోదు చేసుకోవడం, పాటించడం, 7. తనిఖీలు నిర్వహించడం. 8. ఒప్పందాలకు కట్టుబడి ఉండడం అనే ఎనిమిది రంగాలలో రాష్ట్ర ప్రభుత్వాలకు 285 ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టి ఈ నివేదిక తయారు చేశారు. ఆ ప్రశ్నలకు ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ఇచ్చిన జవాబులను బట్టి ఒక్కొక్క రాష్ట్ర ప్రభుత్వానికీ మార్కులు వేశారు. గుజరాత్ 71.14 శాతం మార్కులతో మొదటి స్థానంలో ఉండగా, 70.12 శాతంతో ఆంధ్రప్రదేశ్ రెండో స్థానంలో, 63.09 శాతంతో జార్ఖండ్ మూడో స్థానంలో, 62.45 శాతంతో చత్తీస్ గడ్ నాలుగో స్థానంలో, 62 శాతంతో మధ్యప్రదేశ్ ఐదో స్థానంలో ఉన్నాయి. తెలంగాణ 42.45 శాతంతో పదమూడో స్థానంలో ఉంది.

అసలు ఇలా ఒక రాష్ట్రం మీద మరొక రాష్ట్రాన్ని పోటీ పెట్టడం ఏమిటి, ఆయా రాష్ట్రాల నైసర్గిక స్థితి, సహజ వనరులు, ప్రజల అవసరాలు దృష్టిలో ఉంచుకుని విధానాలు నిర్ణయించుకుంటాం గాని ఈ ప్రపంచ బ్యాంకు ఎవరు, మా పాలన తీరుపై మార్కులు వెయ్యడానికి దానికేమి అధికారం ఉంది అనే కనీస ఆత్మాభిమానపు ప్రశ్నలు కూడ మన రాష్ట్రాల పాలకులకు రావడం లేదు. మాకు మా ప్రజల సంక్షేమమే ముఖ్యం గాని, మా వనరుల్ని కొల్లగొట్టి మా ప్రజల్ని దోపిడీ చేసే సంస్థలకు అనువుగా ఉన్నామా లేదా అనేది ముఖ్యంకాదు అని ఆత్మగౌరవంతో స్పందించవలసిన రాష్ట్ర ప్రభుత్వాలు ఈ మార్కులు రావడమే గొప్ప అని మురిసిపోతున్నాయి. ప్రపంచ బ్యాంకు తమనేదో అందలం ఎక్కించిందని కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు పొంగిపోతుండగా, మరి కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు మాకు ఇంకా ఎక్కువ మార్కులు రావలసిందనీ, మరొక రాష్ట్రం వాళ్లు కుట్ర చేసి ఎక్కువ మార్కులు కొట్టేశారనీ అంటున్నాయి. అంటే వాళ్ల కంటే మేమే ఎక్కువ బానిసలుగా ఉంటాం, మాదగ్గరికే రండి, మా రాష్ట్ర వనరుల్నే దోచుకోండి, మీకు తోచిన పదో పాతికో మాకు పడేయండి అని రాష్ట్ర ప్రభుత్వాధినేతలు ప్రపంచ బ్యాంకు ముందర మోకరిల్లుతున్నారు.

ఇలా దేశంలోని 32 రాష్ట్ర ప్రభుత్వాలకూ మార్కులు వేసి, వాటిలో 75 శాతం కన్న ఎక్కువ మార్కులు వచ్చిన రాష్ట్రాలు నాయక స్థానంలో ఉన్నాయని, 50 నుంచి 75 శాతం మధ్య వచ్చిన రాష్ట్రాలు నాయక స్థానాన్ని ఆకాంక్షిస్తున్నాయని, 25 నుంచి 50 శాతం వచ్చిన రాష్ట్రాలు కష్టపడి పని చేయవలసినవని, 25 శాతం కన్న తక్కువ వచ్చిన రాష్ట్రాలు ఒక కుదుపుతో తమను తాము విదిలించుకుని ముందుకు కదల వలసినవని ఈ నివేదిక ఆదేశాలలా కనబడని ఆదేశాలు ప్రకటించింది. ఇంతకూ ఇప్పుడు ఏ ఒక్క రాష్ట్రానికీ 75 శాతం కన్న ఎక్కువ మార్కులు వేయకుండా, ఇంకా ఏ ఒక్క రాష్ట్రమూ తన ప్రమాణాలకు తగినంతగా లొంగిపోలేదని ప్రకటించింది.

ఇలా మార్కులు వేయడం, ఒక రాష్ట్రం మీద మరొక రాష్ట్రాన్ని పోటీ పెట్టడం మాత్రమే కాదు, ఒక్కొక్క రాష్ట్రమూ ఇప్పటివరకూ ఏమి చేసిందో, ఇకముందు ఏమి చేయవలసి ఉందో కూడ ప్రపంచ బ్యాంకు నివేదిక ఒక్కొక్క రాష్ట్రానికి ఒక పేజీ కేటాయించి మరీ చెప్పింది.

ఆంధ్రప్రదేశ్ సింగిల్ విండో విధానం, సులభ రిజిస్ట్రేషన్, స్వీయ ధ్రువీకరణపై కార్మిక నిబంధనల అమలు, భూమి కేటాయింపులలో సౌలభ్యం, సులభతరమైన పన్నుల విధానాలను అమలు చేయడంలో విజయాలు సాధించిందని, మరికొన్ని రంగాలలో ఇంకా మెరుగుదల సాధించవలసి ఉన్నదని ఈ నివేదిక రాసింది. తెలంగాణ పారిశ్రామిక విధానం సులభంగా అనుమతులు సంపాదించడానికి వీలుగా ఉందని, మౌలిక సౌకర్యాలు కల్పించాలంటే కేవలం రెండు డాక్యుమెంట్లు చాలునని, స్వీయధ్రువీకరణతో అనుమతులు వస్తాయని, అయినా మరికొన్ని రంగాలలో మెరుగుదల కావాలని రాసింది. కాని ఈ అవమానకర నివేదికను ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం తన ఘనతగా చాటుకొంటుండగా, తెలంగాణ ప్రభుత్వం తనకు రావలసినన్ని మార్కులు, రావలసిన స్థానం రాలేదని, ఆంధ్రప్రదేశ్ పాలకులు ఏదో మాయ చేశారని ఆరోపిస్తున్నది.

బహుళ జాతి సంస్థలకు దాసోహం అనడానికి మన ఏలికలు ఎంతగా ఉవ్విళ్లూరుతున్నారు! వీ

# ఎన్‌కౌంటర్ హత్యలు - అమానుష సమర్థనలు

***తెలంగాణలో సెప్టెంబర్ 15న జరిగిన ఎన్‌కౌంటర్ పూర్వాపరాలను వివరిస్తూ, ఆ ఎన్‌కౌంటర్‌ను పరోక్షంగా సమర్థిస్తున్న కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయాలను విశ్లేషిస్తున్నారు* ఎడ్ల పోచయ్య**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం విప్లవోద్యమం మీద తన దుర్మార్గపు హత్యాకాండను ప్రారంభించింది. అధికారంలోకి వచ్చిన ఈ పదహారు నెలలలో సభలు, సమావేశాల మీద ఆంక్షలు విధించడం, జరగనివ్వక పోవడం, ప్రజా సంఘాల మీద పాత ప్రభుత్వం విధించిన నిషేధాన్ని కొనసాగించడం, న్యాయమైన ప్రజాందోళనల మీద లాఠీచార్జిలు, అక్రమ నిర్బంధాలు, చిత్రహింసలు, అరెస్టులు, కుట్రకేసులు – ఒక్కమాటలో చెప్పాలంటే రాష్ట్రాన్ని గత ఆంధ్రప్రదేశ్ కన్న ఎక్కువ పోలీసు రాజ్యంగా మార్చడం జరిగింది. ఆదిలాబాద్ నుంచి ఖమ్మం వరకు గోదావరి తీరంలో విపరీతమైన గ్రేహౌండ్స్ మోహరింపుతో నాలుగైదు సందర్భాలలో కాల్పులు కూడ జరిపినట్టు వార్తలు వచ్చాయి. తెలంగాణ ప్రభుత్వ ఇంటిలిజెన్స్ సమాచారం మేరకే, తెలంగాణ – చత్తీస్ గడ్ – ఆంధ్రప్రదేశ్ పోలీసుల ఉమ్మడి చర్యగా జూన్ 13న కొదమగుండ్ల వివేక్, మడకం సోని, మడకం కమలల ఎన్‌కౌంటర్ హత్య కూడ జరిగింది. తెలంగాణలో ఇంత పెద్దఎత్తున పోలీసు నిర్బంధం సాగుతున్నప్పటికీ, ఆలేరు దగ్గర వికారుద్దీన్‌ను, అనుచరులను అత్యంత దుర్మార్గంగా కాల్చిచంపి ఎన్‌కౌంటర్ కట్టుకథ అల్లినప్పటికీ, తెలంగాణలోకి ఎన్‌కౌంటర్లు రాలేదు గదా అని కొందరైనా అనుకున్నారు. తెలంగాణ రాష్ట్ర సమితి పాలనలో ఎన్‌కౌంటర్లు ఉండవని కూడ కొందరు ఆశించారు. 'మావోయిస్టు ఎజెండానే మా ఎజెండా' అనీ 'ఎన్‌కౌంటర్లు లేని తెలంగాణ సాధిస్తామ'నీ ఎన్నోసార్లు ప్రకటించిన తెరాస అధ్యక్షుడు ముఖ్యమంత్రి కావడం ఆ ఆశకు ఒక కారణం కావచ్చు. అంతేకాదు, 2004 ఎన్నికల్లో గెలిచి, కాంగ్రెస్‌తో ఐక్యసంఘటన ప్రభుత్వంలో చేరిన తెరాస మంత్రులు ఆరుగురు 2005 జూలై 1న జనశక్తి నాయకుడు రియాజ్ ఎన్‌కౌంటర్ హత్య జరగగానే అదే కారణంగా తమ పదవులకు రాజీనామా చేశారు. అలా ఎన్‌కౌంటర్ కారణంగా మరొక ప్రభుత్వం నుంచి తొలగిపోయిన వారు తమ ప్రభుత్వంలో ఎన్‌కౌంటర్లు చేయించరని కూడ కొందరు ఆశించారు.

కాని ఆ సమ్మకాలను, ఆశలను భగ్నం చేస్తూ, రాజ్యస్వభావాన్ని, రాజ్యహింసను బహిర్గతం చేస్తూ సెప్టెంబర్ 15 ఉదయం వరంగల్ జిల్లా తాడ్వాయి అడవుల్లో ఎన్‌కౌంటర్ జరిగిందనీ, ఆ ఎదురుకాల్పుల్లో ఇద్దరు మావోయిస్టులు చనిపోయారనీ, కొందరు తప్పించుకున్నారనీ తొలి వార్తలు వెలువడ్డాయి. కొంతసేపటి తర్వాత మృతులు వరంగల్ జిల్లా వడ్డెపల్లికి చెందిన తంగెళ్ల శ్రుతి, పెద్దపెండ్యాలకు చెందిన మనికంటి విద్యాసాగర్ రెడ్డి అని బైటపడింది. ఆ ఇద్దరూ కూడ ఉన్నత విద్యావంతులు. శ్రుతి ఎంటెక్ చదువుతూ ఉద్యమంలోకి వెళ్లింది. విద్యాసాగర్ రెడ్డి డిగ్రీ చేసి, ఉద్యమంలోకి వెళ్లి, కొద్దికాలం తర్వాత వెనక్కి వచ్చి, గ్రామంలో అక్రమాల మీద పోరాడే క్రమంలో పోలీసు నిర్బంధాన్ని ఎదుర్కొని మళ్లీ ఉద్యమంలోకి వెళ్లాలనుకున్నాడు. మిత్రుడు వివేక్ ఎన్‌కౌంటర్ తర్వాత ఆ సమయం వచ్చిందనుకుని ఉద్యమంలోకి వెళ్లాడు. ముందు వివేక్ ఎన్‌కౌంటర్‌తోనూ, ఇప్పుడు ఈ ఇద్దరి ఎన్‌కౌంటర్‌తోనూ ఇంతకాలం పోలీసులు ప్రచారం చేస్తున్నట్టుగా, ప్రచార సాధనాలు నమ్ముతున్నట్టుగా, విద్యావంతులు ఉద్యమం వైపు చూడడం లేదనే అబద్ధం బద్దలైపోయింది.

పోలీసులు ఆ ఇద్దరినీ కనీసం రెండు రోజుల ముందు పట్టుకున్నారనీ, భయానకమైన చిత్రహింసలకు గురిచేసి, చంపి, మృతదేహాలను అడవిలో పడేసి ఎన్‌కౌంటర్ కట్టుకథ అల్లారనీ స్వతంత్ర పరిశీలకులు, నిజనిర్ధారణ కమిటీల సభ్యులు అంటున్నారు. మృతదేహాల మీద కత్తిపోట్లు, కోసిన గుర్తులు, ఆసిడ్ పోసిన ఆనవాళ్లు, మర్మావయవాల మీద దెబ్బలు వంటి ఎన్నో చిహ్నాలు దారుణమైన చిత్రహింసలు జరిగాయని, శ్రుతి మీద అత్యాచారం జరిగి ఉండవచ్చుననీ, పోలీసులు చెపుతున్నట్టు అవి ఎదురు కాల్పులలో సంభవించిన మరణాలు కావనీ చూపుతున్నాయి. ఒక్క గ్రేహౌండ్స్ కానిస్టేబుల్ కూడ కనీసం గీరుకుపోయిన గాయం లాంటి దానికి కూడ చికిత్స చేయించుకోకపోవడం కూడ ఎదురుకాల్పులు జరగలేదనడానికి సాక్ష్యం పలుకుతున్నది. ఎన్‌కౌంటర్ జరిగిందని చెపుతున్న మర్నాడు ఉదయానికే, ఇంకా ఇరవై నాలుగు గంటలు నిండకముందే మృతదేహాలు కుళ్లిపోవడం, పురుగులు పట్టడం, దుర్వాసన రావడం కూడ హత్య ముందెప్పుడో జరిగి ఉంటుందని చూపుతున్నాయి.

సెప్టెంబర్ 16న వరంగల్ ఎంజిఎం ఆస్పత్రిలో శవపరీక్ష జరిపేటప్పుడు గ్రేహౌండ్స్ పోలీసులు, సాధారణ పోలీసులు చేసిన హడావుడి, వాళ్ల కళ్లలో నాలుగున్నర దశాబ్దాలలో ఎప్పుడూ కనిపించనంత క్రౌర్యం చూస్తే, ఒకవైపు పోలీసులలో పెరిగిన నిర్దాక్షిణ్యం, మరొకవైపు మమ్మల్ని ఎవరూ ఏమీ చేయలేరనే అహంకారం కనిపించాయి. మామూలుగా ఎన్‌కౌంటర్ మరణాలు సంభవించినప్పుడు ఏయే పద్ధతులు పాటించాలో జాతీయ మానవ హక్కుల సంఘం (ఎన్ఎచ్ఆర్‌సి) ప్రకటించిన మార్గదర్శక సూత్రాలను ఖాతరు చేయకపోవడం మాత్రమే కాదు నిస్సిగ్గుగా ఉల్లంఘించడం జరిగింది. శవపరీక్ష సందర్భంలో ఎన్ఎచ్ఆర్‌సి మార్గదర్శక సూత్రాలను పాటించాలని అప్పటికప్పుడు వరంగల్ జిల్లా మానవహక్కుల న్యాయస్థానం ఇచ్చిన ఆదేశాలను పట్టుకుని వచ్చిన న్యాయవాదులను కూడ పోలీసులు అడ్డుకున్నారు. 'కోర్టు ఎవరి పేరు మీద ఉత్తర్వులు ఇచ్చింది, వారి దగ్గరికే వెళ్లండి' అని నిర్లక్ష్యంగా అన్నారు. సాధారణంగా 'అయిపోయిందేదో అయిపోయింది. వాళ్లందరూ తమ బంధువునో, మిత్రులనో కోల్పోయిన దుఃఖంలో ఉన్నారు. ఇప్పుడు సానుభూతి కాకపోయినా చూసీ చూడనట్టు పోదాం' అన్న వైఖరి గత ఆంధ్రప్రదేశ్

పోలీసు రాజ్యం కాలంలోనైనా ఉండేది గాని తెలంగాణ మరింత దారుణమైన పోలీసు రాజ్యంగా సైనిక పాలనగా మారినట్టుంది. తెలంగాణ ఉద్యమకాలంలో పోలీసు నిర్బంధం గురించి చర్చ వచ్చినప్పుడల్లా అదంతా ఆంధ్ర పోలీసుల క్రూరత్వం, తెలంగాణ పోలీసులుంటే తెలంగాణ బిడ్డలమీద అంత దౌర్జన్యం జరిగేది కాదు అని ఉద్యమ నాయకులు అంటూ ఉండేవారు. కాని తెలంగాణ ఏర్పడిన తర్వాత తెలంగాణ పోలీసుల ప్రవర్తన ఆంధ్రప్రదేశ్ పోలీసుల ప్రవర్తన కన్న ఘోరంగా ఉంటుందని ఈ ఘటనలో వ్యక్తమయింది.

నక్సలైట్ ఉద్యమాన్ని అణచివేసే పేరుమీద గత నాలుగు దశాబ్దాలుగా పోలీసులకు మితిమీరిన అధికారాలు, అంతులేని నిధులు ఇచ్చిన పాలకులు వారికి జవాబు చెప్పనక్కరలేని అహంకార ప్రవర్తన అలవాటు చేశారు. ఆ అధికారాలను, నిధులను కొనసాగించుకోవడం పోలీసు అధికారులకు ఒక స్వార్థ ప్రయోజనంగా మారింది. ఒకవైపు 'ఉద్యమం లేదు, అణగారిపోయింది, రిక్రూట్ మెంట్ లేదు, సరెండర్లు పెరిగాయి' అంటూనే, మరొకవైపు ఉద్యమ బూచి చూపి రాజకీయ నాయకులను భయపెట్టి, బ్లాక్‌మెయిల్ చేసి తమ అధికారాలను స్థిరపరచుకుంటున్నారు.

నిజానికి పోలీసులు ఒకానొక ప్రభుత్వ శాఖ. రాజనీతిశాస్త్ర సూత్రాల ప్రకారం చెప్పాలంటే ప్రజల వోట్ల ద్వారా ఎన్నికైన ప్రజా ప్రతినిధులతో చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వ యంత్రాంగంలో ఒకానొక శాఖగా, మంత్రివర్గ ఆదేశాల ప్రకారం, ఆ ఆదేశాలు రాజ్యాంగానికి లోబడినంత వరకూ ప్రవర్తించడం ఆ శాఖ బాధ్యత. కాని ప్రస్తుత తెలంగాణ పోలీసు శాఖ మంత్రివర్గానికి లోబడి మంత్రివర్గ ఆదేశాలను అనుసరించడం కాదు, పోలీసు శాఖే మంత్రివర్గానికి పైస్థాయిలో ఉండి, తన ఇష్టం వచ్చిన రాజ్యాంగ వ్యతిరేకమైన పనులు చేసి, తర్వాత మంత్రివర్గ ఆమోదాన్ని, సమర్థనను పొందుతున్నది.

ఈ చట్టవ్యతిరేక, అప్రజాస్వామిక, అమానుష పవర్తనకు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రోజుల నుంచీ సుదీర్ఘమైన చరిత్ర ఉంది.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో జరిగిన మొదటి ఎన్‌కౌంటర్ హత్య సమయంలో, 1969 మేలో, అప్పటికి పోలీసు శాఖ ఇంతగా బలోపేతం కాలేదు గనుక, పంచాది కృష్ణమూర్తినీ, మరి ఆరుగురినీ శ్రీకాకుళం జిల్లా సోంపేట రైల్వే స్టేషన్‌లో పట్టుకొని అప్పటి హోం మంత్రికి వైర్ లెస్ మెసేజ్ పంపించారు. అప్పటి హోం మంత్రి జలగం వెంగళ రావు స్వయంగా 'బంప్ దెమ్ ఆఫ్' (వాళ్లను చంపి పారేయండి) అని తిరుగు మెసేజ్ ఇచ్చాడు. తర్వాత ఆ ఎన్‌కౌంటర్ల హోం మంత్రి రాష్ట్ర ముఖ్యమంత్రి కూడ అయి దాదాపు నాలుగు వందల మంది విప్లవ కార్యకర్తల, ప్రజల ఎన్‌కౌంటర్ హత్యలకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఆదేశాలు ఇచ్చాడు. ఆ క్రమంలో హోం మంత్రికీ ముఖ్యమంత్రికీ చెప్పకుండానే ఎన్‌కౌంటర్ హత్యలు చేయవచ్చుననీ, వాటిని ఆ తర్వాత వాళ్లే అంగీకరించి, తమ తరఫున సమర్థించే బాధ్యత తీసుకుంటారనీ పోలీసు అధికారులు నేర్చుకున్నారు. అలా నలుగురైదుగురు పోలీసు ఉన్నతాధికారులు, ముఖ్యమంత్రితో సంప్రదించి గాని, సంప్రదించకుండా గాని విచ్చలవిడి హత్యాకాండ సాగించే వ్యవస్థ ఏర్పడింది. ప్రతిస్పందన ఎక్కువగా ఉండవచ్చునని అనుమానం ఉన్న విప్లవనాయకులు దొరికినప్పుడు ముఖ్యమంత్రికి చెప్పి హత్య చేయడం అనే ఆనవాయితీ వచ్చింది. అటువంటి హత్యలు ఎన్‌కౌంటర్ ను ఏ పోలీసు స్టేషన్ పరిధిలో, ఏ జిల్లాలో చూపుతారో, ఆ కిందిస్థాయి పోలీసు అధికారులకు, చివరికి జిల్లా ఎస్పీలకు కూడ తెలియకుండా జరగడం మొదలయింది. ఉదాహరణకు 1999లో కేంద్రకమిటీ నాయకులు నల్లా ఆదిరెడ్డి, ఎర్రంరెడ్డి సంతోష్ రెడ్డి, శీలం నరేష్‌లను బెంగళూరులో పట్టుకున్నప్పుడు, వారిని పట్టుకున్నామని అప్పటి డిజిపి ఎచ్‌జె దొర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు చెప్పి, వారిని చంపడానికి అనుమతి పొందడమో, చంపుతున్నామని సమాచారం ఇవ్వడమో జరిగింది. ఆ ఎన్‌కౌంటర్‌ను కరీంనగర్ జిల్లా కొయ్యూరు అడవిలో చూపదలచు కున్నారు గనుక స్థానిక పశువుల కాపరిని కూడ చంపి నాలుగు మృతదేహాలనూ అక్కడ పడేశారు. తన జిల్లాలో ఎన్‌కౌంటర్ చూపదలచు కున్నారని తెలియని అప్పటి కరీంనగర్ జిల్లా ఎస్‌పి నళిన్ ప్రభాత్ అప్పటికి తన పెళ్లి శుభలేఖలు పంచుకుంటూ సెలవు మీద హైదరాబాదులో ఉన్నాడు. "నీ జిల్లాలో ఎన్‌కౌంటర్ జరిగింది. వెళ్లి అది నీ బలగాలే జరిపాయని క్లెయిమ్ చేసుకో" అనే ఆదేశాలతో ఆయన కరీంనగర్ వెళ్లాడు.

ఆంధ్రప్రదేశ్ చరిత్రలో ఇటువంటి దుర్మార్గ ఘటనలు కొల్లలుగా జరిగాయి. చివరికి చంద్రబాబు నాయుడు ప్రభుత్వం 2001 నవంబర్‌లో అతి దుర్మార్గమైన త్వరితగతి పదోన్నతి పథకాన్ని (యాక్సిలరేటెడ్ ప్రమోషన్ పాలసీ) ప్రకటించింది. ఎన్‌కౌంటర్ లో పాల్గొన్న పోలీసు అధికారులకు వారి సర్వీసుతో, సీనియారిటీతో సంబంధం లేకుండా పదోన్నతి కల్పించడం మొదలుపెట్టింది. సాధారణంగా ఎన్‌కౌంటర్ అనేదే బూటకం గనుక పోలీసు అధికారులు, ఎవరినైనా చంపి, ఎన్‌కౌంటర్ కట్టుకథ అల్లి పదోన్నతులు సంపాదించడం ప్రారంభించారు. ఈ పథకం మనుషులను చంపడాన్ని ప్రోత్సహించే పథకంలా ఉన్నదని న్యాయస్థానానికి వెళితే స్వయంగా సుప్రీం కోర్టు ఇందులో జోక్యం చేసుకోబోమని తీర్పు ఇచ్చింది. ఈ ఎన్‌కౌంటర్ హత్యల ప్రోత్సాహకాలలో మరింత దుర్మార్గమైన ఉదాహరణ కొయ్యూరు ఎన్‌కౌంటర్ లో తాము పాల్గొన్నామని అప్పటి ఇంటిలిజెన్స్ అధికారి ఎ శివశంకర్, అప్పటి ఎస్ఐబి డిఐజి శ్రీరామ్ తివారీ, అప్పటి కరీంనగర్ ఎస్పీ నళిన్ ప్రభాత్ 2002లో పోలీసు శౌర్య పతకాలు పొందారు. ఈ పతకం ప్రకారం ఒక్కొక్కరికి రు. మూడు కోట్ల విలువైన బహుమతులు అందాయని పత్రికలు రాశాయి. ఈ ముగ్గురిలో ఇద్దరు ఎన్‌కౌంటర్ చూపిన సమయానికి అక్కడ లేనేలేరని ఇతర అధికారులు ఫిర్యాదు చేయగా కేంద్ర ప్రభుత్వం ఈ పతకాలను ఉపసంహరించుకుంటామని, సంజాయిషీ ఇమ్మని రాష్ట్ర ప్రభుత్వానికి ఉత్తరం రాసింది.

ఈ చరిత్రంతా ఉమ్మడి రాష్ట్రంలో ఎన్‌కౌంటర్ల పేరిట ఎంతటి అక్రమ, అమానుష, చట్టవ్యతిరేక హత్యాకాండ సాగిందో చూపుతుంది. ఈ హత్యాకాండ పోలీసు అధికారుల నేతృత్వంలో, వారికి సహకరించిన రాజకీయ నాయకుల తోడ్పాటుతో జరిగింది. ఆ రాజకీయ నాయకులలో కొందరు ఉద్దేశపూర్వకంగా సహకరించారు, కొందరు పోలీసు అధికారుల చెప్పుడు మాటలకు, బెదిరింపులకు లొంగిపోయారు. ఇటువంటి హత్యాకాండ తెలంగాణలో జరగక పోవచ్చునని కొందరైనా అమాయకంగా నమ్మారు. తెలంగాణ రాష్ట్ర రాజకీయ నాయకులు ఉద్యమక్రమంలో ఎదిగినవారు గనుక పాత నాయకులలా పోలీసులకు లొంగిపోనక్కరలేదు. తోక కుక్కను ఆడించనక్కరలేదు. కాని ఈ పదహారు నెలల్లో తెలంగాణ నాయకులను కూడ పోలీసులు పాత పద్ధతిలోనే తప్పుదారి పట్టిస్తున్న ఉదంతాలు ఉన్నాయి. ఆ నాయకులు నిజంగా

ప్రజలతో సంబంధం ఉన్నవారైతే, ఉద్యమ క్రమంలో పోలీసుల నిర్బంధకాండ గురించీ, పోలీసులకు అలవాటైన అబద్ధాల గురించీ స్పృహ ఉన్నవారైతే పోలీసులు చెప్పే విషయాలను పక్కనపెట్టి ప్రజాప్రతినిధులుగా తాము చేయదలచుకున్నది చేయవచ్చు. కాని తెలంగాణ ప్రజాప్రతినిధులు కూడ అధికారం చేపట్టిన తర్వాత క్రమక్రమంగా ప్రజలకు దూరమవుతూ ప్రజా సమస్యలను విస్మరిస్తున్నారు. అందువల్లనే ప్రస్తుత దుర్మార్గమైన ఎన్‌కౌంటర్ మీద ప్రజాప్రతినిధుల నుంచి, తెలంగాణ ఉద్యమంలో పాల్గొన్నవారి నుంచి కనీస వ్యతిరేకత కూడ రాలేదు.

వ్యక్తులుగా ఆ ప్రజాప్రతినిధులు ఎట్లా ప్రతిస్పందించినప్పటికీ అసలు ప్రభుత్వ విధానమే ఈ ఎన్‌కౌంటర్ హత్యను ప్రోత్సహించేదిగా ఉంది. ఎన్‌కౌంటర్ జరిగిన సమయానికి ముఖ్యమంత్రి రాష్ట్రంలో లేదు. తిరిగి వచ్చిన తర్వాతనైనా ఎన్‌కౌంటర్ గురించి మాట్లాడలేదు. ఉప ముఖ్యమంత్రి, హోం మంత్రి విలేఖరుల ప్రశ్నలకు జవాబుగా ఈ సంఘటన దురదృష్టకరం అన్నారని వార్తలు వచ్చాయి. పోలీసు అధికారులు, పోలీసు అధికారుల సంఘం ఎన్‌కౌంటర్ నిజమైనదేనని, ప్రజాసంఘాల ఆరోపణలలో నిజం లేదని అన్నారు. అటువంటి స్థితిలో నిజానిజాలను తేల్చడానికి కనీసమైన న్యాయవిచారణకు కూడ ప్రభుత్వం ఆదేశించలేదు. ఎన్‌కౌంటర్ ఘటనలో పాల్గొన్న పోలీసు అధికారులమీద హత్యా నేరం నమోదు చేసి, తాము ఆత్మరక్షణ కోసం మాత్రమే కాల్పులు జరిపామని కోర్టు విచారణలో రుజువు చేసుకోవలసిన బాధ్యత వారి మీద పెట్టాలని గతంలో రాష్ట్ర హైకోర్టు, సుప్రీం కోర్టు, ఎన్ ఎచ్ ఆర్ సి ఇచ్చిన ఉత్తర్వులను పాటించాలని కూడ రాష్ట్ర ప్రభుత్వం అనుకోలేదు. అంటే స్పష్టంగానే రాష్ట్రప్రభుత్వం ఎన్‌కౌంటర్ హత్యలకు అనుకూల విధానం తీసుకోదలచుకున్నదన్నమాట. లేదా, పోలీసులు ఎన్‌కౌంటర్ హత్యలు కొనసాగించినా తమకేమీ పట్టనట్టు ఉండి పోదలచుకున్న దన్నమాట.

ఈ ప్రభుత్వ దుర్మార్గానికి సమాజంలో, రాజకీయవర్గాలలో, యువతరంలో పెద్దఎత్తున స్పందన వచ్చింది. శ్రుతి, విద్యాసాగర్ రెడ్డిలు తమ ప్రాణత్యాగం ద్వారా ప్రజాఉద్యమంలో ఐక్యతకు కారణమయ్యారు. పది వామపక్ష పార్టీలు, నాలుగు వందల దాకా ప్రజాసంఘాలు కలిసి ఈ ఎన్‌కౌంటర్ హత్యల మీద విచారణ, నేరస్తులకు శిక్ష కోరుతూ చలో అసెంబ్లీ పిలుపునిచ్చాయి. ఇద్దరి అంతిమ యాత్రలలో, సంస్మరణ సభల్లో వేలాది మంది పాల్గొన్నారు. వందలాది మంది విద్యావంతులు, యువకులు ప్రభుత్వ దుర్మార్గాన్ని నిరసిస్తూ ఎన్నో మార్గాలలో తమ స్పందన ప్రకటించారు.

ప్రభుత్వ విధానంలోని ఈ దుర్మార్గం ఒక ఎత్తు కాగా, ఈ ఎన్‌కౌంటర్ సందర్భంలో పత్రికలలో, అంతకన్న ఎక్కువగా సోషల్ మీడియాలో కొందరు బుద్ధిజీవుల స్పందనలు, వ్యాఖ్యలు మరింత అమానుషంగా ఉన్నాయి. వీరిలో కొందరు తెరాస ప్రభుత్వాన్ని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో సమర్థించదలచుకున్న "తెలంగాణ వాదులు". వారు తమను తాము తెలంగాణ వాదులమని అనుకుంటున్నారు గాని తెలంగాణ ఉద్యమ ఆకాంక్షలకు వ్యతిరేకమైన విధానాలను సమర్థిస్తున్నందువల్ల, ఇవాళ తెలంగాణ బిడ్డల ఆత్మహత్యలకూ, హత్యలకూ నిమ్మకు నీరెత్తినట్టు ఉండడం వల్ల వాళ్లను తెలంగాణ వాదులు అనడానికి వీలులేదు. తెలంగాణ ఉద్యమ సమయంలో వీళ్లు మావోయిస్టులతో కలిసి పనిచేసినవాళ్లే. తెలంగాణ పట్ల మావోయిస్టు వైఖరిని సమర్థించినవాళ్లే. కాని తెలంగాణ ఏర్పడిన తర్వాత తెరాస ప్రభుత్వం మావోయిస్టు వ్యతిరేక వైఖరి తీసుకోవడంతో, ఈ ప్రభుత్వం కింద తమకేదో దక్కడంతో, భవిష్యత్తులో దక్కే అవకాశం ఉన్నదనే భ్రమతో, తమ పాత మిత్రత్వాన్ని వదిలి మావోయిస్టులను విమర్శించాలనీ, ప్రభుత్వాన్ని సమర్థించాలనీ వీళ్లు నిర్ణయించుకున్నారు. కళ్ల ముందర భయంకరమైన, పాశవికమైన అత్యాచారం, హింస, హత్య కనబడుతుండగా వాటిని కూడ సమర్థిస్తున్న కర్కోటకులు కొందరు కాగా, ఆ దారుణ చర్యల పట్ల మౌనం వహిస్తూ, మృతుల మీదనో, మృతుల సానుభూతిపరుల మీదనో ఎదురుదాడి చేస్తే సరిపోతుందనుకుని (అఫెన్స్ ఈజ్ ది బెస్ట్ ఫార్మ్ ఆఫ్ డిఫెన్స్ అంటారు) మావోయిస్టుల మీద, మృతుల మీద, సిద్ధాంతం మీద దాడి చేస్తున్నవారు కొందరు.

ఇక ఈ హత్యలను దొడ్డిదారిన సమర్థిస్తున్న మరికొందరికి తెలంగాణ ప్రభుత్వం మీద అభిమానమేమీ లేదు గాని సమాజాన్ని పట్టించుకోనక్కర లేదని, పోరాటాలు వద్దని అనుకునే విలాస నిర్లక్ష్య జీవితపు మనుషులు కొందరు. తాము భద్రజీవితంలో కూచుని, తమకు ఏ సమస్యలూ లేవు గనుక ప్రపంచానికి కూడ సమస్యలు లేవని భ్రమ పడుతూ, సమస్యల మీద పోరాటాలు చేసేవాళ్లను ఏవగించుకునేవాళ్లు కొందరు. ఒకప్పుడు తాము కూడ సమస్యల గురించి, పోరాటాల గురించి మాట్లాడి, ఇప్పుడు ఆ ఆదర్శాలను వదులుకున్న అపరాధ భావన పీడిస్తుండగా, ఆ ఆదర్శాలను ఇంకా నమ్ముతున్న, ఆచరణలో ఉన్నవారి మీద బురద జల్లి తమ అపరాధ భావనను వదులుకోవడానికి ప్రయత్నిస్తున్న వాళ్లు మరికొందరు.

ఈ ఎన్‌కౌంటర్ హత్యల్లో నవయువకులు, విద్యావంతులు హతమైపోవడం చూసి నిజంగానే భావోద్వేగంతో ఈ మారణకాండ ఆగదా, ఆగేదెట్లా అని ఆలోచిస్తున్న, ప్రశ్నిస్తున్న సున్నిత మనస్కులు కూడ ఉన్నారు. వారి స్పందనలు, వ్యాఖ్యలు తీవ్రంగా ఆలోచించ వలసినవే. అయితే పైన చెప్పిన అమానుష వ్యాఖ్యలు చేసినవారు మాత్రం స్పష్టంగా చెప్పాలంటే హత్యలకు సమర్థన వాదనలు, దొడ్డిదారి సమర్థన వాదనలు ముందుకు తెస్తున్నారు. ఇద్దరు నవయువకులను రాజ్యం అతి కిరాతకంగా బలిగొంటే ఆ కిరాతకాన్ని ఖండించడం లేదు, మృతులకోసం ఒక కన్నీటిచుక్క కార్చడం లేదు, ఆ బాధితులనే విమర్శించడానికి, వారు చేపట్టిన మార్గాన్ని విమర్శించడానికి, ఆ మార్గంలోకి వాళ్లను "పంపించిన వాళ్లను" విమర్శించడానికి, నిందించడానికి పూనుకుంటున్నారు. తమ పాండిత్యాన్ని, అతి తెలివిని, దూరదృష్టిగా కనబడే సంకుచితత్వాన్ని, మానవీయ స్పర్శ ఉందేమో అని భ్రమ కల్పించే అమానవీయ వైఖరిని, నిజాయితీ నిండిన ప్రశ్నలేమో అనిపించే దొంగప్రశ్నలను ప్రకటిస్తున్నారు.

కోపం తెచ్చుకోవలసింది చంపినవాళ్ల మీద కాదు, పంపినవాళ్ల మీద అని వాళ్లు ప్రకటిస్తున్నారు. "పంపినవాళ్లు" అని కొందరిని పేరుపెట్టీ, కొందరిని పేరుపెట్టకా నిందిస్తున్నారు. ఉద్యమంలోకి వెళుతున్నవాళ్లు వ్యక్తిత్వం లేని, ఆలోచన లేని, ఉద్యమంలోకి వెళితే తమ ప్రాణాలు పోవచ్చునని తెలియని, ఎవరో పంపితే వెళుతున్న మైనం ముద్దల వంటి వాళ్లా అనేది మొదటి ప్రశ్న. తుపాకి పట్టుకొమ్మని ఒకరు చెప్పగానే పట్టుకునేవాడు, దించమని మరొకరు చెపితే దించుతాడు కూడ అని కొడవటిగంటి కుటుంబరావు అన్నమాట గుర్తుకొస్తున్నది.

ఎవరినైనా ఎవరి మాటలైనా, పాటలైనా ప్రభావితం చేయవచ్చు. తమ జీవితాదర్శం ఏమిటో నిర్ణయించుకునేలా చేయడంలో ఆ ప్రభావం పాత్ర ఉండవచ్చు. కాని ఆ ప్రభావం వల్ల మాత్రమే అందరూ ఉద్యమంలోకి వెళ్లడం లేదంటే, కొందరే వెళ్తున్నారంటే, పంపించడం – వెళ్లడం అనే ప్రక్రియను మించిన అంశాలేవో ఇందులో ఉన్నాయని, వెళ్లిన వారందరినీ ఎవరో పంపిస్తే వెళ్లినవారిగా చెప్పలేమనీ అర్థమవుతుంది. కుటుంబ నేపథ్యం, జీవితానుభవాలు, అధ్యయనం, స్పందనాశీలత, పరిణామాలను ఎదుర్కొనే సంసిద్ధత వంటి ఏ వ్యక్తికి ఆ వ్యక్తికే ఉండే ప్రత్యేక లక్షణాలకు మరొకరి మాటల, రచనల ప్రభావం తోడు కావచ్చు గాని కేవలం ప్రభావమే ఎవరినైనా పంపిస్తుందని అనడం దొంగవాదన తప్ప వాస్తవం కాదు.

అంతేకాదు, ఒక మార్గం మంచిది, అనుసరణీయమైనది అని ఒకరు చెప్పగానే మిగిలినవాళ్లందరూ పాటించే స్థితి సమాజంలో ఎప్పుడూ ఉండదు. గౌతమ బుద్ధుని నాటినుంచి ఇవాళ్టిదాకా అటువంటి మంచి మార్గాల గురించి ఎందరో చెప్పారు. అటువంటి మాటలు చెప్పినందుకే చార్వాకులు హింసలు కూడ అనుభవించారు. పర్యవసానం ప్రమాదకరమైనదైనా, కాకున్నా ఎప్పుడైనా ఒక ప్రబోధాన్ని మిగిలిన సమాజంలో వీలైన వ్యక్తులు తమకు వీలైనట్టు, వీలైన సమయంలో మాత్రమే, ఆ మాటల పర్యవసానాల బీభత్సాన్ని కూడ లెక్కచేయకుండా అనుసరిస్తారు. ఆ పర్యవసానాల బీభత్సాన్ని చూపి ప్రబోధాన్ని తప్పు పట్టడం అంటే అది యథాస్థితికి సమర్థనే అవుతుంది. యథాస్థితి మీద ప్రశ్నలు వేయవద్దనీ, దాన్ని మార్చాలనే ఆలోచన చేయవద్దనీ చెప్పడమే అవుతుంది.

తమ వ్యాఖ్యల ద్వారా తాము యథాస్థితిని, దోపిడీ పీడనలను సమర్థిస్తున్నామనీ, హత్యలకు వత్తాసు పలుకుతున్నామనీ ఈ వ్యాఖ్యాతల అంతరంగాలకైనా తెలుసు. అందుకని ఆ వత్తాసుకు ఒక చక్కెరపూత పూస్తున్నారు. ఎన్‌కౌంటర్లను వ్యతిరేకించే, ప్రగతిశీల రాజకీయ విశ్వాసాలు ప్రకటించే వాళ్ల మీద దాడి చేస్తూ వాళ్లు అమాయకులను ఉద్యమాలలోకి "పంపినవాళ్లు" అని ఆరోపిస్తున్నారు. వాళ్లు తమ పిల్లలను పంపుతున్నారా అనీ, వాళ్లు భద్రజీవనం గడపడం లేదా అనీ, వాళ్లు కంప్యూటర్ల ముందర కూచుని సుఖంగా ఏడవడం లేదా అని ఎమోషనల్ బ్లాక్ మెయిల్ చేస్తున్నారు. తటస్థులకు న్యాయమైనవిగా కనిపించే ప్రశ్నలు వేస్తున్నారు. ఈ ప్రశ్నలలోని అబద్ధాలూ దురుద్దేశాలూ తెలియనివాళ్లూ, అర్ధసత్యాలే నిజాలని అనుకునేవాళ్లూ ఈ ప్రశ్నల మాయలో పడుతున్నారు.

ఈ ప్రశ్నలు అమాయకులను మాయ చేయడానికి ఉద్దేశపూర్వకంగా వేస్తున్నవి గనుక వీటిని జాగ్రత్తగా పరిశీలించాలి. అసలు పంపేవాళ్లు – పంపబడేవాళ్లు అనే విభజనే అర్థరహితం గనుక ఎవరైనా ఇతరులను పంపారనీ, తమ కుటుంబాలను పంపడం లేదనీ అనడం తప్పుడు వాదన. ఉద్యమం మంచిదని ప్రచారం చేసేవాళ్లు ఇంట్లోనూ బైటా కూడ ఆ ప్రచారం చేస్తారు. ఆ భావాల ప్రభావం అందరిమీదా ఉన్నట్టే కుటుంబ సభ్యుల మీద కూడ ఉంటుంది. ఆ అందరిలో ఏ కొందరో ఈ ప్రభావానికి తోడు ఇతర అంశాలు కూడ కలిసి ఉద్యమంలో చేరుతారు. ఆ కొందరిలో కుటుంబ సభ్యులూ ఉండవచ్చు, ఇతరులూ ఉండవచ్చు. ఇక ఆ ప్రచారం చేస్తున్నవాళ్లు తాము ఉద్యమంలోకి వెళ్లకుండా బైట ఎందుకున్నారు అని మరొక అర్థరహితమైన ప్రశ్న. సమాజంలోనైనా, సమాజాన్ని మార్చదలచుకున్న ఉద్యమంలోనైనా అనేక రంగాల్లో, అనేక స్థాయిల్లో, అనేక చోట్ల పని ఉంటుంది. ఎవరికి వారు అవకాశాలనూ పరిమితులనూ బట్టి, తమ చైతన్యాన్ని బట్టి, సంసిద్ధతను బట్టి ఏదో ఒక రంగం, ఒక స్థాయి ఎంచుకుని పని చేస్తారు. వీటిలో కొన్ని ఎక్కువ ప్రమాదకరమైనవీ, కొన్ని తక్కువ ప్రమాదకరమైనవీ కావచ్చు. అసలు ప్రమాదమే లేని పని ఏదీ లేదని బహిరంగ జీవితంలో పనిచేసినవారి మీద అమలైన రాజ్యహింస ఉదాహరణలు చూపుతున్నాయి. ఇప్పుడు రాజ్యహింస సమయంలో దాన్ని ప్రశ్నించే బదులు, ఎవరు ఎక్కడ పనిచేస్తున్నారు అని చర్చ చేయడం అసలు సమస్యను పక్కదారి పట్టించడానికే. ఇది సామాజిక మార్పుకు ఉండే విభిన్న తలాల గురించి అవగాహన లేని అమాయకత్వమైనా కావచ్చు. రాజ్యహింస మీది నుంచి దృష్టిని పక్కకు మళ్లించే దురుద్దేశం అయినా కావచ్చు.

ఈ ప్రశ్నల, వ్యాఖ్యల అంతస్సారం ఒకటే – 'ఉద్యమంలో మరణించిన వారి పట్ల కన్నీరు కూడ కార్చగూడదు. వారిని తలచుకో గూడదు. వారిని తలచుకోవడమంటే వారి మార్గాన్ని, ఆచరణను తలచుకోవడమే, వాటి వైపు మరింత మందిని ఆకర్షించడమే. కవిత్వాలూ, పాటలూ, ఫేస్‌బుక్ పోస్టులూ, వ్యాసాలూ, ఉపన్యాసాలూ అన్నీ మళ్లీ కొందరిని ఆ మార్గంలోకి పంపడానికే' అని వీళ్లు అంటున్నారు. తన కవిత్వం ద్వారా ఇతరుల మీద ప్రభావం వేసిన ఒక మాజీ విప్లవ కవి, విప్లవ పార్టీ మాజీ నాయకుడు ఈ రాజ్యహింస తర్వాత, "వారిని రాజ్యహింస అనే పాముల పుట్ట లోనికి పంపించి, వాళ్లు పాములు కరిచి చనిపోతే, ఆ దుఃఖం చూపించి మరి కొందరినీ పుట్ట లోకి పంపించే కళా వలయం, సౌందర్య చక్రం ఎక్కడ ఆగుతుందో అర్థం కాకనే, సాధారణ జనమిలా... ఎందుకు ఎందుకు అని అడుగుతున్నారు" అని రాశాడు. రాజ్యహింస అనే పాముల పుట్ట సమాజానికి దూరంగా ఒకానొక పార్టీ నడుపుతున్న ఉద్యమంలోనే ఉందనీ, పాములు అక్కడ మాత్రమే ఉన్నాయనీ ఆయన అనుకుంటున్నాడన్నమాట. అసలు ఈ సమాజమే రాజ్యహింస కింద పాములపుట్టలా మారిపోయిందనీ, ఇక్కడ సాధారణమైన ఉనికే ఎప్పుడు పాములు కరుస్తాయో అనే స్థితిలో ఉందనీ వాస్తవాన్ని ఆయన చూడదలచుకోలేదు. లేదా ఇతరులను మోసం చేయదలచారు. మరి సమాజమే పాముల పుట్ట అయినప్పుడు బుద్ధి ఉన్నవారెవరినా పాములను చంపే మార్గాలు వెతుకుతారా, కనీసం పాముల దౌష్ట్యం గురించి మాట్లాడతారా, పాముల గురించి మాట్లాడకుండా ఉందాం, రోజుకొకరం పాము కాటుకు చచ్చిపోదాం, ఒకరు చస్తే మరొకరు ఏడవడం కూడ వద్దు అంటారా?

అసలు విషయమేమంటే ఈ వ్యాఖ్యలు చేస్తున్నవాళ్లకు తమ భద్రజీవితాలకు ఎక్కడ ముప్పు వస్తుందోనని భయం. ఒకప్పుడు ఇటువంటి సామాజిక ఆలోచనలే, పోరాటాలే మధ్యతరగతిని ప్రశ్నించి, వారిని పోరాటాలవైపు ఆకర్షించాయనీ, మళ్లీ ఇప్పుడు అటువంటి ఆలోచనలు తమ భద్రజీవితానికి ముప్పు తెస్తాయనీ భయం. అసలు పోరాటాన్ని, ప్రశ్నను, ఆచరణను తప్పు పడితే పాములు తమను వదిలిపెడతాయేమోనని ఒక భ్రమ. అందుకని బాధితుల మీదికే ప్రశ్నలు సంధిస్తున్నారు. బాధితులకు సానుభూతి ప్రకటించేవాళ్ల మీదికే సవాళ్లు

విసురుతున్నారు. దుర్మార్గాలు చేసేవాళ్ల మీద పల్లెత్తుమాట లేదు. అతితెలివితో అసలు మార్గమే తప్పు అనేవాళ్లూ, తప్పుడు ఎత్తుగడలు, తప్పుడు వ్యూహం అనేవాళ్లూ, ఈ మార్గం విఫల మార్గమనీ, ఎండమావి అనీ తేలిపోయింది కనుక ఆ మార్గాన్ని మూసేయాలనే వాళ్లూ, ఆ మార్గంలో మరణాలను త్యాగం అనడం, వారిని కీర్తించడం తప్పు అనేవాళ్లూ రకరకాలవాళ్లున్నారు. ప్రజాపోరాటాల గురించి అబద్ధాలూ, అర్ధసత్యాలూ, ఘటనలకు పాలకుల, పీడితుల కోణాలూ కలగలిపి ఎప్పుడో బాలగోపాల్ రాసిన 'చీకటికోణాలు' వ్యాసాన్ని తమకు వత్తాసు తెచ్చుకుంటున్నారు.

వాళ్లు అంటున్నట్టు ఈమార్గమే ఏకైక మార్గం కాకపోవచ్చు. ఈ మార్గంలో గుర్తించదగిన లోపాలు ఉండవచ్చు. ఇంత తెలివైన మేధావులు మరొక మంచి, ఏ నష్టమూ లేని, నెత్తురు చుక్క చిందని మార్గమేదైనా సమసమాజానికి తీసుకుపోయేది ఉంటే చూపితే బాగుండును. కాని వాళ్లు చెపుతున్నదల్లా 'మన కర్మ' అనుకొని ఈ దుర్మార్గాన్ని భరించమనీ, పోరాటాలకు దిగవద్దనీ మాత్రమే.

జరుగుతున్నది ఒక సామాజిక ప్రయోగం. ఉన్న సమాజం కుళ్లిపోయిందనీ, దీన్ని మార్చక తప్పదనీ అనడంలో భిన్నాభిప్రాయమే లేదు. దీన్ని మార్చడానికి ప్రయోగాలు ఇప్పుడే మొదలుకాలేదు. స్పార్టకస్ నాటి నుంచి ఇవాళ్టిదాకా అనేక ప్రయోగాలు జరుగుతూ వచ్చాయి. మనుషుల మధ్య సమానత్వాన్ని సాధించాలనుకున్న ప్రయోగాలు, దోపిడీ పీడనలు లేకుండా ఉండాలనే ప్రయోగాలు. సమసమాజాన్ని నిర్మించే ప్రయోగాలు ఎన్నో జరిగాయి, జరుగుతున్నాయి. సమాజ చరిత్ర, పరిణామం వందల వేల ఏళ్లది గనుక దానిలో యాభై ఏళ్లకే ఓడిపోవడాలూ, విఫల మార్గమనీ, ఎండమావి అనీ తేలడాలూ ఉండవు. బానిసలూ బానిస యజమానులూ ఉండగూడదని స్పార్టకస్ కలగన్నాడు, పోరాడాడు, సహచరులతో సహా శిలువనెక్కాడు. రెండు వేల ఏళ్ల తర్వాత బానిసత్వం ఇంకా ఉంది గనుక బానిసత్వానికి వ్యతిరేకంగా పోరాడడం తప్పందామా? స్పార్టకస్ విఫలమయ్యాడా, విజయం సాధించాడా? రాజునూ రాణినీ తలనరికి స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అని నినదించారు ఫ్రెంచి విప్లవకారులు. రెండు శతాబ్దాల తర్వాత కూడ అవి నిజం కాలేదు. ఆ ఆకాంక్షలు విఫలమయ్యాయా, వాటి గురించి ఆలోచించకుండా ఉందామా? వ్యవస్థనే మార్చదలచుకున్న పోరాటాలకైతే అవరోధాలు, ఎదురుదెబ్బలు, ద్రోహాలు ఎన్ని ఉంటాయో లెక్కలేదు.

మనుషుల సంగతే కాదు, మందే, విషపూరిత రసాయన పదార్థాలతో ప్రయోగాలు చేస్తారు శాస్త్రవేత్తలు. శరీరాలతో ప్రయోగాలు చేస్తారు వైద్యులు. తిరిగి వస్తామో రామో తెలియని అన్వేషణలు చేస్తారు రోదసి లోనూ సముద్రగర్భం లోనూ శాస్త్రవేత్తలు. ఎన్నోసార్లు ఫలితాలు రాలేదు. శాస్త్రవేత్తలు ప్రమాదాల బారినపడ్డారు, ప్రాణాలు పోగొట్టుకున్నారు. ప్రయోగవస్తువుల ప్రాణాలు పోయాయి. ప్రతి ప్రాణమూ విలువైనదే. ప్రతి ప్రాణం పోయినప్పుడూ కన్నీరు కార్చవలసిందే. కాని ప్రయోగాన్ని తప్పు పడితే, మానవ సమాజం ఇక్కడిదాకా వచ్చి ఉండేదేనా?

మేం సాయుధ పోరాటాన్నీ, నూతన ప్రజాస్వామిక విప్లవ భావననూ, ప్రజా యుద్ధ భావననూ మాత్రమే వ్యతిరేకిస్తున్నాం, ఆ తప్పుడు వ్యూహాల వల్లనే, ఎత్తుగడల వల్లనే ఈ ప్రాణాలు పోతున్నాయి, వీధుల్లోకి వచ్చి, ప్రజాస్వామిక ఉద్యమాలు చేసుకోవచ్చుగదా అని ఈ తెలివైన పెద్దమనుషులు పిలుపునిస్తున్నారు. చాల సంతోషం. ఇప్పుడు హత్యకు గురైన విద్యాసాగర్ రెడ్డి మూడు సంవత్సరాలు సాయుధ ఉద్యమంలో పనిచేసి, వెనక్కి వచ్చి పోలీసుల దగ్గర సరెండర్ అయ్యాడు. తర్వాత గ్రామంలో గుట్కాకు వ్యతిరేకంగా, పెత్తందార్ల అక్రమాలకు వ్యతిరేకంగా ప్రజాస్వామిక, వీధిపోరాటాలే చేశాడు. పోలీసు నిర్బంధానికి గురై, మళ్లీ సాయుధ మార్గం ఎంచుకున్నాడు. శ్రుతి కనీసం ఐదు సంవత్సరాల పాటు తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో ప్రజాస్వామికంగా వీధి పోరాటాలలో పాల్గొన్నది. అవి తాము కోరుకున్న మౌలిక మార్పును కాదు, సరిగదా కనీసమైన మార్పులు కూడ తేవడం లేదనే ఎరుక తోనే వాళ్లు విప్లవోద్యమంలోకి వెళ్లారు. ప్రజాస్వామిక ఉద్యమాలు, వీధి పోరాటాలు అంటే ఈ వ్యాఖ్యాతల నిర్వచనం ఏమిటో తెలియదు గాని రాజ్యహింసకు గురికాని, నిర్దాక్షిణ్యమైన అణచివేతకు గురికాని, ప్రాణ నష్టం జరగని ఒక్క ప్రజాస్వామిక ఉద్యమాన్నైనా ప్రపంచ చరిత్రలోంచి, భారత చరిత్రలోంచి వారు చూపెడితే బాగుండును.

ఈ వ్యాఖ్యాతల ప్రశ్నలనూ, స్పందనలనూ, వ్యాఖ్యలనూ తప్పు పడుతున్నామంటే ప్రజా ఉద్యమం లోపరహితంగా జరుగుతున్నదని కాదు, నేర్చుకోవలసినదేమీ లేదని కాదు. తప్పనిసరిగా నష్టాలు తగ్గించుకోవడానికి ప్రయత్నాలు జరగవలసిందే. ప్రతిభావంతులైన, గొప్ప భవిష్యత్ వాగ్దానాన్నిస్తున్న నవయువకులను, విద్యావంతులను పోగొట్టు కోవడం ఉద్యమానికీ, సమాజానికీ తీవ్ర నష్టమే. అటువంటి నష్టాలు తగ్గించుకోవడం ఎట్లా అని ఆలోచించ వలసిందే. రాజ్యహింస ఇంత విచ్చలవిడిగా దుర్మార్గంగా సాగకుండా అడ్డుకోవడానికి ఏకైక సాధనమైన విశాల ప్రజా స్పందనను, నిరసనను, ప్రతిఘటనను నిర్మించడం ఎట్లా ఆలోచించవలసిందే. ప్రజా యుద్ధ వ్యూహంలో, ఎత్తుగడలలో సమయోచిత మార్పులు చేసుకోవడం అవసరమా ఆలోచించవలసిందే.

కాని ప్రస్తుత సందర్భం దుర్మార్గంగా రాజ్యహింస బైటపడిన సందర్భం. దాన్ని ఖండించడం, ఒరిగిన మృతవీరుల కోసం కన్నీరు కార్చడం, అసంపూర్ణంగా ముగిసిన వారి జీవితాదర్శాన్ని స్మరించుకోవడం అవసరం. వారిమీద జరిగిన హంతక దాడిని ఖండించడం అవసరం. అది కూడ వాళ్ల కోసం కాదు. మనకోసం. ఈ ఉద్యమం మీద హంతక దాడులు జరుగుతున్నాయనీ, తమ ప్రాణాలు ఎప్పుడైనా పోవచ్చుననీ పూర్తి ఎరుకతోనే, సంసిద్ధత తోనే వాళ్లు ఉద్యమంలోకి వెళ్లారు. విద్యాసాగర్ రెడ్డి అయితే వివేక్ ఎన్‌కౌంటర్ హత్య జరిగాక ఆవేదనతో వెళ్లాడు. కనుక ప్రశ్న వాళ్ల గురించి కాదు, మనను మనం ఆలోచనా పరులుగా చెప్పుకుంటున్న మన గురించి. సమాజాన్ని మార్చే ఆశయం కోసం ఒక మార్గాన్ని ఎంచుకుని అర్థాంతరంగా రాజ్యహింసలో మరణించిన వాళ్ల గురించి సమాజం ఏమనుకుంటున్నది, ఏమనుకోవాలి అనేవి ప్రశ్నలు. ఆశయం కోసం ప్రాణమైనా త్యజించే విలువలు వాళ్లు ఆచరించి చూపారు. ఆ ప్రాణాన్ని గౌరవించే కనీస మానవ విలువలైనా మనకు ఉన్నాయా, ఆ ప్రాణాన్ని తీసే హక్కు రాజ్యానికి లేదని ఎలుగెత్తగల ధైర్యం మనకుందా అనేవి ప్రశ్నలు. ప్రశ్నలు సంధించవలసింది వాళ్ల మీద, వాళ్ల మార్గం మీద, వాళ్ల సానుభూతిపరుల మీద కాదు. మనుషులుగా ఉన్నామా, ప్రజాస్వామికంగా ఉన్నామా అని మనమీద మనం ప్రశ్నలు సంధించుకోవలసిన సమయమిది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

# తెలంగాణ అధ్యయనం ఎందుకు, ఎలా?

***పబ్లిక్ సర్వీస్ కమిషన్ సిలబస్ నేపథ్యంలో పరీక్షార్థులైనా, సాధారణ ప్రజలైనా తెలంగాణ గురించి సమగ్రంగా తెలుసుకోవలసిన విషయాలను ఎలా అధ్యయనం చేయాలో వివరిస్తున్నారు* ఎన్. వేణుగోపాల్**

**నేపథ్యం**

ప్రొ. జి. హరగోపాల్ నాయకత్వంలో ఏర్పాటయిన మేధావుల, ఆయా శాస్త్రాల నిపుణుల కమిటీ ఏడెనిమిది నెలల చర్చల, సంప్రదింపుల తర్వాత సమర్పించిన సిలబస్ ను తెలంగాణ రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఆగస్ట్ చివరి వారంలో ప్రకటించింది. కొత్త రాష్ట్రంలో కొత్తగా ఏర్పడిన పబ్లిక్ సర్వీస్ కమిషన్ ఇకముందు నిర్వహించబోయే అన్ని ప్రభుత్వోద్యోగాల పరీక్షలకు పాఠ్యాంశాలు ఈ సిలబస్ లో భాగం.

ఏ ప్రాంత ఉద్యోగులైనా ఆ ప్రాంతం గురించి సంపూర్ణ అవగాహనతో ఉండడం అవసరం. ప్రభుత్వోద్యోగులు ప్రజలకు సేవచేయవలసి ఉంటుంది గనుక, ప్రజాసమస్యలను పరిష్కరించవలసి ఉంటుంది గనుక అక్కడి ప్రజల చరిత్ర, సంస్కృతి, ఆర్థిక జీవనం, సమస్యల గురించి వారికి ఎంత అవగాహన ఉందో పరీక్షించడం తప్పనిసరి. సామర్థ్యాన్ని బట్టే ప్రభుత్వోద్యోగులను నియమించడం, ఆ సామర్థ్యాన్ని గణించడానికి లిఖిత, మౌఖిక పరీక్షలు పెట్టడం, ఆ ఉద్యోగులు పనిచేసే ప్రాంతం గురించీ, ప్రజల గురించీ వారి అవగాహనను పరీక్షించడం నూట యాభై సంవత్సరాలకు పైగా జరుగుతున్నాయి. దేశంలో ప్రభుత్వానికి పెద్ద ఎత్తున ఉద్యోగులు ఉండడం, వేరువేరు ప్రాంతాలవాళ్లు తమకు సంబంధంలేని, తెలియని ప్రాంతాల్లో పని చేయవలసి రావడం బ్రిటిష్ వలస పాలన కాలం నుంచీ మొదలయింది. అలా భారత సమాజం గురించి తెలుసుకోవడం, తాము పనిచేయవలసిన ప్రాంతపు చరిత్ర, భాష, సంస్కృతులను అధ్యయనం చేయడం ప్రారంభించిన బ్రిటిష్ ఉద్యోగులతోనే ఓరియంటలిస్టు దృక్పథం, ఇండాలజీ వంటి శాస్త్రశాఖలు పుట్టుకువచ్చి విస్తరించాయి. తమ పాలనా అవసరాలకోసమే బ్రిటిష్ వలసవాదులు భారతీయ భాషలలో పాఠ్యపుస్తకాలు, నిఘంటువులు, సామెతల సంకలనాలు, చరిత్రలు, పటాలు రచించారు. సాహిత్యాన్ని సేకరించారు, పరిష్కరించి ప్రచురించారు. తాము ఉద్యోగార్థం వచ్చిన దేశపు, ప్రాంతపు, సమాజపు చరిత్ర, ఆర్థిక జీవనం, భాషా సంస్కృతుల గురించి తెలుసుకోవడానికి బ్రిటిష్ ఉద్యోగులు చేసిన ప్రయత్నాలు ఎంతో సాహిత్యాన్ని సృష్టించాయి.

గత హైదరాబాద్ రాజ్యంలో కూడ ప్రభుత్వోద్యోగులకు స్థానిక ప్రజల భాష, చరిత్ర, సంస్కృతి, సమస్యలు తెలియాలనే ఉద్దేశంతోనే 1919లోనే ముల్కీ నిబంధనలు అమలులోకి వచ్చాయి. వలస పాలన తర్వాత కాలంలో ప్రభుత్వోద్యోగులను నియమించడానికి ఏర్పడిన యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్, ఆయా రాష్ట్రాల పబ్లిక్ సర్వీస్ కమిషన్లు కూడ ఉద్యోగుల ఎంపిక పరీక్షలలో ఆ ఉద్యోగుల సాధారణ సామర్థ్యాలను పరీక్షించడంతో పాటు, వారు పనిచేయబోతున్న సమాజం గురించి వారి అవగాహనా స్థాయిని కూడ పరీక్షించడం ప్రారంభించాయి. తాము పనిచేయబోయే ప్రాంతం గురించి కనీస అవగాహన లేకుండా అక్కడ పనిచేయడం అసాధ్యమని ఉద్యోగులకు తెలిసివచ్చింది.

అయితే ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో తెలంగాణ చరిత్ర, భాష, సంస్కృతులకు అన్ని రంగాలలో అన్యాయం జరిగినట్టుగానే ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ పాఠ్యాంశాలలోనూ, ఇతర పరీక్షల పాఠ్యాంశాల లోనూ తెలంగాణ అంశాలకు సముచిత స్థానం దొరకలేదు. మొత్తంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వోద్యోగులు తెలంగాణ గురించి ఏమీ తెలియ కుండానో, అరకొరగా మాత్రమే తెలుసుకునో తెలంగాణలో పనిచేసే అవకాశం వచ్చింది. తెలంగాణ చరిత్ర గురించి, ప్రజల గురించి, సంస్కృతి గురించి, ప్రజా సమస్యల గురించి ఇటు విద్యారంగపు పాఠ్యపుస్తకాలలో, అటు ప్రధానస్రవంతి ప్రచార సాధనాలలో లేకపోవడం, అతి తక్కువ ఉండడం ఒక ఎత్తు. కనీసం ప్రభుత్వోద్యోగులు కూడ అవేమీ తెలియకుండానే తెలంగాణకు సంబంధించిన నిర్ణయాలు చేయడం, ఆ నిర్ణయాలను అమలు చేయడం మరొక ఎత్తు. అందువల్లనే ఆంధ్ర సమాజంలో సాధారణంగా ప్రగతిశీలంగా ఉన్నవారిలోనూ, తెలంగాణలో ప్రభుత్వోద్యోగాలు చేసిన ఆంధ్ర ప్రాంతీయులలోనూ కూడ తెలంగాణ గురించి ఉండవలసినంత అవగాహన లేదు. సగటు ఆంధ్ర ప్రజలు, ఉద్యోగులు తెలంగాణ గురించి ఏమీ తెలియకుండానే తెలంగాణ ఉద్యమాన్ని వ్యతిరేకించడానికి కారణం ఈ స్థితే.

**తెలంగాణ సిలబస్**

ఈ నేపథ్యంలో ఏర్పడిన తెలంగాణ రాష్ట్రంలో కొత్తగా రూపొందిన తెలంగాణ రాష్ట్ర పబ్లిక్ సర్వీస్ కమిషన్ పాత పాఠ్యాంశాలను యథాతథంగా కొనసాగించడం అసాధ్యం. ఇంతకాలం విస్మరణకూ, చిన్నచూపుకూ గురైన స్థానిక చరిత్ర, సంస్కృతి, ఆర్థికవ్యవస్థ, ప్రజాజీవనాలకు ప్రాధాన్యత ఇస్తూ కొత్త పాఠ్యాంశాలను తయారు చేయకతప్పదు. అలాగే ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షకూ ఏర్పాటుకూ దశాబ్దాల చరిత్ర ఉంది గనుక ఆ ఆకాంక్షల చరిత్రను, విభిన్న వ్యక్తీకరణలను తెలంగాణ చరిత్రలో భాగం చేయకతప్పదు. ఈ అవసరాలను గుర్తిస్తూనే కొత్త పబ్లిక్ సర్వీస్ కమిషన్ సిలబస్ లు తయారయ్యాయి.

తెలంగాణ బిడ్డలందరికీ తెలంగాణ గురించిన సమగ్ర అవగాహన ఉండడం అవసరమే. అలా ఉండాలనుకోవడం ఆదర్శమే. కాని ప్రత్యేక తెలంగాణ కోసం ఉద్యమించినవారికీ, ఉద్యమ నాయకులకూ కూడ చాలామందికి అటువంటి సమగ్ర అవగాహన లేదనేది ఒక వాస్తవం. కాని ఏ స్థాయి ఉద్యోగులైనా కనీసం ఇరవై ఐదు, ముప్పై సంవత్సరాలు తెలంగాణ ప్రజలకు తమ సేవలు అందించవలసి ఉంటుంది గనుక వారికి తెలంగాణ గురించి అర్థవంతమైన అవగాహన ఉండడం తప్పనిసరి అవసరం. అయితే ఉద్యోగులకు కూడ ఒకే ఒక్కసారి సమగ్ర అవగాహన అందించడం సాధ్యం కాదు. ఒక్కొక్క స్థాయి ఉద్యోగానికి

ఒక్కొక్క స్థాయిలో తరతమ భేదాలతో సిలబస్ తయారు చేయడం అవసరం. ఆ పనిని పబ్లిక్ సర్వీస్ కమిషన్ కొంతవరకైనా చేయగలిగింది.

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలు గ్రూప్ 1, గ్రూప్ 2, గ్రూప్ 3, గ్రూప్ 4 అని నాలుగు రకాలుగా ఉంటాయి. వీటిలో గ్రూప్ 1 ఉద్యోగాలకు మొత్తం వెయ్యి మార్కులకు పరీక్ష ఉంటుంది. అందులో ఇంటర్వ్యూకు 100 మార్కులు పోగా మిగిలిన 900 మార్కులకు – 1. సాధారణ వ్యాసం, 2. చరిత్ర, సంస్కృతి, భూగోళం, 3. భారత సమాజం–రాజ్యాంగం–పాలన, 4. ఆర్థిక వ్యవస్థ–అభివృద్ధి, 5. శాస్త్రవిజ్ఞానం–సాంకేతిక విధానం–సమాచార విశ్లేషణ, 6. తెలంగాణ ఉద్యమం – రాష్ట్ర ఏర్పాటు అనే – ఆరు పేపర్లు ఉంటాయి. వీటిలో ఒక్కొక్క పేపర్ కు 150 మార్కులుండగా, చరిత్ర–సంస్కృతి–భూగోళం పేపర్ లో మూడింట రెండు అంశాలు, ఆర్థిక వ్యవస్థ–అభివృద్ధి పేపర్లో మూడింట ఒక అంశం తెలంగాణ గురించి ఉన్నాయి. అంటే గ్రూప్ 1 పరీక్షలో మొత్తం 900 మార్కులలో 300 మార్కులు తెలంగాణ గురించిన అవగాహనకు సంబంధించినవే. ఇక గ్రూప్ 2 లో కూడ అదే విధంగా మొత్తం నాలుగు పేపర్లు, 600 మార్కులు ఉండగా అందులో 250 మార్కులు తెలంగాణకు సంబంధించినవే. గ్రూప్ 3 లో మూడు పేపర్లు, 450 మార్కులు ఉండగా అందులో 100 మార్కులకు పైన తెలంగాణకు సంబంధించినవే. గ్రూప్ 4 లో రెండు పేపర్లు, 300 మార్కులు ఉండగా అందులో కనీసం 60 మార్కులు తెలంగాణకు సంబంధించినవే. మొత్తం మీద ప్రతి స్థాయి పరీక్షలోను 20 నుంచి 35 శాతం తెలంగాణ చరిత్ర, సంస్కృతి, భూగోళం, ఆర్థికవ్యవస్థ, ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం, రాష్ట్ర సాధన అంశాలకు సంబంధించినవే. అంటే రానున్న పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షలలో తెలంగాణ అంశాల అవగాహనే అభ్యర్థుల జయాపజయాలకు నిర్ణయాత్మక అంశం అవుతుంది.

**అధ్యయనానికి ఆధారాలు**

కాని పైన చర్చించిన కారణాల వల్లనే తెలంగాణ అంశాల గురించి వివరమైన అవగాహన కలగడానికి తగిన ఆధారాలు సులభంగా అందుబాటులో లేవు. అలాగే సిలబస్ కొత్తది కావడం వల్ల దానిలోని అన్ని అంశాలూ చెప్పగలిగిన ఉపాధ్యాయులు లేరు. అన్ని అంశాలూ ఒకేచోట దొరికే పుస్తకాలు లేవు. ఆ ఐదు అంశాలకు సంబంధించి గత రెండు మూడు దశాబ్దాలలో మూడు, నాలుగు వందల పుస్తకాలు వెలువడ్డాయి గాని, ఆ పుస్తకాలతో కొన్ని సమస్యలున్నాయి. వాటిలో చాలభాగం ఆయా రచయితల దృక్పథాల నుంచి జరిగిన విశ్లేషణలు గనుక అవి పరీక్షల కోసం ఎంత ఉపయోగపడతాయో చెప్పడం కష్టం. పైగా అవన్నీ చదవడానికి అభ్యర్థులకు సమయమూ లేదు. కేవలం పరీక్షలో కృతార్థులు కావడానికి అవన్నీ చదవవలసిన అవసరం కూడ లేదు. వంద పేజీలు చదివితే ఒకటి రెండు మార్కులు తెచ్చుకోగలిగిన సమాచారం, వివరణ, విశ్లేషణ ఉంటాయని హామీ కూడ లేదు. ఈ సమస్యలతో, సిలబస్ వెలువడిన నాటి నుంచీ తెలంగాణ నిరుద్యోగులలో, ఉద్యోగార్థులలో, విద్యావంతులలో ఆందోళన, ఆదుర్దా, తక్కువ సమయం లో ఎక్కువ నేర్చుకోవడం ఎట్లా అనే తహతహ కనబడుతున్నాయి.

ఏ జ్ఞానమైనా నిరంతర సాధనతో, దీర్ఘకాల శ్రమతో సాధ్యమయ్యేదే గాని, రాత్రికి రాత్రి చదవగలిగే గైడ్ గానో, అరటి పండు వలిచి తిన్నట్టుగానో సాధ్యమయ్యేది కాదు. అందులోనూ తెలంగాణ చరిత్ర, సంస్కృతి, ఆర్థిక, సామాజిక వ్యవస్థల గురించిన జ్ఞానం గ్రహించడానికి మరిన్ని పరిమితులున్నాయి. తగినన్ని సరైన ఆధారాలు లేకపోవడం, ఉన్న చరిత్రంతా సంక్షోభభరితమైనది గనుక దాని మీద అనేక భిన్నాభిప్రాయాలు ఉండడం, రచయిత దృక్పథాన్ని బట్టి ఆ చరిత్ర మీద వ్యాఖ్యానాలు ఉండడం, గత ఆరు దశాబ్దాలలో ఆ చరిత్ర మీద మసి పూయడం, వక్రీకరించడం, విస్మరించడం, తెలంగాణేతర చరిత్రను తెలంగాణ మీద రుద్దడం వంటి ఎన్నో కారణాల వల్ల తెలంగాణ గురించి సంపూర్ణమైన, ఆమోదయోగ్యమైన అవగాహనకు రావడం కష్టమవుతుంది. అదే చాల కష్టభరితమైన పని అనుకుంటే పరీక్షల కోసం దాన్ని చదవడం మరింత కష్టం. పరీక్షలు మొత్తం జ్ఞానానికి కాక, జ్ఞాపకశక్తికీ, అందులోనూ ముక్కలు ముక్కల సమాచారాన్ని ఎంత బాగా జ్ఞాపకం ఉంచుకున్నారనడానికీ పరీక్షలుగా ఉన్నాయి గనుక ఈ జ్ఞానాన్ని జీర్ణించుకుని పరీక్షలకు తగినట్టుగా మలచుకోవడం మరింత జటిలమవుతుంది.

**అధ్యయన సమస్యలు**

ఇక ఇటువంటి సిలబస్ తయారుచేసే పని మొదటిసారి జరుగుతున్నందువల్ల, వీలైనంత వివరంగా ఉండాలనే ఆకాంక్ష వల్ల సిలబస్ ఉండవలసిన దానికన్న ఎక్కువగా ఉంది. తెలంగాణ గురించి పండితులకూ, పరిశోధక విద్యార్థులకూ, ఆయా రంగాలలో ప్రత్యేక కృషి చేసిన నిపుణులకూ మాత్రమే తెలియగలిగిన సూక్ష్మ అంశాలను కూడ సిలబస్ లో భాగం చేశారు. ఇంత వివరంగా సిలబస్ తయారు చేసినప్పుడు, అందులోనూ పరీక్షకు మూడు నాలుగు నెలలకు మించి సమయం లేనప్పుడు ఎలా చదవాలనేదే ప్రశ్నార్థకమవుతుంది. ఈ కారణాల వల్ల ప్రస్తుత తెలంగాణ పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షల పాఠ్యాంశాల అధ్యయనం సమస్యాత్మకంగా మారింది. అయితే ఆ సమస్యను అధిగమించి, వీలైనంత ఎక్కువ అధ్యయనం చేయగలిగితే భవిష్యత్ తెలంగాణ ప్రభుత్వోద్యోగులకు తెలంగాణ గురించి కొంతవరకు అర్థవంతమైన అవగాహన కలుగుతుందనడంలో సందేహం లేదు.

ప్రస్తుత పరీక్షల కోసమైనా కాకపోయినా, భవిష్యత్తులో ప్రభుత్వోద్యోగులు కావాలనుకునేవారైనా ఇతరులైనా మొత్తంగా తెలంగాణ ప్రజలందరూ తెలుసుకోవలసిన అత్యవసరమైన విషయాలన్నిటికీ ఈ సిలబస్ ఒక సూచిక. ఎందుకంటే ఇప్పుడు ప్రకటించిన అన్ని గ్రూపుల విడివిడి సిలబస్ లలో తెలంగాణ గురించి ఉన్న ఉమ్మడి అంశాలనూ ప్రత్యేక అంశాలనూ కలగలిపితే సగటు తెలంగాణ విద్యావంతులు తెలుసుకోవలసిన విషయాలన్నీ ఉన్నాయి. వాటిని తెలంగాణ భూగోళం, తెలంగాణ చరిత్ర, తెలంగాణ సంస్కృతి, తెలంగాణ ఆర్థిక వ్యవస్థ, తెలంగాణ ఉద్యమం అని ఐదు భాగాలుగా విడివిడిగానైనా చూడవచ్చు. లేదా మొత్తంగా తెలంగాణ ప్రాంతం గురించీ, ప్రజల గురించీ, ప్రజల ఆకాంక్షల గురించీ ఒకేఒక్క సమగ్రమైన కథనంగానైనా చూడవచ్చు.

**తెలంగాణ భూగోళం**

తెలంగాణ భూగోళం అంటే ఇవాళ తెలంగాణ పేరుతో ఒక రాష్ట్రంగా ఏర్పడిన, కనీసం ఆరువందల సంవత్సరాలుగా తెలంగాణ పేరుతో చరిత్రకెక్కిన, కనీసం ఐదు వేల సంవత్సరాలుగా జనావాసం ఉన్నదని ఆధారాలు దొరుకుతున్న ఈ ప్రాంతంలోని భూమి గురించీ, సహజ వనరుల గురించీ తెలుసుకోవడం. ఈ భూమిలో ఏయే రకాల నేలలున్నాయి, ఎటువంటి కొండలున్నాయి, ఏ నదులు, ఉపనదులు, వాగులు, అడవులు, ఖనిజాలు, వృక్షజాతులు, జంతుజాతులు ఉన్నాయి, ఈ భౌగోళిక ప్రదేశంలో మానవ సమాజ పరిణామం ఎలా జరిగింది వంటి విషయాల గురించి సవివరంగా తెలుసుకోవడం తెలంగాణ భూగోళంలో భాగం.

### తెలంగాణ చరిత్ర

తెలంగాణ చరిత్ర అంటే తెలంగాణలో ఆదిమ మానవ సంచారం నాటి నుంచి చరిత్ర పూర్వ యుగంలోని పాత, కొత్త రాతియుగాలు, ఇనుము యుగం దాటి మెగస్తనీస్ కాలానికే చరిత్రకు ఎక్కిన తెలంగాణ దగ్గర ప్రారంభించి 2014 జూన్ 2న భారత దేశపు 29వ రాష్ట్రంగా ఏర్పడిన తెలంగాణ దాకా చరిత్రను అధ్యయనం చేయడం. ఇది రాజవంశాల చరిత్ర కన్న ఎక్కువగా ప్రజలు నిర్మిస్తూ వచ్చిన చరిత్ర, ప్రజల ఉత్పత్తి శక్తులు పెరుగుతూ వచ్చిన చరిత్ర, ప్రజల మధ్య ఉత్పత్తి సంబంధాలు, సామాజిక సంబంధాలు విస్తరిస్తూ వచ్చిన చరిత్ర. సమాజాన్ని శాసించే శక్తులుగా ఎదిగిన పాలకవర్గాల, రాజవంశాల, కులాల, పాలనా విధానాల చరిత్ర కూడ అధ్యయనం చేయవలసినదే. వేర్వేరు పాలకవర్గ ముఠాలు తెలంగాణ వనరులను, ప్రజల శ్రమ ఉత్పత్తులను, తెలంగాణలోని అపారమైన సంపదలను కొల్లగొట్టడానికి యుద్ధాలు చేసుకున్న చరిత్రను కూడ చదవాలి. ప్రజాస్వామ్యం పేరు మీద సాగుతున్న పాలనా చరిత్రను చదవాలి. ప్రజల అవసరాలను, ఆకాంక్షలను అణచివేసిన చరిత్రను చదవాలి. శాతవాహనులకు ముందు ప్రారంభమై ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు, వేములవాడ చాళుక్యులు, కాకతీయులు, ఖుతుబ్ షాహీలు, అసఫ్ జాహీలు, భారతదేశంలో విలీనం, హైదరాబాద్ రాష్ట్రం, ఆంధ్రప్రదేశ్ వంటి పాలనా కాలాల ఆధారంగా చదివినా, ప్రజల జీవిత పోరాటాల కథనంగా చదివినా ఇది ఒక విశాలమైన, సంక్లిష్టమైన చారిత్రక ప్రస్థానం. ఇది ఎంత విస్తృతమైనదీ, విశిష్టమైనదీ, సంక్లిష్టమైనదీ అంటే దీన్ని వెయ్యి పేజీల పుస్తకంగా రాసినా మిగిలిపోయే వాస్తవాలూ, పరిణామాలూ, దృక్పథాలూ ఎన్నో ఉన్నాయి. అంత విస్తృతికి ప్రస్తుత పరీక్షల సిలబస్ లో అవకాశం లేదు. కాని ఎప్పటికైనా తెలంగాణ ప్రజలందరూ తమ పూర్వీకుల నుంచి తమదాకా సాగివచ్చిన ప్రయాణం గురించి చదివి తీరవలసిన చరిత్ర ఇది.

### తెలంగాణ సంస్కృతి

ఇక తెలంగాణ సంస్కృతి తెలంగాణ చరిత్రతో సమానమైన విశిష్టత, సంక్లిష్టత, సంకీర్ణత కలిగినది. సంస్కృతి అంటే ఆచార వ్యవహారాలు, మతం, కులం, ఆహారపుటలవాట్లు, భాష, సాహిత్యం, కళలు, పండుగలు, విశ్వాసాలు వంటివెన్నో కలగలిసిన ప్రజల జీవన విధానం అని అర్థం చెప్పుకుంటే కనీసం రెండున్నర వేల సంవత్సరాల జీవన క్రమంలో తెలంగాణ ప్రాంతంలో ఒక సొంత, స్వతంత్ర సంస్కృతి అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఇతర ప్రాంతాల ప్రజలతో, పాలకులతో సంబంధం వల్ల, ఆదాన ప్రదానాల వల్ల తెలంగాణ సంస్కృతిలోకి ఎన్నెన్నో కొత్త అంశాలు వచ్చి చేరాయి. నిత్యచలనశీలమైనదిగా సంస్కృతి మారుతూ వచ్చింది కూడ. ఒక శతాబ్దిలో ప్రబలంగా ఉండిన సాంస్కృతిక చిహ్నం మరొక శతాబ్దిలో మరుగున పడిపోయింది. మతంలో, కులంలో, భాషలో, సాహిత్యంలో, కళలలో, విశ్వాసాలలో మార్పులు వచ్చాయి. ఒక్కమాటలో చెప్పాలంటే తెలంగాణ సంస్కృతి గురించి అధ్యయనం చేయడమంటే విస్తారమైన ప్రజా జీవనాన్ని అధ్యయనం చేయడమే. చరిత్రకారులు చెప్పే ప్రకారం సంస్కృతిని అధ్యయనం చేయడానికి పురావస్తు ఆధారాలు, సజీవంగా జనజీవితంలో ఉన్న ఆధారాలు రెండూ ఉపకరిస్తాయి. పురావస్తు ఆధారాలలో కేవలం తవ్వకాలలో దొరికే అవశేషాలు మాత్రమే గాక ప్రాచీన మౌఖిక గాథల లోకి, లిఖిత సాహిత్యంలోకి ఎక్కిన ఆధారాలు కూడ పనికి వస్తాయి. సురవరం ప్రతాపరెడ్డి గారు ఆంధ్రుల సాంఘిక చరిత్ర రచనలో అటువంటి సాహిత్య ఆధారాలనెన్నిటినో ఉపయోగించారు. అలాగే సజీవ జనజీవితంలో నుంచి తెలంగాణ సంస్కృతి ఆధారాలను గ్రహించి వివరించిన పుస్తకాలు ఇప్పటికే ఎన్నో ఉన్నాయి. తెలంగాణ సంస్కృతిలోని అటువంటి ప్రత్యేక, నిర్దిష్ట అంశాలనెన్నిటినో అధ్యయనం చేయడం అవసరం.

### తెలంగాణ ఆర్థిక వ్యవస్థ

తెలంగాణ ఆర్థిక వ్యవస్థ తెలంగాణ చరిత్రతో, సంస్కృతితో సమాంతరంగా సాగుతూ నిజానికి ఆ రెంటికీ పునాది కల్పించినది. రెండు నదుల మధ్య దేశంగా, ప్రధానంగా రాతి నేలల దక్కన్ పీఠభూమి అయినా శ్రమైక జీవుల వ్యవసాయ క్షేత్రంగా, ఇనుము, వజ్రాలు, బొగ్గు వంటి ఖనిజాల కాణాచిగా తెలంగాణ చరిత్రకు తెలిసిన నాటినుంచీ సంపన్నమైన భూమి. కాకతీయుల కాలంలో నీటి పారుదల సౌకర్యాల కల్పన వల్ల వ్యవసాయం విస్తరించి ఈ నేల సంపన్నమైన ఆర్థిక వ్యవస్థకు నిలయమైంది. కనీసం కాకతీయుల కాలం నుంచీ ఈ సంపద ఎంత విస్తారమైనదో చారిత్రక లిఖిత ఆధారాలు దొరుకుతున్నాయి. పదమూడో శతాబ్దిలోనే ఢిల్లీ సుల్తానుల కన్ను పడేంత విస్తారమైన సంపద అప్పటి రాజధాని వరంగల్ లో ఉండిందని సమకాలీన కథనాలు చెపుతున్నాయి. కాకతీయుల పతనం తర్వాత ఎంత సంపదను ఢిల్లీకి ఎలా తరలించుకుపోయారో చరిత్రకారుల కథనాలున్నాయి. ఆ తర్వాత ఆరు వందల సంవత్సరాలకు మళ్లీ తెలంగాణ రాజు, మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ ప్రపంచంలోకెల్లా అత్యంత ధనికుడిగా గుర్తింపు పొందాడు. ఆ రాజు పదవీచ్యుతుడైన తర్వాత, ఈ ప్రాంతాన్ని ఆంధ్ర రాష్ట్రంతో కలుపుకోవడంలో కూడ ఇక్కడి సంపదలను కైవసం చేసుకునే వ్యూహం ఉండిందనడానికి ఆధారాలున్నాయి. ఆ తర్వాత గడిచిన ఆరు దశాబ్దాలు తెలంగాణ ఆర్థిక వ్యవస్థ నుంచి తరలించడమే తప్ప ఈ ఆర్థిక వ్యవస్థ పెంపొందడానికి ఎటువంటి సహాయమూ చేయని పాలన కొనసాగింది. ఆ ఆర్థిక వ్యవస్థ వల్ల పీడనకూ వేదనకూ నిరుద్యోగానికీ గురైన వర్గాల ఆర్థిక ఆకాంక్షల రాజకీయ ప్రతిఫలనంగానే మా వనరులు మాకే అనే నినాదం తలెత్తి అది ప్రత్యేక రాష్ట్ర ఆందోళనగా మారింది. ఈ మొత్తం ఆర్థిక వ్యవస్థ చరిత్రను, దానిలోని స్థూల, సూక్ష్మ అంశాలతో సహా అధ్యయనం చేయడమే తెలంగాణ ఆర్థికవ్యవస్థ పాఠ్యాంశంలో భాగం.

### తెలంగాణ ఉద్యమం

ఇంతకుముందే చెప్పినట్టు ఆర్థిక ఆకాంక్షగా స్వావలంబన, సాంస్కృతిక ఆకాంక్షగా ఆత్మగౌరవం, రాజకీయ ఆకాంక్షగా స్వయం నిర్ణయాధికారం కలిసి తెలంగాణ భారత రాజ్యాంగ పరిధిలోనే ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఉండాలనే ఆలోచన 1940ల చివరినుంచీ ఉంటూ వచ్చింది. అప్పటికి మూడు శతాబ్దాలుగా స్వతంత్రంగా, విడిగా ఉంటూ వచ్చి ఒక సొంత సంస్కృతిని, చరిత్రను నిర్మించుకున్నందువల్ల కావచ్చు, తెలంగాణ సమాజంలో వందల సంవత్సరాలుగా ఉంటూ వచ్చిన ధిక్కార స్వభావం వల్ల కావచ్చు ఈ ఆకాంక్ష బలపడింది. 1948 సెప్టెంబర్ 17న హైదరాబాద్ పై సైనికచర్య జరిగి మూడు సంవత్సరాల పాటు సైనిక పాలన సాగినప్పుడు పాత ప్రభుత్వాధికారుల మీద అపనమ్మకంతో ఇతర ప్రాంతాల నుంచి ప్రభుత్వాధికారులను తరలించడం వల్ల పాత ముల్కీ నిబంధనల వాతావరణం సడలిపోయింది. సైనిక పాలన ముగిసి, ఎన్నికల ద్వారా మొదటి ప్రభుత్వం ఏర్పడగానే ముల్కీ వ్యతిరేక ఆందోళన పెల్లుబికింది. ఆ వాతావరణంలోనే 1953లో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ కోసం కేంద్ర ప్రభుత్వం నియమించిన జస్టిస్ ఫజల్ అలీ కమిషన్

ముందర హైదరాబాద్ రాష్ట్రాన్ని యథాతథంగా ఉంచడం, హైదరాబాద్ రాష్ట్రాన్ని భాషా ప్రాతిపదికపై మూడు రాష్ట్రాలుగా విడదీసి తెలంగాణను హైదరాబాద్ రాష్ట్రంగా విడిగా ఉంచడం, తెలంగాణను ఆంధ్ర రాష్ట్రంతో కలిపి కొత్త రాష్ట్రం ఏర్పాటు చేయడం అనే మూడు సూచనలు వచ్చాయి. రాజకీయ ఎత్తుగడల వల్ల ఆ మూడో సూచన అమలులోకి వచ్చినప్పుడు, కనీసం తెలంగాణ భూములకు, ప్రజలకు, అభివృద్ధికి, విద్యా ఉద్యోగాలకు లిఖితపూర్వక రక్షణలు కల్పించాలనే ఆలోచన వచ్చింది. ఆ రక్షణలు, హామీలు ఉల్లంఘనకు గురైనప్పుడు 1969 ప్రత్యేక రాష్ట్ర ఆందోళన ప్రారంభమయింది. అణచివేతతోనూ, ఆకర్షణలతోనూ, విద్రోహాల తోనూ ఆ ఆందోళన సమసిపోయినప్పటికీ ఆ నిప్పురవ్వ ఎన్నడూ ఆరలేదు. అది 1990ల మధ్య నుంచి మళ్లీ రాజుకుని 2001 నాటికి ఒక రాజకీయ ఆందోళన రూపం ధరించింది. 2009 నాటికి విస్తరించి క్రియాశీల ఉద్యమంగా మారింది. అంతిమంగా 2014 ఫిబ్రవరి లో పార్లమెంటు ఆమోదించిన చట్టం ప్రాతిపదికగా 2014 జూన్ 2 న తెలంగాణ రాష్ట్రం ఏర్పడింది. ఈ సుదీర్ఘమైన తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమ చరిత్రను ప్రస్తుత పాఠ్యాంశాలలో మూడు దశలుగా 1948 నుంచి 1970 - తెలంగాణ భావన దశ, 1971-90 - సమీకరణ దశ, 1991-2014 రాష్ట్ర ఏర్పాటు దశ అని విభజించారు.

### ఎలా చదవాలి?

ముందే చెప్పినట్టు పై ఐదు అంశాలనూ ఒక్కచోట సమీకరించిన పుస్తకం ఒక్కటి కూడ లేదు. విడివిడిగా భూగోళానికి సంబంధించి దాదాపు పది పుస్తకాలు, చరిత్రకు సంబంధించి ఇరవై, ముప్పై పుస్తకాలు, సంస్కృతికి సంబంధించి పది పుస్తకాలు, ఆర్థిక వ్యవస్థకు సంబంధించి దాదాపు పది పుస్తకాలు వెలువడి ఉన్నాయి. అవన్నీ చదవగలిగినా సిలబస్ లోని అన్ని అంశాల మీద సమగ్ర అవగాహన రావడం కష్టమే. ఇక తెలంగాణ ఉద్యమ చరిత్ర సిలబస్ లోని అన్ని దశలనూ కలుపుకుని వందకు పైగా పుస్తకాలు వెలువడి ఉంటాయి గాని వాస్తవాల మదింపులోనూ, వివరణలోనూ, విశ్లేషణలోనూ సంతృప్తికరమైన పుస్తకాలు తక్కువే. ఉద్యమ సమయంలో ఆయా కాలాల్లో జరిగిన ప్రత్యేక ఘటనలనూ పరిణామాలనూ వివరిస్తూ, విశ్లేషిస్తూ రాసిన వ్యాసాల సంకలనాలు కూడ ఎన్నో వెలువడ్డాయి గాని అవి ఆయాకాలాల సమాచారాన్నిస్తాయి గాని సమగ్ర కథనాన్ని ఇవ్వవు. మిగిలిన నాలుగు అంశాలలో పరిశీలకులు, రచయితలు ఏ దృక్పథం కలవారైనా చాలవరకు ఉమ్మడి అంశాలు ఉండవచ్చు గాని, చివరి అంశమైన తెలంగాణ ఉద్యమ చరిత్రలో విభిన్న, పరస్పర వ్యతిరేక కథనాలు, వివరణలు, విశ్లేషణలు ఉండే అవకాశం ఉంది. ఈ ఉద్యమంలో తెలంగాణ సమాజంలోని అన్ని దృక్పథాలకూ ప్రాతినిధ్యం వహించేవారు పాల్గొనడం ఒక అంశమైతే, ఉద్యమంలో చాల భాగం ఇటీవలిదీ, సన్నిహితమైనదీ కావడం వల్ల తీవ్రమైన అభిప్రాయభేదాలు కూడ ఉన్నాయి. ఒక ఘటనను, పరిణామాన్ని ఎలా చూడాలనే విషయంలో, ఎలా వివరించాలనే విషయంలో పరస్పర వ్యతిరేకమైన అంచనాలు ఉన్నాయి. అందువల్ల ఈ చివరి అంశంలో తటస్థమైన, అందరికీ ఆమోదయోగ్యమైన పుస్తకం ఉండడం కష్టం. దిన, వార, మాస పత్రికల్లో మొదటి నాలుగు అంశాలు కొంతవరకు, చివరి అంశం చాల ఎక్కువగా నమోదయ్యాయి గాని పరీక్షల కోసం చదివే అభ్యర్థులు ఆ పత్రికల నుంచి ఆ సమాచారమంతా సేకరించుకోవడం కష్టం. టెలివిజన్ ఛానళ్ల చర్చలలోను, ఇంటర్నెట్ మీద, యూట్యూబ్ మీద తెలంగాణ ఉద్యమ చరిత్రకు సంబంధించి కొంత సమాచారం ఉంది.

ఈ అన్ని వనరులనుంచి సమాచారాన్ని సేకరించి ఒక్కచోట సంకలనం చేసి, భిన్నాభిప్రాయాలు ఉన్నదగ్గర అన్ని అభిప్రాయాలనూ ప్రస్తావిస్తూ, ఒక అకడమిక్ గ్రంథం రావలసిన అవసరం ఎంతగానో ఉంది. అది కేవలం ప్రస్తుత పరీక్షల అభ్యర్థులను దృష్టిలో పెట్టుకుని మాత్రమే కాక, తెలంగాణ గురించిన సమగ్ర అవగాహనకు కరదీపికగా ఉండడం చారిత్రక అవసరం.

### ఒక హెచ్చరిక

తెలంగాణ పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షల కోసం నిరుద్యోగులు, ఉద్యోగార్థులు, విద్యార్థులు తెలంగాణ సిలబస్ అధ్యయనం చేయడానికి అవసరమైన సూచనలు చేస్తూనే ఒక హెచ్చరిక కూడ చేయవలసి ఉన్నది. ప్రతి వ్యక్తీ, విద్యావంతులైన ప్రతి ఒక్కరూ ఉద్యోగం కోసం ప్రయత్నించవలసిందే, అందుకు అవసరమైన కృషి చేయవలసిందే. అందులోనూ చిరకాలంగా ఉద్యోగాలకు దూరంగా ఉన్న తెలంగాణ యువత ఉద్యోగాల కోసం ప్రయత్నించవలసిందే. కాని, ఆ ప్రయత్నంలో భాగంగా రెండు విషయాలు గుర్తుంచుకోవాలి.

మొదటిది, జీవితం గడవడానికి ఒక ఉపాధి మార్గంగా ఉద్యోగం అవసరమే గాని ఉద్యోగమే సమస్తం కాదు. ఉద్యోగి కావడం కన్న ముందుగా మనం మనుషులమని, సమాజంలో భాగమైనవాళ్లమని గుర్తించాలి. సమాజాన్ని మరింత మెరుగ్గా మార్చడానికి తమ విద్యనూ శక్తి సామర్థ్యాలనూ ఉపయోగించడం విద్యావంతులందరి బాధ్యత. కనుక విద్యావంతులు ఉద్యోగ ప్రయత్నాలతో పాటుగానే, సమాజ హితం కోసం పనిచేయవలసి ఉంటుంది. మన సమాజం, తెలంగాణ సమాజం అత్యంత కష్టభరితమైన మార్గంలో ప్రయాణం చేస్తూ వచ్చింది గనుక మన ఈ అధ్యయనాన్ని ఆ కష్టాలను తొలగించే, తగ్గించే సాధనంగా ఉపయోగించుకోవలసి ఉంటుంది.

రెండవది, తెలంగాణ ఉద్యమ క్రమంలో పదే పదే వినిపించిన మాట, పెద్దమనుషుల ఒప్పందాన్నీ, రాష్ట్రపతి ఉత్తర్వులనూ, 610 జీవోనూ ఉల్లంఘిస్తూ ఆంధ్రప్రదేశ్ పాలకవర్గాలు తెలంగాణ బిడ్డలకు రావలసిన ఉద్యోగాలు కొల్లగొట్టాయనేది, ఇతరులకు అప్పగించాయనేది. తెలంగాణ బిడ్డలకు చెందవలసిన కనీసం రెండున్నర లక్షల ఉద్యోగాలు అలా అన్యాక్రాంతమయ్యాయని ప్రతి ఒక్కరూ అంకెలు చెప్పేవారు. అంటే తెలంగాణ ప్రభుత్వం వచ్చిన తర్వాత, ఉద్యోగుల విభజన సక్రమంగా జరిగితే, ఆ సంఖ్యలో ఖాళీలు నింపవలసి ఉండేది. కాని కారణాలు ఏమైనప్పటికీ పంచపాండవులు మంచం కోళ్లలా ముగ్గురు అని రెండువేళ్లు చూపించి ఒకటి రాశారని సామెత చెప్పినట్టుగా ఖాళీల సంఖ్యను ప్రభుత్వం తగ్గిస్తూ తగ్గిస్తూ వచ్చి ఒక లక్ష లోపు ఖాళీలు మాత్రమే ఉన్నాయని అంటున్నది. అందులోనూ అన్ని ప్రకటనలూ వస్తే కూడ ఇరవై ముప్పై వేలకు మించి ఉద్యోగకల్పన జరిగేట్టు లేదు. మరొకవంక ఆరు నుంచి పది లక్షల మంది నిరుద్యోగులు, ఉద్యోగార్థులు ఉంటారని ఒక అంచనా. అంటే ప్రతి ఒక్క ఉద్యోగానికీ కనీసం ముప్పై నుంచి యాభై మంది పోటీ పడతారనిపిస్తున్నది. ఆ పోటీ తెలంగాణ బిడ్డల మధ్యనే ఉండబోతుంది. ఆ పోటీలో ఓటమి పాలైనవారు నిరాశానిస్పృహలకు గురయ్యే అవకాశం ఉంది. ఈ సామాజిక వాస్తవాన్ని గుర్తెరిగి ఉద్యోగమే సమస్తమూ అనుకోకుండా, అనవసరమైన ఒత్తిడికీ, ఆ తర్వాత నిరాశా నిస్పృహలకూ గురి కాకుండా ఉండడం, ఉద్యోగం కోసం కన్న ఎక్కువగా తెలంగాణ గురించి తెలుసుకోవడం కోసం ఈ పాఠ్యాంశాలు అధ్యయనం చేయడం యువతరం బాధ్యత.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# సంక్షేమం పేరుతో మద్యానికి ప్రోత్సాహం

***పాలకులు ప్రజలకు పని కల్పించాల్సిన బాధ్యతను తప్పించుకోవడానికి మద్యాన్ని ఏరులుగా పారిస్తూ, ప్రజల్ని మత్తులో జోగేలా చేస్తూ అసలు సమస్యలను పరిష్కరించకుండా తప్పించుకుంటున్నారని అంటున్నారు రాధ***

తెలుగు రాష్ట్రాలు 2015-17 సంవత్సరాలకు గాను నూతన ఎక్సైజ్ పాలసీలను ప్రకటించాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఈ పాలసీ ప్రకారం జూలై 1 నుండి 4,380 మద్యం షాపులకు లైసెన్స్‌లు మంజూరు చేసింది. అందులో 10 శాతం వ్యవసాయ, మార్కెట్ కమిటీ సహకార సంఘాల ద్వారా ప్రభుత్వమే మద్యాన్ని అమ్ముతుంది. దీంతో షాపింగ్ మాల్స్, హైబ్రీడ్ మార్కెట్‌లలోనూ మద్యం అందుబాటులోకి వస్తుంది. కార్పొరేషన్ పరిధిలో మైక్రోబ్రూవరీలు (విదేశీ మద్యం) ఏర్పాటుకు అనుమతినిచ్చారు. నాటుసారా, కల్తీమద్యం, లూజు విక్రయాలను నిరోధించేందుకు టెట్రా ప్యాకెట్‌ల ద్వారా అమ్ముతున్నారు. రోజువారీ అమ్మకపు సమయాన్ని గంట అదనంగా పెంచారు. 2014-15 మద్యం ద్వారా ఆదాయం రు.11,900 కోట్లు వచ్చింది. ఈ ఏడాది రు.15,000 కోట్ల టార్గెట్‌ను ఎక్సైజ్ మంత్రి కొల్లు రవీంద్ర ప్రకటించారు. తెలంగాణ ప్రభుత్వం అక్టోబర్ 1 నుండి 2,216 మద్యం షాపులకు లైసెన్స్ ఇస్తున్నది. ప్రస్తుతం ఉన్న 720 బార్లకు అదనంగా 90 బార్లను పెంచుతున్నారు. గుడంబా నిర్మూలన లక్ష్యంతో గ్రామాలలో గుడంబా అమ్మే సెంటర్‌లలో మద్యం అమ్మడానికి ప్రణాళిక రూపొందించింది. అందుకుగాను మండలాన్ని ఒక యూనిట్‌గా లైసెన్స్ బి ఫీజులను పెంచి విరివిగా షాపులు పెట్టుకోవడానికి అనుమతి ఇస్తున్నది. 2014-15 మద్యం ఆదాయం రు.10,300 కోట్లు వచ్చింది. ఈ ఏడాదికి రు.12,000 కోట్ల టార్గెట్‌ను ఎక్సైజ్ మంత్రి పద్మారావు ప్రకటించారు. యథావిధిగానే రెండు రాష్ట్రాలు దరఖాస్తు ఫీజులను, లైసెన్స్ ఫీజులను పెంచారు.

నాటుసారా, గుడంబాలో వచ్చే మరో రు.2,000 కోట్లకు పైగా వచ్చే ఆదాయాన్ని కూడా వదులుకోదల్చుకోలేదు. వీటిని అరికడుతున్నా మనే పేరుతో లక్షన్నరకు పైగా ఉన్న బెల్టు షాపులను అనధికారికంగా నడుపుతానని చంద్రబాబు అంటే, అధికారికంగా నడుపుతానని కెసిఆర్ ప్రకటించుకున్నారు. గుడంబా ప్రజల ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుందని దీన్ని అరికట్టడానికి చీప్ లిక్కర్‌ని మరింత చీప్‌గా 15 రూపాయలకే 60 ఎంఎల్ అందుబాటులోకి తెస్తానని కెసిఆర్ ప్రకటించాడు. దీనిపై మహిళా సంఘాలు, విపక్షాల నుండి తీవ్ర నిరసన రావడంతో తాత్కాలి కంగా ఈ పద్ధతిని వాయిదా వేశాడు. ఆరోగ్య విషయంలో గుడంబాలోని ఇథనాల్ జీర్ణవ్యవస్థను దెబ్బతీస్తే, చీప్ లిక్కర్‌లోని ఇథనాల్ కాలేయాన్ని, కిడ్నీలను, క్రమంగా నాడీ వ్యవస్థను దెబ్బతీస్తుంది. ఇద్దరు చంద్రులూ ప్రజల్ని మద్యం మత్తులో ముంచి సంక్షేమం సాధిస్తామంటున్నారు.

భర్త సంపాదనంతా తాగుడుకే పోగా స్త్రీలు సంపాదించి, సంసారాన్ని నడిపి పైగా మొగుడిచేత దెబ్బలు పడుతూ చావలేక బతుకుతున్నారు. స్త్రీల కష్టాలు, కన్నీళ్లు, మగవాళ్ల అనారోగ్యాలు, ఆకలి చావులు ఇవ్వన్నీ ఆ వ్యక్తి తాగితే ఆ కుటుంబానికి జరిగే నష్టమయితే, తాగిన వ్యక్తి చేసే యాక్సిడెంట్‌లు, హత్యలు, అత్యాచారాలు, అల్లరి వల్ల సామాన్యులు బలవుతున్నారు. మద్యం మహమ్మరి ఆరోగ్యాన్ని పాడుచేస్తుంది. ఆర్థికంగా నష్టపరుస్తుంది. హింసకు ప్రోత్సహించి హంతకులుగా, నేరస్తులుగా మారుస్తుంది. నైతికంగా పతనం వైపు నెడుతుంది. మనిషిని మృగంలా మారుస్తుంది. మద్యపానం ఒక వ్యక్తికి సంబంధించింది మాత్రమే కాదు. నేరాలు పెరగడానికి కారణమవుతూ సమాజ అభివృద్ధికి ఆటంకమవుతుంది. మరి ప్రతియేటా మద్యం తయారీ డిస్టిలరీ కంపెనీలు, మద్యం షాపులు, బార్‌లు, రెస్టారెంట్‌లు, క్లబ్‌లు, పబ్‌లు, రిసార్ట్‌లు పెంచుతూ, వీటికి అనుమతుల ప్రోత్సాహాన్ని ప్రదర్శిస్తున్నాయి ప్రభుత్వాలు. ఈ నేరస్తులు తయారు కావడానికి ప్రభుత్వాలదే ప్రధాన బాధ్యత కాదా?

రాజ్యాంగంలోని 21వ అధికరణ ప్రతి పౌరుడికి ఆరోగ్యంగా జీవించే హక్కునిస్తుంది. మద్యాన్ని నియంత్రించాలని రాజ్యాంగంలోని ఆర్టికల్ 47 చెపుతుంది. 'మత్తు పదార్థాలు, జూదం, లాటరీలు, గుర్రప్పందాలు, వ్యభిచారం వంటి విషయాలు ప్రభుత్వ ఆధాయ వనరులు కారాదు. ఆ ఆదాయ వనరులతో ప్రభుత్వ పాలన జరగరాదు. వైద్య అవసరాలకు మాత్రమే తప్ప మత్తు పదార్థాలను నిషేధించాలి.' (భారత రాజ్యాంగం 47వ నిబంధన). ఈ నిబంధనల ప్రకారమే ఎక్సైజ్ శాఖను స్థాపించారు. ఎక్సైజ్ శాఖ ద్వారా మద్యం అమ్మకాలను నియంత్రించి తాగుడు అలవాటును మాన్పించడానికి చర్యలు తీసుకోవాలి. ప్రస్తుతం ఎక్సైజ్ శాఖ మద్యం అమ్మకాలను పెంచి ఆదాయాన్ని సమకుర్చే శాఖగా మారిపోయింది. ఈ శాఖ స్వభావాన్నే మార్చేశారు మన పాలకులు.

2011 డిసెంబర్ నుంచి 2012 మార్చి వరకు మద్యం మాఫియాపై ఎ.సి.బి దాడులు నిర్వహించింది. మంత్రులు, ఎం.ఎల్.ఎలు ప్రధాన నిందితులైతే వీరికి సహకరించిన వారంతా ఎక్సైజ్ అధికారులే అని తేల్చారు. ఎక్సైజ్ అధికారులంతా తమపై అవినీతి నిరోధక శాఖ (ఎసిబి) దాడులు ఆపాలని ఎక్సైజ్ కమిషనర్ సమీర్ శర్మను కలిశారు. మద్యం అక్రమ రవాణాను, కల్తీలను అరికట్టడం, బెల్టుషాపులను మూయించడం ఇలా నిబంధనల ప్రకారం మేం పనిచేస్తే ప్రభుత్వ ఆదాయం పడిపోతుందన్నారు. లైసెన్స్ షాపుల ద్వారా 30 శాతం అమ్మకాలు జరిగితే బెల్టుషాపులు, ఇతరత్రా ద్వారానే 70 శాతం అమ్మకాలు జరుగుతున్నాయని తేల్చిచెప్పారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రతి సంవత్సరం మద్యం అమ్మకాలను పెంచుతూ రాజ్యాంగానికి విరుద్ధంగా మద్యాన్ని ప్రభుత్వ ప్రధాన ఆదాయ వనరుగా మలుస్తున్నారు. రాజ్యాంగాన్ని సక్రమంగా అమలు చేయమని అడిగే వారిపై ప్రభుత్వం అరెస్టులు, నిర్బంధం కొనసాగిస్తోంది.

పాలకులు ప్రజలకు పని కల్పించాల్సిన బాధ్యతను తప్పించు

కోవడానకి మద్యంను ఏరులై పారిస్తూ, ప్రజల్ని నమ్మకాల, మూఢ విశ్వాసాల సుడిగుండంలో ముంచెత్తుతూ మత్తులో జోగేలా చేస్తూ అసలు సమస్యలను పరిష్కరించకుండా తప్పించుకుంటున్నారు.

1963లో మద్య నిషేధం అమలుకై ఏర్పాటైన టేక్‌చంద్ కమిషన్ రిపోర్టు ప్రకారం ప్రభుత్వాలకు చిత్తశుద్ధి ఉంటే మద్య నిషేధం కష్టమైన పని కాదన్నారు. ప్రభుత్వం, మద్యం కాంట్రాక్టర్లు ఆర్జిస్తున్న ఆదాయం కంటే తాగుడు వల్ల మూడింతల మానవ శ్రమ బలహీనమై పోతోందని స్పష్టం చేసింది. అంటే కేవలం తెలుగు రాష్ట్రాల్లోనే ఈ సంవత్సరానికి 2 లక్షల కోట్లు మానవ శ్రమ, ప్రజల ఆదాయం వృథా అవుతుందన్న మాట. అనుత్పాదక విధ్వంసాన్ని అభివృద్ధిగా చిత్రీకరిస్తున్నారు. అభివృద్ధి జరగాలన్నా, సంక్షేమ పథకాలు అమలు కావాలన్నా, ప్రభుత్వం నడవాలన్నా మద్యం అమ్మకాల ద్వారా వచ్చే ఆదాయమే ప్రధానం అంటున్నారు. నిరుపేదలు తాగితేనే సబ్సిడీ బియ్యం, ఊరికి రోడ్లు, వారి పిల్లలకి స్కాలర్‌షిప్‌లు, వారు తాగి చస్తేనే దేశానికి, రాష్ట్రానికి ఆదాయం అంటున్నారు మన నీతిమాలిన పాలకులు. ప్రభుత్వాలు ప్రాథమిక విద్య, వైద్యం, మౌలిక సదుపాయాలు, సంక్షేమ పథకాల కోసం ఎంత ఖర్చుచేస్తున్నారు. వాళ్ల రక్షణకోసం ఎంత ఖర్చు చేస్తున్నారు? రైతులకు చేనేత కార్మికులకు ఎంత సబ్సిడీ ఇస్తున్నారు? మల్టీనేషనల్ కంపెనీలకు ఎంత సబ్సిడీలు ఇస్తున్నారు? లెక్కలు తీస్తే ప్రజా సంక్షేమంకోసం ఖర్చుపెట్టేది 10 శాతం అయితే, బహుళజాతి కంపెనీల ప్రయోజనాలకోసం ఖర్చుపెట్టేదే అధికంగా ఉంటుంది.

వాస్తవానికి మద్య నిషేధాన్ని అమలు చేస్తేనే ప్రజల దగ్గర కొంత డబ్బు మిగులుతుంది. అది పొదుపు మొత్తాల ద్వారా, మార్కెట్ ద్వారా, పన్నుల ద్వారా ప్రభుత్వం దగ్గరికే వస్తుంది. బడా పారిశ్రామిక వేత్తలు, వర్తకులు, సినీతారలు ఎగ్గొట్టే పన్నులు వసూళ్లు చేస్తే, మంత్రులు చేసే స్కాములను నియంత్రిస్తే, మల్టీనేషనల్ కంపెనీలకు సబ్సిడీలు ఇవ్వడం మానేస్తే, విలువైన అటవీ సంపదను అతితక్కువ ధరకు లీజుకు ఇవ్వడం నిలిపివేస్తే, స్విస్ బ్యాంకుల్లోని అక్రమ సంపాదనను రప్పిస్తే... లక్షల కోట్ల రూపాయల ఆదాయం ఉంటుంది. ఇంకా చాలా రకాలుగా దేశ సంపద తరలిపోవడాన్ని అరికడితే మనమే ప్రపంచ బ్యాంకుకు అప్పు ఇవ్వవచ్చు. ఇలాంటి చర్యలు మన పాలకులు తీసుకోరు. ఎందుకంటే వీటన్నిటిలో వీరికి భాగం ఉంటుంది. మద్యం వ్యాపారులు, భూస్వాములు, బడా పారిశ్రామికవేత్తలు, స్మగ్లర్లు వీరే నేటి రాజకీయ నాయకులు. నేటి రాజకీయాలంటే మద్యంతో ఓటు, ఓటుతో సీటు, సీటుతో నోటు. వీరు చేసే దోపిడీని, అక్రమార్జనను, అన్యాయాలను ప్రజలు ప్రశ్నించకూడదు. అందుకే ప్రజల్ని మత్తులో ముంచుతారు. మద్యాన్ని ఏరులై పారిస్తారు. ఇది దోపిడీ పాలకులకు అవసరం.

చరిత్రలో నుంచి పరిశీలిస్తే బ్రిటిష్ వలసవాదులు మద్యపానాన్ని ఆదాయవనరుగా మలిచారు. 1972లో మొదటిసారిగా మద్యం దుఖానాల వేలం పాటల పద్ధతిని ప్రవేశపెట్టారు. స్వాతంత్రోద్యమంలో మద్యనిషేధం కూడా ఒక ప్రధాన నినాదమైంది. శాసనోల్లంఘన ఉద్యమం లో మత్తుపానీయాల, కల్లు దుఖానాల ముందు నిరసనలు జరిగాయి. బ్రిటిష్ ప్రభుత్వానికి మహాత్మాగాంధీ సమర్పించిన జాతీయ స్థాయి డిమాండ్‌లలో సంపూర్ణ మద్యనిషేధం మొట్టమొదటిది. స్వాతంత్ర్యా నంతరం కొన్ని రాష్ట్రాలలో మద్య నిషేధం అమలు చేశారు. 1970 గాంధీ శతజయంతి నాటికి సంపూర్ణ మద్య నిషేధం అమలు చేయాలని కేంద్ర ప్రభుత్వం తీర్మానించి 1963లో టేక్‌చంద్ కమిషన్ ఏర్పాటు చేశారు. 1964లో విలువైన సూచనలతో నివేదికను సమర్పించారు. వీటిని పాటించలేదు సరికదా 1970 కల్లా దేశంలో అక్కడక్కడ ఉన్న మద్యనిషేధాన్ని కూడా ఎత్తివేశారు. నూతన ఆర్థిక విధానాల తర్వాత మద్యంపై వచ్చే ఆదాయం వేగంగా పెరుగుతూ వచ్చింది.

తెలుగు రాష్ట్రాల విషయానికొస్తే 1984లో ఎన్‌టిఆర్ – వారుణి వాహిని – పేరుతో సారాను విస్తృతంగా పారించారు. అదేకాలంలో నక్సలైట్ ఉద్యమం బలంగా ఉన్న కరీంనగర్, ఆదిలాబాద్, ఉత్తర తెలంగాణ జిల్లాలలో మద్యం అమ్మకాలను నియంత్రించారు. తక్కువ లాభాలు రావడంతో చాలా మంది మద్యం వ్యాపారాన్ని మానుకున్నారు. దీంతో పోలీసుస్టేషన్లే సారా దుఖాణాలయ్యాయి. 1991–94 మధ్య కాలంలో నెల్లూరు జిల్లాలో సారావ్యతిరేక ఉద్యమం ప్రభంజనంలా ముందుకొచ్చింది. చీపురు, కారంపొడి, నిప్పు మూడు ప్రధాన ఆయుధాలతో ఉద్యమాన్ని మహిళలు ముందుండి నడిపారు. తాగుబోతుల్ని, గుండాలని, పోలీసుల్నీ చీపురు, కారంపొడితో ఎదుర్కొంటూ సారా దుఖాణాల కాంట్రాక్టర్ల గోడౌన్లకు నిప్పు పెట్టారు. 40 వేల మందితో నెల్లూరులో ర్యాలీ నిర్వహించారు. 34 సార్లు సారా వేలం పాటల్ని ఆపిన ఘనచరిత్ర వీరిది. ప్రతిపక్షంలో ఉన్న ఎన్‌టిఆర్ సంవత్సర కాలం మద్య నిషేధాన్ని అమలు చేశాడు. చాలా మంది సంసారాలు బాగు పడ్డాయి. 1995లో చంద్రబాబు వైస్రాయ్ హోటల్ సాక్షిగా ఎన్‌టిఆర్ ప్రభుత్వాన్ని కూల్చేసి గద్దెనెక్కాడు. ప్రపంచ బ్యాంకు ఆదేశాల ప్రకారం శ్వేత పత్రాలు విడుదల చేశాడు. మద్య నిషేధం వల్ల రాష్ట్ర ఆదాయం కుంటుపడిందని సంక్షేమ పథకాలు అమలు చేయాలంటే మద్యం అమ్మకాలు తప్పనిసరి అని తన మీడియా ద్వారా విస్తృతంగా ప్రచారం చేసి మద్య నిషేధాన్ని ఎత్తివేశాడు. సారాని నిషేధిస్తున్నానని సారాకి బదులు చీప్ లిక్కర్‌ను ప్రవేశపెట్టాడు. కొత్త సీసాలో పాత సారానే ఇది. ప్రపంచ బ్యాంకు ఎజెండాను ఎంత వేగంగా అమలు చేశారో అంతే వేగంగా మద్యం ఆదాయాన్ని ఊహించని విధంగా పెంచాడు.

2004 ఎన్నికల్లో వై.ఎస్. రాజశేఖర రెడ్డి మద్య నిషేధాన్ని దశల వారీగా అమలు చేస్తానని హామీనిచ్చాడు. గద్దెనెక్కిన తరువాత దీన్ని రివర్స్‌లో అమలుచేశాడు. దశల వారీగా పెంచుతూ 2009లో ఉన్న 32 డిస్టిలరీ కంపెనీలకు తోడుగా ఒక్కసారిగా మరో 40 డిస్టిలరీ కంపెనీలకు అనుమతి ఇచ్చాడు. లాటరీ పద్ధతి నుండి వేలం పాటలకు మార్చి మద్యం మాఫియాకు తెరలేపాడు. 2014 ఎన్నికల్లో చంద్రబాబు బెల్టుషాపులను రద్దుచేస్తానని హామీనిచ్చాడు. ప్రమాణ స్వీకారం రోజు ఫైల్‌పై సంతకం కూడా చేశాడు. కానీ అదే నెలలో ప్రకటించిన ఎక్సైజ్ పాలసీ గతంకంటె రెండు వేల కోట్లు ఎక్కువ టార్గెట్ నిర్ణయించి తన వాగ్దానం నీటిమీద రాతలేనని నిరూపించాడు. ఈసారి ఈ ఆదాయాన్ని ప్రభుత్వ ఆదాయంలో 55 శాతం పెంచాలని తమిళనాడు, కేరళ, కర్ణాటక మద్యం పాలసీలను మంత్రులతో సర్వేచేయించాడు. ప్రయోగాత్మకంగా 10 శాతం వ్యవసాయ, మార్కెట్ సహకార సంఘాల ఆధ్వర్యంలో ప్రభుత్వమే నడపాలని నిర్ణయించారు. ఈ సహకార సంఘాలలో టిడిపి కార్యకర్తలే ఉంటారు.

ఇక బంగారు తెలంగాణ చేస్తానని ప్రగల్భాలు పలికిన కెసిఆర్. 2014–15కి గాను మద్యం ఆదాయాన్ని రు. 9481 కోట్ల నుండి రు. 10,300 కోట్లకు పెంచాడు. ప్రజల్ని మత్తులో ముంచి బంగారు తెలంగాణను ఎలా సాధిస్తాడు? ఈసారి గుడుంబా నిర్మూలన పేరుతో మండలాన్ని యూనిట్‌గా లైసెన్స్ బి ఫీజును పెంచుతూ విరివిగా షాపులు పెట్టుకోవడానికి ప్రభుత్వం అనుమతులిస్తున్నది. ఇది అధికారంలో ఉన్న

# అన్నదాతల ఆత్మహత్యలు-పరిష్కారం

*రైతును ఆదుకోవడంలో, కాపాడుకోవడంలో ప్రభుత్వాలు విఫలమవుతూనే ఉన్నాయనీ, కొత్త రాష్ట్రం వచ్చినా కూడ రైతుల ఆత్మహత్యలు కొనసాగుతూనే ఉన్నాయనీ అంటున్నారు* **మచ్చ శ్రద్ధానందం**

గ్రామీణ జీవితాన్ని, నేపథ్యాన్ని ముఖ్యంగా వ్యవసాయ ప్రాధాన్యతను అన్నదాతల అవసరాన్ని ఎంతో మంది మేధావులు నొక్కి చెప్పారు. గ్రామాలతో కూడుకున్నదే దేశం, దేశాభివృద్ధి గ్రామాభివృద్ధితోనే ముడిపడి ఉన్నదనే అభిప్రాయాన్ని జాతిపిత గాంధీజీ వెలువరించగా, గ్రామ ప్రగతి లేకుండా జాతి ప్రగతి లేదని సామాజిక వేత్తలు భావించగా, 'భారతదేశ ఆత్మ గ్రామాల్లోనే ఉందని' తెలంగాణ రాష్ట్ర తొలి ముఖ్యమంత్రి కెసిఆర్ ఇటీవల ఓ సదస్సులో అభిప్రాయ పడిన విషయం విదితమే.

వ్యవసాయం దేశ ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక అని అనేక సంవత్సరాల నుండి రైతుల్ని కొనియాడుకుంటున్నాం. ఇదే సందర్భంలో లక్షలాది మంది రైతులు వ్యవసాయాన్ని నమ్ముకుని నష్టపోయి బలవన్మరణాలకు పాల్పడుతున్నారు. 1995-2014 మధ్య కాలంలో దాదాపు మూడు లక్షల మంది అన్నదాతలు ఆత్మహత్యలకు పాల్పడ్డారంటే ఒంట్లో గగుర్పాటు కలుగుతుంది. వీటిలో 60 శాతం పైగా దక్షిణ భారత దేశంలోని ప్రధాన నాలుగు రాష్ట్రాలు అందులో తెలంగాణ కూడా ఒకటిగా ఉండడం, కొత్త రాష్ట్ర ప్రజలుగా తీవ్రంగా ఆందోళన చెందాల్సిన అవసరం ఉంది.

2014 జాతీయ నేర విభాగపు లెక్కల ప్రకారం ఈ సంవత్సరంలో దేశవ్యాప్తంగా 5,650 మంది రైతులు చనిపోగా దీనిలో 472 మంది మహిళా రైతులు కూడా ఉండడాన్ని గమనించాలి. వీటిలో 45.5 శాతం (2,568) మహారాష్ట్రలో జరుగగా, 15.9 (898) తెలంగాణ రాష్ట్రంలో జరిగాయి. తెలంగాణ రైతు ఆత్మహత్యల్లో ద్వితీయ స్థానానికి రావడం విచారించవలసిన విషయం. 29వ రాష్ట్రంగా ఏర్పడిన తెలంగాణకు ప్రత్యేకత ఉన్నది. ఆవిర్భావం వెనుక 14 సంవత్సరాల సుదీర్ఘ ఉద్యమం ఉంది, 60 ఏళ్ల వ్యథ ఉంది, వెన్ను విరిగిన వ్యవసాయ రంగముంది, తనువు చాలిస్తున్న అన్నదాతలున్నారు. ఒక కొత్త ఒరవడితో, పునర్నిర్మాణ అంకితా భావంతో అధికారంలోకి వచ్చిన తెలంగాణ రాష్ట్ర సమితి (టిఆర్ఎస్) ప్రభుత్వానికి అందరికీ ఆమోద యోగ్యమైన పార్టీ మేనిఫెస్టో ఉండడాన్ని అంగీకరించాల్సిన అవసరం ఉంది.

రాష్ట్ర ఆవిర్భావం నుండి నేటి వరకు ఆత్మహత్యల పరంపర కొనసాగుతూనే ఉంది. ఒక రకంగా చెప్పాలంటే వేగం పుంజుకుందనే విశ్వసించవచ్చు. వ్యక్తి కారణం కంటే వ్యవస్థ కారణాలే రైతు ఆత్మహత్యలకు కారణంగా నిలుస్తుందనే విషయాన్ని గుర్తించాలి. శీఘ్రంగా జరుగుతున్న రైతు ఆత్మహత్యలకు పరిష్కార మార్గాన్ని కనుక్కునే ప్రయత్నంలో అనేక సవాళ్లను ఎదుర్కోవాల్సి ఉన్నది. వాటిని ఒకసారి చూద్దాం.

1) వ్యవస్థాగత రుణాలు కావలసినంత సకాలంలో అందకపోవడం వల్ల రైతులు వడ్డీ వ్యాపారస్తుల్ని ఆశ్రయించి అధిక వడ్డీతో కూడిన రుణాన్ని తీసుకోవడం, అసలు, వడ్డీ కలిపి అధిక భారమై అప్పుల పాలు కావడం, వడ్డీ వ్యాపారస్తుల ఒత్తిడికి తట్టుకోలేక మానసిక క్షోభకు గురై ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. అయితే ఈ ప్రభుత్వం సంస్థాగత రుణాల్ని పెంచుతుందా, పెంచితే ఎంత వరకు పెంచుతుంది? వడ్డీ వ్యాపారస్తుల ఆగడాలను నియంత్రించగలుగుతుందా?

2) ముఖ్యంగా నకిలీ విత్తనాలు వాడకం అనేది కూడా కారణంగా

---

పార్టీ కార్యకర్తలను పెంచి పోషించడానికి ఒక ఆదాయ వనరుగా ప్రభుత్వాలు చూస్తున్నాయి. రెండు రాష్ట్రాల్లో ప్రభుత్వాలు కింది స్థాయి కార్యకర్తలను మద్యం వ్యాపారంలో భాగంచేసి వారికి లబ్ది చేకూర్చి, టి.ఆర్.ఎస్ పార్టీని బలోపేతం చేసుకోవడంలో భాగమే ఇది.

ఇలా ప్రభుత్వాలు ప్రతి ఊరిలో మంచి నీళ్లు, బడి, ఆరోగ్య కేంద్రం లాంటివి లేకపోయినా మద్యాన్ని మాత్రం అందుబాటులో ఉంచుతూ భావితరాల్ని కూడా మద్యానికి బానిసలుగా తయారు చేస్తున్నారు. మద్య నిషేధం అమలు చేయాలని అన్ని పార్టీలు అంటాయి. కాని వారు అధికారంలో ఉన్నప్పుడు మాత్రం అమలు చేయరు. నాటి వలస పాలకులైన బ్రిటిష్ వారి నుండి నేటి దళారీ పాలకుల దాకా మద్యాన్ని ఆదాయ వనరుగా చూపినంత వరకు మద్య నిషేధం అమలు కాదు. ఎక్కడైతే ప్రజా ఉద్యమాలు జరుగుతాయో అక్కడ కింది స్థాయి ప్రజలు సంఘటితంగా చైతన్యవంతులయి ఉద్యమాల్లో భాగస్వాములవుతారో అక్కడ మద్యనిషేధం అమలయ్యింది. ఇది మనకు చరిత్ర చెప్పిన సత్యం.

నెల్లూరు సారా వ్యతిరేక ఉద్యమం, 2011 ఏప్రిల్‌లో కడప జిల్లా పెద్దపసుపుల గ్రామంలో మద్యానికి వ్యతిరేకంగా ఊరి ప్రజలంతా ఉద్యమించి సాధించుకున్నారు. వీరికి ప్రజా సంఘాలు అండగా నిలబడ్డాయి. తెలంగాణ ఉద్యమంలో కొన్ని గ్రామాల్లో మద్యాన్ని ఊరి మధ్యలో కుప్పలా పోసి తగులబెట్టారు. ప్రస్తుతం భూమి, భుక్తి, విముక్తి కోసం పోరాడుతున్న ప్రజలు జనతన సర్కార్లను ఏర్పాటు చేసుకున్న దగ్గర అక్కడి విప్లవ ప్రజా కమిటీలు సంపూర్ణ మద్య నిషేధాన్ని అమలు చేస్తున్నాయి.

నేడు మహిళల జీవించే హక్కునే హరించివేస్తున్న మద్యానికి వ్యతిరేకంగా, పేద ప్రజల రక్త మాంసాలు పీల్చే, మహిళల కన్నీళ్లను సొమ్ము చేసుకునే, మనిషిని మృగంగా మార్చే వ్యాపారానికి వ్యతిరేకంగా పోరాడుదాం. నిజమైన అభివృద్ధి అంటే ఆకలి, అనారోగ్యం, అసమానతలు, అత్యాచారాలు లేని సమాజానికై పోరాడుదాం. వర్గ, కుల, మత, లింగ, జాతి, ప్రాంతీయ అసమానత్వం లేని సమాజం కోసం పోరాడుదాం. ఈ పోరాటాల్లో భాగంగానే సంపూర్ణ మద్య నిషేధం అమలు సాధ్యమౌతుంది. ఆరోగ్యవంతమైన సమాజాన్ని ముందు తరాలవారికి అందిద్దాం.

*(రచయిత చైతన్య మహిళా సంఘం రాష్ట్ర కార్యదర్శి)* వీ

నిలుస్తూ ఉన్నది. అటువంటప్పుడు నకిలీ విత్తనాలు మార్కెట్‌లోకి రాకుండా అడ్డుకోగలుగుతుందా? నాణ్యమైన విత్తన సరఫరా చేయగలుగు తుందా? ఒకవేళ ఎవరైనా నకిలీ విత్తనాలు అమ్మినట్లు రుజువైతే ఆ వ్యక్తికి గాని కంపెనీకి గాని శిక్ష విధిస్తుందా? వాటిని వినియోగించి నష్టపోయిన రైతులకు పరిహారం ఇప్పిస్తుందా? లేదా ఇస్తుందా?

3) కనీస మద్దతు ధర లేకపోవడం అనేది కూడా ఒక కారణంగా ఉంది. అయితే ప్రభుత్వ లెక్కల ప్రకారం ఇ‌ఎక్స్ వరిబస్తా పండించడానికి రు. 1600 రైతుకు ఖర్చవుతుంది. కాని గత ప్రభుత్వాలు రు.1200 మించి ఇవ్వలేదు. (ఈ ప్రభుత్వం స్వల్పంగా పెంచిందనుకోండి) మరి ప్రభుత్వం ఎంఎస్‌పి (మినిమం సపోర్ట్ ప్రైస్)ని రు.1600గా గాని లేదా దాన్ని మించి గాని చేయగలుగుతుందా? (ఇలాగే మిగతా వ్యవసాయోత్పత్తులకు కూడా)

4) రైతులకు పంటలు వేయాల్సిన తీరు తెలియకపోవడం కూడా ఒక కారణం. అటువంటప్పుడు రైతులకు పూర్తి స్థాయిలో ఏకకాలంలో ఏ భూమిలో ఎటువంటి పంట వేస్తే బాగుంటుందో అటువంటి వాటిని అధికారుల ద్వారా రైతులకు చెప్పించగలుగుతుందా? చెపితే ఏ విధంగా చెపుతుంది. ముఖ్యంగా భూసార పరీక్షలు జరపకపోవడం భూసార ఉపయోగ లోతుపాతులు రైతులకు తెలియకపోవడం, అధికారుల నిర్లక్ష్యం గతంలో కొట్టొచ్చినట్లు కనబడింది. అటువంటి భూసార పరీక్షలు నిర్వహించి రైతులకు పంటల తీరును తెలియజేస్తుందా?

5) ప్రభుత్వానికి సంబంధించిన వివిధ డిపార్టుమెంట్ల మధ్య సఖ్యత లేకపోవడం కూడా ఒక కారణం. ఉదాహరణకు విద్యుత్, వ్యవసాయం, నీటిపారుదల, బ్యాంకింగ్. రైతు శ్రేయస్సు కోసం తీసుకునే నిర్ణయం విషయంలో 'ఏకరూపత' లేకపోవడం వల్ల చివరగా రైతులు నష్టపోవడం జరిగింది. రైతుల అవసరాల్ని దృష్టిలో ఉంచుకుని వీటి మధ్య ఒక సఖ్యతను తీసుకురాగలుగుతుందా?

6) ఉత్పత్తి ఖర్చులు విపరీతంగా పెరిగినాయి. ఎరువులు, విత్తనాలు, క్రిమి సంహారక మందులు మొదలైన ధరలు గతంలో అనూహ్యంగా పెరిగినాయి. ముఖ్యంగా ఎరువులపై ప్రభుత్వం సబ్సిడీని తగ్గించింది. ఫలితంగా రైతుల ఖర్చులు ఎక్కువయినాయి. వీటి ధరలు తగ్గించడం గాని లేదా సబ్సిడీలు పెంచడం గాని ఏమైనా చేయగలుగుతుందా? వీటి నాణ్యత లేమి, ధరల పెరుగుదల విషయంలో ప్రభుత్వం నియంత్రణ చేయగలుగుతుందా? ముఖ్యంగా ఆత్మహత్య చేసుకుంటున్న రైతులలో 'కౌలు రైతులు' కూడా అధికమే. వీరిని రైతులుగా గుర్తించకపోవడం వల్ల రుణ సదుపాయం అందే పరిస్థితి లేదు. వీళ్లని రైతులుగా గుర్తించడంలో ఎటువంటి ప్రమాణికతను వాడుతారు అది ఆమోద యోగ్యం పొందుతుందా? ముఖ్యంగా మహిళా రైతులను కూడా పూర్తి స్థాయిలో రైతులుగా గుర్తించగలుగుతుందా?

7) తెలంగాణలో సుమారు 80 శాతం వ్యవసాయం బోరుబావుల పైననే ఆధారపడి ఉంది. ప్రస్తుత ప్రభుత్వం 'మిషన్ కాకతీయ' పేరిట పూడుకపోయిన చెరువులను పునర్నిర్మాణం చేయడం అనేది కొనియాడు కోవాల్సిందే. కాని ఈ పథకం కింద చెరువులన్నింటిలో పూర్తి స్థాయిలో పూడిక తీయించగలుగుతుందా? ముఖ్యంగా ప్రాజెక్టుల ద్వారా 'ఎత్తిపోతల' ద్వారా వ్యవసాయానికి నీరును అందించ గలుగుతుందా? (దీర్ఘకాలికమైనప్పటికిని). ఒకవేళ అందిస్తే ఎన్ని జిల్లాలకు అందించ గలుగుతుంది? ముఖ్యంగా మహబూబ్‌నగర్ జిల్లా పరిస్థితి ఏమిటి? ఇక్కడి వలసలను ఆత్మహత్యలను నివారించ గలుగుతుందా?

8) పక్క రాష్ట్రమైన కర్ణాటకలో వ్యవసాయానికి ప్రత్యేక బడ్జెట్ ఉన్నది. దీని వలన నిధులు నిరుపయోగం కాకుండా ఉంటాయి. ఈ విధంగా ప్రభుత్వం వ్యవసాయాభివృద్ధిని దృష్టిలో ఉంచుకుని 'వ్యవసాయానికి ప్రత్యేక బడ్జెట్'ను రూపొందించగలుగుతుందా?

9) రైతులకు చిరు ధాన్యాల సాగుపై అవగాహన లేదు. చిరు ధాన్యాల విత్తనాలపై ఇంకా పరిశోధన జరగాల్సి ఉందని నిపుణులు అభిప్రాయ పడుతున్నారు. అటువంటప్పుడు ప్రభుత్వం చిరు ధాన్యాల పరిశోధనలు, సాగు మెలకువలను చేయించగలుగుతుందా? నేర్పించ గలుగుతుందా?

10) రైతులకు వ్యవసాయం నుండి వచ్చే ఆదాయం విషయంలో భద్రత లేదు. అటువంటప్పుడు రైతులకు భరోసా, భద్రతనిచ్చే పథకాన్ని ప్రభుత్వం రూపొందించ గలుగుతుందా?

11) కమీషన్ ఏజెంట్లు, షావుకారులు, మధ్య వర్తులు మొదలైన వారు రైతుల అమాయకత్వంతో, లేమి తనంతో, నిరక్షరాస్యతతో ఆడుకుంటున్నారు. అటువంటప్పుడు వారిని నియంత్రణ చేసే విధంగా, వారి మోసాలను అరికట్టే విధంగా ఏదైనా విధానం తీసుకొస్తుందా?

12) పంట రుణాల పంపిణీలో భూమి ఉండి వ్యవసాయం చేయకుండా పంట రుణాలు పొందుతున్న వారు (ఉద్యోగులు, వ్యాపారులు). మరోవైపు నకిలీ పట్టాలతో రుణాల్ని కొట్టేసేవాళ్లు కూడా ఉన్నారు. దీనివల్ల భూమి ఉండి వ్యవసాయం చేయాలనుకునే వారికి కావలసినంతగా రుణం అందడం లేదు. అటువంటప్పుడు వ్యవసాయ కార్యకలాపాలు ఏ మాత్రం చేయకుండా రుణాలు తీసుకునే వారిని ప్రభుత్వం ఏ మేరకు నియంత్రిస్తుంది.

13) సేంద్రీయ వ్యవసాయ విధానం వల్ల ఉత్పత్తి ఖర్చులు తగ్గడంతో పాటు, నాణ్యమైన ఉత్పత్తి జరిగి లాభాలు వచ్చే అవకాశాలున్నాయని అనేక మంది వ్యవసాయ నిపుణులు చెపుతున్నారు. అటువంటప్పుడు సేంద్రీయ వ్యవసాయ విధానం అనే విషయంలో ప్రభుత్వం ఏ విధంగా ప్రోత్సహించగలుగుతుంది? ఏ విధమైన చొరవ తీసుకుంటుంది.

14) ముఖ్యంగా రైతు ఆత్మహత్య అనంతరం అది ప్రభుత్వ దృష్టిలో 'రైతు ఆత్మహత్య'గా పరిగణించడానికి ఉండే నిబంధనల వల్ల చాలా రైతు కుటుంబాలు ఇబ్బందుల్ని ఎదుర్కొంటున్నాయి. అటువంటప్పుడు 'రైతు ఆత్మహత్య'గా గుర్తించడానికి ఉండే నిబంధనలను సడలింపు చేసే అవకాశం ఉందా?

15) ఇక పరిహారం పొందే విషయంలో 13 పత్రాలను రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌కు సమర్పించాల్సి ఉంటుంది. వీటిలో ఏ ఒక్కటి లేకపోయినా పరిహారం అందే పరిస్థితి ఉండదు. ఇలాంటి విషయంలో మినహాయింపులేవైనా తీసుకు వస్తుందా? అలా కాకుండా సింగిల్ విండో విధానాన్ని తీసుకొచ్చి రైతు కుటుంబాలను ఆదుకునే అవకాశం ఉందా?

16) పంటల బీమా, గిట్టుబాటు ధరలను పెంపు చేస్తామని రాష్ట్ర వ్యవసాయ మంత్రి పోచారం శ్రీనివాస్ రెడ్డి ఇటీవల ఓ సమావేశంలో ప్రకటించిన విషయం తెలిసిందే. దీని విషయంలో ఎంత వరకు అమలు చేసే ప్రయత్నం చేస్తారో వేచి చూడాల్సిందే.

**ముగింపు**

రైతు ఆత్మహత్యల కారణాలు బహుముఖ విలువలను కలిగి ఉన్నవి. ఇవ్వాళ రైతు నష్టపోతున్నాడంటే వ్యవస్థా పూర్వకమైన కారణాలే సింహ భాగాన్ని ఆక్రమిస్తున్నాయి. రైతు జీవితాలకు భద్రత కల్పించాల్సిన భారీ బాధ్యత ప్రభుత్వాల పైన ఉన్నది.

*(రచయిత ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిశోధకులు)* వీ

# రాజధానికి చేరిన రైతు ఆత్మహత్యలు

***రైతుల ఆత్మహత్యలు గ్రామాల నుండి దేశ, రాష్ట్ర రాజధానులకు చేరుకుని పాలకులకు రైతాంగం పట్ల ఉన్న నిర్లక్ష్య ధోరణికి అద్దం పడుతున్నాయని అంటున్నారు ఎ. మల్లేశ్, వై రామచంద్రం***

దేశంలో గత రెండున్నర దశాబ్దాలుగా రైతులు ఆత్మహత్యలు చేసుకోని రోజు లేదు. ఈ దుస్థితి రోజు రోజుకు పెరుగుతుందే గాని తగ్గడం లేదు. దానికి కారణాలు ముఖ్యంగా దేశంలో ప్రపంచీకరణ విధానాలు అమలయిన నుంచి ఈ దుస్థితి తీవ్రమయింది. వ్యవసాయ కేంద్రంగా ఉత్పత్తి సాగుతున్న దేశంలో దానికి అనుకూలమైన విధానాల రూపకల్పన జరగాలి. అందులో ప్రభుత్వాలు పూర్తిగా విఫలమయ్యాయనడానికి నిత్యం రోజు రోజుకు పెరుగుతున్న రైతుల బలవన్మరణాలే నిదర్శనం. ఇరవై లక్షల మంది రైతులు సాగు భారాన్ని తట్టుకోలేక వీధుల పాలైనారు. నేషనల్ క్రైం రికార్డు బ్యూరో లెక్కల ప్రకారమే ఈ సంవత్సరంలోనే దేశ వ్యాప్తంగా పన్నెండు వేల మూడు వందల అరవై మంది అన్నదాతలు ఆత్మహత్యలు చేసుకున్నారు.

రైతాంగాన్ని పాలకులు ఎంత ఆర్థిక సంక్షోభంలోకి నెట్టారో దానికి దేశ, రాష్ట్ర రాజధాని నడి వీధుల్లో రైతులు చేసుకున్నా రైతుల ఆత్మహత్యలే సజీవ సాక్ష్యంగా మనముందున్నవి. రాజస్థాన్ రాష్ట్రానికి చెందిన రైతు గజేంద్రసింగ్ (41) ఆమ్ ఆద్మీ పార్టీ ఏప్రిల్ 23న ఢిల్లీలో భూసేకరణ ఆర్డినెన్స్‌కు వ్యతిరేకంగా నిర్వహించిన కిసాన్ ర్యాలీలో పాల్గొనడానికి వచ్చి తన ఆవేదనను ఆత్మహత్య రూపంలో వెల్లడించాడు, అలాగే తెలంగాణ రాజధాని హైదరాబాద్‌లో రైతు లింబయ్య (48) అప్పుల భారాన్ని మోయలేక ఆత్మహత్య చేసుకున్నారు. ఈ ఆత్మహత్యలు గ్రామాల నుండి రాజధానికి పాలకుల నిర్లక్ష్యాన్ని వదిలించడానికి నగరాలకు వచ్చాయి. లింబయ్య నిజామాబాద్ జిల్లా, సదాశివనగర్ మండలం, రథాల రామరెడ్డి గ్రామానికి చెందిన వాడు. ఇతనికి ఐదెకరాల భూమి ఉంది. తన కుటుంబాన్ని పోషించడానికి ఆధారం ఈ భూమే. గత మూడు సంవత్సరాలుగా పంటలు సరిగా పండకపోవడంతో కుటుంబ ఆర్థిక పరిస్థితి దిగజారిపోయింది. దీంతో నాలుగు లక్షల రూపాయల అప్పు చేయవలసి వచ్చింది. ఈ అప్పును తీర్చే మార్గం లేక, ప్రభుత్వ సహకారం అందక ఆత్మహత్య వైపు మొగ్గు చూపడానికి కారణమైంది. అదే రోజు తెలంగాణ వ్యాప్తంగా పదిమంది లింబయ్యలు ఆత్మహత్యలు చేసుకున్నారు. రాజధాని హైదరాబాద్ నడిబొడ్డున సెప్టెంబర్ 20న జగ్గోళ్ల మల్లేషం (58) ఆత్మహత్య చేసుకున్నారు. ఈయన మెదక్ జిల్లా దౌల్తాబాద్ మండలం రాంసాగర్ గ్రామానికి చెందిన వాడు. ఈయన గతంలో పీపుల్స్‌వార్‌లో పనిచేసి అనారోగ్యకారణాలతో తిరిగి వచ్చి వ్యవసాయం చేసుకుంటున్నాడు. పంటలు పండక, పండిన పంటకు గిట్టుబాటు ధర రాక అప్పులు అవడంతో తనకున్న మూడు ఎకరాల్లో ఒక ఎకరం అమ్మినా అప్పులు తీరగ నగరానికి వచ్చి సెక్యూరిటీ గార్డుగా చేరాడు. అప్పుల బాధ ఆయన్ని వెంటాడుతుండడంతో మనో వ్యథకు లోనై యూనిఫాంలోనే చెట్టుకు ఉరివేసుకొని ఆత్మహత్య చేసుకున్నాడు.

ఒక వైపు రైతులు పిట్టల్లా రాలిపోతుంటే రైతులకు జీవితం పట్ల భరోసా ఇవ్వాల్సిన పాలకులు ఈ ఆత్మహత్యలకు గత పాలకుల విధానాలే కారణమంటూ బాధ్యత నుంచి తప్పించుకునే ప్రయత్నం చేస్తున్నారు. కాని గత పాలకులే ఈ ప్రభుత్వంలో మంత్రులుగా ఉన్నారు. లింబయ్య ఆత్మహత్య పట్ల పాలకులు మాట్లాడుతున్న, వ్యవహరిస్తున్న తీరును ఒకసారి పరిశీలిస్తే సమస్యను పరిష్కరించే కంటే పాలక పక్షం దాని నుండి తప్పుకునే ప్రయత్నం చేయడానికి ప్రభుత్వ అధికారులతో తప్పుడు రిపోర్టులు తయారుచేసి ఆయన చావుకు అప్పులు కారణం కాదు, అనారోగ్యమే అంటున్నారు. విపక్షాలు రాజకీయ లబ్ధికోసం ప్రయత్నం చేస్తున్నాయి. అవి రైతాంగ ఆత్మహత్యలు కావు అని పాలకులు రైతులను అవమానపరిచే వ్యాఖ్యానాలు చేస్తున్నారు.

దేశ వ్యాప్తంగా మరీ ముఖ్యంగా తెలుగు రాష్ట్రాల్లో అందునా తెలంగాణలో పంట చేన్లకు తన రక్త మాంసాలతో జీవం పోసిన రైతులు తమ జీవి తీసుకుంటున్న పరిస్థితి ఉంది. రైతు ఆత్మహత్యల పట్ల సమాజమంతా లోలోపల తల్లడిల్లుతూ కుమిలిపోతోంది. రైతులకు జీవితం పట్ల విశ్వాసాన్ని ఇవ్వాల్సిన పాలకులు 'రోమ్ నగరం తగలబడుతుంటే రాజు ఫిడేలు వాయించినట్లు'గా పాలకులు విదేశీ పర్యటనల్లో మునిగి తేలుతున్నారు.

ఈనాడు వ్యవసాయరంగం ఇంత సంక్షోభాన్ని ఎదుర్కోవడానికి ప్రభుత్వాలు ఆరున్నర దశాబ్దాలుగా అమలు చేసిన విధానాలే కారణం. ప్రధానంగా కేంద్ర ప్రభుత్వం 1991 జూలైలో తెచ్చిన నూతన ఆర్థిక విధానాలు వ్యవసాయ రంగాన్ని తీవ్ర సంక్షోభంలోకి నెట్టాయి. ఈ నూతన ఆర్థిక విధానాలను కేంద్ర ప్రభుత్వం అంతర్జాతీయ ద్రవ్య నిధి, ప్రపంచ బ్యాంక్, అంతర్జాతీయ వాణిజ్య సంస్థల ఒత్తిడి మేరకు అమలు చేసి, బలవంతంగా ప్రజల మీద రుద్దుతున్నాయి. అప్పటి నుంచి విదేశీ పెట్టుబడులు, మనదేశంలోకి విచ్చలవిడిగా వచ్చి స్థానిక వనరులను, స్థానిక వ్యవసాయ ఉత్పత్తులను దెబ్బతీశాయి. అలాగే సంప్రదాయ విత్తనాలపై దాడి చేశాయి. ఈ పెట్టుబడులు ప్రపంచీకరణకు అనుకూలంగా వ్యవసాయ రంగాన్ని మార్చివేశాయి. ఫలితంగా రైతులు అనివార్యంగా బహుళ జాతి కంపనీలు తయారు చేసే వ్యవసాయ ఉత్పత్తులైన విత్తనాలు, ఎరువులపై ఆధారపడవలసి వచ్చింది. ఉమ్మడి వనరు అయిన విత్తనాన్ని సరుకుగా మార్చి మార్కెట్ మయం చేశాయి. అనేక ఇతర విత్తనాల సంస్థలు ఈ వ్యాపారంలోకి వచ్చి, రైతాంగాన్ని భారీగా దోచుకున్నాయి. ప్రధానమైన పంటల విత్తనాల సరఫరాలో విదేశీ కంపెనీల వాటా 30 నుంచి 80 వరకు పెరిగింది. పత్తి విత్తనాల్లో ఒక మాన్‌శాంటో విదేశీ కంపెనీ వాటానే 95 శాతం. బహుళజాతి కంపెనీలు రైతులను నిలువు దోపిడి చేస్తున్నాయి. దీని ఫలితంగా

విత్తనాల, ఎరువుల ఖర్చులు భారీగా పెరిగాయి. వ్యాపార పంటలు పెరిగాయి. రసాయన ఎరువుల వినియోగం భారీగా పెరిగింది. రసాయన ఎరువులు వేస్తేగానీ పంటలు పండే పరిస్థితి లేదు. వాటి కోసం అనివార్యంగా అప్పులు చేయాల్సిన పరిస్థితి వచ్చింది. బ్యాంకుల నుంచి అందుతున్న సహకారం అంతంత మాత్రమే. దీంతో ప్రైవేట్ అప్పుల మీద, సరుకు కొనుగోలు దారుల మీద ఆధారపడాల్సి వస్తోంది. వీరు రైతును అన్ని విదాల ముంచుతున్నారు. విదేశాల్లో ప్రభుత్వాలు రైతులకు ఇచ్చే సబ్సిడీలతో పోల్చిచే మన ప్రభుత్వాలు ఇచ్చే సబ్సిడీలు నామమాత్రమే. ఈ అరకొర సబ్సిడీలతో రైతులు విదేశీ మార్కెట్ పోటీని తట్టుకోలేక పోతున్నారు.

ప్రపంచీకరణ విధానంలో ముఖ్యమైనది ప్రైవేటీకరణ. దీని ఫలితంగా ప్రాథమిక అవసరాలైన విద్యా, వైద్య రంగాల్లో గత ఇరవై ఏళ్లలో ప్రైవేటీకరణ విజృంభించింది. దీని ఫలితంగా ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ప్రభుత్వ హాస్పిటల్స్ ప్రభుత్వ నిరాదరణకు గురి అయ్యాయి. కాబట్టి ప్రజలు ప్రైవేట్ హాస్పిటల్స్‌కు వెళ్లక తప్ప లేదు. ఫలితంగా వైద్యం ఖర్చులకు అత్యధికంగా ఖర్చు చేయవాల్సి వస్తోంది. ఈ ఖరీదైన వైద్యం కోసం ప్రజలు అప్పుల పాలవుతున్నారు. అలాగే ఇదే విధానం విద్యారంగంలోనూ కొనసాగుతుంది. కొనగలిగినోనికే నేడు విద్య దక్కుతుంది. స్థానిక విశ్వవిద్యాలయాలకు వనరులను కేటాయించకుండా, వాటికి వైస్‌చాన్స్‌లర్‌లను, బోధనా సిబ్బందిని నియమించక వాటికవె నిర్వీర్యమయ్యేలా ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నాయి. వాటి స్థానంలో విదేశీ విద్యాలయాలను మనదేశంలోకి అనుమతించాయి. ప్రైవేటీకరణకు అనుకూలమైన విద్యా విధానాన్ని అమలు చేస్తున్నాయి. ఈ విధానాలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అడుగడుగున చేయూతనిచ్చి వాటిని స్థాపించడానికి కావాల్సిన చట్ట సవరణలు చేసి, ఎర్రతీవాతీలు పరిచాయి. అలాగే వాటికి కావాల్సిన రాయితీలిచ్చి వాటి స్థాపన కోసం ప్రోత్సహం అదించాయి.

వ్యవసాయరంలో నెలకొన్న సంక్షోభంపై నివేదిక కోరుతూ ప్రభుత్వం రైతు సంక్షేమ కమిషన్‌ను జయతీఘోష్ అధ్యక్షతన ఏర్పాటు చేసింది. ఈ కమిషన్ వ్యవసాయ రంగంలోని సంక్షోభానికి కారణాలను తెలుపుతూ తన నివేదికను ప్రభుత్వానికి అందజేసింది. ఇందులో రైతాంగ సంక్షోభాన్ని ఏ విదంగా పరిష్కరించాలి? సంక్షోభం ఎందుకు వచ్చింది. అనే విషయాలను కమిషన్ చాలా అధ్యయనం చేసి 'ప్రభుత్వ ఆర్థిక వ్యూహం–ప్రభుత్వం అనుసరిస్తున్న సరళీకరణ, ప్రపంచీకరణ విధానాలు' ఈ సంక్షోభానికి ప్రధాన కారణమని స్పష్టంగా కమిషన్ చెప్పింది. సరళీకరణ, ప్రైవేటీకరణలో భాగంగానే వ్యవసాయ రంగంపై పెడుతున్న పెట్టుబడులను, ఖర్చులను ప్రభుత్వం తగ్గించుకున్నది. అలాగే మరో ముఖ్యమైన కారణమేమంటే రైతులు మార్కెట్‌లో తమ సరుకులను అమ్ముకునే వీలులేకుండా మార్కెట్‌ను సరళీకరించారు. దీనిపై ప్రభుత్వానికి ఏవిధమైన నియంత్రణలు లేవు.

ఇదే దేశంలో పాలకవర్గాల అభివృద్ధి నమూనాకు భిన్నంగా దేశ మధ్య భారతంలో భీజరూపంలో జనతన సర్కార్ ఆధ్వర్యంలో కొనసాగుతున్న ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాలో ఎలాంటి ఆత్మహత్యలే కనిపించవు. అక్కడ ప్రాథమిక ఉత్పత్తి సాధనాలతో వ్యవసాయం చేస్తున్నారు. ఇక్కడ ఉన్నటువంటి మార్కెట్ దోపిడీ, వడ్డీ వ్యాపారుల దోపిడీ అక్కడ ఉండవు. అధిక ధరలకు విత్తనాలు కొనడం ఉండదు. ఈ వివరాలన్నీ అక్కడి నుండి వెలువడుతున్న నివేదికలు, విశ్లేషణలు తెలియజేస్తున్నాయి. అక్కడి ప్రత్యామ్నాయ విధానాలు రైతును బతికించుకుంటూ సమాజ పురోభివృద్ధికి దోహదపడే స్వావలంబన కొనసాగుతున్నది. అక్కడ మరణాలు ప్రభుత్వ పోలీసు బలగాలు ఎన్‌కౌంటర్ పేరుతో చేసే హత్యలు, అత్యాచారాలు తప్పించి తమకు తాము ఆత్మహత్యలకు పాల్పడడం మనకు మచ్చుకైన కనపడవు.

తెలంగాణ ఉద్యమం కోరుకున్నది ఆత్మహత్యలు లేని తెలంగాణ, అణచివేత లేని తెలంగాణ, పౌర ప్రజాస్వామిక హక్కులు ఉన్న తెలంగాణ, ఆంధ్రా పెట్టుబడిదారుల నుంచి విముక్తి కోరిన తెలంగాణ, ప్రపంచ బ్యాంకు అప్పు లేని తెలంగాణను ప్రజలు కోరుకున్నారు. కాని ఆ ఆశలు నెరవేరకపోగా ఆ విధానాలనే అధికారంలోకి వచ్చిన పాలకులు కొనసాగిస్తున్నారు. ప్రజల నమ్మకాలపై, విశ్వాసాలపై, వెనుకబాటుపై, ఇంకా మద్యం మత్తులో ముంచి పాలన కొనసాగిస్తున్న తీరును మనం రోజు చూస్తూనే ఉన్నాం.

లక్ష కోట్లతో నీటి ప్రాజెక్టులు నిర్మిస్తామంటున్న పాలకులు అవి రైతుల కోసమే అయితే రైతులు బతికి ఉండడానికి తగిన నిర్ణయాలు తీసుకోవాలి కదా? అంటే ప్రాజెక్టులన్నీ కార్పొరేట్ శక్తుల కంపెనీల కోసమయినా అయి ఉండాలి, లేదా మళ్లీ తెలంగాణలో రైతుల్ని బలన్మరణాలకు గురిచేసి యంత్రాలతో వ్యవసాయంచేసే దొరల భూములను తడుపడం కోసమైనా అయి ఉండాలి.

రైతులు బలవన్మరణాలకు గురవుతుంటే, అదే వ్యవసాయం పై ఆధారపడి బతుకుతున్న మధ్య దళారీలంతా విలాసవంతమైన జీవితాలను గడుపుతున్నారు. సమాజం రైతులకు ఎంత ధైర్యాన్ని, ఓదార్పును ఇచ్చినా, ఆత్మహత్యల వైపు నుంచి వారి దృష్టిని మరల్చలేక పోతోంది. అంటే పాలకుల విధానాలు రైతాంగాన్ని ఎంత కోలుకోలేని స్థితికి నెట్టివేశాయో దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. ఇప్పటికైనా ప్రభుత్వమే రైతుల ఆత్మహత్యల నిరోదానికి వారికి ఉన్నటువంటి అప్పులకు భరోస పడాలి. తిరిగి వ్యవసాయం చేసుకోవడానికి అవసరమైన ఏర్పాట్లు చేయాలి. రైతును బతికించడానికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేయాలి.

రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు అధికారంలోకి వస్తే రైతుల రుణాలను మాఫీ చేస్తామని హామీని ఇచ్చి నెరవేర్చలేదు. అప్పుల బాద భరించలేక ఆత్మాభిమానంతో కృంగిపోయి రైతులు బలవన్మరణాలకు గురవుతున్నారు. తెలంగాణ ప్రభుత్వం ఇప్పుడు మేల్కొని చావు ఖర్చులు కట్టించే ప్రయత్నంలో ఉంది. ప్రజలు అడగని వాటికి ప్రజల్ని మూడ నమ్మకాల్లో ఉంచడానికి యాదాద్రిలకు, పుష్కరాలకు వేల కోట్లు కేటాయించారు. ప్రజల్ని నిత్యం మత్తులో ఉంచడానికి రాజకీయ నాయకుల క్యాడర్ల ఆద్వర్యంలో మద్యం, కల్తీ కల్లు దుఖాణాలు అందుబాటులో ఉంచాయి. ప్రజల్ని దానికి బానిసల్ని చేసి చంపుతున్న తీరు మన కళ్ల ముందు కనబడుతున్నది.

అటు కేంద్రం ప్రభుత్వం, ఇటు రాష్ట్ర ప్రభుత్వాలు రైతుల ఆత్మహత్యలను గుర్తిస్తున్నది లేదు. సమాజానికి బతుకునిస్తున్న రైతులకు సమాజం అండగా నిలిచి వారిన బతికించుకుంటేనే మనకు బతుకు అనే విషయం గ్రహించాలి. ఈ విషయంపై ప్రభుత్వాలను రైతుల జీవితాలకు హామీ పడేలా చేయాలి.

*(రచయితలు ఎం.ఎ తెలుగు విద్యార్థి, వీక్షణం కరెస్పాండెంట్)* వీ

# సమస్యల సుడిగుండంలో అన్నదాత

***వ్యవసాయ సంక్షోభానికీ రైతు ఆత్మహత్యలకూ పెట్టుబడిదారీ, ఆర్థిక సంస్కరణలే కారణమనీ, పాలకులు వ్యవసాయరంగాన్ని చిన్నచూపు చూస్తూ దాన్ని సంక్షోభంలోకి నెట్టివేస్తున్నారనీ అంటున్నారు* విద్యాభూషణ్**

ఇటీవల పెరుగుతున్న నిత్యావసర వస్తువుల ధరలను పరికిస్తే ఇది అంతం కాదు ఆరంభం మాత్రమే అనిపిస్తుంది. ఎందుకంటే సేద్యం పట్ల పాలక వర్గాల విధివిధానాల ధోరణుల ఫలితమే ఇది అని చెప్పక తప్పదు. సంస్కరణల విధానాల్లోనే సేద్యాన్ని అటకెక్కించేయా లన్న లక్ష్యం స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. నూటికి డెబ్బై శాతం వరకూ జీవనాధారమైన సేద్యాన్ని అటకెక్కించేందుకు ప్రభుత్వాలు సాహసించలేక క్రమానుగతంగా నెమ్మది నెమ్మదిగా, కాస్తా మాటల గారడితో వారి విధానాల అమలు ఫలితం ఇది. ఈ నాటికీ సేద్య ధర, జన శాతం 57 శాతానికి తగ్గి, సేద్య విస్తీర్ణం 30 శాతం తగ్గిందని ఓ అంచనా. అయినా రుణదాత శాంతించడం లేదు. 25 ఏళ్ల సంస్కరణల అమలు ఫలితాలు అనుకున్నంతగా లేవు. ఇంకా ఈ విధానాల అమలు తీవ్రతను పెంచి జనాలను బిచ్చగాళ్లను చేయాల్సి ఉందని ఆదేశిస్తూనే ఉన్నారు. ఫలితంగా పార్టీలతో ప్రమేయం లేకుండానే, అన్ని పార్టీల విధి విధానాలు ఒకేలా ఉంటున్నాయి. అభివృద్ధి తారక మంత్రంతో రుణదాత ఎజెండాను తలకెత్తుకుంటూనే ఉన్నారు. ఫలితంగా రుణ ధర్మాలే మారిపోయేటంతగా వాతావరణం కలుషితం అయిపోయింది. నైరుతి రుతువులు విశేషంగా విజృంభించాల్సిన ఆగస్టు మాసంలో సైతం చినుకు కోసం రైతు ఎదురుచూడాల్సిన పరిస్థితి. పొరపాటున ఏ అల్పపీడనమో తలెత్తితేకాని వర్షం కురవని పరిస్థితి. ఉన్న కొద్దిపాటి భూమిని సేద్యానికి సిద్ధం చేసి, నాట్లు వేసిన రైతుకు చినుకు రాలక బీటలు వారిన నేల తీవ్ర గుండెకోతనే మిగిలిస్తున్న అనుభవం మనది. ఆ తర్వాత రైతును ఆదుకోవాల్సిన పాలక వర్గాలు ఆదుకోకుండా, మొత్తం వారు సేద్యాన్నే వదిలేసుకునేలా చర్యలు చేపడుతున్నారు.

గతంలో గ్రామీణ రైతు తనకున్న చారెడు నేలను ఆరుకాలం పండిస్తూ, ఇంటిల్లిపాది ఆనందంగా బతికిన అనుభవాలను చూశాం. ఉన్న కొద్దిపాటి నేలలోనే నారుమళ్లు వేసుకుని, కాస్తా నేలలో కాయగూరలను పండించుకొని మిశ్రమ సేద్యంలో ఒకేసారి రెండు మూడు ఉత్పత్తులను పండించిన సందర్భాలనూ చూశాం. ఆపై తన ఉత్పత్తి నుంచే మెరుగైన ధాన్యాలను సేకరించి విత్తనాలుగా భద్రపరిచిన ఆనవాయితీ సైతం ఉండేది. సంస్కరణల మొదటి ప్రభావం ఈ సంప్రదాయ విత్తన వ్యవస్థను మాన్‌శాంటో విత్తనాలతో దెబ్బతీసింది. జన్యుపర బిటి విత్తన వ్యవస్థ విస్తరించింది ఈ ప్రభుత్వాల ప్రోద్బలంతోనే. చివరికీ ప్రభుత్వాలు 'విత్తనాల బిల్లు'ను ప్రవేశ పెట్టేందుకు సైతం సాహసించేరు.

ఇదే క్రమంలో సేద్యపు వైఫల్యానికి వాస్తవ కారణాలను పరిగణనలోకి తీసుకోకుండా, సేద్యమే లాభదాయకం కాదనే ప్రవచనాలకు ఒడిగట్టుతోంది. పోనీ ఇదే వాస్తవమనుకుంటే, ఆచరణలో సేద్యం చేస్తున్న రైతే నష్టపోవడాన్ని చూస్తున్నాం. కానీ వ్యవసాయానుబంధ వర్తక వాణిజ్యదారులంతా లాభపడుతునే ఉన్నారు. మండల వ్యాపారులు విత్తన, ఎరువుల వ్యాపారులూ కోట్లకు పడగలెత్తుతూనే ఉన్నారు. రైతు మాత్రం పెట్టిన పెట్టుబడి రాక ఆత్మహత్యలకు పాల్పడుతున్నాడు. కారణం నకిలీ మందులు, విత్తనాలు, ఎరువులతో వ్యాపారులు రైతు నడ్డి విరగ్గొడు తున్నారు. పాలకులకు కావాల్సింది ఇదే కనుక ఆనందంగా వినోదాన్ని చూస్తున్నారు. ముందు నుంచీ చెపుతూనే ఉన్నాంగా సేద్యం లాభదాయకం కాదనే వారి వాదనను బలపరుచుకుంటున్నారు.

మార్కెట్ కల్చర్ వెల్లివిరుస్తున్న వేళ, బ్యాంకులు రుణ మేళాలతో పబ్బం గడుపుకుంటున్నా, సేద్యానికి మాత్రం రుణం అందించడం లేదు. వినిమయ విలాస వస్తువులకు కోరీ కోరకుండా రుణాలు ఇస్తూ, సేద్యానికి మాత్రం మొండి చెయ్యి చూపిస్తున్నాయి. పరిశ్రమాధిపతులకు, కార్పొరేట్ రంగానికి వేలాది కోట్ల రూపాయలను రుణాలుగా అందిస్తున్నాయి. ఈ రంగాలకు చెందిన పెద్ద మనుషులు ఎగవేసిన మొండి బాకీలు లక్షల కోట్లకు చేరినా ఇదే వరస. సుమారు 70 శాతం వరకూ ఉన్న రైతాంగానికి బ్యాంకులు అందించిన రుణం మాత్రం 27 శాతమే. పాలకుల పరిభాషలో చెప్పాలంటే, దేశంలో పది కోట్ల వ్యవసాయ కుటుంబాలుంటే కేవలం నాలుగున్నర కోట్ల మందికి మాత్రమే బ్యాంకులు రుణాలు ఇచ్చాయి. దీంట్లో గ్రామీణ భూస్వామ్య నేతలు ఎంత మందో? పేద కుటుంబాల భూ పత్రాలను, పట్టాలను గ్రామ పెద్ద మనుషులు (సర్పంచ్‌లు వగైరాలు) బ్యాంకుల్లో ఆసరాగా చూపి తీసుకున్న అక్రమ రుణాలు సైతం ఈ 27 శాతాల్లోకే వస్తాయి. ఇటీవల ఓట్ల జాతరలో నేతలు ఇచ్చిన 'వ్యవసాయ రుణాల రద్దు' అనే హామీలు అధికారంలోకి వచ్చాక ఎన్ని వెర్రి తలలు వేస్తున్నది ఆచరణలో చూస్తున్నాం. ఈ తరహా వ్యవసాయ రుణ ప్రహసనంలో వాస్తవంగా అవసర రీత్యా రుణం పొందిన సన్నకారు రైతాంగాని కంటే, నేతల వాగ్దానాలతో బాగుపడింది దళారీ భూస్వామ్య శక్తులే. వాస్తవ రైతు మాత్రం రుణ మాఫీ కోసం ఎదురుచూడాల్సిందే. మరోవైపు బ్యాంకుల నుంచి అందాల్సిన రుణ సహాయం అందని కారణంగా, చిన్న – సన్నకారు రైతాంగం విధిలేక ప్రైవేట్ వడ్డీ వ్యాపారులను ఆశ్రయించాల్సి వస్తుంది. తదుపరి కలిసిరాని సేద్యం, పెరిగిపోయిన రుణభారం కలిసి రైతును ఆత్మహత్యలకు పురిగొల్పుతున్నాయి.

మనది ప్రజాస్వామ్య వ్యవస్థ అని చెప్పుకుంటున్న దృష్ట్యా, మెజార్టీ నిర్ణయానికి మైనార్టీ కట్టుబడి ఉండాలి కదా! జనాభాలో సుమారు 70 శాతంగా ఉంటున్న రైతాంగ అభివృద్ధికి పాలకులు కట్టుబడి విధి విధానాలు రూపొందించాలి. అలా అయితేనే వ్యవసాయాదాయం పెరిగి ప్రజల కొనుగోలు శక్తి పెరిగి, పారిశ్రామిక ఉత్పత్తులకు, సేవా

ఉత్పత్తులకు డిమాండ్ పెరిగి, ఆయా రంగాలు 'అభివృద్ధి' చెంది ఆర్థిక వ్యవస్థే మెరుగవుతుంది. అయితే ఇది కాదు కదా పాలకులకు కావాల్సింది. చిత్తశుద్ధితో దేశం అభివృద్ధిని కాంక్షించిన పార్టీలైతే ఈ విధి విధానాన్నే చేపడతాయి. ఇవి దళారీ ప్రభుత్వాలు కదా. దళారీలెప్పుడూ 'పరాధీనత'కే పెద్దపీట వేస్తారు. రుణ దాతకు సర్వ శక్తులూ వొడ్డి రుణాన్ని సంపాదించి కార్పొరేట్ వ్యవస్థను వేళ్లూనుకునేలా చేయడమే నేటి రాజకీయం. చిన్న-సన్నకారు రైతాంగాన్ని, వ్యవసాయం నుంచి దూరం చేసి, వారి భూముల్ని కార్పొరేట్ శక్తుల పరం చేసి, వ్యవసాయాన్ని కార్పొరేటీకరణ చేయడమే పాలకుల లక్ష్యం. అందుకే ఈ తరహా ఆచరణ ప్రణాళికల్లో, బడ్జెట్‌లో వ్యవసాయ రంగానికి కేటాయింపులను పెంచుతున్నామని చెప్పి పెంచుతూ పెంచిన మొత్తాలను నీటిపారుదల ప్రాజెక్టులకు కేటాయిస్తున్నారు. సేద్యానికి కేటాయింపులు పెరగకపోగా, వాస్తవంగా తగ్గుముఖం పదుతున్నాయి. సాగునీటి అవసరాలకై అలవికాని ప్రాజెక్టులను ప్రకటించేసి, అవసర కేటాయింపులు కొరవడి, దశాబ్దాల మేరకు పథకాలు కొనసాగుతూనే ఉంటాయి. ఈ పథకాల మూలంగా బాగుపడడం పోయి నిర్వాసితులైన ఆదివాసులు, పేదలు బతుకుదెరువుకై రోడ్డున పడాల్సి వస్తున్నది. నిర్వాసితుల పునరావాసం ఏ మేరకన్నది మనకు తెలిసిందే కదా! మరోవైపు కాంట్రాక్టు వ్యవస్థ వేళ్లూనుకుని విరాజిల్లుతూనే ఉంటుంది. నిర్వాసితులు తమ నేలలో తామే కూలీలుగా బతుకు వెళ్లదీస్తున్నారు.

సంస్కరణల ఆవిర్భావానికి ముందు గ్రామీణ రైతాంగం ఎంతో సమిష్టిగా సేద్యాన్ని నెరపుతూ తమదైన గ్రామీణ జీవన వికాసాన్ని ఆచరణలో చూపారు. భూసారాన్ని బట్టి వరి వంగడాలను నిర్ణయిస్తూ ఉన్న కొద్దిపాటి నేలను సేద్యం చేస్తూ, అర-కొరగానైనా కుటుంబ అవసరాలను అదిగమించేవారు. గత శతాబ్దపు 80వ దశకం వరకూ మనకీ పరిస్థితే కనిపించేది. సేంద్రియ ఎరువుల వినియోగం, స్వయంగా తయారు చేసుకున్న గ్యారంటీ విత్తనాల వినియోగం అందుబాటులో ఉన్న సహజ జలవనరులను, సహజ న్యాయం మేరకు వినియోగించు కుంటూ, సమిష్టి భావనతో సేద్యాన్ని నెరపేవారు. సంస్కరణలు అడుగుపెట్టి ప్రభుత్వ రుణ చెల్లింపులకు హామీగా, ప్రభుత్వ రాయితీలను నియంత్రించాలనే లక్ష్యంతో, తప్పుడు విధి విధానాలతో 'వంచన'నే అధికారంగా చేపట్టడం మొదలైంది.

సాగునీటి పథకాలను చూశాం. పాతవి దశాబ్దాలుగా కొనసాగు తున్నా, రోజుకో కొత్త పథకం పుట్టుకొస్తూనే ఉంటుంది. దేశంలో రాష్ట్రాల మధ్యే జలకలహాలు ఉత్పన్నమయ్యే పరిస్థితి. మరోవైపు జల వనరులు ఆవిరయ్యే పరిస్థితి-ప్రకృతి ప్రకోపించిన కారణంగా ప్రకృతి తన సహజ లక్షణాలను కోల్పోయేలా పర్యావరణ వినాశనం, 'అభివృద్ధి' మాటున నిలదీసే శక్తిని మట్టుబెట్టే యత్నంగా నకిలీ 'అభివృద్ధి' వెంపర్లాట - రహదారుల నిర్మాణంకై అడవుల నరికివేత. మరోవైపు చెట్లునాటే కార్యక్రమం - చినుకును ఆహ్వానిస్తూ ఈ ప్రహసనమంతా ఓ కంటి తుడుపు చర్యగానే, వంచనలో భాగంగానే జరుగుతున్నది.

రైతాంగాన్ని శాంత పరచడానికి ఉచిత విద్యుత్తు అని పిలుపునిస్తూ, కెపాసిటర్లను బిగిస్తేనేనని ముక్తాయింపు. అంటే ఒ చేత్తో ఇస్తూనే మరో చేత్తో లాగేసుకోవడం. రేపు మీ భూమి విస్తారాన్ని బట్టి ఇంత విద్యుత్ అయితే సిరిపోతుందనే లెక్కల కోసం అన్నమాట ఈ కెపాసిటర్లు. ఇప్పుడే చూస్తున్నాం ఒకరు ఏడు గంటల సరఫరా అంటే, మరో పార్టీ రోజుకి తొమ్మిది గంటల విద్యుత్ సరఫరా అంటుంటారు. ఈ ఠికాణా లేని విద్యుత్ సరఫరాలో రైతు సేద్య దాహార్తిని తీర్చేందుకై అర్ధరాత్రి - అపరాత్రనకుండా పడిగాపులు పడి-విద్యుత్ ఘాతానికి-కడకు పాములు, విష పురుగుల బారిన పడి ప్రాణాలు పోగొట్టుకున్న ఘటనలు కోకొల్లలు. ఇదీ ప్రభుత్వ ప్రోత్సాహమే!

1960వ దశకంలో ప్రారంభించిన సస్య విప్లవానికి కాలం చెల్లింది. ఈ సస్య విప్లవ ఫలితంగా పురుగు మందులు, రసాయన ఎరువుల వినియోగం పెరిగి ఉత్పత్తి ఖర్చు పెరిగిపోయింది. పైగా ఈ రసాయన వినియోగం భూ ఉత్పాదక శక్తిని హరించి వేస్తూ వచ్చింది. భూసారం క్షీణించడం మొదలైంది. చిన్న-సన్నకారు రైతుల్లో కుటుంబం యావత్తూ వారి భూ వసతిని సేద్యం చేసుకోగలిగితే సుభిక్షంగా ఉన్న స్థితి రానురాను తీసికట్టుగా తయారయింది. వ్యయం పెరిగిపోయి, ఉత్పత్తి తగ్గిపోవడం అనుభవమైంది. 'సంస్కరణలు' అడుగిడడంతో ఈ సేద్యం మరింత భారమై సేద్య విస్తీర్ణం తగ్గిపోవడం మొదలయింది. 1989-90లో నికరంగా సేద్యం విస్తీర్ణం 110 లక్షల హెక్టార్లు ఉంటే 1997-98 నాటికి (సంస్కరణల ఏడెనిమిదేళ్ల వయస్సు నాటికి) 99 లక్షల హెక్టార్లయింది. ఈ రోజుకి సేద్యపు విస్తీర్ణం 30 శాతం తగ్గగా, రైతాంగ శాతం 70 నుంచి 57 శాతానికి తగ్గిందని అంచనాలు వెల్లడిస్తున్నాయి. ఈ రకంగా 'సేద్యం' భారమై కుదించుకుపోతూ, రేపటి 'ఆహార భద్రత'ను ఏ స్థాయిలో ఎదుర్కోనుందన్నది ఓ శేష ప్రశ్న.

ప్రభుత్వమే రైతాంగాన్ని ఆహారేతర సేద్యానికి మళ్లించడం మనం చూస్తూనే ఉన్నాం. ఆహారధాన్యాల కన్నా, పూలు - పండ్లు వంటివి పండిస్తే ఆదాయం ఎక్కువవుతుందని ఎరచూపి దారి మళ్లించడం కూడా కుట్రే. ఈ తరహాలో బేజారవుతున్న చిన్న - సన్నకారు రైతాంగాన్ని కార్పొరేట్ సెక్టార్ ఆక్రమించి ఆగ్రో ప్రోసెసింగ్ పేరిట ఎగుమతులకు అవసరమయ్యే పంటలను కాంట్రాక్టు పద్ధతిన చేపట్టడం జరుగుతుంది. ముందు ముందు ఇది ఇంకా విస్తారమయ్యే అవకాశం ఉంది.

రైతు నేడు ఎదుర్కొంటున్న మరో ప్రధాన సమస్య 'ధరలు'. రైతు తన ఉత్పత్తిని అమ్ముకోవడం అంటే 'అమ్మబోతే అడవి-కొనబోతే కొరివి' అన్న సామెత అక్షరాలా వర్తిస్తుంది. ఈరోజున మనం కిలో బియ్యం 50 రూపాయలకు కొంటున్నామంటే, రైతుకు లభ్యమయ్యేది వంద కిలోల ధాన్యానికి 1250 రూపాయలు లేదా 1300 రూపాయలు మాత్రమే. అంటే వంద కిలోల బియ్యానికి రైతుకు ముట్టేది 2600 రూపాయలే. మరి అమ్మకం ధర ఐదు వేలలో మిగతాదంతా దళారులు, మిల్లర్లు, లంచగొండి అధికార్లు మింగేస్తున్నారు. ప్రభుత్వ ధాన్య సేకరణ ధర సైతం ఇంతకన్నా ఎక్కువగా ఏమీ ఉండదు. అయినా పంట చేతికి వచ్చిన వెంటనే చిన్నా-సన్నకారు రైతులు తమకు అప్పిచ్చిన షావుకార్లకు ముందు కుదుర్చుకున్న ఒప్పందం మేరకు అమ్ముకోవాలి. వాళ్లు మార్కెట్ ధర పెరిగే వరకూ నిల్వ ఉంచుకుని మార్కెట్లో ధర పెరిగినంక అమ్ముకుని లాభపడడం జరుగుతుంది. ఈ ప్రభుత్వ 'గిట్టుబాటు' ధర సైతం ఢిల్లీలో కూర్చున్న ఓ అధికారి నిర్ణయిస్తాడు. వాడికి సేద్యపు ఓనమాలు కానీ, కష్ట సుఖాలు కానీ ఏమీ తెలియవు. గత సంవత్సరపు గిట్టుబాటు ధరమీద ఓ పదో-పరకో పెంచేసి ప్రకటిస్తాడు. అసలీ రేటు నిర్ణయంలోనే రైతుకు అన్యాయం జరుగుతూ ఉంది. సాధారణంగా ఏ ఉత్పత్తికైనా ఆ ఉత్పత్తి దారుడే తన సరుకు అమ్మకం ధరను నిర్ణయిస్తాడు. ఇక్కడ ఏమీ తెలియని ఓ ప్రభుత్వ అధికారి నిర్ణయిస్తాడు. ఇదీ వింతల్లోకెల్లా వింత!

చరిత్ర పరంగా చూస్తే, అడవుల మీద, పోరంబోకుల మీద గ్రామాలకున్న అధికారాన్ని శాశ్వత శిస్తు విధానం మింగేసింది. ఈ

# పాలకుల ద్వంద్వ ప్రమాణాలు

***పాలకులు దేశ సహజ వనరులను కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టడాన్ని వ్యతిరేకిస్తూ ప్రజలు పోరాడి నిలబెట్టుకున్న వాటిని కూడా దొడ్డిదారిన తిరిగి వారికే కట్టబెడుతున్న తీరును వివరిస్తున్నారు రాజేంద్రబాబు అర్విణి***

*తామే భువికధినాయకులమని,*
*స్థాపించిన సామ్రాజ్యాలు*
*నిర్మించిన కృత్రిమ చట్టాల్*
*ఇతరేతర శక్తులు లేస్తే*
*పడిపోయెను పేకమేడలై! — శ్రీశ్రీ*

'ప్రజలకే పట్టం... ఎందుకంటే ప్రజలు ఎల్లప్పుడు శాంతినే కాంక్షిస్తారు' అని ఒక లాటిన్ అమెరికన్ కవి తన పాటలో గానం చేస్తాడు. అది ఎన్‌డిఎ ప్రభుత్వమైతేనేమి, అందులో భాగమైన తెలుగుదేశం కానివ్వండి లేదా అధికారికంగా పాలు పంచుకోకపోయినా అన్యాపదేశంగా కేంద్ర ప్రభుత్వ విధానాలను సమర్థించే తెలంగాణ రాష్ట్ర సమితి అవనివ్వండి, ఏ ప్రభుత్వమైనా సరే ప్రజాభిప్రాయం ముందు తలవంచాల్సిందే!

రాచరిక వ్యవస్థలోనే ప్రజల మద్దతులేని పరిపాలనా పద్ధతులను పట్టుకొని వేళ్లాడినందువల్ల రాజ్యాల, రాజరికాలు కూలిపోయిన సంఘటనలు మనం చరిత్రలో చదివాం, విన్నాం. చూశాం కూడా. ఇక ప్రజాస్వామ్యంలో నయితే ప్రజల సమ్మతి లేకుండా, ప్రజా శ్రేయస్సుకు వ్యతిరేకంగా చేపట్టిన పనిని కొనసాగించడం పలు అనర్థాలకు దారి తీస్తుంది. అలాంటి విధానాలను ప్రజలకు ఇష్టం లేకపోయినా కొనసాగిస్తే ప్రభుత్వ పతనం మాత్రమే కాదు, సమాజంలోనే అశాంతి ప్రబలిపోయి అవాంఛనీయ పరిణామాలు సంభవించే ప్రమాదం ఉంటుంది.

ఇటీవలి కాలంలో కేంద్రంలోను, రెండు తెలుగు రాష్ట్రాలలో జరిగిన ఒకటి రెండు సంఘటనలను నెమరు వేసుకుంటే ప్రభుత్వాలు అవలంభించే దుస్సాహస విధానాలను ప్రజాభిప్రాయం ఎలా అడ్డుకుంటుందో అవగతమవుతుంది.

**భూసేకరణ, భూమి సమీకరణ యత్నాలు**

ఈ దేశంలో భూ సమస్య ప్రధాన సమస్య. సగం కంటె ఎక్కువ మంది శ్రామికులు తమ జీవనాధారం కోసం భూమి మీదనే ఆధారపడతారు. వ్యవసాయ రంగమే వారి బతుకు దెరువు. భూ సమస్య ముందుకు వచ్చినప్పుడు వ్యవసాయంతో సంబంధం ఉన్న వర్గాలలో మాత్రమే కాకుండా, ఇతర వర్గాలలోను ముఖ్యంగా సమాజపు బాగు కాంక్షించే మేధావి వర్గంలో తీవ్రమయిన చర్చ జరుగుతుంది.

పారిశ్రామికాభివృద్ధి పేరుతో లక్షలాది ఎకరాల భూమిని బహుళజాతి సంస్థలకు కట్టబెట్టే ప్రయత్నం జరిగిన ప్రతిసారీ దేశ వ్యాప్తంగా నిరసన కార్యక్రమాలు తీవ్రరూపం దాల్చాయి. భూసేకరణను క్రమబద్ధీకరించే ప్రయత్నం మొట్ట మొదట బెంగాలులో 1824లో జరిగింది. ఆ తర్వాత క్రమంలో గ్రామ యాజమాన్యం పోయి వ్యక్తి యాజమాన్యం వచ్చింది. దీంతో క్రయ విక్రయాలకు మార్గం సుగమం అయింది. పెట్టుబడిదారీ వ్యవస్థలో విస్తృతాభివృద్ధికి భూమి ప్రధాన వనరైంది. అభివృద్ధి చెందిన దేశాల్లో భూ లభ్యత సుమారుగా మృగ్యమైపోయింది. ఇక వెనుకపడ్డ దేశాల మీద ఆధారపడాల్సి వచ్చింది. వాటికి 'అభివృద్ధి చెందుతున్న దేశాలనే' లేబుల్ తగిలించి, పారిశ్రామికాభివృద్ధి పేరిట రుణాలను ఆశచూపి, దళారీ పాలకుల ద్వారానే భూకబ్జా మొదలైంది. దీంతో ప్రతీచిన్న అవసరానికి వందల-వేల ఎకరాల్లో భూ కేటాయింపులు వారి వారి తాబేదార్లకు, అదీ 'పారిశ్రామికాభివృద్ధి' పేరిట ఇప్పుడు ప్రభుత్వ భూములయిపోగా, వ్యక్తుల భూములను కాజేసేందుకు 'భూ సేకరణ' చట్టాలు అవసరమయ్యాయి ఈ భూబకాసురులకు. వంద కోట్లు వెచ్చించినా అమెరికాలో ఓ ఎకరం భూమి దొరకడం కష్ట సాధ్యమే. అదే ఇక్కడైతే వేల ఎకరాలొస్తాయి. అందుకే వ్యక్తిగత సేద్యపు భూములకు తక్షణ మార్కెట్ రేటుకన్నా నాలుగైదు రెట్లు ఎక్కువ ఆశచూపి, భూములను లాగేసుకునే యత్నం చేస్తున్నారు పాలకులు. భూమి ఓ మారకపు వనరైంది. రైతు చదువురాని అజ్ఞానుడనే భావన ఉంది పాలకుల్లో. కాని చైతన్యరహితుడు కాదు. ఎందుకంటే?

1855-56లలో ఆంగ్ల ప్రభుత్వం మీద 'తిరుగుబాటు' జెండా ఎగురవేసింది సంతాల్ గిరిజన రైతులే. భారత జాతీయోద్యమ క్రమంలో ఈ రైతులు రాజకీయ చైతన్యం పొందారు. 1917-18లలో నీలిమందు రైతు సత్యాగ్రహ ఉద్యమం, 1921-22లలో పన్నుల నిరాకరణోద్యమం, 1922లో మోప్లా రైతుల తిరుగుబాటు. కొనసాగింపుగా కన్నెగంటి హనుమంతు పుల్లరి పోరాటం, 1922-24ల మధ్య అల్లూరి నాయకత్వాన 'మన్యం' పోరాటం జగత్ ప్రసిద్ధం. 1920 దశాబ్దంలో జమీందారీ వ్యతిరేక పోరాటాలు సాగి రైతు సంఘాలు ఏర్పడ్డాయి. 1937-38లలో ఆంధ్ర రైతు రక్షణ యాత్ర సాగింది. 1939-40 సంవత్సరంలో చల్లపల్లి జమీందారీ వ్యతిరేక పోరాటం సాగింది. 1946-48ల మధ్య తెలంగాణ రైతాంగ పోరాటం, 1969 నుంచి నక్సల్బరీ ఉద్యమం చరిత్రలో రైతాంగ చైతన్యానికి ప్రతీకలు.

వీటి స్ఫూర్తితోనే ఈనాటి వరకూ నమోదైన రైతుల ఆత్మహత్యల పరంపరను నిలపాల్సి ఉంది. ఇందుకు ప్రధాన కారణాలైన సరళీకృత ఆర్థిక విధానాలను, గాట్ ఒప్పందాలను రైతులకు విప్పి చెప్పి చైతన్య పరచాల్సి ఉంది. రైతన్న చైతన్యానికి ప్రతీకలైన పై పోరాటాలను విడమర్చాల్సి ఉంది. అందుకు రైతు సంఘాలే కాదు, సర్వ ప్రజానీకం సంసిద్ధం కావాలి. ఇదో తక్షణ అవసరం! సామాజిక బాధ్యత!!

*(రచయిత పాత్రికేయులు)* వీ

మద్రాసు, బొంబాయి రాష్ట్రాలు ఇంకాస్త ముందుకు తీసుకెళ్లాయి. చివరికి దేశం మొత్తం మీద అమలయ్యేటట్లుగా 1894లో భూసేకరణ చట్టం అమలులోకి వచ్చింది. 1894లో బ్రిటిష్ ప్రభుత్వం చట్టబద్ధం చేసిన నిబంధనలో ప్రభుత్వ సంస్థల నుండి, వ్యక్తుల నుండి ప్రజోపయోగం కోసం ప్రభుత్వం భూమిని సేకరించవచ్చునని స్పష్టంగా ఉంది. ప్రజల ప్రయోజనం కోసం అంటే కూడా నిర్వచనం ఇచ్చారు. స్కూళ్లు, కాలేజీలు, యూనివర్సిటీలు ఏర్పాటు చేయడం, గ్రామీణ ప్రణాళికల అమలు, గృహ నిర్మాణం, ప్రభుత్వ కార్యాలయాల ఏర్పాటు, ఆరోగ్య పరిరక్షణ లేదా మురికి వాడల నిర్మూలన లాంటివి ప్రజా ప్రయోజనాలు దీనికి భిన్నంగా బ్రిటిష్ ప్రభుత్వం, దేశీయ ప్రభుత్వం కొన్ని మార్పులు చేయబోతే ప్రజలు ఉద్యమాల ద్వారా అడ్డుకున్నారు. 1914 నుండి 2007 వరకు ఎన్నో పోరాటాల ఫలితంగా ఎన్నో సవరణలు జరిగాయి. ఎన్ని సవరణలు జరిగినా 1894 చట్టం ప్రాథమిక స్వభావం మాత్రం మారలేదు.

కాని గత రెండున్నర దశాబ్దాల నుండి నూతన సరళీకరణ, మార్కెట్ కేంద్రంగా రూపొందుతున్న ప్రభుత్వ ఆర్థిక విధానాల మూలంగా ప్రభుత్వ, ప్రైవేట్ అవసరాల నిమిత్తం భూసేకరణ పెద్ద ఎత్తున అవసరమయింది. భూమిని సేకరించేందుకు ప్రభుత్వం అవలంభిస్తున్న పద్ధతిని నిరసిస్తూ దేశ వ్యాప్తంగా నిరసన జ్వాలలు మిన్ను ముట్టాయి. వాటికి తలొగ్గి, యుపిఎ-2 ప్రభుత్వం 1894 చట్టం స్థానంలో భూసేకరణ, పునరావాసం, పునఃపరిష్కారంలో న్యాయబద్ధ పరిహారం, పారదర్శక చట్టం -2013 ప్రవేశ పెట్టింది. ఈ చట్టంలో ప్రభుత్వ అవసరాల కోసం, ప్రభుత్వ - ప్రైవేట్ భాగస్వామ్యంలో పథకాలు', ప్రైవేట్ అవసరాల కోసం భూసేకరణ అవసరమని తేల్చారు.

పెరుగుతున్న పారిశ్రామికీకరణ, పట్టణీకరణ అవసరాల రీత్యా ప్రైవేట్ కంపెనీల కోసం కూడా భూసేకరణ అనివార్యమని ప్రకటించారు. అయితే, అంతకు ముందు కూడా చాలా సందర్భాలలో అత్యవసర నిబంధన కింద ప్రైవేట్ కంపెనీల కోసం భూమి సేకరించి కేటాయించిన ఉదాహరణలు కోకొల్లలు. 2005లో వచ్చిన ప్రత్యేక ఆర్థిక మండళ్ల చట్టం ఆధారంగా ప్రైవేట్ సంస్థల కోసం కొన్ని వేల ఎకరాల భూమిని సేకరించారు. దానికి ప్రతిఘటన కూడా తీవ్ర స్థాయిలోనే చవి చూశారు.

2013 నాటి చట్టంలోని ఒప్పంద నిబంధన గురించి ప్రత్యేకంగా పేర్కొనాలి. ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్యంలో స్థాపించబోయే సంస్థల కోసం జరపబోయే భూసేకరణలో దానివల్ల ప్రభావితమయ్యే కుటుంబాలలో 70 శాతం కుటుంబాలు సమ్మతిస్తేనే భూసేకరణ జరపాలి. అదే ప్రైవేట్ సంస్థల కోసం అయితే 80 శాతం ప్రభావిత కుటుంబాలు ఒప్పుకోవలసి ఉంటుంది. సాగునీటి వసతి కలిగిన భూములు, సంవత్సరంలో ఒకటి కంటె ఎక్కువ పంటలు పండే భూముల విషయంలో నిబంధనలు ఇంకా కఠిన తరంగా ఉన్నాయి. తప్పనిసరి అయితేనే అలాంటి భూములను తీసుకోవాలి. అదీ దానికి ప్రతిగా అంతే వీలుగల భూమిని అభివృద్ధి పరిచి ఇచ్చిన తర్వాతనే! కాని, సేకరిస్తున్న భూమి మార్కెట్ ధర నిర్ధారించే అధికారం ఏకపక్షంగా ఉందన్న విమర్శకు ఈ చట్టంలో జవాబు లేదు.

గ్రామీణ ప్రాంతాల్లో మార్కెట్ విలువకన్నా నాలుగు రెట్లు, పట్టణ ప్రాంతాల్లో మార్కెట్ విలువ కన్నా రెండు రెట్లు ఎక్కువ పరిహారం చెల్లించాల్సి ఉంటుంది. మరొక సానుకూల అంశం ఏమిటంటే భూసేకరణకు ముందు ఆ ప్రాజెక్టు వల్ల ఆ ప్రాంతంలో సంభవించబోయే పరిణామాలపై సామాజిక ప్రభావ అధ్యయనం జరగడం ఈ చట్టం ప్రకారం తప్పనిసరి.

వ్యాపార, వాణిజ్య వర్గాలు ఈ చట్టాన్ని వ్యతిరేకించాయి. ఇది అభివృద్ధి కేంద్రంగా కాకుండా హక్కుల పరిరక్షణకే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చిందని విమర్శను ఎక్కుపెట్టాయి. సామాజిక ప్రభావ అధ్యయన నివేదిక నిబంధనను తీవ్రమయిన పదజాలంతో తప్పుపట్టాయి. సాలీనా ఒకటి కంటె ఎక్కువ పంటలు పండే ప్రాంతాలలో 5 శాతం కంటె ఎక్కువ భూమి సేకరించరాదని, ఒక పంట పండే పొలాలయితే 10 శాతం వరకు సేకరించవచ్చునన్న నిబంధన పట్ల కూడా పారిశ్రామిక వర్గాలు అసంతృప్తి వ్యక్తపరిచాయి. మొత్తం మీద ఈ చట్టం వల్ల కోర్టు వివాదాలకు అవకాశం ఎక్కువ అని, ఇది పారిశ్రామిక ప్రగతి అడ్డుపుల్ల వంటిదని వాణిజ్య వర్గాలు ఆరోపించాయి.

2014లో ఎన్‌డిఎ ప్రభుత్వం కొలువు తీరిన తరువాత దేశంలో కార్పొరేట్ శక్తులు విజృంభించి లాబీయింగ్ ద్వారా ఈ చట్టంలో మార్పు తేవాలని ప్రయత్నాలు ముమ్మరం చేశాయి. కార్పొరేట్ వర్గాలకు, పారిశ్రామిక వర్గాలకు అనుకూలమైన పార్టీ బిజెపి నాయకత్వంలోని ప్రభుత్వం 2013 చట్టానికి ప్రైవేట్ రంగానికి అనుకూలమైన సవరణలు చేస్తూ 2014 డిసెంబర్ 29న ఆర్డినెన్స్ జారీ చేసింది. భూసేకరణ వల్ల నష్టపోయే కుటుంబాల ఇబ్బందులను, కష్టాలను, వారి జీవనోపాధిని బేఖాతర్ చేస్తూ జారీ చేసిన ఆర్డినెన్స్ ఇది. హోటళ్లను కూడా ప్రజా ప్రయోజనం పరిధిలోకి తీసుకువచ్చిన ఆర్డినెన్స్ ఇది. ఈ ఆర్డినెన్స్ ప్రైవేట్ వ్యవస్థ సైతం భూసేకరణ చేయడానికి వీలు కలిగిస్తుంది. భూసేకరణ వల్ల నష్టపోయిన రైతు తన వాదనను, అభ్యర్థనలను విన్నవించుకునే వెసులుబాటు కూడా ఇవ్వరని ఆర్డరు ఇది. దేశంలో 69.24 శాతం కుటుంబాలు సెంటు భూమి కూడా లేని నిరుపేదలలో, సన్నకారు, చిన్నకారు రైతులవోనని 1992లో జరిపిన జాతీయ నమూన సర్వే (భూమి, పశుగణం) లో తేలింది. ఆ శాతం 2012 వరకల్లా 92.84 శాతంకి పెరిగింది. ఈ పరిస్థితులలో వ్యవసాయ రంగంలో ఇంకా తీవ్రతరం అయ్యే సంక్షోభాన్ని ఏ మాత్రం పరిగణనలోకి తీసుకోకుండా మోడీ ప్రభుత్వం ఈ ఆర్డినెన్స్ తీసుకువచ్చే దుస్సహాసానికి ఒడిగట్టింది.

ఈ ఆర్డినెన్స్‌కు వ్యతిరేకంగా రైతు ఆగ్రహం పెల్లుబికింది. వ్యవసాయ రంగంలో పెరుగుతున్న అశాంతికి, సంక్లిష్టతకు సంకేతంగా గజేందర్ సింగ్ అనే రైతు ఆమ్‌ఆద్మీ పార్టీ ర్యాలీ సందర్భంగా పార్లమెంటు సమీపం లో చెట్టుకు ఉరి వేసుకుని చనిపోయాడు. రైతుకు అండగా పలు ప్రతిపక్ష పార్టీలు కార్యక్రమాలు చేపట్టాయి. చివరికి ఆర్డినెన్స్ చట్టంగా రూపొందే అవకాశం లేక సహజ మరణం పొందింది. అయినా, ప్రజలు అప్రమత్తంగా ఉండకపోతే మరో రూపంలో ఏదో రీతిన ఈ ప్రజా వ్యతిరేక కార్పొరేట్ అనుకూల ఆర్డినెన్స్ లాంటి చట్టాలు మొలకెత్తవచ్చు. పారిశ్రామిక వర్గాలు అదునుకోసం, అవకాశం కోసం ఎదురు చూస్తూనే ఉంటాయి. ఇప్పటికే ఎన్‌డిఎ పాలిత రాష్ట్రాలలో, (ఇతర రాష్ట్రాలలో కూడా) రైతు వ్యతిరేక భూసేకరణ వెసులు బాటు ఉంది.

**సోంపేట ఉదంతం**

నాగార్జున కన్‌స్ట్రక్షన్ కంపెనీ వారి థర్మల్ పవర్ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా 2009 డిసెంబర్ 5న రిలే నిరాహార దీక్షలతో ప్రారంభమైన

శ్రీకాకుళం జిల్లా సోంపేట ప్రాంత ప్రజల వీరోచిత పోరాటం 2015 ఆగస్టులో ఆంధ్రప్రదేశ్ క్యాబినెట్ మంత్రుల సమావేశంలో తీసుకున్న ప్రాజెక్టు రద్దు నిర్ణయంతో గొప్ప విజయం సాధించినా, కార్పొరేట్ శక్తులతో, ఆ శక్తులకు కొమ్ము కాస్తున్న ప్రభుత్వ గణంతో దీర్ఘకాలిక పోరాటం తప్పదనే సత్యాన్ని కూడా రుజువు పరుస్తున్నది.

సమైక్య ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం 2008 సెప్టెంబర్‌లో విశేషంగా సారవంతమైన బీల భూములను జిఒ 1107ను జారీ చేసి ప్రభుత్వానికి చెందిన 972.69 ఎకరాలు నాగార్జున కన్‌స్ట్రక్షన్ కంపెనీకి థర్మల్ పవర్ ప్రాజెక్టు నిర్మించే నిమిత్తం కట్టబెట్టింది. ఆ కంపెనీ తాముగా ఇంకో 500 ఎకరాలు ప్రైవేట్ వ్యక్తుల నుండి సేకరించి ప్రాజెక్టు నిర్మాణానికి పూనుకుంది. నాగార్జున కంపెనీకి కేటాయించిన ఆ భూములు శ్రీకాకుళం జిల్లాలోని సోంపేట, కవిటి, కింతలి మండలాల లోని 30 గ్రామాలలో ఉన్న వ్యవసాయదారులు, మత్స్యకారులు, చేతి వృత్తుల వారికి జీవనోపాధి మార్గాన్ని చూపించే కల్పతరువు లాంటివి. ఆ చుట్టు పక్కల విస్తరించి ఉన్న 500 ఎకరాల వ్యవసాయ భూమికి నీటి వనరు బీల'. ఆ ప్రాంతంలో మూడు ఎత్తిపోతల పథకాలు కూడా ఉన్నాయి. 60 గ్రామాల ప్రజలు మంచినీటి కోసం, తాగునీటి కోసం బీల పైనే ఆధారపడతారు. సంవత్సరం పొడుగునా మత్స్యకారుల కడుపు నింపేది ఈ నదీ పారివాహక ప్రాంతమే. తమ నోటికాడి కూడును లాగేస్తున్న పవర్ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా అన్ని వర్గాల ప్రజలు ప్రాణాలకు తెగించి పోరాటం ప్రారంభించారు. ఆ ప్రాంత ప్రజలు తమ జీవనోపాధి కోసం, మునిగి పోతున్న తమ ఇళ్లకోసం మాత్రమే కాకుండా పర్యావరణ పరిరక్షణ కోసం కూడా నడుంబిగించి ముందుకు కదిలారు. వారి పోరాటంలో భాగంగా పర్యావరణ పరిరక్షణ సమితి ఏర్పాటయింది. సమితి తీసుకున్న వివిధ పోరాట మార్గాలకు తలవొగ్గి భారత ప్రభుత్వం సలీం అలీ పక్షి విషయ, ప్రకృతి శాస్త్ర కేంద్రా'న్ని శ్రీకాకుళం జిల్లాలోని తరి భూముల స్థితిగతుల గురించి సర్వే జరపమని ఆదేశించింది.

సలీం అలీ కేంద్రం శ్రీకాకుళం జిల్లాలోని తరి భూములలో జీవావరణ సంగతుల స్థితిగతులపై సమగ్ర సర్వే జరిపి థర్మల్ విద్యుత్ కేంద్ర స్థాపన వల్ల పర్యావరణంపై విపరీత ప్రభావం ఉంటుందని తేల్చి చెప్పింది. వారు రిపోర్ట్‌లో పేర్కొన్న ముఖ్యాంశాలు ఇవి: 1) జీవావరణ వ్యవస్థలో థర్మల్ ప్రాజెక్టు వల్ల ప్రతికూల మార్పులు ఉంటాయి. 2) జీవ వైవిధ్యంపై విపరీతమయిన ప్రభావం ఉంటుంది. 3) నేల, నీటి గుణంలో తరుగుదల ఉంటుంది. 4) జీవనాధార మార్గాలు సమూలంగా నిర్మూలించబడతాయి. శ్రీకాకుళం జిల్లాలోని తరి భూములన్నింటిని గుర్తించి, వాటిని వ్యవసాయం తప్ప వేరే పనుల కోసం వాడకుండా చట్టబద్ధమైన కట్టుదిట్టం చేసి రక్షించాలని, లేనిచో పర్యావరణ క్షేత్రంలో సంభవించే పరిణామాలు తీవ్రంగా ఉంటాయని కూడా ఆ నివేదిక హెచ్చరిక చేసింది.

పర్యావరణం రీత్యా చాలా ప్రత్యేకమైన ప్రదేశం ఇది. అరుదైన పక్షుల సంగమ స్థలం ఇది. ఈ బీల నీటిలో 121 పక్షి సంతతి, 493 వృక్ష జాతులు జీవిస్తూ ఉంటాయి. బీల నీటి నుండి రెండు వేల హెక్టార్ల పొలంలో వరి, 300 హెక్టార్ల భూమిలో కూరగాయలు, ఉద్యావన పంటలు పండుతాయి. ఒకప్పటి ప్రధాన మంత్రి జవహర్‌లాల్ నెహ్రూ చేతుల మీదుగా నాణ్యమైన పంటలు పండే ప్రాంత అవార్డు అందుకున్న ప్రాంతం ఇది. శ్రీకాకుళం జిల్లా కలెక్టర్ ప్రభుత్వానికిచ్చిన రిపోర్టు ప్రకారం థర్మల్ పవర్ ప్రాజెక్టు నిర్మిస్తే 356 వృక్ష జాతులు మునిగి పోతాయి. వాటిలో మేలి రకపు మామిడి, తాటి, కొబ్బరి, ఈత, తురాయి, తుమ్మ, జీడి మామిడి లాంటి ఎన్నో రకాలయిన వృక్షాలతో పాటు అశ్వగంధ, సర్పగంధ లాంటి ఔషధ మొక్కలు కూడా ఉంటాయి. నాగార్జున కంపెనీవారు పర్యావరణ శాఖ నుండి, అటవీ సంరక్షణ శాఖ నుండి లాబీయింగ్ ద్వారా ఇతర పద్ధతుల ద్వారా సంపాదించిన అనుమతులను, నిరభ్యంతర సర్టిఫికెట్లను కూడా ప్రజా ఉద్యమాల వెల్లువలో ప్రభుత్వం, కోర్టులు రద్దు చేశాయి.

రిలే నిరాహార దీక్షలతో ప్రారంభమైన ప్రజా ఉద్యమం పోలీస్ కాల్పులకు దారితీసింది. పోలీస్ కాల్పుల్లో లెక్కలేనంత మంది గాయ పడ్డారు. రైతులు, మత్స్యకారులు ముగ్గురు కాల్పుల్లో మరణించారు. చివరికి నాగార్జున కన్‌స్ట్రక్షన్ కంపెనీ తమ థర్మల్ ప్రాజెక్టును కృష్ణపట్నం మార్చుకుంటున్నట్లు ప్రకటించింది. అయినా, ఆ కంపెనీకి కేటాయించిన ప్రభుత్వ భూమిని తిరిగి ప్రభుత్వం కైవసం చేసుకునే వరకు, 1107 జిఒ రద్దు చేసేవరకు పోరాటం విరమించే ప్రసక్తే లేదని పర్యావరణ పరిరక్షణ సమితి ప్రకటించింది. చివరికి ఆ జిఒను రద్దు చేసింది ప్రభుత్వం. ఇది ఖచ్చితంగా ప్రజా విజయమే. కాని, వెనువెంటనే మరో ఘోరానికి తెర తీసింది ప్రభుత్వం. సోంపేటకు కేవలం 9 కిలోమీటర్ల దూరంలో బారువా అన్న గ్రామం వద్ద సుమితోమో కార్పొరేషన్ అన్న జపాన్ దేశపు కంపెనీకి 4000 మెగావాట్ల సామర్థ్యం గల థర్మల్ ప్రాజెక్టు నిర్మించడానికి అనుమతి ఇచ్చింది ఎపి ప్రభుత్వం. ఈ సారి మానవ హక్కుల వేదిక, పర్యావరణ పరిరక్షణ సంఘం సంయుక్తంగా జపాన్ దేశపు థర్మల్ ప్రాజెక్టును వ్యతిరేకిస్తూ పోరాటంలోకి దిగాయి. ఈ కొద్ది సమయంలోనే బారువా, హరిపురం, మందసలలో సభలు ఏర్పాటు చేసి ప్రభుత్వం అనుసరిస్తున్న విధ్వంసక అభివృద్ధి ప్రతిపాదనలను పరీక్షించడానికి శ్రీకాకుళం జిల్లాను ఒక ప్రయోగశాలగా ఉపయోగించుకుంటున్నదని దుయ్యబట్టాయి. కాకరపల్లి, పొందూరు, కొవ్వాడలలో ఉద్యమ వ్యాప్తి కోసం మీటింగ్ ఏర్పాట్లు చురుగ్గా సాగుతున్నాయి. విజయవంతమైన సోంపేట పోరాట స్ఫూర్తితో బారువా ఉద్యమం కూడా సఫలీకృత మవుతుందనడంలో సందేహం లేదు. అక్కడి ప్రజలు దీర్ఘకాలిక పోరాటానికి సిద్ధం అయ్యారు.

**తెలంగాణలో చీప్ లిక్కర్**

నూతనంగా ఏర్పాటయిన తెలంగాణ రాష్ట్రం పుష్కర కాలం ప్రజలతో కలిసి నడిచిన ఉద్యమ పార్టీ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. సహజంగానే ప్రజల ఆకాంక్షలు నెరవేరుతాయని, ఉద్యమ అశయాలు చిగురిస్తాయని అందరూ ఆశించారు. గత ప్రభుత్వాల కంటె ఈ ఉద్యమ పార్టీ పరిపాలన భిన్నమైనదేమీ కాదని అప్పుడే రుజువైపోయింది. పేరు మార్పిడితో పాత విధానాలు, స్లోగన్లు తప్ప ప్రభుత్వ దిశ మార్చే విధంగా తెరాస ప్రభుత్వ వైఖరి లేదన్నది స్పష్టమైంది. గతంలో ఒక ముఖ్యమంత్రి స్వర్ణాంధ్రప్రదేశ్ అంటే ప్రస్తుత ప్రభుత్వ రథసారధి బంగారు తెలంగాణ అంటున్నాడు. గత ప్రభుత్వం ఇందిరమ్మ గృహ నిర్మాణం అంటే నేటి ముఖ్యమంత్రి డబుల్ బెడ్‌రూం ఫ్లాటు అంటున్నాడు. అలాగే, బహుళజాతి కంపెనీలకు దాసోహమనడంలో గత ప్రభుత్వాల కంటె ఏమాత్రం వెనక్కు పోవడం లేదు ఈ ఉద్యమ పార్టీచే ఏర్పాటు చేయబడ్డ తెలంగాణ ప్రభుత్వం. ఎన్ని మాయ మాటలు చెప్పినా, స్థానిక ప్రజల భాషలో చిట్టిపొట్టి కథలతో వారి యాసలో మాట్లాడుతూ తెలంగాణను స్వర్గధాయం చేస్తానని వాగ్దానాల వెల్లువలో తన వాగ్ధాటితో ప్రజలను ముంచెత్తే ప్రయత్నం

# సెప్టెంబర్ 2 సమ్మె - ప్రభుత్వ నిర్లక్ష్యం

***ప్రజలకు పెనుభారంగా మారుతున్న ఆర్థిక విధానాలను వ్యతిరేకిస్తూ ప్రజల పక్షాన నిలిచి దేశవ్యాప్తంగా కార్మికులు చేసిన సమ్మె పట్ల ప్రభుత్వంలో ఎటువంటి కదలిక లేదనీ, దానికి భిన్నమైన పోరాట రూపాలను ఎంచుకోవాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు బి. రామకృష్ణ***

కార్పొరేట్ అనుకూల ప్రజా వ్యతిరేక విధానాలకు నిరసనగా 2015 సెప్టెంబర్ 2న కార్మిక సంఘాలు దేశవ్యాప్తంగా సమ్మెకు పిలుపునిచ్చాయి. ప్రభుత్వ రంగాన్ని ప్రైవేటీకరించడం ఆపాలి. రైల్వే రక్షణ, ఇన్సూరెన్స్ రంగాలతో సహా కీలక రంగాలన్నింటిలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు రావడాన్ని నిరోధించాలి. సార్వత్రిక ప్రజాపంపిణీ వ్యవస్థను బలపరచాలి. ధరల పెరుగుదలను నియంత్రించాలి. ఉపాధీ హామీ పథకానికి నిధులను పెంచాలి. నిరుద్యోగాన్ని నియంత్రించాలి. కార్మికులందరికీ సార్వత్రిక, సామాజిక భద్రత, కాంట్రాక్ట్ విధానాన్ని రద్దు చేసి కార్మికులను పర్మినెంట్ చేయాలి. సమాన పనికి సమాన వేతనం ఇవ్వాలి. నెలకు రు. 15 వేలు కనీస వేతనం ఇవ్వాలి. బలవంతపు భూసేకరణ ఆర్డినెన్స్‌ను రద్దు చేయాలి. అంతర్జాతీయ కార్మిక సంస్థ తీర్మానాలన్నింటిని అమలు చేయాలనే డిమాండ్లతో ఈ సమ్మె జరిగింది. గతంలో ఎన్నడూ లేనంతగా ప్రజల నుండి ఉద్యోగ కార్మిక వర్గాల నుండి స్పందన వచ్చింది. ఈ డిమాండ్లలో కార్మికుల స్వప్రయోజనాలకు సంబంధించిన వాటికంటే కూడా విస్తృత ప్రజాబాహుళ్యాల ప్రయోజనాల కోసం దేశ సార్వభౌమత్వాన్ని కాపాడుకునే తపన కనిపిస్తున్నది.

దేశవ్యాప్తంగా కార్మికుల హక్కులకు గ్యారంటీ లేకుండా పోయింది. సరళీకృత, ప్రైవేటీకరణ విధానాల నేపథ్యంలో ప్రజల హక్కులు కుంచించుకుపోతున్నాయి. స్వదేశీ, విదేశీ పెట్టుబడిదారులు, బహుళజాతి సంస్థల పెట్టుబడుల ప్రయోజనాల కోసం ఈ దేశ ప్రజల ప్రయోజనాలను ఫణంగా పెట్టడం జరుగుతున్నది. ప్రభుత్వ, ప్రైవేటు కంపెనీలలో కాంట్రాక్ట్ కార్మికులు పెరుగుతున్నారు. తక్కువ వేతనాలతో ఎక్కువ పనితో ఉద్యోగ భద్రత లేకుండా పోవడం అనేది కాంట్రాక్ట్ ఉద్యోగ పద్ధతి లక్షణం. ఇది ప్రజల జీవన ప్రమాణాలను పెంచకుండా ఏ చేస్తున్నా, ప్రజా వ్యతిరేకమైన నిర్ణయాలకు ప్రజాగ్రహం తప్పట్లేదు. ప్రజల కోపానికి వెనుకంజ వేసిన సంఘటనలు కోకొల్లలు. దీనికి తాజా ఉదాహరణ చీప్ లిక్కర్ అంశం.

గుడుంబాతో, కల్తీ సారాతో ప్రజలు ప్రాణాలు పోగొట్టుకుంటున్నారు కాబట్టీ, వారి ఆరోగ్యం నాశనం అయిపోతుంది కాబట్టి ప్రభుత్వమే మద్యం తయారు చేసి సరసమైన ధరకు విక్రయిస్తుందని, దాన్ని కొనుక్కుని తాగితే ఆరోగ్యం చెడిపోదని ఊదరగొడుతూ చీప్ లిక్కర్ పాలసీని ప్రకటించింది తెలంగాణ ప్రభుత్వం. గుడుంబాను, కల్తీ సారా, కల్లులను అరికట్టి, ప్రజలలో మద్యపానం పట్ల విముఖత కలిగించే ఏర్పాటు చేయడం సంక్షేమ ప్రభుత్వ విధానం అయి ఉండాలి. దానికి విరుద్ధంగా ప్రభుత్వమే లిక్కర్ తయారు చేస్తుందంటే ఏ సమాజం ఒప్పుకోదు. గతంలో ప్రభుత్వ సరాయి దుకాణాలు (ప్రసాదం) పెట్టి వారుణ వాహిని పేరుతో మద్యాన్ని ఏరులుగా పారించే ప్రయత్నం చేసినపుడు కూడా ప్రజలు ఒప్పుకోలేదు. ఈనాడు చీప్ లిక్కర్ పాలసీకి వ్యతిరేకంగా ప్రజా సంఘాలు గళమెత్తాయి. గతంలో ప్రభుత్వాలు నడిపినపుడు మద్యపానాన్ని యథేచ్ఛగా ప్రోత్సహించిన పార్టీలు కూడా ప్రజల అభిప్రాయాన్ని పసిగట్టి వారితో చేయి కలిపారు. చివరికి ప్రజలు వ్యతిరేకిస్తున్నారు కాబట్టి చీప్ లిక్కర్ ప్రకటనను విరమించుకుంటున్నట్లు క్యాబినెట్ సమావేశం తర్వాత ప్రభుత్వం ప్రకటించింది.

ఇదీ ప్రజల విజయమే. కాని ప్రజలు సాహసం చేసి ముందుకు వస్తే సహించలేని పాలకవర్గాలలో ఇప్పుడు మీడియా కూడా చేరిపోయింది. కల్తీలేని మద్యం దొరకక చనిపోతున్న తాగుడుకు బానిసల కథనాలు వరుసగా ప్రసారం చేస్తుంది ఎలక్ట్రానిక్ మీడియా. రైతుల ఆత్మహత్యల కంటె ఎక్కువ కవరేజ్ ఇస్తూ స్టోరీస్ రాస్తున్నాయి దిన పత్రికలు. ఇదంతా చీప్‌లిక్కర్ పాలసీకి తమ వంతు దోహదపడే ప్రయత్నాలే చేస్తున్నాయి పత్రికలు, టివీలు. ఈ మీడియా ప్రమాదం నుండి తమను తాము ప్రజలు రక్షించుకుంటారన్న భరోసా మాత్రం ఉంది.

ముందు వెనకా ఆలోచన లేకుండా పత్రికా ప్రకటనలివ్వడం, ప్రజా అభిప్రాయం వాటికి వ్యతిరేకంగా ఉండడం పసిగట్టి వెనుకంజ వేయడం తెలంగాణ ప్రభుత్వంలో పరిపాటయిపోయింది. ఉస్మానియా యూనివర్సిటీకి చెందిన భూములను పేదల ఇళ్ల కోసం ధారధత్తం చేస్తాననడం, ఎర్రగడ్డ ఆసుపత్రిని అనంతగిరికి, సెక్రటేరియట్‌ను ఎర్రగడ్డకు మారుస్తానని-ఇలా ఎన్నెన్నో మార్పులకు శ్రీకారం చుట్టి ప్రజల అభిప్రాయం వ్యతిరేకమవడంతో ఆ ప్రతిపాదనల పట్ల మౌనం దాల్చడం తెలంగాణ ప్రభుత్వపు దినచర్యగా మారింది. ఇవన్నీ ముఖ్యమైన సమస్యల నుండి ప్రజల దృష్టిని మరల్చడానికి అయితే ఈ నక్కజిత్తులు ఎంతో కాలం సాగవు.

ప్రజాస్వామ్యంలో ప్రజలకు, ప్రజల అభిప్రాయాలకు ప్రాతినిధ్యం ఇవ్వకపోతే ప్రజలే ముందుకు వచ్చి దానిని సాధించుకునే ప్రయత్నం చేస్తారు. ప్రజలు శాంతిని కాంక్షిస్తారు. అందరూ బాగుండాలనే కోరుకుంటారు. ప్రజా శ్రేయస్సును కాంక్షించే మేధావులు ప్రజా అభిప్రాయాన్ని బలంగా ఎత్తి చూపగలగాలి. ప్రజాభిప్రాయాన్ని శాస్త్రీయమైన పద్ధతిలో మలచగలగాలి. రాజకీయ పార్టీ ముఖ్యంగా ప్రతిపక్ష పార్టీలు ప్రజాభిప్రాయాన్ని సరైన రీతిలో ప్రాతినిధ్యం వహించే వేదికలుగా పని చేయాలి. ప్రజా సమస్యల పరిష్కారానికి ప్రజల మద్దతు కూడగట్టడమే ప్రథమ మెట్టు.

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

పూటకాపూట అన్నట్లు, నిరంతర అభద్రతతో బతుకులు ఈడ్చుకొచ్చే దుస్థితికి అద్దం పడుతుంది. ఇటువంటి అన్యాయమైన విధానంతో కూడి ఉన్న కాంట్రాక్టు పద్ధతిలో నేడు ప్రభుత్వ రంగంలో 45 శాతం, ప్రైవేటు రంగంలో 70శాతం వరకు కార్మికులు పనిచేస్తున్నారు. ఈ విధానం సమాన పనికి సమాన వేతనం అనే సహజ న్యాయసూత్రానికి వ్యతిరేకమైనది. దీనిని భారత రాజ్యాంగం అనుమతించదు. అయినాసరే ప్రజాస్వామ్యం పేరుతో రాజ్యాంగం సాక్షిగానే ఈ అన్యాయం జరిగిపోతూ ఉన్నది. ప్రతి ప్రభుత్వం దీన్ని పాటిస్తూ వస్తున్నది. దీన్ని మరింత వేగవంతం చేయడానికి మోడీ వేగిరపడుతున్నాడు.

ప్రస్తుత తరుణంలో కార్మికుల వేతనాలు తగ్గుతూ పోవడం, యాజమాన్య లాభాలు పెరుగుతుండడం జరుగుతున్నది. ప్రపంచవ్యాప్త ఆర్థిక సంక్షోభ కారణంగా ఎన్నో కంపెనీలు మూతపడుతున్నాయి. ఫలితంగా కార్మికులు రోడ్డున పడుతున్నారు. ప్రభుత్వ రికార్డుల ప్రకారమే దేశంలో రిజిస్టర్ అయిన 18.70లక్షల కంపెనీలో20 శాతం మూసివేయబడ్డాయి. ఇలా మూసివేయడం చట్టవ్యతిరేకంగా జరుగుతున్నది. దీంతో కార్మికుల సంక్షేమం ప్రమాదంలో పడుతున్నది. అయినా ప్రభుత్వాలు పట్టించుకున్నది లేదు.

స్వదేశీ అంటూ గొంతు చించుకునే సంఘ్ పరివార్ శక్తులు, విదేశీ పెట్టుబడుదారులకు గేట్లు బార్లా తెరవడమే కాకుండా వాటి రాకకోసం ఇక్కడి ప్రజల హక్కులను పణంగా పెట్టడానికి ఉత్సుకతతో ఉన్నాయి. అందులో భాగమే మేకిన్ ఇండియా అంటూ మోడీ చేస్తున్న విదేశీ ప్రయాణాలు. మేకిన్ ఇండియా పేరుతో ప్రపంచవ్యాప్త విదేశీ పెట్టుబడిదారీ సంస్థలకు విన్నపాల మీద విన్నపాలు చేస్తూ వాటికోసం అనువైన వాతావరణం కల్పించడంలో భాగంగా ఎన్నో వాగ్దానాలను చేస్తూ వారి ప్రయోజనాల కోసం దేశ ప్రజల, కార్మికుల జీవన భద్రత, హక్కులను కాలరాసే ప్రయత్నం చేస్తున్నారు. కార్మిక చట్టాలను సవరిస్తూ సంఘం పెట్టుకునే హక్కును, కార్మిక, ప్రజా వ్యతిరేక విధానాలను వ్యతిరేకించేందుకు సమ్మె చేసే హక్కును నిర్వీర్యం చేస్తున్నారు. ప్రస్తుత చట్టంలో 2 నుంచి 3 వారాల్లోపు సమ్మె నోటీస్ ఇస్తే సరిపోతుంది. కానీ కొత్త చట్టంలో ఆరువారాల ముందు సమ్మె నోటీస్ ఇవ్వాల్సి ఉంటుంది. సమాన పనికి సమాన వేతనం, ఉద్యోగ భద్రత కనీస వేతనాలకు గ్యారంటీ లేకుండా చట్టాలలో సవరణలు తెస్తున్నారు. బి.జె.పి పాలిత రాష్ట్రాల్లో ప్రధానంగా రాజస్థాన్‌లో కార్పొరేట్ అనుకూల కార్మిక చట్టాల్లో మార్పులు తెచ్చారు.

ఈ రకంగా మిగతా రాష్ట్రాల్లో కూడా కార్మిక చట్టాల్లో సవరణలు తేవాలని లేనిపక్షంలో పెట్టుబడులు రావని ప్రధానమంత్రి కార్యాలయం నుండి రాష్ట్రాలకు లేఖలు వచ్చాయి. తాను తప్పు చేయడమే కాకుండా మిగతా వారిని చేయమని కూడా బలవంతపెట్టే దిక్కుమాలిన చర్యలకు మోడీ ప్రభుత్వం పాల్పడుతున్నది. ఈ చట్టాలు అమల్లోకి వస్తే కార్మిక సంఘాల ఉనికి ప్రమాదంలో పడుతుంది. ప్రస్తుత నిబంధనల మేరకు కేవలం 7మంది కలిసి దరఖాస్తు చేస్తే సరిపోతుంది. కాని సవరణలు చేయబోయే చట్టాల ద్వారా ఏ పరిశ్రమలోనైనా సంఘం పెట్టుకోవడానికి 10శాతం మంది కార్మికులు సంతకాలు పెట్టి దరఖాస్తు చేసుకోవాల్సి ఉంటుంది. ప్రస్తుత చట్టాల ప్రకారం, కార్మిక సంఘంలో నాయకత్వ స్థానంలో 50శాతం వరకు బయటవారు ఉండొచ్చు. ప్రతిపాదిత బిల్లులో బయటివారు ఉండుటకు వీలులేదు. కొత్తగా కార్మిక సంఘాలను ఏర్పాటు కానీయకుండా ముందుముందు కార్మిక సంఘాల రిజిస్ట్రేషన్ అసాధ్యంగా మారనుంది.

ట్రేడ్ యూనియన్ చట్టాల్లో సవరణలు తెస్తూ యూనియన్లే లేకుండా చేయాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. 40 మంది అంతకు తక్కువగా కార్మికులున్న కంపెనీలకు, కార్మికుల చట్టాల నుండి మినహాయింపు లభిస్తున్నది. అప్రెంటిస్ చట్టాలకు చేయబోయే సవరణలు అప్రెంటిస్‌లను దోపిడీ చేయనున్నాయి. పారిశ్రామిక వివాదాల చట్టంలో చేసే సవరణలు ఇష్టానుసారం నియమించడం, తొలగించడం(హైర్ అండ్ ఫైర్) అనే విధానాన్ని యాజమాన్య హక్కుగా మార్చబోతున్నాయి. తద్వారా అక్రమ లాకౌట్లు, లే ఆఫ్‌లు, రిట్రెంచ్‌మెంట్లు, యజమానుల హక్కుగా మారి కార్మికుల ఉద్యోగ భద్రత ప్రశ్నార్థకం అవుతుంది. న్యాయమైన డిమాండ్ల కోసం జరిగే సమ్మెలను చట్ట విరుద్ధమైనవనే పేరుతో 50 వేల నుండి 6 లక్షల వరకు జరిమానాలు విధిస్తూ అవి చెల్లించలేకపోతే జైళ్లకు పంపడం అనే నిబంధనలతో చట్టాల్లో సవరణలు తెచ్చి సమ్మెలను అదుపు చేయబోతున్నారు.

మోడీ ప్రభుత్వం వచ్చిన మొదటి మూడు నెలల్లోనే 40 వేల కోట్ల ప్రభుత్వ రంగ వాటాను అమ్మేశారు. ఈ ఆర్థిక సంవత్సరంలో ప్రభుత్వ రంగ సంస్థల్లో 69వేల కోట్ల వాటాలను అమ్మాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. అనేక కేంద్ర ప్రభుత్వ సంస్థల నుండి పెట్టుబడులను ఉపసంహరించడానికి కేంద్ర కేబినెట్ ఆమోదం తెలిపింది. ఉదాహరణకు నాల్కోలో 5శాతం బిహెచ్ఇఎల్‌లో 5 శాతం, ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్‌లో 10శాతం, ఎన్‌టిపిసి, పవర్ గ్రిడ్, పవర్ ఫైనాన్స్ కార్పొరేషన్, రూరల్ ఎలక్ట్రిఫికేషన్, కార్పొరేషన్ల నుండి ప్రభుత్వ పెట్టుబడులను వెనక్కు తీసుకోవాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ప్రభుత్వ రంగ సంస్థల్లోని వాటాలను పెట్టుబడిదారులకు అతితక్కువకు అమ్మేస్తున్నారు. ఏ లాభాలు లేనిది ప్రైవేట్ కంపెనీ ఎందుకు కొంటుందనే ప్రశ్న రాకపోవడం దుర్మార్గమైనది. ఇలా ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటీకరించి కార్మికుల, ప్రజల, ఉద్యోగ ఉపాధి భద్రతలను ప్రమాదంలో పడేస్తున్నారు.

రక్షణ, రైల్వేలు, బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, పెన్షన్ నిధులు, బొగ్గు, పెట్రోలియం, మైనింగ్, విద్యుత్ రంగం, టెలికం, పౌరవిమానయానం, శాటిలైట్, నిర్మాణరంగం, రిటైల్ వ్యాపారం, ఫార్మాస్యూటికల్స్ ఇలా అనేకానేక రంగాలలో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను అనుమతించడానికి కేంద్ర ప్రభుత్వం నిర్ణయించింది. దీని ద్వారా దేశీయ ఆర్థిక వ్యవస్థలోని అత్యధిక రంగాలపై మన దేశం పట్టు కోల్పోతుంది. తద్వారా దేశ ఆర్థిక వ్యవస్థపై విదేశీ సంస్థల గుత్తాధిపత్యం పెరిగిపోతుంది. ఇది దేశ సార్వభౌమత్వానికి, సమగ్రతకు ప్రమాదకరం. ఇప్పటికే ఇన్సూరెన్స్ రంగంలో 49 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అనుమతులిచ్చే ఆర్డినెన్స్ లు జారీ అయ్యాయి. రైల్వే, రక్షణ రంగ పరిశ్రమల్లో 100 శాతం వరకు విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అనుమతులిచ్చే విధాన నిర్ణయం తీసుకోబోతున్నారు. గత రెండు దశాబ్దాలకు పైగా విదేశీ పెట్టుబడుల ద్వారా ఉపాధి పెరిగిందేమీ లేదు. అయితే 1990 తరువాత జరుగుతున్న సరళీకృత ఆర్థిక విధానాల ద్వారా మొదట్లో కొంత మేరకు ఇబ్బందులెదురైనా దీర్ఘకాలంలో దేశానికి ప్రజలకు మేలు జరుగుతుందని ఒకప్పటి భారత ఆర్థిక మంత్రి అలాగే ప్రధానమంత్రి అయిన మన్‌మోహన్ సింగ్ చెబుతూ వచ్చాడు. కానీ ఫలితాలు వ్యతిరేకంగా

వస్తున్నాయి. ఈ విధానాల వల్ల విదేశీ అప్పులు పెరుగుతూ పోతున్నాయి తప్ప దేశ ఆర్థిక వ్యవస్థ మెరుగుపడి ప్రజలకు విద్యా ఉద్యోగ ఉపాధి అవకాశాలు పెరిగిందేమీ లేదు. నిరుద్యోగుల సంఖ్య పెరుగుతూ పోతున్నది. మూడొంతులకు పైగా ప్రజలు కనీస తిండికి నోచుకోవడం లేదు. దేశవ్యాప్తంగా రైతుల ఆత్మహత్యలు పెరిగిపోతున్నాయి. ఇవన్నీ కూడా ప్రజల జీవించే హక్కు ప్రమాదంలో పడడాన్ని సూచిస్తున్నాయి. విదేశీ పెట్టుబడులు తక్షణ లాభాలు సంపాదించుకునే అవకాశం ఉన్న షేర్ మార్కెట్, ఇన్సూరెన్స్, బ్యాంకింగ్, రియల్ ఎస్టేట్ వంటి రంగాల్లోకి మాత్రమే వచ్చాయి. ఇలాంటి ప్రమాదకరమైన విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తూ వారి ప్రయోజనాల కోసం కార్మికుల హక్కులను అణచి వేయాలని తలంపుతో బి.జె.పి ప్రభుత్వం పనిచేస్తున్నది. ఓ వైపు స్వదేశీ అభిమానమంటూ మరో వైపు విదేశీ పెట్టుబడులకు బి.జె.పి ప్రభుత్వం లొంగిపోతున్నది. ఇదంతా కూడా పెట్టుబడిదారీ దోపిడీ శక్తులకు, సంఘ పరివార్ చెప్పే మతానికి మధ్య అన్యోన్య సంబంధాన్ని తెలియపరుస్తున్నది.

నూతన సరళీకృత ఆర్థిక విధానాల్లో కార్మికుల హక్కులు హరించి వేయబడుతున్న సందర్భంలో 1990ల నుండి 15 సార్వత్రిక సమ్మెలు జరిగాయి. ప్రజలు, కార్మికులు ఎన్నో కష్టనష్టాలకు ఒత్తిళ్లకు గురవుతూ కూడా ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలపై అసంతృప్తులను, వ్యతిరేకత లను ఎంతో స్పష్టంగా ఈ సమ్మెల రూపంలో తెలియజేస్తూ వచ్చారు. కానీ ప్రభుత్వాలు దున్నపోతు మీద వానచినుకులా స్పందించకపోవడమే అన్యాయమైనది. అయితే వీటి ఫలితంగా కొంతమేరకైనా సరళీకృత ప్రైవేటీకరణ విధానాల వేగం మందగించింది కానీ అవి ఆగిపోవడమైతే లేదు. దేశీయ, విదేశీయ పెట్టుబడిదారులు భారత్‌లోని సహజ సంపదలను దోచుకోవడానికి ఈ దేశ ప్రభుత్వాలు చట్టపర, చట్టవ్యతిరేక ద్వారాలను బార్లా తెరిచిపెట్టి ఉన్నాయి. సకల ప్రజలకు చెందవలసిన దేశసంపద కొద్దిమందికి భుక్తం కావడం ప్రజాస్వామ్యం పేరుతో రాజ్యాంగ, న్యాయవ్యవస్థల సాక్షిగానే జరుగుతున్నది.

రిటైల్ వ్యాపారంలో సహితం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు వీలు కల్పించడం ద్వారా చిన్నచిన్న వ్యాపారస్తులు ఉపాధిని కోల్పోతున్నారు. సకల సంపదలున్నప్పటికీ కూడా దేశంలో మూడొంతులకు పైగా దుర్భర దారిద్ర్యంతో కొట్టుమిట్టాడుతూ దయనీయంగా బతుకుతున్నారు. వీరి ప్రయోజనాల కోసం కనీసం నెలకు రు.15 వేల జీతం ఉండాలనే డిమాండ్‌ను ఈ సమ్మె ముందుకు తేవడం అంటే దేశంలోని అసమానత్వా లను, అణచివేతలను సంపదంతా కొందరి చేతుల్లోనే కేంద్రీకృతం కావడాన్ని సూచిస్తున్నది. కనీస వేతనం రు. 20 వేలు ఉండాలని ఇండియన్ లేబర్ కాన్ఫరెన్స్ స్పష్టం చేసింది. కార్మిక సంఘాలు రు.15 వేలను అడుగుతున్నాయి. కానీ ప్రభుత్వం కనీస వేతనంగా ఏడు వేలను ప్రతిపాదిస్తున్నది. ఈ వేతనంతో బతకడం ఎంత కష్టమో అర్థం కావడం కష్టమేమీకాదు. కార్మిక చట్టాల సవరణకు సంబంధించి కార్మిక సంఘాలతో కాకుండా, కార్పొరేట్ శక్తులతో చర్చించడం ద్వారా కార్పొరేట్లకు అనుకూలమైన విధానాలు చట్టపరమైన సవరణలు తేబడతాయని తెలుసుకోవచ్చు. ఈ సందర్భంలో ప్రభుత్వాలను నడిపిస్తున్నది కార్పొరేట్ శక్తులేనని గుర్తుకురాక మానదు.

అభివృద్ధి పేరుతో సాగుభూములను సహితం వదలకుండా ప్రజల ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా లాక్కొని కార్పొరేట్, పెట్టుబడిదారీ శక్తులకు కట్టబెట్టే వెసులుబాటును ఇస్తున్న భూసేకరణ ఆర్డినెన్స్‌ను రద్దు చేయమని సార్వత్రిక సమ్మె డిమాండ్ చేసింది. నిజానికి భూములను సాగుకు యోగ్యం చేసి ప్రజలకు పంచితే వారి ఉపాధిని, ఆత్మ విశ్వాసాన్ని పెంచినట్లయ్యేది. తద్వారా దేశ ప్రజలు స్వయం సమృద్ధం అయ్యే అవకాశమున్నది.

ఈ సమ్మె నేపథ్యంలో కేంద్ర ప్రభుత్వం కార్మిక సంఘాలతో చర్చలు జరిపింది. కాని అది ఏ డిమాండ్‌ను పరిష్కరించలేదు. ఈ సమ్మె ముందుకు తెచ్చిన డిమాండ్‌లు అన్నీ కూడా సమంజసమైనవి. దేశ స్వయం నిర్ణయాధికారాన్ని, స్వావలంబనను ప్రజాస్వామ్యాన్ని పరిరక్షిస్తూ ప్రజల కనీసావసరాలను తీర్చేటందుకు దోహదపడేవే తప్ప అవేమీ గొంతెమ్మ కోరికలో అన్యాయమైనవో కానేకావు. ఈ డిమాండ్లను సాధించుకోవడం ప్రజల ప్రజాస్వామిక హక్కులకు సంబంధించిన విషయం. రాజ్యాంగంలో గ్యారంటీ చేయబడిన హక్కులను సాధించు కోవడానికి ఉద్యమించాల్సిన ఆగత్యం ఎప్పుడూ ఉంటూనే వస్తున్నది. కష్టనష్టాలకోర్చి ఆందోళనలకు, పోరాటాలకు, ఉద్యమాలకు ప్రజలు సిద్ధం కావాల్సి రావడం అనేది ఈ దేశంలోని ప్రజాస్వామిక వ్యవస్థ అభాసుపాలు కావడాన్ని సూచిస్తున్నది.

సెప్టెంబర్ 2 నాటి సార్వత్రిక సమ్మెకు దేశవ్యాప్తంగా పెద్ద ఎత్తున స్పందన వచ్చినప్పటికీ సమ్మె డిమాండ్లు ఏవీ కూడా నెరవేర్చబడలేదు. రక్షణ రైల్వే రంగాల్లో విదేశీ పెట్టుబడులు నిలిపివేయడం, ప్రభుత్వ రంగ సంస్థల్లో పెట్టుబడుల ఉపసంహరణను నిలిపివేయడం, కాంట్రాక్ట్ విధానాన్ని ఎత్తివేయడం వంటి విషయాల్లో ప్రభుత్వం ఏమాత్రం స్పందించలేదు. తద్వారా ప్రజాభిప్రాయాలను ప్రభుత్వం పెడచెవిన పెడుతూ అవమానపరిచింది. నిజానికి ఈ సమ్మె మోడీ ప్రభుత్వానికి ఒక హెచ్చరిక వంటిది. అలాగే కార్పొరేట్ అనుకూల విధానాలను విరమించుకోవాలని ప్రజాసంక్షేమం కోసం ప్రభుత్వం పాటుపడాలని తదనుగుణంగా తన విధానాలను రూపొందించుకోవాలని చెప్పింది. ప్రజాభిప్రాయాలను, ప్రజాస్వామ్యాన్ని గౌరవించే ప్రభుత్వమే అయితే సార్వత్రిక సమ్మె ముందుకు తెచ్చిన డిమాండ్లపై స్పందించి ఉండేది కార్మిక వర్గాలతో చర్చలు జరిపి ఎంతో కొంతమేరకైనా అంగీకారానికి వచ్చేది. నిజానికి ఈ డిమాండ్లు తలెత్తకుండా ప్రభుత్వమే తగు చర్యలు తీసుకుని స్పందించాల్సి ఉన్నది. పోనీ ప్రజలు గుర్తు చేస్తూ పెద్ద ఎత్తున నిరసనలు తెలిపే పక్షంలోనైనా సరే ప్రభుత్వం దిగిరావాల్సి ఉంటుంది. కానీ అలాంటివేమీ ఈ సమ్మె నేపథ్యంలో జరగలేదు. 2014లో జరిగిన ఎన్నికల్లో కేంద్రంలో బి.జె.పి గెలుపుకు మీడియా అధిపతులు, కార్పొరేట్ శక్తులు శక్తివంచన లేకుండా కృషిచేశారు. మన్మోహన్‌సింగ్ అవసరం తీరిపోయిందనుకున్నాక మోడీ వెంట పడ్డారు. కార్పొరేట్ల రుణం తీర్చుకోవడానికి వారి పాదసేవలో తరించడానికి ఈ ప్రభుత్వం తపిస్తున్నట్లుగా తెలిసిపోతున్నది. ఈ క్రమంలో ప్రజలు తమ ఆకాంక్షలను అభిప్రాయాలను తెలియజేసి ప్రజాస్వామిక డిమాండ్లను ఎలా సాధించుకోవాలి. ఇంకెలా ప్రభుత్వాలకు తెలియజేయాల్సి ఉంటుంది? గతంలో ఎన్నో సార్లు దేశవ్యాప్త సమ్మెలు జరిగి ఓ యాంత్రిక వ్యవహారంగా మారిన పరిస్థితి కనిపిస్తున్నది. సమ్మెలపట్ల ప్రభుత్వాలు స్పందించని నేపథ్యంలో సమ్మెలకు మించిన పోరాట రూపాలు పదునెక్కవలసిన అవసరాన్ని ఈ సందర్భం కోరుతున్నట్లుగా అనిపిస్తున్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# రిజర్వేషన్లకు వ్యతిరేకంగా పటేళ్ల పోరు

***పాలకులు దళిత, మైనారిటీ వర్గాలకు వ్యతిరేక విధానాలు, ఆధిపత్య ధోరణులు అవలంబిస్తున్నారనీ, ఈ నేపథ్యంలోనే పటేళ్ల రిజర్వేషన్ డిమాండ్‌ను చూడాలనీ అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

గుజరాత్ రాష్ట్రంలో 22 ఏళ్ల వయస్సు ఉన్న హార్దిక్ పటేల్ నేతృత్వంలో పటేదార్ అనే ఆధిపత్య (అగ్రకుల) కులానికి చెందిన సామాజిక వర్గం ఇటీవల తమను ఒబిసి (అదర్ బ్యాక్‌వార్డ్ క్లాసెస్) రిజర్వేషన్‌లలో భాగంగా కలపాలనే డిమాండ్‌తో ఉద్యమించారు. అంతే కాకుండా ఆ రాష్ట్రంలో పెద్ద ఎత్తున విధ్వంసం, కొంతమంది చనిపోయారు, దాడులు జరిగాయి, కర్ఫ్యూ కూడా విధించారు. ఇది దేశ వ్యాప్తంగా సంచలనాత్మకమయింది.

గుజరాత్‌లో పటేల్ కులస్థులను పటీదార్లని పిలుస్తారు. పటీదార్ అంటే భూ యజమాని అని అర్థం. ఎక్కువ శాతం వ్యవసాయం ప్రధాన వృత్తిగా జీవనం కలిగి ఉంటారు. ఇటీవలి 30 సంవత్సరాల కాలంలో వ్యాపార రంగంలో ప్రవేశించి, బిస్కట్ల నుంచి విమానాల దాకా అంతా తమ ఆధిపత్యంలోనే ఉండాలని భావిస్తూ, అహ్మదాబాద్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ (ఐఐఎం)లో తమ వ్యాపార సామ్రాజ్యాలకు పరిశోధనా స్థాయి కల్పిస్తూ, పెద్ద ఎత్తున వ్యాపార వ్యవస్థలను దేశ వ్యాప్తంగా విస్తృత పరిచి, ప్రస్తుతం విదేశాలలో సైతం వీరి వ్యాపారాలు విస్తరించాయి. ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి చెందిన వజ్రాల వ్యాపారుల్లో పటేళ్ల పేరు మొదటి పది స్థానాలలోనే ఉందంటే వారి వ్యాపార జిజ్ఞాస, వ్యాపార ఆకాంక్షలను అర్థం చేసుకోవచ్చు.

1981-85 మధ్య కాలంలో ఇదే పటేళ్లు ప్రభుత్వ ఉద్యోగాలకు వ్యతిరేకంగా నినదించారు. రిజర్వేషన్లను సైతం వ్యతిరేకిస్తూ, పెద్ద ఎత్తున ఉద్యమించారు. కానీ ప్రస్తుతం వాటి అవసరం కోసం, తమ కులపు మహిళ (ఆనందబెన్ పటేల్) ముఖ్యమంత్రిగా ఉండగా కూడా ఉద్యమించడం అనేక ప్రశ్నలను లేవనెత్తుతుంది. దీని వెనుక ఉన్న శక్తులెవరో, ఏయే రాజకీయ పక్షాలు వీరికి అండగా ఉన్నాయో తెలియాల్సి ఉంది. కానీ అంతా ఆధిపత్య సంస్కృతితో, తమకు ఎదురు ఎవరూ నిలువలేరనే అహంతో ఉద్యమిస్తున్న తీరు మనకు కనబడు తోంది. మొత్తం రాజ్యాంగ యంత్రాంగాన్నంతా తాము శాసిస్తామనే ధోరణిలో వారి ఉద్యమ తీరు కనబడుతున్నది.

ఆగస్టు 29న ఢిల్లీలో హార్దిక్ పటేల్ ప్రెస్‌మీట్ పెట్టి తాను గుజ్జర్లనూ, కుర్మీలనూ, ఝూట్‌లనూ కలుపుకుని దేశవ్యాప్త ఉద్యమం చేపట్టుతాననీ, మొత్తం 24 కోట్ల మంది ప్రజలమవుతాం, ఈ ప్రభుత్వాన్ని నిలదీస్తామనీ హెచ్చరించాడు. అయితే ఇందులో కుర్మీలు ఇప్పటికే ఒబిసిలో ఉన్నప్పటికీ, (బీహార్‌లో ఆధిపత్య రాజకీయాలలో ఉన్నారు - కర్నాటక ముఖ్యమంత్రి సిద్ధరామయ్య కూడా ఈ కులానికి చెందినవాడే) వారిని కలుపుకుని పోవడానికి హార్దిక్ పటేల్ ముందుకు వచ్చాడంటే వ్యూహాత్మకంగానే ఒబిసి కులాలను ఒప్పించే ప్రయత్నం చేస్తున్నట్లు కనపడుతున్నది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కూడా భవిష్యత్తులో కాపులు, కమ్మ కులస్థులు, ఈ తరహా ఉద్యమాలు చేయాలనే తలంపుతో ఉన్నట్లు అప్పుడే సంకేతాలు మొదలయ్యాయి. దీనిని తీవ్రంగా వ్యతిరేకించవలసి ఉంది. ఎందుకనగా, ఆధిపత్య కులాలన్నీ, ఈ విధంగా ఆర్గనైజ్ అవుతూ మరింత బలంగా గ్రామీణ ప్రాంతాలలో కుల వ్యవస్థను అమలు జరుపుతూ ఉండాలనే బలమైన ఆకాంక్ష వీరిలో ఉంది. ఇందుకు ఎక్కడికక్కడ రాజకీయ పక్షాలు కూడా సహకరించాలనే ధోరణి కూడా కనపడుతున్నది. ఇది ఇప్పుడిప్పుడే బలపడుతున్న ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనారిటీ - ఉపకులాలన్నింటికీ ప్రమాదమే. ఎందుకనగా కొద్దో, గొప్పో చదువుకొని, ఆర్థికంగా, సామాజికంగా నిలదొక్కుకుంటున్న పరిస్థితులలో ఇలాంటి ఉద్యమాలు, దళిత, బహుజన శక్తులకూ, వారి చైతన్యానికీ ఆటంకం కలిగించేవే. చాలా లోతుగానే, వ్యూహాత్మకంగానే, ఆర్‌ఎస్‌ఎస్, సంఘపరివార్ శక్తులూ, కాంగ్రెస్ పార్టీలో ఉన్న కొంత మంది అగ్రకుల మేధావులు పటేల్‌ల ఉద్యమానికి వెన్ను దన్నుగా ఉన్నట్లు అర్థమవుతున్నది.

ఈ దేశంలో అడుగడుగునా, అణిచివేతనూ, అగ్రకుల ఆధిపత్యాన్ని చాటి చెపుతున్న హిందూత్వ ఫాసిస్ట్ శక్తులు, మరోసారి పటేళ్ల ఉద్యమ రూపంలో గుజరాత్ రాష్ట్రంలో హింసను ప్రేరేపించాలనే దుష్ట సంకల్పంతో ఉన్నారు. దీనిని ప్రగతిశీల, ప్రజాస్వామిక శక్తులన్నీ ప్రతిఘటించవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

పటేళ్ల రిజర్వేషన్ డిమాండ్‌ను రెండు కోణాల్లో చూడాలి. 1) రాజకీయ కోణం 2) అగ్రకులంలోని పేదలకు రిజర్వేషన్ డిమాండ్ నిజంగా ఉన్నదా? అనే విషయం కూడా కొంత లోతుగానే పరిశీలిద్దాం.

గుజరాత్ రాష్ట్ర రాజకీయాలలో ఎక్కువశాతం పటేళ్ల పాలనే సాగింది. చిమన్‌భాయ్ పటేల్, కేశూభాయ్ పటేల్, ఇప్పుడు ఆనంద్ బెన్ పటేల్ ఈ విధంగా ఎక్కువ కాలం పటేల్ కులస్థులే గుజరాత్ రాష్ట్రాన్ని పరిపాలించారు. (2001-14 వరకూ నరేంద్రమోడీ ముఖ్యమంత్రిగా ఉన్న విషయం తెలిసిందే). ఇప్పుడు ఉన్న గుజరాత్ అసెంబ్లీలోని 121 మంది బిజెపి ఎంఎల్‌ఎలలో కూడా 42 మంది పటేల్ కులానికి చెందిన వారే. అందుకే బహుశ నరేంద్రమోడీ తన తర్వాత అదే కులానికి చెందిన ఆనంద్ బెన్ పటేల్‌ను ముఖ్యమంత్రిగా చేశాడు. వీరందరికీ, భారతదేశ మొదటి హోంమంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్ ఆదర్శం. ప్రస్తుత ప్రధాన మంత్రి నరేంద్రమోడీ గుజరాత్‌లోని పటేళ్ల ఉద్యమాన్ని ఏ విధంగా చూస్తున్నప్పటికీ, ఇది గుజరాత్ ప్రజల సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను తీవ్రంగా ప్రభావితం చేస్తున్నది. గుజరాత్‌లో ప్రారంభమైన ఉద్యమం దేశవ్యాప్తంగా మరికొన్ని కులాలు కలసి ఉద్యమిస్తే, వారికి సహకరిస్తే, అది నరేంద్రమోడీ వ్యక్తిగత ప్రతిష్టకు భంగం వాటిల్లే ప్రమాదం కూడా లేకపోలేదు. భారతీయ జనతాపార్టీ నాయకత్వంలోని ప్రధానమంత్రి గుజరాత్ మోడల్‌గా ప్రచారం చేసుకున్న పాలన పటేళ్ల సమస్యకు ఏ విధమైన పరిష్కారాన్ని కనుగొంటుందో చూడాలి.

రెండవ కోణం, అగ్రకులంలోని పేదలకు రిజర్వేషన్ డిమాండ్ నిజంగా ఉన్నదా? ఈ దేశంలో కొన్ని సామాజిక వర్గాలు రిజర్వేషన్లను అనుభవించి, కొంత ఆర్థికంగా ప్రగతి సాధించిన విషయం వాస్తవమే. అయినప్పటికీ సామాజిక స్థాయి, స్థితి గతులు ఈ పౌర సమాజం'లో

ఏమాత్రం మారలేదు.

అగ్రకులంలోని పేదలు అనే విషయం వచ్చేసరికి, బాగా ఇటీవలి కాలంలో కృషించిపోయిన వారు, సాంప్రదాయాలలో మునిగి తేలుతూ, తమ పూర్వం ఆస్తులను కోల్పోయి, దుర్భర జీవితం గడుపుతున్నవారు బ్రాహ్మణులు. వీరు వేరే వృత్తులు చేసుకోలేక, ఉన్న వాటితోనే సర్దుకుని జీవిస్తున్నారు. ప్రస్తుతం దేశంలో వీరి రాజకీయ ఆధిపత్యం చాలా తగ్గిపోయింది. వైశ్యులు వివిధ రకాలైన వ్యాపారాలు చేసుకుని లక్షలాది రూపాయలు వార్షికాదాయం ఉన్నప్పటికీ, సామాజికంగా వారి హోదా అగ్రకులం'లో ఉన్నప్పటికీ, ఎక్కువ మంది తెల్ల రేషన్ కార్డ్ కలిగి ఉండడం వలన కొన్ని ప్రత్యేక రాయితీలు పొందుతున్నారు. మిగతా కులాల వారు రాజకీయంగా ఏదో ఒక రకమైన స్థాయిలలో ఉంటున్నారు. వీరందరికీ రిజర్వేషన్లు అనేసరికి, ఇందుకు రాజ్యాంగ సవరణ జరగాలి. అయితే రిజర్వేషన్లు 50 శాతం మించరాదు అనే రాజ్యాంగ నిబంధన కూడా ఉన్నది. దీనిని కూడా పరిగణనలోనికి తీసుకోవాలి.

ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో కమ్మ-రెడ్డి కులాలు రాజకీయ ఆధిపత్యాన్ని కలిగి ఉన్నాయి. వీరిలోని పేదలకు రిజర్వేషన్లు ఇస్తే, దాదాపు అన్ని రంగాలలో కూడా వీరే బలపడే ప్రమాదం కూడా ఉన్నది. ఇలాంటి విషయాలు కూడా కూలంకషంగా ఆలోచించాలి. లేని పక్షంలో తరతరాల నుంచి అణిచివేతకు గురవుతున్న కులాలు ఇంకా వెనుకబడే ప్రమాదం ఉంది.

వాస్తవానికి రిజర్వేషన్లతో ఆయా సామాజిక వర్గాలలో కొంత మంది మాత్రమే ఉన్నతి సాధించారనేది స్పష్టం. అయితే ఈ రిజర్వేషన్ల ఫలాలు ఎందుకు సామాన్యుని వరకూ అందకుండా పోతున్నాయన్నది ఆలోచించాల్సిన అవసరం ఉన్నది. అందరికీ విద్య - ఉద్యోగం ఒక నినాదంగా మాత్రమే మిగిలిపోయింది. పైగా ఇప్పుడు చదువులలో కేవలం కొంత మందికి మాత్రమే కొలువులు వచ్చే ప్రమాదం ఉంది. ఎక్కువ శాతం నిరుద్యోగులుగా మిగిలిపోతున్నారు. దీనికి పరిష్కారం కనుగొనాలి. లేనిచో భవిష్యత్తులో మరిన్ని ప్రమాదాలు వచ్చే అవకాశాలు లేకపోలేదు. రిజర్వేషన్ల ప్రయోజనం పొంది ఆర్థికంగా ఉన్నతి చెందినవారు, అదే కులంలోని కింది స్థాయి వారి గురించి ఆలోచించడం లేదు. ఉపయోగించుకున్న వాడే ఉపయోగించుకోవడం వల్ల, ప్రయోజనం అంతా కొంత పరిమితిలోనే తిరుగుతుండడం వలన ఎక్కువ మంది ప్రయోజనం పొందే అవకాశం ఎలాగూ ఉండదు. ఇదే కుల వ్యవస్థ స్వరూప స్వభావాల లక్షణం. కాబట్టే మనిషి సామ్యవాద దృష్టితో, వర్గ దృష్టితో వ్యవస్థను చూడాలి. అప్పుడే నిర్దిష్టంగా, లోతుగా ఈ కుల వ్యవస్థ అర్థమవుతుంది.

ఈ రోజు పటేల్ సామాజిక వర్గం కూడా రిజర్వేషన్ల కోసం పోరాటానికి దిగడానికి దారి తీసిన పరిస్థితులు, కారణాలు విశ్లేషించాలి, ఈ కుల-వర్గ సమాజంలో ఆ లోపం ఎక్కడ ఉందో శాస్త్రీయంగా పరిశీలించాలి. ఉదాహరణకు ఎస్సి, ఎస్టి, బిసి - మైనారిటీ వర్గాలలో ధనవంతులైన వారు, తమ, తమ స్థాయిల్లో కింది వర్గాల వారిని దరి చేయనీయవచ్చు. కానీ ఆ విధంగా జరగడం లేదు.

గుజరాత్‌లో దాదాపు 2 లక్షలకు పైగా చిన్న, పెద్ద పరిశ్రమలు మూత పడ్డాయని అంటున్నారు. వాటిలో మెజారిటీ పటేల్ సామాజిక వర్గానివే. తద్వారా పటేల్ సామాజికవర్గంలో అనేకమంది దృష్టి ఉద్యమం పైన పడింది. విదేశాలలో ఉన్న ఈ సామాజికవర్గానికి చెందిన ధనవంతులూ, పెట్టుబడిదారులూ వీరిని ఉద్యమం వైపు ప్రోత్సహించారు. అంతే కాకుండా వ్యవసాయం ద్వారా, పాల ఉత్పత్తుల ద్వారా పేరు ప్రఖ్యాతులు ఆర్జించిన ధనవంతులైన పటేళ్ళు, ఈ ఉద్యమానికి వెన్ను దన్నుగా ఉన్నారు. ఈ దృష్టితోనే, పటేళ్ల పోరాటాన్ని విశ్లేషించు కోవాలి.

తమ ఆధిపత్య, అగ్రకుల దురహంకారాన్ని చాటి చెప్పుతున్నారు.

తమకు ఉద్యోగాలు రాకపోవడానికి ముఖ్య కారణం రిజర్వేషన్లు కాదని మొట్ట మొదటగా ఈ పటేళ్ల ఉద్యమ నిర్వాహకులు తెలుసుకోవాలి. ఏ రిజర్వేషన్లు పాటించని ప్రైవేట్ రంగం ఎందుకు అగ్రకుల యువతకు పూర్తి స్థాయిలో ఉపాధి మార్గం చూపలేక పోయిందనే విషయం కూడా ఆలోచించాలి. ఉన్నవాళ్లను కూడా కొన్ని చోట్ల తొలగిస్తున్నారు. పదేళ్ల క్రితం మెరిట్ ఉన్నవారిని ఉద్యోగాల్లోకి తీసుకుని ఇప్పుడు ఏవేవో కారణాలు చెప్పి తొలగిస్తున్నారు. వారంతా ఏమి చేయాలో, ఎక్కడికి పోవాలో అర్థం కాని పరిస్థితి ఇప్పుడు దేశంలో ఉంది. వారి ఉపాధిని కాపాడడానికి ఇప్పుడున్న కార్మిక చట్టాలు సరిపోవడం లేదు. వాటిని అమలు చేయించుకోవడం చాలా సమస్యతో కూడుకున్న పని అయింది.

నయా ఉదారవాద విధానాల అమలులో ప్రతికూల ఫలితాలు ఇప్పుడు కనిపిస్తున్నాయి. ప్రైవేట్ రంగం విస్తరణతో మొదట లాభపడ్డ అగ్రకుల, మధ్య తరగతి వర్గాలలో ఇప్పుడు నిరుద్యోగం ప్రబలింది. ప్రభుత్వ రంగ పతనంతో వెనుకబడిన సామాజిక వర్గాల్లో ఉపాధి అవకాశాలు తగ్గి నిరుద్యోగం తీవ్రంగా పెరిగింది. వాస్తవానికి కులాల వారిగా ఉపాధి పరిశీలిస్తే, కంప్యూటర్ వంటి ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ వంటి నైపుణ్యంతో కూడిన రంగాలు మొదలుకొని, ఆటో వంటి పారిశ్రామిక రంగాల వరకూ అగ్రకుల శక్తులు తమ, జనాభా నిష్పత్తికి మించి ఉపాధి పొందారు. మిగతా ఎస్సి, ఎస్టి, బిసిలు చాలా తక్కువ స్థాయిల్లో ఉన్నట్లు మనకు ప్రభుత్వ సమాచారం తెలుపుతున్నది. ఇప్పుడు ప్రభుత్వం కూడా ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు అమలు చేయడానికి బదులు, ఏవేవో గాలి కబుర్లు చెపుతున్నది. ఇప్పుడు నరేంద్రమోడీ కూడా స్టార్టప్, స్టాండప్ అంటూ కొన్ని నినాదాలు ఇస్తున్నారు. ఎస్సి, ఎస్టి, బిసి యువత కొత్తగా వ్యాపారం, పరిశ్రమలు పెట్టుకోవడానికి బ్యాంకులు చేయూతనివ్వాలని ఆయన అంటున్నారు. ఉపాధికి బదులు మీరు పరిశ్రమలు పెట్టండి'-మేము పెట్టుబడులను బ్యాంకుల ద్వారా ఇప్పిస్తాం అంటున్నారు. మీరే 10 మందికి ఉపాధి కల్పించే స్థాయి రావాలంటూ నరేంద్రమోడీ ఉద్భోదిస్తున్నారు. ఇప్పుడున్న పోటీ ప్రపంచంలో ఇది సాధ్యమయ్యేపనేనా? ఆచరణలో చాలా ఇబ్బందులు పడాల్సివస్తుంది యువత. అప్పులు తీర్చలేక తమ తమ పరిశ్రమల యంత్రాలను అమ్ముకొని, మళ్లీ మొదటికి వస్తున్నారు.

గతంలో ఎంతో అనుభవం ఉంది ఈ విషయాలలో. పరిశ్రమలు నిలదొక్కుకోవాలంటే అందులో తయారయ్యే సరుకులకు మార్కెటింగ్ ఉండాలి. కొనుగోలు శక్తి ప్రజలకు ఉండాలి. ప్రజల ఆదాయ వనరులు పెరగాలి. అసంఘటిత రంగంలో ఉన్న చాలా మంది కార్మికులకు వేతనాలు లేవు. నిరుద్యోగం, పేదరికం, ఆత్మహత్యలు, ఇప్పటికీ గ్రామాలలో ఉన్న కుల వ్యవస్థ, దళితులపై, మహిళలపై దాడులు ఈ 68 సంవత్సరాల దేశ స్వాతంత్ర్య ఫలాలు. వీటన్నింటికీ పాలకుల విధానాలే కారణం.

ఎన్నో ఏళ్లుగా పోరాడి సాధించుకున్న సామాజిక న్యాయంపై వేటు వేయాలని చూస్తున్నారు. వెనుకబడిన వివిధ సామాజిక వర్గాల, పాలకుల కుట్రలను గమనించాలి. పాలకుల కుటిల నీతిలో రాజకీయ పావులుగా మారకుండా ఉండాలి. బలిపశువులు కాకూడదు. పాలకుల ప్రజా వ్యతిరేక, దళిత, బిసి, మైనారిటీ వ్యతిరేక ధోరణిని తిప్పికొట్టేందుకు సంఘటితంగా పోరాడాలి. అగ్ర కులాల్లోని ఆర్థికంగా వెనుకబడిన వర్గాలనూ, ప్రజాస్వామ్య శక్తులనూ కలుపుకొని పోరాటం కొనసాగించాలి. అందరికీ విద్య-ఉపాధి-ప్రజాస్వామ్య, పౌర హక్కులకై పోరాటం నిరంతరం చేయాలి.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర ఆర్గనైజింగ్ కార్యదర్శి)* వీ

# ప్రాథమిక హక్కుల్లో విద్య మిథ్యేనా?

*విద్యా హక్కును ప్రాథమిక హక్కుల్లో చేర్చి దశాబ్దం పైగా గడిచిపోయినా, మిగిలిన హక్కుల లాగనే అది కూడ మిథ్య అయిపోయిందంటున్నారు* **దుర్గం సారయ్య**

విద్య మానవుని అజ్ఞాన భరిత జీవితం నుండి జ్ఞానపూరిత జీవితానికి, ప్రమాణ రహిత సమాజం నుండి ప్రమాణానికి, అహేతుక జీవితం నుండి హేతుబద్ధ జీవితానికి నడిపించాలి. విద్య మానవీయ సంస్కృతిని, ప్రజాస్వామిక విలువలను, లౌకిక ప్రజాతంత్ర భావాలను పెంపొందించే, సామాజిక న్యాయాన్ని సాధించే విధంగా ఉండాలి. ఈ విధంగా విద్యా విధానాన్ని రూపొందించడం మూలాన మానవీయ విలువలు పెంపొంది, వాస్తవ విజ్ఞానంతో కూడిన ప్రజాస్వామిక సమాజానికి పునాది ఏర్పడుతుంది. దీనికై మన ప్రభుత్వాలు విలువలతో కూడిన విద్యను అందరికీ అందుబాటులోకి తేవాలి. ఎటువంటి ఫీజు లేకుండా ప్రభుత్వమే ఉచితంగా, నాణ్యతతో కూడిన విద్యను అందించాలి. కుల, మత, లింగ తారతమ్యాలు లేకుండా 14 ఏళ్లు గల పిల్లలందరికీ ప్రాథమిక విద్యను పొందే హక్కు భారత రాజ్యాంగం కల్పించినప్పటికీ దాని అమలుకు నోచుకోవడం లేదు.

ఫలితంగా పౌరుల ప్రాథమిక హక్కులో చోటు చేసుకున్న ప్రాథమిక విద్య హక్కు రూపంలో ప్రభుత్వాలు అందరికీ విద్య కల్పిస్తున్నట్లుగా... సారంలో కొందరికే విద్యగా మారింది. పౌరుల ఆదేశిక సూత్రాల నుండి ప్రాథమిక హక్కులలో విద్య హక్కుగా రూపాంతరం చెంది ఏండ్లు గడుస్తున్నా, ఎండమావిలో నీటి లాగానే ప్రాథమిక హక్కులో విద్య మిథ్యగానే ఉంది. విద్య ప్రజలందరికీ అందుబాటులోకి రావాలన్నా, విద్యా వ్యాప్తి జరగాలన్నా ప్రజల ఆర్థిక స్థితిగతులు మెరుగు పరచకుండా సాధ్యం కాదు. ఈ విషయాన్ని గుర్తించిన పూలే, గోఖలే, గాంధీ, అంబేద్కర్ లాంటి మహనీయులు ఉచిత నిర్బంధ విద్య అమలు పరచాలని ఆనాటి బ్రిటిష్ పాలకులను కోరారు. దీనికి బ్రిటిష్ పాలకులు నిరాకరించారు. రాజ్యాంగ పరిషత్ సభలో డా. బి.ఆర్. అంబేద్కర్ మాట్లాడుతూ ప్రజల్లో నెలకొన్న పేదరికం, దారిద్ర్యం, అమాయకత్వం, అవిద్య వంటి సమస్యల నిర్మూలనకు నిర్దిష్టమైన పరిష్కారం చూపకపోతే ప్రజలు ఈ రాజ్యాంగాన్ని తగులబెడతారని హెచ్చరించాడు.

1948-49 మధ్య కాలంలో రాజ్యాంగ పరిషత్‌లో జరిగిన చర్చలలో పేద ప్రజలందరికీ విద్యా అవకాశాలు కల్పించాలని, 14 ఏళ్ల పిల్లలందరికీ ఉచిత విద్య హక్కుగా గుర్తించాలని అంబేద్కర్ వాదించాడు. అంబేద్కర్ ప్రతిపాదించిన 14 ఏండ్ల వయోపరిమితిని, 11 ఏండ్ల వరకే కేటాయించాలని రాజ్యాంగ పరిషత్‌లో సభ్యులు అడ్డుకున్నారు. పౌరుల ప్రాథమిక హక్కులలో చేర్చవలసిన ప్రాథమిక విద్యను మెజారిటీ సభ్యులు అంగీకరించని కారణంగా భారత రాజ్యాంగంలో పౌరుల ఆదేశిక సూత్రాలలో 45వ అధికరణంలో మాత్రమే చోటు దక్కింది. ఇక్కడి నుండి ప్రాథమిక విద్యపై పాలకుల దాడులు ప్రారంభమైనాయి. విద్యను హక్కుగా గుర్తించి పిల్లలందరికీ అందించాల్సిన ప్రభుత్వం ప్రాథమిక విద్యపట్ల నిర్లక్ష్యం వహించడం రాజ్యాంగం ఆది నుండి మొదలైంది.

**విద్యా హక్కు బిల్లుకు ముందు**

స్వేచ్ఛగా, స్వతంత్రంగా, గౌరవంగా జీవించే హక్కులో అంతర్భాగమే విద్యా హక్కు. విద్యాభ్యాస హక్కును నిరాకరించడమంటే జీవించే హక్కును నిర్దేశించే రాజ్యాంగ స్ఫూర్తిని గుర్తించకపోవడమే, అంతే కాదు భారత రాజ్యాంగంలో ఆర్టికల్ 19(1) ..... ప్రసాదించిన వాక్ స్వాతంత్ర్యం, భావ ప్రకటనా హక్కును కూడా నిరాకరించడమే. ఇదే విషయాన్ని నాలుగున్నర దశాబ్దాల తరువాత భారత అత్యున్నత న్యాయ స్థానం 1993లో ఉన్ని క్రిష్ణన్ వర్సెస్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కేసులో స్పష్టం చేసింది. తన తీర్పులో ఈ విషయాన్ని పేర్కొంటూ రాజ్యాంగంలోని 21వ అధీకరణంలో పొందుపరచిన జీవించే హక్కును గౌరవంగా జీవించే హక్కుగా వ్యవహరిస్తూ ప్రాథమిక విద్యను హక్కుగా పొందడం ఇందులో భాగమని పేర్కొంది. 14 ఏళ్ల వయస్సు గల బాల బాలికలకు అందిస్తున్న ప్రాథమిక విద్య, ప్రాథమిక హక్కుగా గుర్తించాలని పేర్కొన్నది.

సుప్రీం కోర్టు తీర్పు తరువాత 1997లో యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం ప్రాథమిక విద్యను ప్రాథమిక హక్కుగా గుర్తిస్తూ 83వ రాజ్యాంగ సవరణ తీసుక వచ్చింది. యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం తెచ్చిన ఈ రాజ్యాంగ సవరణ బిల్లులో అనేక లోపాలున్నాయి. బిల్లుపై తీవ్ర వ్యతిరేకత, నిరసనలు వ్యక్తమయ్యాయి. ఈ పరిణామాల నేపథ్యంలో ప్రాథమిక విద్యను, ప్రాథమిక హక్కుగా 10 సంవత్సరాలలో అమలు చేయడానికి అవసరమైన వ్యవస్థ రూపకల్పన, అందుకు అవసరమయ్యే నిధుల అంచనా వేయడం కోసం తమన్ మజుందార్ కమిటీని 1997 జూన్‌లో నియమించింది. ఈ కమిటీ తన నివేదికను 1999 జనవరిలో కేంద్రానికి సమర్పించింది. పాఠశాల విద్యలో అసమానతలు, ద్వంద ప్రమాణాలను తిరస్కరించి విలువైన సిఫారసులు చేసింది. ఈ కమిటీ సిఫారసులను ఆచరించకుండా అటకెక్కించారు.

తమన్ మజుందార్ కమిటీ తన నివేదికను సమర్పించిన మూడేండ్లకు అధికారంలోకి వచ్చిన ఎన్.డి.ఎ. ప్రభుత్వం 2001లో ప్రాథమిక విద్యను – ప్రాథమిక హక్కుగా చేస్తూ 86వ రాజ్యాంగ సవరణ బిల్లు తెచ్చింది. 2002 డిసెంబర్‌లో 86వ రాజ్యాంగ సవరణ బిల్లుకు పార్లమెంట్‌లో ఆమోదం లభించింది. 55 సంవత్సరాల స్వాతంత్ర్యం తరువాత విద్యను హక్కుగా మన పాలకులు గుర్తించారు. రాజ్యాంగంలో ప్రాథమిక హక్కుల విభాగంలో 21(ఎ) కొత్త అధికరణం ఈ బిల్లు ద్వారా చోటు చేసుకుంది. 83వ రాజ్యాంగ సవరణ బిల్లు తరహాలో ఈ బిల్లులో కూడా అనేక లోపాలున్నాయి. ఈ బిల్లు అసలు విద్యను హక్కుగా గుర్తించకపోగా ప్రాథమిక విద్యను బలహీనం చేసే విధంగా ఉంది.

**లొసుగుల చట్టం**

2004 జూన్‌లో అధికారంలోని వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ఎన్‌డిఎ ప్రభుత్వం తయారు చేసిన విద్యా హక్కు ముసాయిదా బిల్లును పరిశీలన

పేరుతో నాలుగు సంవత్సరాలు కాలయాపన చేసింది. ఎవరి సూచనలు, సలహాలు స్వీకరించకుండా అనేక లోపాలు లొసుగులతో కూడిన బిల్లును 2008 డిసెంబర్ 18న పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టారు. సెప్టెంబర్ 3న రాష్ట్రపతి ఆమోదం పొంది 'విద్యా హక్కు చట్టం 2009' ప్రధానమంత్రి ప్రసంగం ద్వారా 2010 ఏప్రిల్ 1 నుంచి (జమ్ము - కశ్మీర్) మినహా దేశ వ్యాప్తంగా అమలులోకి వచ్చింది. 2009 జూలై 20న రాజ్యసభలో, 2009 ఆగస్టు 4న లోక్‌సభలో (255 మంది ఉండే రాజ్యసభలో 50 మంది సభ్యులు హాజరైనప్పుడు 10 మంది సభ్యుల మద్దతుతో) మూజువాణి ఓటు విధానంతో ఈ బిల్లు పాసైంది. ఈ చట్టాన్ని బాల బాలికల ఉచిత నిర్బంధ 'విద్యా హక్కు చట్టం - 2009' అని పేర్కొన్నారు.

68 సంవత్సరాల స్వాతంత్ర్యం తరువాత విద్యను హక్కుగా గుర్తిస్తూ తీసుకొచ్చిన 'విద్యాహక్కు చట్టం - 2009' ద్వారా పేద, మధ్య తరగతి అట్టడుగు వర్గాల పిల్లలకు చదువు అందుబాటులోకి వస్తుందని ఆశించారు. కాని ఈ బిల్లు పేదవాడిని విద్య నుండి మరింత దూరం చేసేదిగా, చీకటి నుండి చిమ్మచీకట్లో నెట్టివేసే విధంగా రూపొందించ బడ్డది. విద్యా హక్కు చట్టం - 2009లో 38 సెక్షన్లు, ఒక షెడ్యూల్ ఉన్నాయి. ఆ 38 సెక్షన్లు 7 అధ్యాయాలుగా విభజించారు. విద్యాహక్కు చట్టంలో 2వ సెక్షను, 13వ సెక్షను 12(2) సెక్షన్లు మొత్తం విద్యను నీరుగార్చే విధంగా ఉన్నాయి.

**పూర్వ ప్రాథమిక విద్యకు గ్యారంటీ ఏది?**

విద్యాహక్కు చట్టం సెక్షన్ -2లో పిల్లలు అన్న పదానికి 6-14 వయో పరిమితిలో ఉన్న బాలబాలికలు అన్న అర్థం ఇవ్వబడింది. ఈ విధంగా పిల్లల నిర్వచనం ఇవ్వడంతో దేశంలో 6 సంవత్సరాల లోపు వయస్సున్న సుమారు 17 కోట్ల మంది పిల్లలకు ఈ బిల్లు పూర్వ ప్రాథమిక (0-6) విద్యకు హక్కు కల్పించలేదు.

పిల్లలు అంటే (0-18) సంవత్సరాల మధ్య వయస్సు గల వారని చైల్డ్ రైట్స్ కన్వెన్షన్ 1990లో గుర్తించింది. ఆ తీర్మానంపై మన దేశం ప్రపంచ దేశాలతో పోటీపడి సంతకం పెట్టింది. ఆ తీర్మానం ఆధారంగా 0-6 వయస్సు గల పిల్లల పూర్వ ప్రాథమిక విద్య, 15-18 సంవత్సరాలు గల పిల్లలు సెకండరీ విద్య, విద్యాహక్కు చట్టంలో సెక్షను 2 ద్వారా నిరాకరించారు. అధ్యయనం 3, సెక్షను 8(ఎ)లో నిర్బంధ విద్య బాధ్యత ప్రభుత్వానిదే అని పేర్కొన్నారు. అయితే మరల 8(ఎస్) లో ప్రతి బిడ్డ రెగ్యులర్‌గా పాఠశాలకు హాజరయ్యేటట్లు చూసుకునే బాధ్యత తల్లితండ్రులపై నెట్టివేశారు. ఈ విధంగా విద్యను హక్కుగా ఇవ్వడంలో గందరగోళం సృష్టించి, తన బాధ్యత నుండి ప్రభుత్వాలు తప్పుకోవడానికి అవకాశం కల్పించబడింది.

**అధిక ఫీజులకు అడ్డుకట్ట ఏది?**

అధ్యయనం 4లో సెక్షన్ -13లో క్యాపిటేషన్ ఫీజు వసూలు చేయడం నిషేధమని పేర్కొనబడింది. అయితే క్యాపిటేషన్ ఫీజుకు నిర్వచనం సెక్షను-2లో ఇలా పేర్కొంది. అడ్మిషన్ల సందర్భంలో బహిరంగంగా ప్రకటించిన ఫీజుకు అదనంగా వసూలు చేసే ఫీజు అనే నిర్వచనం ఇవ్వబడింది. ఈ నిర్వచనం ప్రకారం ప్రైవేట్ యాజమాన్యాలు ఎంత ఫీజునైనా వసూలు చేయవచ్చు. ఎంత ఫీజు వసూలు చేసేది అడ్మిషన్ల సందర్భంలో బహిరంగంగా నోటీసు బోర్డులో ప్రకటిస్తే చాలు. ఈ చట్టం ప్రకారం ప్రైవేట్ యాజమాన్యాలు ఎంత ఎక్కువ ఫీజునైనా వసూలు చేసుకునే స్వేచ్ఛ ఉంది. ప్రైవేటు, కార్పొరేట్ పాఠశాలలకు విద్యాహక్కు చట్టంలో సెక్షను 2, 13లు ఫీజులు దండుకోవడానికి లైసెన్సు ఇచ్చింది.

**ప్రభుత్వ పాఠశాల పరిరక్షణ ఏది ?**

రాష్ట్రంలో ప్రాథమిక విద్యను ప్రభుత్వాలు శిక్షిస్తున్నాయి. తొలి పలుకులు నేర్చుకోవాలనుకుంటున్న గొంతులు ప్రభుత్వాల విధానాల మూలంగా మూగబోతున్నాయి. పాఠశాలలకు వెళ్లే పిల్లలకు ఆహ్లాదకరమైన వాతావరణంలో, ఆసక్తిని రేకెత్తించే విధంగా విద్యాలయాలు ఉండాలి. కాని నేడు పాఠశాలలు, వాటి ప్రాంగణాలు దుర్భరంగా ఉన్నాయి. కర్ణుడి చావుకి ఎన్ని కారణాలో అన్నట్లుగా నేడు ప్రాథమిక విద్య బలహీనం అవడానికి అన్ని కారణాలు ఉన్నాయి. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 80 శాతం పాఠశాలల్లో సరిపడ తరగతి గదులు లేక, ఒకే తరగతి గదిలో రెండు, మూడు క్లాస్‌లు కొనసాగుతున్నాయి. 29,672 పాఠశాలలకు మరుగుదొడ్లు లేవని కేంద్ర ప్రభుత్వమే నిస్సిగ్గుగా ప్రకటించింది. 17,536 పాఠశాలల్లో మంచినీటి వసతి లేదు. 50,159 పాఠశాలల్లో విద్యుత్తు సౌకర్యం లేదు. 51,663 పాఠశాలలకు ప్రహరి గోడలు లేవు. 39,088 పాఠశాలలకు ఫర్నీచర్ లేదు. 15 వేల పాఠశాలలు ఒక్కొక్క టీచరుతో నడుస్తున్నాయి. 2,264 పాఠశాలల్లో ఒక్క టీచర్ కూడా లేదు. ఈ విధంగా మొత్తం ప్రభుత్వ పాఠశాలలు ప్రభుత్వాల నిర్లక్ష్యం మూలంగా బలహీనం అవుతుంటే ప్రైవేట్ పాఠశాలలు మాత్రం ప్రభుత్వ అండతో కళకళలాడుతున్నాయి.

**పెరిగిపోతున్న డ్రాప్ ఔట్ రేట్**

పేదరికానికి - ప్రాథమిక విద్యకు అవినాభావ సంబంధం ఉంది. ఏ స్థాయిలో పిల్లలకు విద్య అందిస్తే అదే స్థాయిలో పేదరికం సమసిపోయే అవకాశం ఉంది. చదువుకునే ఆర్థిక స్థోమత లేక పిల్లలు బాల కార్మికులుగా తమ బాల్యాన్ని అమ్ముకుంటున్నారు. ఏటా దాదాపు లక్ష మంది విద్యార్థులు సర్కారీ బడులకు దూరమవుతున్నారు. వీరిలో కొంత మంది ప్రైవేట్ స్కూళ్లలో చేరుతుండగా కొందరు చదువులకు పూర్తిగా దూరమవుతున్నారు. 2002లో ప్రభుత్వ పాఠశాలల్లో 19,35,871 మంది విద్యార్థులు చేరితే 2012 వచ్చే సరికి (పదవ తరగతిలో) 10,51,051 మంది మిగిలారు. 8,84,820 మంది విద్యార్థులు మధ్య లోనే బడి మానేశారు. దేశ వ్యాప్తంగా చూసినప్పుడు ప్రతి ముగ్గురిలో ఇద్దరు 7వ తరగతిలో చేరకుండానే బడి మానేస్తున్నారు. మనరాష్ట్రంలో చూస్తే 5వ తరగతి పూర్తి చేయకుండా 16 శాతం 7వ తరగతి పూర్తి చేయకుండా 35 శాతం మంది పిల్లలు చదువుకు దూరం అవుతున్నారు. రాజశేఖర్‌రెడ్డి కాలంలో ఉమ్మడి రాష్ట్రంలో 80 లక్షల మంది విద్యార్థులు, 2000 టీచర్లు ప్రభుత్వ రంగంలో తగ్గారు. అదే ప్రైవేట్ రంగంలో 4000 పాఠశాలలు 12,00,000 విద్యార్థులు, 23,000 టీచర్లు పెరిగారు. డ్రాప్ అవుట్ రేటులలో 40 శాతం దళితులు, 65 శాతం ఆదివాసి పిల్లలున్నారు. 90 శాతం దళిత బాలికలు, 95 శాతం గిరిజన బాలికలు 10వ తరగతి పూర్తి చేయకుండానే చదువు మానేస్తున్నారు.

**నిధుల కొరత**

ప్రాథమిక విద్యపై, ప్రభుత్వాలు కేటాయించే బడ్జెట్ ఎట్లా ఉందంటే కుండలో అన్నం కుండలో ఉండాలి, బుడ్డోడు మాత్రం దుడ్డుగా ఉండాలి. అన్నట్లుంది. నిధుల కొరత పెట్టి ప్రాథమిక విద్యను హరిస్తున్నారు. మొదటి పంచవర్ష ప్రణాళికలో విద్యపై 7.86 శాతం, 2వ పంచవర్ష ప్రణాళికలో 5.83 శాతం, 4వ పంచవర్ష ప్రణాళికలో 5.16 శాతం, 5వ పంచవర్ష ప్రణాళికలో 3.3 శాతం, 7వ పంచవర్ష ప్రణాళికలో 2.5 శాతం ఇలా కోతలు విధిస్తున్నారు. ప్రభుత్వ పాఠశాలల అభివృద్ధికి బడ్జెట్‌లో కేటాయించిన నిధులు ఏ మాత్రం సరిపోవడం లేదు.

విద్యారంగం అభివృద్ధి చెందాలంటే 1964లో డా.డి.ఎస్. కొఠారి కమీషన్ సూచించిన విధంగా రాష్ట్ర బడ్జెట్‌లో 30 శాతం కేంద్ర బడ్జెట్‌లో పది శాతం జిడిపిలో ఆరు శాతం నిధులు కేటాయించి పాఠశాలల అభివృద్ధికి పాటు పడాలి.

**సూచనలు**

1) ప్రతి ప్రాథమిక పాఠశాలలో తరగతికి ఒక గది, ఒక ఉపాధ్యాయుని నియమించాలి; 2) పాఠశాలలన్నింటికి ఆట స్థలాలను, మరుగుదొడ్లను, నీటి సౌకర్యాన్ని, తాగు నీటిని, గ్రంథాలయాలను ఏర్పాటు చేయాలి; 3) ప్రతి పాఠశాలకు ఆఫీస్ అసిస్టెంట్‌ను, ఒక స్వీపరును, ఒక వాచ్‌మెన్‌ను నియమించాలి; 4) ప్రభుత్వ పాఠశాల విద్యార్థులకు ఉదయం అల్పాహారాన్ని, మధ్యాహ్నం మరింత పుష్టికరమైన ఆహారాన్ని, సాయంత్రం ఫలాహారాన్ని అందించాలి; 5) పాఠ్య పుస్తకాలను, నోట్ పుస్తకాలను, యూనిఫాంలను పాఠశాలలను తెరిచిన వెంటనే అందించాలి; 6) కొఠారి కమీషన్ సూచించిన విధంగా రాష్ట్ర బడ్జెట్‌లో 30 శాతం నిధులు కేటాయించి, ఖర్చు చేయాలి; 7) ప్రైవేట్/ కార్పొరేట్ పాఠశాలలను వెంటనే జాతీయం చేయాలి; 8) ప్రభుత్వ - ప్రైవేట్ భాగస్వామ్యం పేరుతో ప్రభుత్వ నిధులను ప్రైవేట్ కార్పొరేటు పాఠశాలలకు ఏ రూపంలోను దారాదత్తం చేయకూడదు; 9) శాస్త్రీయమైన హేతుబద్ధమైన పాఠ్యాంశాలను బోధించాలి; 10) ప్రజాస్వామ్యం, లౌకికవాదం, శాస్త్రీయ దృక్పథం వంటి విలువలను పెంపొందించే విధంగా అసమానతలను అంతమొందించి పై విధానాలను గౌరవించే విధంగా విద్యా విధానాలను అభివృద్ధి చేయాలి; 11) ప్రతీ ప్రాథమిక పాఠశాలకు అనుబంధంగా శిశు సంరక్షణ, విద్యా కేంద్రాన్ని స్థాపించాలి; 12) ఆర్థికంగా వెనుకబడిన పిల్లలను గుర్తించి వారికి ఆర్థిక సహాయం అందించాలి.

రాజ్యాంగ రచన మొదలుకొని విద్యా హక్కు చట్టం 2009 వరకు మన పాలకులు విద్యను అందించేందుకు కమిటీల, విద్యా కమిషన్‌ల పేర కాలం, ధనాన్ని వృథా చేశారు తప్ప ప్రాథమిక విద్యను పేదలకు అందించడంలో పూర్తిగా విఫలమయ్యారు. దీని మూలంగా డబ్బు ఉన్న పిల్లలకు విద్యలేని పేద పిల్లలకు విద్య మిథ్యగానే మిగిలిపోయింది. ఏ ప్రభుత్వం పరిపాలించినా ప్రాథమిక విద్యను బలహీనం చేసే పనినే చేపట్టారు. దశాబ్దాల తరువాత విద్య హక్కుగా గుర్తించబడ్డ తరువాత కూడా అది అందరికి సమాన స్థాయిలో అందడం లేదు. నేటికీ అది పేద పిల్లలకు అందని ద్రాక్షలాగే, ప్రాథమిక హక్కులలో విద్య మిథ్యగానే మిగిలి పోయింది. స్వీయ ఆత్మగౌరవం, విద్య, ఉద్యోగం, నీళ్లు పేరుతో ఏర్పడ్డ నూతన తెలంగాణ రాష్ట్రంలో పిల్లలకు ఉచితంగా, సమానంగా, నాణ్యతతో కూడిన ప్రభుత్వ విద్యను అందించాల్సిన బాధ్యత ఈ ప్రభుత్వం పై ఉంది. కాని తెలంగాణ ప్రభుత్వం అటువైపు అడుగులు వేయకుండా కె.జి. నుండి పి.జి. వరకు విద్య అందించడం నా జీవిత ఆశయం అంటూ ముఖ్యమంత్రి కెసిఆర్ అనని వేదిక లేదు, వినని జనం లేదు. ముఖ్యమంత్రి కె.జి. నుండి పి.జి. నినాదం సంవత్సరం దాటుతున్నా ఆచరణ రూపం దాల్చడం లేదు.

కె.జి. నుండి పి.జి. పేరుతో అందరికీ విద్య అంటూనే మరోపక్క రేషనలైజేషన్ పేరుతో విద్యార్థులు లేరనే కుంటి సాకుతో పాఠశాలలను ఎత్తివేసే కుట్రను పన్నుతున్నారు. ఇక్కడే రాష్ట్ర ప్రభుత్వం అసలు రంగు తేటతెల్లమైంది. గత పాలకుల జాడలోనే తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం విద్యారంగంపై నిర్లక్ష్యం వహిస్తే విద్యార్థుల తిరుగుబాటుకు తలవంచక తప్పదు.

*(రచయిత రిసెర్చ్ స్కాలర్, కాకతీయ యూనివర్సిటీ, వరంగల్)* వీ

*(... 4వ పేజీ తరువాయి)*

ఎందుకంటే పనిగంటల కాలం తగ్గింది గనుకనూ, అదనపు విలువపై యజమాని హక్కు కలిగి ఉండడం సరైనదేనని ఇతను భావిస్తున్నందు వల్లనూ. తగ్గిన పనిగంటల కాలం, సమస్యలను తీర్చగలిగిందా? 'మార్క్సిజం' జపం చేస్తూ దానికి తిలోదకాలు ఇచ్చే ఇలాంటి వ్యాసాలు ఇవ్వాళ కొత్తేం కాదు. ఇది పాత నకిలీ సరుకే. నిజాయితీ లేని సిద్ధాంత చర్చ నిష్ప్రయోజనం.

**- యు.ఎచ్. ప్రీతమ్**
ఖమ్మం

*పేరు ప్రఖ్యాతులు పొందిన వ్యక్తుల మరణాలకు సంబంధించిన సంఘటనలను ప్రచార, ప్రసార సాధనాలు పెద్దఎత్తున ప్రచారం చేస్తాయి, చేస్తున్నాయి. మనదేశ 14వ రాష్ట్రపతి డా. ఎపిజె అబ్దుల్ కలాం జూలై 27న గుండెపోటుతో మరణించారు. ప్రచారం మితిమీరింది. ప్రాథమిక పాఠశాల విద్యార్థుల నుండి ఉన్నత విద్యా సంస్థల విద్యార్థుల వరకు సంతాప సభలు నిర్వహించారు. ఎవ్వరికి ఇవ్వనంత ప్రాధాన్యత ఇచ్చారు. ఒక్క అంతరిక్ష రంగం, రక్షణ రంగమే కాదు వైద్య రంగానికి కూడా అతను ఒక మెంటర్‌గా పనిచేసిన కలాం గొప్ప వ్యక్తే ఆ మేరకు మాత్రమే అతన్ని పొగడాలి. ఆయన రాష్ట్రపతిగా 2002 జూలై 25 నుడి 2007 జూలై 25 వరకు భాధ్యతలు నిర్వహించారు. ఆ కాలంలో వాజ్‌పేయి, మన్మోహన్ సింగ్ ఇరువురు దేశ ప్రధాన మంత్రులుగా కొనసాగారు. 2002లో గుజరాత్‌లో మైనారిటీల మీద మతోన్మాదుల మారణకాండ ప్రభుత్వ అండదండలతో జరిగి, వేల మంది హత్యగావించబడినారు. రాష్ట్రపతి కలాం చర్యలు శూన్యం. మన దేశంలో పది రాష్ట్రాలలో 10 కోట్ల మంది గిరిజనులున్నారు. కొన్ని రాష్ట్రాలలో గిరిజన ప్రాంతాలను కేంద్ర ప్రభుత్వం నేటికి షెడ్యూల్ ప్రాంతాలుగా గుర్తించలేదు. నాన్ షెడ్యూల్ ప్రాంత గిరిజన గ్రామాలను షెడ్యూల్ ప్రాంతాలుగా గుర్తించాలని కోరుతు రాష్ట్ర ప్రభుత్వాలు పంపిన ఫైల్లు రాష్ట్రపతి కార్యాలయంలో 30 సంవత్సరాలుగా పడిఉన్నాయి. రాజ్యాంగంలోని, 5,6 షెద్యూలు ప్రకారం గిరిజన ప్రాంతాల ప్రజల హక్కులు సంక్షేమం చూడవలసిన భాధ్యత రాష్ట్రపతి, గవర్నర్‌లది. కాని నేటి వరకు వీరెవ్వరు గిరిజన ప్రాంతాలను పర్యటించలేదు. కలాం అందులో ఒకరు. రాష్ట్రపతిగా రాజ్యాంగ విధులు ఆయన నిర్వర్తించలేదు. భాధ్యతలు విస్మరించారు. ఇతర అంశాలలో పిల్లలు వృద్ధులతో సన్నిహితంగా మెలిగారు, మీడియా వంత పాడింది. నేటి వరకు పొగడ్తలు, కార్యక్రమాలు వస్తూనే ఉన్నాయి. రాజ్యం తలుచుకుంటే దేనికి కొదవలేదు.*

**- తుంపాల శ్రీరామమూర్తి,**
గాజువాక, విశాఖపట్నం

**రాబోయే సంచికలలో...**

- **ప్రపంచీకరణ బోనులో మాధ్యమిక విద్య - తోట రాజేష్**
- **'ద్వేశ భక్తి - గుండెబోయిన శ్రీనివాస్**
- **ప్రజల గురించి చర్చించని పార్లమెంట్ - సి.ఎచ్. మధు**
- **సాంఘిక వెలి - ప్రజారోగ్యం - డా. పట్టా వెంకటేశ్వర్లు**
- **మరణశిక్షను ఎందుకు వ్యతిరేకించాలి? - మాదిరాజు రాంబాబు**

# ఆలస్యంగానైనా అర్థవంతమైన అడుగు

*అభివృద్ధి చెందిన దేశాలు తమ వ్యర్థ పదార్థాలకు మూడవ ప్రపంచ దేశాలను డంపింగ్ యార్డులుగా మార్చుకున్నాయనీ, ఇప్పుడు భారతదేశం దిగుమతులపై ఆంక్షలు విధించి దేశీయ వ్యర్థాలను రీసైక్లింగ్ చేసే విధానాల వైపు అడుగులు వేస్తోందనీ అంటున్నారు* **ఆర్. లక్ష్మి**

ఇటీవలే భారత ప్రభుత్వం వ్యర్థాల దిగుమతులపై నిషేధం విధించే దిశగా చర్యలు చేపట్టింది. మన దేశంలో 7500 పైగా రీసైక్లింగ్ యూనిట్లు ఉన్నాయి. ఈ యూనిట్లలో రీసైక్లింగ్ చేయబడే వ్యర్థాలలో 75 శాతం దిగుమతులే. ఆ కారణంగా దేశీ వ్యర్థాలు రీసైక్లింగ్‌కు నోచుకోక గుట్టలు గుట్టలుగా పేరుకుపోతున్నాయి. ఇప్పుడు ప్రభుత్వం ఎటువంటి దేశీ వ్యర్థాలనైనా వినియోగించుకునే స్వేచ్ఛను సంబంధిత పరిశ్రమలకు ఇస్తుంది. ప్రస్తుతం దిగుమతి అవుతున్న వ్యర్థాలను దేశీయ వ్యర్థాల నుండి వెలికి తీయగల సాంకేతిక పరిజ్ఞానాన్ని సైతం రాష్ట్ర కాలుష్య నియంత్రణ మండళ్లకు అందిస్తారు.

రసాయనాలు, సమ్మేళనాలు, మండే పదార్థాలతో నడిచే పరిశ్రమలకు సైతం ఖచ్చితమైన మార్గదర్శకాలను ఆదేశించనున్నారు. సుమారుగా 175 రకాల రసాయనాలు, సమ్మేళనాలు వంటివి ఈ కోవలోనికి వస్తాయి. అలాగే ఇటువంటి పరిశ్రమలు ఇక మీదట ప్రత్యేక బీమా పాలసీని తీసుకోవాల్సి ఉంటుంది. అనుకోని ప్రమాదాలు సంభవించినపుడు సమర్థవంతంగా ఎదుర్కోవడానికి ఈ చర్య ఉపకరిస్తుంది. పిఎల్ఐ చట్టాన్ని అనుసరించి ఏడాదికి సరిపడా ప్రీమియానికి సమాన మొత్తాన్ని ఇఆర్ఐగా జమచేయాలి. ఈ నిబంధనలలో వీటిని ఉల్లంఘించినా పర్మిషన్లు రద్దు చేయబడతాయి.

ఈ చర్యలన్నీ ఖచ్చితమైన విధి విధానాలతో వెంటనే అమలులోనికి రావాలి. అప్పుడే సరైన నిర్ణయాలకు సరైన ఫలితాలు లభిస్తాయి. పారిశ్రామిక దేశాల విషయానికి వస్తే మితిమీరిన పారిశ్రామికీకరణ తాలూకు ఫలితాలను ఆయా దేశాలు అంతో ఇంతో ఇప్పటికీ అనుభవిస్తూనే ఉన్నాయి. మన దేశంలో ఆ స్థాయిలో పారిశ్రామికీకరణ విస్తరించనూ లేదు. వికటించనూ లేదు. ఆ ప్రమాదానికి వెంట్రుకవాసి దూరంలో ఉన్న భారత్ వంటి దేశాలు బాధ్యతాయుతంగా ఆలోచించి పురోగామి చర్యలలో భాగంగా సాంప్రదాయక విధానాలను, సహజ వనరులను ఆశ్రయించడం ద్వారా వ్యర్థాల ఉత్పత్తిని నియంత్రించుకోవాలి. వ్యర్థాల దిగుమతుల బెడద నుండి విముక్తి దిశగా ఆలోచించడం తక్షణావసరమే.

గత శతాబ్ది ఆఖరి దశకంలోనే విషపూరిత వ్యర్థాల ఎగుమతులపై నిషేధం విధించాలని అమెరికన్ కాంగ్రెస్ నిర్ణయించింది. సమస్య ఎంత తీవ్రమైనదో దానిని బట్టే అర్థం అవుతుంది. ఫ్రాన్స్, దక్షిణ కొరియా, అమెరికా, బ్రిటన్ వంటి దేశాలు ఆసియా దేశాలను పారిశ్రామిక వ్యర్థాల చెత్తకుండీలలా వాడుకున్నాయి. ఆయా దేశాలలో రీసైక్లింగ్ యూనిట్లు అనేకం ఉన్నాయి. అయినప్పటికీ ప్రజల అవగాహన, పర్యావరణం పట్ల, ప్రజారోగ్యం పట్ల గల చైతన్యం కారణంగా ప్రజా ప్రయోజనాలకు భంగం కలిగించే ఏ పనులనైనా కొనసాగించడం ఆ దేశాలకు అంత సులభం కాదు. ఆ కారణంగా వ్యర్థాలను వర్ధమాన దేశాలకు ఎంతో కొంతకు అమ్మి సొమ్ము చేసుకోవడం, అది సాధ్యపడని సందర్భాలలో ఉపకారం ముసుగులో ఉదారంగా ఆ దేశాలలో కుమ్మరించడం పారిశ్రామిక దేశాలు ఎంచుకున్న అతి సులువైన మార్గం.

ఆర్థిక పరిపుష్టితో అవగాహన లేమి కారణంగా ఊరికే వస్తున్నట్లు సంబరపడిపోయి వ్యర్థాలను దేశంలోకి అనుమతించడం జరుగుతూ వస్తోంది. అయితే తగిన సాంకేతిక నైపుణ్యానికి మళ్లీ ఆ దేశాలపైననే ఆధారపడవలసి వస్తోంది. ఈ మొత్తం తతంగం పూర్తి అయ్యే సరికి రీసైక్లింగ్ సైతం వ్యయ ప్రయాసలతో కూడుకున్నది అవడమే కాక, ఆరోగ్య, పర్యావరణ సమస్యలకూ కారణమవుతోంది.

బాసెల్ అంతర్జాతీయ ఒప్పందం ప్రకారం విష వ్యర్థాల ఎగుమతులు నిషిద్ధం. ఈ ఒప్పందం 1998 నుండి అమలులోకి వచ్చింది. ఒఇసికి ఆర్గనైజేషన్ ఆఫ్‌ది ఎకనామిక్ కో ఆపరేషన్ అండ్ డెవలప్‌మెంట్ నిబంధనల ప్రకారం సభ్యత్వం లేని దేశాలకు ఎగుమతులు చట్ట విరుద్ధం. మనదేశం 1995 లోనే ఒప్పందాన్ని ఆమోదించిన కారణంగా వ్యర్థాలను దిగుమతి చేసుకోవడం చట్ట విరుద్ధం.

'పర్యావరణ పరిరక్షణ', 'బ్యాక్ టు నేచర్' వంటి లక్ష్యాలను ఆదర్శప్రాయంగా అనుసరించి అమలులో పెడుతున్న నెదర్లాండ్స్ వంటి దేశం కూడా తన వద్దనున్న విష వ్యర్థాలను ఇతర దేశాలలో పారబోసి చేతులు దులుపుకుంటున్నదంటే ఏ దేశానికైనా స్వప్రయోజనాలే మిన్న అన్న పరమ సత్యం భారత దేశానికి ఇన్నాళ్లు అర్థం కాలేదు అనుకోవడానికి వీలులేదు. ప్రజా ప్రయోజనాల కంటే ఇక్కడ రాజకీయ ప్రయోజనాలకు, వ్యాపార ప్రయోజనాలకు పెద్దపీట అన్నది బహిరంగ సత్యం. కారణం–1996 జూలై 12న ఢిల్లీ హైకోర్టు విష వ్యర్థాల దిగుమతులను నిలిపి వేయవలసిందిగా ఆదేశాలు జారీ చేసింది. 1996 ఏప్రిల్ 16 నుండి దిగుమతులను నిలిపివేశామని అప్పటి ప్రభుత్వం ప్రకటించింది. రెండు దశాబ్దాల అనంతరం ఈనాటికీ భారతదేశానికి ఏటా వచ్చి చేరుతున్న వివిధ రకాల వ్యర్థాలు దాదాపు 50 లక్షల టన్నులు. రీసైక్లింగ్ నిమిత్తం వచ్చే వ్యర్థాలు పర్యావరణానికి, సంబంధిత యూనిట్లలో పనిచేసే పనివారి ఆరోగ్యానికి తీవ్రమైన హానిని కలిగిస్తున్నాయి. రీసైక్లింగ్‌కు అయ్యే ఖర్చు, దాని వలన కలిగే దుష్ట పరిణామాలను లెక్కవేసుకుంటే రీసైక్లింగ్ తలకు మించిన భారమే అవుతోంది.

గుజరాత్‌లోని 'అలంగే' షిప్‌బ్రేకింగ్ యూనిట్స్‌లో పనిచేసే కార్మికులు అనేక రోగాల బారిన పడుతున్నా పట్టించుకునే నాథుడే లేడు. మొరాదాబాద్ ఎలక్ట్రానిక్ వ్యర్థాల రీసైక్లింగ్, డిస్‌మెంటలింగ్ ప్రక్రియల్లో పనిచేసే కార్మికుల పరిస్థితీ అంతే. సాధారణంగా ఈ వ్యర్థాలను విడగొట్టడం వంటి ప్రక్రియలు ఇళ్లల్లో జరుగుతాయి. ఈ విడగొట్టడంలో వెలువడే హానికారక వాయువులు కార్మికుల శ్వాసకోశాల పనితీరును దెబ్బతీస్తున్నాయి. అక్కడ ఆరోగ్య సమస్యలలో 80 శాతం ఉపిరితిత్తుల వ్యాధులకు సంబంధించినవే. కానీ గణాంకాలతో వీటిని రుజువు

# వాళ్లెందుకు భయపడుతున్నారు?

*అమెరికా సామ్రాజ్యవాదులు, భారత పాలక వర్గాలు మావోయిస్టు ఉద్యమాన్ని చూసి ఎలా ఆందోళన పడుతున్నారో ఇంటర్‌నెట్‌లో దొరికిన ఆధారాలతో వివరిస్తున్నారు* **లోక సంచారి**

**మా**వోయిస్ట్‌లపై ప్రత్యేక పరిశోధనా విభాగాన్ని ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పీస్ అండ్ కాన్‌ఫ్లిక్ట్ స్టడీస్ అనే దేశ భద్రతపై పరిశోధన చేసే సంస్థ స్థాపించింది. ఇది ఢిల్లీ కేంద్రంగా కొన్ని దశాబ్దాలుగా పని చేస్తున్నది. ఈ సంస్థ భారత రక్షణ శాఖతో, హోంశాఖతో, పారా మిలటరీ బలగాలతో చాలా 'దగ్గరి' సంబంధాలు కలిగి ఉంది. ఈ సంస్థ దేశ వ్యాప్తంగా మావోయిస్ట్‌ల అణిచివేతలో పాల్గొనే అన్ని శాఖల టాప్ ఆఫీసర్లతో మావోయిస్ట్ 'సమస్య'పై ఒక సెమినార్‌ను జనవరి 2012లో నిర్వహించింది. దీని వివరాలన్ని వారి వెబ్‌సైట్లో (ఐపిసిఎస్ కాన్ఫరెన్స్ రిపోర్ట్ 38) పేరున ఉన్నాయి. ఈ సెమినార్‌లో భారత మాజీ హోం సెక్రటరీ జి.కె. పిళ్లై మాట్లాడుతూ, 'భారత హోం శాఖ ఒక పరిశోధన జరిపింది, దాంట్లో అర్థమయింది ఏమంటే, మావోయిస్ట్‌ల ప్రాబల్యం కల ప్రాంతాలన్నీ సహజ వనరులతో నిండి ఉన్నవి. కావున ఒకవేళ మావోయిస్ట్‌లు ఈ వనరులను తమ ఆధీనంలోకి తీసుకున్నట్లైతే వారికి కేవలం మూడు రోజుల్లో ఢిల్లీకి విద్యుత్ సరఫరాను నిలిపి వేయగలిగే శక్తి వస్తుంది' అని చెప్పాడు. నిజానికి, మావోయిస్ట్‌ల విషయంలో ఇలాంటి బయటకు బహిరంగంగా చెప్పుకోలేని ఎన్నో 'రహస్యాలు' భారత ప్రభుత్వాన్ని కలవర పెడుతున్నాయి.

ఇదే సంస్థకు విజిటింగ్ ఫెలోగా పనిచేస్తున్న రజత్ కుజుర్ పారా–మిలిటరీ, పోలీస్ బలగాల అధికారులతో మాట్లాడిన తర్వాత రాసిన వ్యాసంలో, '2011–2012లో కొన్ని నష్టాలు జరిగినా మావోయిస్ట్ ఉద్యమం బలహీనం కాలేదు. ప్రభుత్వం వారి నష్టాలను తమ లాభాలుగా కూడా మలుచుకోలేక పోయింది' అంటాడు.

జాతీయ భద్రతా కౌన్సిల్ సెక్రటేరియట్‌లో డిప్యూటి డైరెక్టర్‌గా చేసిన బిబూ ప్రసాద్ అనే మావోయిస్టు విభాగ స్పెషలిస్ట్ 2015 మే 21 నాటి ఐపిసిఎస్ వెబ్‌సైట్ వ్యాసంలో, 'ప్రభుత్వం మావోయిస్ట్‌లపై సాధించిన విజయాలు ఎన్ని ఉన్నా భారత ప్రభుత్వం మావోయిస్ట్‌లపై సమీప భవిష్యత్తులో విజయం సాధించలేదు అని తరుచుగా వినిపించే వాదన సరైనదే' అంటాడు. అదే వ్యాసంలో '2015 మే 16 నాడు బీజాపూర్ జిల్లా (చత్తీస్‌గఢ్)కు చెందిన పొంజేడ్ వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు యాంటీ–నక్సల్స్ పోలీస్ కమాండోలు చనిపోతే, 24 గంటల తర్వాత మాత్రమే చత్తీస్‌గఢ్ పోలీసులు ఆ శవాలను తెచ్చుకోగలిగారు. అది కూడా ఒక స్థానిక విలేఖరి ద్వారా మావోయిస్ట్‌ల నుండి (శవాలను తీసుకుపోవడానికి వచ్చిన పోలీసులపై దాడులు చేయమని) పర్మిషన్ తీసుకున్న తర్వాత మాత్రమే పోలీసులు అక్కడికి వెళ్లారు. కాని చత్తీస్‌గఢ్ పోలీసులు మాత్రం అదే ఎన్‌కౌంటర్లో చనిపోయిన ఒక మావోయిస్ట్ శవం తమకు దొరకడంతో అది ఒక గొప్ప విజయంగా మీడియాకు చెప్పుకున్నారు' అని రాశాడు.

ఇదే వ్యాసంలో 2015 మే 18న ఇండియన్ ఎక్స్‌ప్రెస్ జర్నలిస్ట్ రాసినదాన్ని ఉదహరించాడు. 'ఆ వార్తా సంస్థ జరిపిన పరిశోధనలో తేలిందేమంటే సిఆర్‌పిఎఫ్ పారా–మిలటరీ అధికారులు తమ

---

చేయడానికి వీలుపడడం లేదు. కారణం ఇటువంటి పనుల్లో ఉన్న కార్మికులు పేదరికం కారణంగా ఒకపాటి అనారోగ్య సమస్యలకు వైద్య పరీక్షలు, చికిత్స వరకు పోరు. మొరాదాబాద్‌కు రోజుకు 9 టన్నుల ఎలాక్ట్రానిక్ వ్యర్థాలు వచ్చి పడుతుంటాయని ఆ జిల్లా మెజిస్ట్రేట్ దీపక్ అగ్రవాల్ వాపోవడం జరిగింది. విదేశీ వ్యాపారం, నిర్వహణలకు సంబంధించి అధ్యయనం చేసే సంస్థ (మొరాదాబాద్) వెలువరించిన నివేదికల ప్రకారం – హానికారక రసాయనాలు, బూడిద, పొగ, విష వాయువులు వంటి వన్నీ వ్యర్థాలను విడగొడుతున్నప్పుడు వెలువడుతాయి. ఇవన్నీ వాతావరణాన్ని పాడుచేయడమే కాక నేల, నీరులను కూడా కలుషితం చేస్తాయి. కొన్ని వాయువులు క్యాన్సర్ కారకాలుగా ప్రజారోగ్యానికే ప్రమాదకరమవుతున్నాయి. పాదరసం, ఆర్సెనిక్ వంటివి అక్వా ఉత్పత్తులలో చేరి తద్వారా మానవ శరీరంలోకి ప్రవేశిస్తున్నాయి. ఇవి అత్యంత ప్రమాదకరమైన న్యూరో టాక్సిన్లు. ఇక జింక్, నికెల్ వంటివి నిదానంగా ఆరోగ్యాన్ని దెబ్బతీస్తాయి తప్ప వెనువెంటనే పరీక్షలలో బయటపడవు.

ఇక భారీ లోహాల కారణంగా ఏర్పడగల కాలుష్యాన్ని ఖచ్చితంగా లెక్కించగల ప్రమాణాలు మన దగ్గర లేవు. ఆ కారణంగా యునైటెడ్ స్టేట్స్ ఎన్విరాన్‌మెంట్ ప్రొటక్షన్ ఏజెన్సీ ప్రమాణాలు, కెనడియన్ ప్రమాణాలను అనుసరించి జరుపబడిన అధ్యయనాల ప్రకారం – మొరాదాబాద్ – పరీవాహక ప్రాంతంలో రామ్ గంగానది ఒడ్డున కిలో మీటర్ పొడవునా మట్టిని పరీక్షించగా కాడ్మియం 1.3 రెట్లు, క్రోమియం రెండు రెట్లు, రాగి ఐదు రెట్లు, జింక్ 15 రెట్లు సురక్షిత ప్రమాణాలకు మించి ఉన్నట్లు తేలింది. ఈ అధ్యయనాలను చేపట్టిన సిస్ఇ సంస్థ రామ్ గంగా నది ఒడ్డున ఎలక్ట్రానిక్ వ్యర్థాలను మండించడాన్నీ నిషేధించాలని కోరుతోంది. ఎలక్ట్రానిక్ ఉత్పత్తుల పరిశ్రమల యజమానులను పరిశ్రమల నిర్వహణలో, తయారీలో, వ్యర్థాల నిర్వహణలో చట్టబద్ధంగా బాధ్యులను చేయాలనీ అప్పుడు యజమాన్యాల నిర్లక్ష్య ధోరణికి అడ్డుకట్ట పడుతుందనే వాదనలు వినిపిస్తున్నాయి. అదే జరిగితే వ్యర్థాల నిర్వహణ చట్టబద్ధమైన విధానాలతో తద్వారా సురక్షితమైన పద్ధతుల్లో జరుగుతుంది. ప్రజారోగ్యానికీ, పర్యావరణానికీ భరోసా లభిస్తుంది.

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్ట్)* వీ

కమాండోలను అడవుల్లోకి పంపడం ఆపినందు వల్లనే కమాండోల మరణాలు తగ్గాయి తప్పించి వేరే కారణాలు ఏమీ కాదని తేలింది. సిఆర్‌పిఎఫ్ కమాండోలు అడవుల్లోకి వెళ్లడం లేదనే ఆరోపణ చత్తీస్‌గఢ్ పోలీసులు కూడా చేశారు' అని రాశాడు. ఇదే అధికారి ఇంకో వ్యాసంలో రాస్తూ, 'భద్రతా దళాలు ఇంకా మావోయిస్ట్‌ల నుండి తప్పించుకునే వ్యూహం (డిఫెన్సివ్ స్ట్రాటజీ) లోనే ఉన్నాయి' అని రాశాడు.

ఈ ఆశ్చర్యకరమైన వాస్తవాలన్నీ భారత హోం శాఖతో, పారా - మిలటరీ, పోలీస్ శాఖతో కలిసి పనిచేస్తున్న ఒక సంస్థ అధికారులు తమ వెబ్‌సైట్లో రాసుకున్నవి కాబట్టి నమ్మక తప్పదు. ఒకవేళ ఈ విషయాలనే మావోయిస్ట్‌లు తమ సాహిత్యంలో రాసుకున్నట్లయితే పట్టణ మధ్య తరగతి విద్యాధికులు నమ్మడం కష్టమే. ఎందుకంటే టి.వి ఛానళ్లు కానీ, వార్తా పత్రికలు కానీ (ప్రభుత్వ వ్యూహంలో భాగంగా) మావోయిస్ట్‌ల పని అయిపోయిందనే ప్రచారమే ఎక్కువగా చేస్తున్నాయి.

ప్రభుత్వం చేతిలో మావోయిస్ట్‌లు ఓడిపోతున్నట్లు (మీడియా ద్వారా) ప్రచారం చేసుకోవడంలో ఒక వ్యూహం ఉన్నది. ఓడిపోతున్న సంస్థలో చేరడానికి ప్రజలు సాధారణంగా మానసిక సంసిద్ధత చూపరు అనేది ఆ వ్యూహం. ఈ వ్యూహాన్ని రెండు వేల సంవత్సరాల క్రితం గ్రీక్ సామ్రాజ్యం వాడినది చరిత్రలో చదవవచ్చు. చైనాలో ఛాంగ్-కై-షేక్ తానే స్వయంగా దేశం నుండి పారిపోయి ప్రభుత్వ రేడియోలో మాత్రం ప్రభుత్వం చేతిలో ఎర్ర సైన్యం ఓడిపో తున్నట్లు ప్రచారం చేపించినట్లు చైనా చరిత్ర పుస్తకాల్లో ఉంది. బాబర్ కూడా ఆ కాలంలో ప్రతి ఊరికి ఒక ప్రచార దళాన్ని పంపి తన ప్రత్యర్థులు ఓడిపోతున్నట్లు ప్రచారం చేయించినట్లు బాబర్ చరిత్ర చదివితే తెలుస్తుంది.

పాలకులు తాము ఎంత బలహీనమైన పునాదులపై తమ సామ్రాజ్యాన్ని నిర్మించుకున్నారో ప్రజలకు పూర్తిగా అర్థం కాకపోవచ్చు కాని పాలకులకు స్వయంగా బాగా తెలుసు. తమని, తమ ఆస్తులని, అధికారాన్ని కాపాడడానికి వారు ఎవరిని నమ్ముకుంటున్నారు, వారు ఎంత బలహీనులు అనేది వారికి అత్యంత స్పష్టంగా తెలుసు. వారి అంతర్గత పరిశోధనా పత్రాల ద్వారానే మనకు ఈ విషయాలు అర్థమవుతాయి. జాతీయ భద్రతా సలహాదారు అజిత్ దోవల్ వీరాభిమాని అయిన యతీష్ యాదవ్ అనే 'ది న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్' విలేఖరి వివిధ పారా-మిలటరీ, పోలీస్ అధికార్లను ఇంటర్వ్యూ చేసి 2015 ఏప్రిల్ 25న ఒక వ్యాసం రాశాడు. ఆ అధికారులు అతనితో, 'ఒకవేళ మావోయిస్ట్‌లు మాపై దాడి చేయడం లేదంటే అది మా హీరోయిజం కాదు. అది వారి ఎత్తుగడలో భాగం' అన్నారని రాశాడు. మావోయిస్ట్-వ్యతిరేక ప్రచారంలో ఈ పత్రిక కూడా ముందుంది. అలాంటి పత్రికనే వాస్తవాలను రాసిందంటే పరిస్థితి అర్థం చేసుకోవచ్చు.

ఇదే పత్రిక ఒడిస్సా ప్రతినిధి (శ్రీ బిఎస్ఎఫ్ జవాన్స్ కిల్డ్ పేరున) 2015 ఆగస్టు 27న తమ వెబ్‌సైట్లో వార్త రాస్తూ, '15 సంవత్సరాల నుండి ప్రభుత్వం బలిమెల రిజర్వాయర్ దగ్గరలోని జాన్‌బాయి అనే ప్రాంతంలో మావోయిస్ట్‌ల ప్రతిఘటన కారణంగా గురుప్రియ అనే నామకరణం చేసిన బ్రిడ్జిని కట్టే పరిస్థితి లేదు. మూడు సంవత్సరాల క్రితమే ఆ బ్రిడ్జిని ఎలానైనా కట్టాలని ప్రభుత్వం ఆ ప్రాంతంకు దగ్గరలో ఒక బిఎస్ఎఫ్ పారా-మిలటరీ క్యాంప్‌ను పెట్టినా అక్కడ బ్రిడ్జి పనులు ఏమీ జరగడం లేదు అని రాశారు. ఈ క్యాంప్‌కు చెందిన బలగాలపైనే మావోయిస్ట్‌లు ఆగస్టు 27న ఆంబుష్ జరిపినప్పుడు ముగ్గురు చనిపోయిన సందర్భంగా అతను ఈ వ్యాసం రాశాడు. నిజానికి ఈ ప్రాంతం దట్టమైన అడవిలో కూడా ఏమీ లేదు. రిజర్వాయర్‌కు ఆనుకుని ఉన్న ప్రాంతం. గూగుల్ మ్యాప్‌లో స్పష్టంగా చూడవచ్చు. ఇలాంటి ప్రాంతంలోనే 15 సంవత్సరాలుగా మావోయిస్ట్‌లను అణిచివేయడానికి ఉపయోగపడే బ్రిడ్జి కట్టే పరిస్థితి లేదు. పైగా మావోయిస్ట్‌లు తాము ఈ ప్రాంతంలో బలహీనంగా ఉన్నామని (తమ వెబ్‌సైట్‌లో) చెప్పుకుంటున్నారు. మావోయిస్ట్‌లు తాము బలహీనంగా ఉన్నామని చెప్పుకుంటున్న ప్రాంతంలోనే ప్రభుత్వం ఎంత బలహీనంగా ఉందో ఈ వార్తల ద్వారా అర్థమవుతున్నది.

ఓపెన్ అనే ప్రముఖ ఆంగ్ల మ్యాగజిన్ ఎడిటర్ సందీపన్ దేబ్ 2009 అక్టోబర్ 17న రాసిన స్టేరింగ్ ఎట్ డిఫీట్ అనే వ్యాసం చదివితే ఆశ్చర్యానికి షాక్‌కు గురికావలసిందే. (వ్యాసం వారి వెబ్‌సైట్లో ఉంది). ఐఐటి పట్టభద్రుడైన సందీపన్ తన వ్యాసంలో రాస్తూ, 'నేను ఐఐఎంలో జరిగిన ఒక కాన్ఫరెన్స్‌కు వెళ్లినప్పుడు నాకు ఒక రాష్ట్రంలో మావోయిస్ట్‌లను అణిచివేసే పోలీస్ విభాగానికి చీఫ్‌గా ఉన్న (ఐపిఎస్) అధికారి పరిచయమయ్యాడు. మావోయిస్ట్‌లను మన ప్రభుత్వం ఎప్పుడు అంతం చేయబోతున్నది అని నేను అతన్ని అడిగాను. అతను జవాబు చెప్పలేదు. రెండవ రోజు కాన్ఫరెన్స్ అయిపోయి, అందరం వెళ్లిపోతున్న సమయంలో ఆ పోలీస్ అధికారిని మళ్లీ అదే ప్రశ్న అడిగాను. మావోయిస్ట్‌లపై పోరులో మనం ఓడిపోబోతున్నాం అని అతను జవాబిచ్చి వెళ్లిపోయాడు' అని వ్యాసంలో ఆ ఎడిటర్ రాశాడు.

డజన్ల కొలది మానవ రహిత విమానాలను దింపి సంవత్సరాలు గడుస్తున్నా, లక్షలాది పారా-మిలిటరీ జవాన్లను, పోలీసులను దింపి 'చుట్టు ముట్టడం' మొదలయి దశాబ్దం దాటినా, అత్యంత అధునాతన ఆయుధాలు, టెక్నాలజీ వాడడం మొదలయి సంవత్సరాలు గడుస్తున్నా, మావోయిస్టుల బలం పెరుగుతూ, ప్రభుత్వం బలహీనంగా మారుతూ, ఏకంగా భద్రతా దళాల అధికారులే భవిష్యత్‌లో కూడా మావోయిస్టులను ఓడించలేమని ఒప్పుకోవడం ఆశ్చర్యం కలిగించే విషయం.

ఇలాంటి ఎన్నెన్నో ఆశ్చర్యకరమైన వాస్తవాలు స్వయంగా ప్రభుత్వంలో ఉన్నవారి నుండి లేదా హోం శాఖతో కలిసి పనిచేస్తున్న సంస్థల నుండి లేదా పాలక వర్గ మీడియా నుండే వినిపిస్తాయి. ఇవన్నీ ఇంటర్నెట్‌లో ఉన్నాయి. ఇవన్నీ రాయాలంటే ఒక పెద్ద పుస్తకమే తయారవుతుంది. మరింత ఆశ్చర్యకరమేమంటే, ఇలాంటి పరిస్థితులలో కూడా మావోయిస్ట్‌లు బ్యాన్డ్‌థాట్ డాట్ నెట్‌లో పెట్టిన తమ పత్రాలలో తమ గురించి ఎక్కడా అతిగా చెప్పుకోవడం లేదు సరికదా తమ గురించి తామే తగ్గించి చెప్పుకుంటున్నారు.

భారత ప్రభుత్వంలోని అతిపెద్ద స్థాయి అధికారులే స్వయంగా తాము ఓడిపోబోతున్నట్లు అంగీకరించే స్థాయికి తీసుకు వచ్చిన మావోయిస్ట్‌లు, తమ పత్రాలలో తమను తాము తగ్గించుకుని రాసుకోవడం వారి రాజకీయాలతో సంబంధం లేని (నాలాంటి) మధ్య తరగతి విద్యాధికులకు ఆశ్చర్యం కలిగిస్తుంది. గెలువాలనే లక్ష్యం, గెలువగలిగే లక్షణం ఉన్నవారు బహుశా ఈ పద్ధతినే పాటిస్తారు కావచ్చు.

*(రచయిత అనేక దేశాల్లో పని చేసిన సామాజిక కార్యకర్త)* వీ

# ముగింపులేని పెట్టుబడిదారీ సంక్షోభం

***సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు ప్రపంచ దేశాల ఆర్థిక వ్యవస్థల పతనానికి దారితీస్తున్నాయనీ, ముందు ముందు ఇంకా తీవ్రమైన మాంద్యం రావడానికి ఇవి సూచికలని అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థలో సంక్షోభం మొదలై ఏడు సంవత్సరాలు అయింది. ఇప్పటికీ అది కోలుకునే సూచనలు కన్పించడం లేదు. అంతేకాక మరింత తీవ్రం అయ్యే సూచనలు కన్పిస్తున్నాయి. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలు సంక్షోభంలో పీకలలోతు కూరుకుపోయాయని ఇటీవలి పరిణామాలు తెలియజేస్తున్నాయి. ఈ సంక్షోభ ప్రభావం నుండి ఆరంభంలో చైనా, భారత్‌లు తప్పించుకున్నట్లు కన్పించినా ఇప్పుడు ఆ దేశాలకు కూడ వ్యాపించింది. 2008లో అమెరికాలో పుట్టి ప్రపంచ ఆర్థిక వ్యవస్థల 'పుట్టి' ముంచిన ఆర్థిక సంక్షోభం మరోసారి కోరలు చాస్తున్నది. కొన్నేళ్లపాటు ప్రపంచవ్యాప్త మాంద్యం కొనసాగితే, తాత్కాలికంగా కోలుకున్నా తిరిగి అలాంటి పరిస్థితులను ఎదుర్కోవలసివస్తే దానిని ఆర్థికవేత్తలు డబుల్‌డిప్‌గా పిలుస్తారు. ఇటీవల భారతీయ రిజర్వు బ్యాంకు (ఆర్‌బిఐ) గవర్నర్ రఘురామ్ రాజన్ ఈ అంశంపై చేసిన వ్యాఖ్యలు నిజమయ్యాయి. సంక్షోభ పరిస్థితులు ప్రస్తుతం స్పష్టంగా కనిపిస్తున్నాయి. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలు మరో మహామాంద్యం అంచున నిలిచి ఉన్న సంకేతాలు ఆగస్టు 24 నాడు ప్రపంచవ్యాప్తంగా షేర్లు కుప్ప కూలడం, మన దేశీ కరెన్సీ రూపాయి మూకుమ్మడిగా పతనం కావడం ఈ అంశాన్ని పట్టి చూపుతోంది!

గత జూలైలో గ్రీస్‌లో ఏర్పడిన సంక్షోభ పరిణామాలు ఆ దేశానికే పరిమితం కావు. చాలా దేశాలు గ్రీస్ బాటలోకి వచ్చే ప్రమాదం పొంచి ఉంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల వికృత ఫలితాలు ప్రస్తుతానికి అక్కడ కేంద్రీకృతం అయినాయి. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ రానున్న రోజుల్లో పెద్ద సంక్షోభాన్ని ఎదుర్కొనే ప్రమాదం ఉందని ఆర్థిక నిపుణులు హెచ్చరిస్తున్న నేపథ్యంలో ఆగస్టులో మొత్తం ప్రపంచ స్టాక్ మార్కెట్లు, కరెన్సీలు ఒక్కసారిగా పతనమై ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థ పెద్ద కుదుపుకు గురైంది. పెట్టుబడిదారీ ఆర్థిక పండితులు ప్రపంచ ఆర్థిక పరిస్థితులు కుదుట పడుతున్నాయని జోస్యాలు చెబుతూ పుంఖాను పుంఖాలుగా వ్యాసాలు రాస్తున్న తరుణంలో ; అమెరికా నుండి ఇండియా వరకు ఆర్థికాభివృద్ధి గాడిలో పడుతున్నదని ఘోషిస్తున్న కాలంలో; అమెరికా, యూరప్ కేంద్ర బ్యాంకులు ఆర్థిక మాంద్యం తొలగి పోతున్నందున ఇక వడ్డీ రేట్లు పెంచవచ్చునని భావిస్తున్న తరుణంలో ప్రపంచ వ్యాప్తంగా స్టాక్ మార్కెట్లు కుప్పకూలాయి. ఏడేండ్ల క్రితం అమెరికా సబ్ ప్రైమ్ సంక్షోభం బద్దలైనప్పుడు ప్రపంచవ్యాప్తంగా స్టాక్ మార్కెట్లు పేకమేడల్లా కూలిపోయాయి. పలు అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు, బడా బ్యాంకులు నామరూపాల్లేకుండా పోయాయి. అప్పటి ప్రకంపనల ప్రభావం యూరప్‌ను ఇప్పటికీ వేదిస్తోంది. యూరప్ దేశాల సంక్షోభం ప్రభావం నుంచి ప్రపంచమార్కెట్లు పూర్తిగా కోలుకోలేదు. తాజాగా ఆసియా దిగ్గజం చైనా ఆర్థిక రంగంలో సంక్షోభం బట్టబయలైంది.

'బ్లాక్ మండే'గా ప్రపంచవ్యాప్తంగా పతాక శీర్షికలకు ఎక్కిన ఆగస్టు 24న ప్రపంచ స్టాక్ మార్కెట్ల పతనం 2008 అమెరికా ఆర్థిక సంక్షోభపు రోజులను గుర్తుకు తెచ్చింది. షాంఘై - షెన్‌జెన్ నుంచి లండన్, న్యూయార్క్, ముంబై దాకా ప్రపంచ స్టాక్ మార్కెట్లు కుప్పకూలాయి. చైనా కరెన్సీ యువాన్ విలువ పడిపోతుండడం ప్రపంచ షేర్ మార్కెట్లను ఆగస్టు 24న కుదేలు చేసింది. భయకంపితులైన మదుపుదార్లు పెద్ద ఎత్తున ధనం ఉపసంహరించటంతో అన్ని ప్రధాన ప్రపంచ షేర్ మార్కెట్లతో పాటు మనదేశ షేర్ మార్కెట్లు (బిఎస్‌ఇ, నిఫ్టీ) బ్లాక్ మండేని చవిచూశాయి. జపాన్ నిక్కీ 4శాతం పతనం అయింది. ఐరోపా మార్కెట్లు 7.8శాతం దెబ్బతిని 500 బిలియన్ యూరోల షేర్ల విలువ తుడిచి పెట్టుకుపోయింది. పాన్-ఐరోపా ఎఫ్‌టిఎస్‌ఇ 300 పాయింట్లు కోల్పోయి 12శాతం విలువ తగ్గి 2008 అక్టోబరులో జరిగిన 12.6శాతం నష్టానికి చేరువయ్యింది. ఫ్రెంచ్ సిఏసి సూచిక 5శాతం, జర్మన్ డ్రాక్స్ 5శాతం నష్టపోయాయి. లండన్‌లోని ఎఫ్‌టిఎస్‌ఇ 5.5శాతం నష్టపోయి మొదటిసారి 6000 పాయింట్ల దిగువకు పడిపోయింది. దానితో 74 బిలియన్ల పౌండ్లు ఆవిరైపోయాయి. అమెరికాలో డౌ జోన్స్ పారిశ్రామిక సూచిక 6.5శాతం పడిపోయి 1000 పాయింట్లు కోల్పోయింది. ఎస్ అండ్ పి500 క్రెడిట్ రేటింగ్ 4శాతం పడిపోయింది. నాస్‌డాక్ 8.5శాతం నష్టపోయింది. దీనితో తాజాగా టెక్నాలజీ బుడగ పగిలిపోయిందనే భయం పట్టుకుంది. టెక్నాలజీ షేర్లు దారుణంగా పడిపోయాయి. ఫేస్‌బుక్ ఒక దశలో 14శాతం నష్టపోయింది. భారత్ మార్కెట్ దిక్సూచిగా పరిగణించే బొంబాయి దలాల్ స్ట్రీట్ స్టాక్ ఎక్స్ఛేంజ్ సెన్సిటివ్ ఇండెక్స్ (సెన్సెక్స్) 1,640 పాయింట్లు పతనమైంది. ఈ పతనం 1990 తర్వాత 27వ పెద్ద క్షీణత. ఒక్కరోజులోనే ఇంతటి భారీ పతనం 2009 జనవరి 7 తదుపరి ఇదే ప్రథమం. మదుపుదారుల సంపద విలువ రూ.7లక్షల కోట్లు హరించుకుపోయినట్లు అంచనా. ఈ పతనం అన్నిమార్కెట్లకు విస్తరించింది. మార్కెట్‌లో భయాన్ని కొలవటానికి వాల్‌స్ట్రీట్ 'విక్స్ వోలటిలిటి సూచిక' అనే ఇన్‌డెక్స్‌ను అనుసరిస్తుంటుంది. ఆగస్టు 24న ఈ సూచిక 39.77 పాయింట్లకు పెరిగింది. ఈ సూచిక 20పాయింట్లు దాటితే పెట్టుబడి పెట్టేవారు ఆందోళన చెందుతున్నట్టు లెక్క. ఇది ఒకేరోజు ఆరుసార్లు పెరిగింది.

ప్రపంచవ్యాప్తంగా సంభవించిన బ్లాక్ మండే స్టాక్‌మార్కెట్ పతనం వల్ల షేర్ల రూపంలో ఉన్న లక్షల కోట్ల డాలర్ల సంపద ఆవిరైపోయింది. ఈ పతన పరంపరలో మొదటగా దెబ్బతిన్న దేశం చైనా. ఆ తరువాత ఆసియా, ఐరోపా మార్కెట్లు కుప్పకులాయి. చివరగా అమెరికన్ స్టాక్ మార్కెట్ కుదేలయింది. 'ఇది ప్రమాదకరం' అని మాజీ అమెరికన్ ఆర్థికమంత్రి లార్రి సమ్మర్స్ పేర్కొన్నాడు. జార్జి ఓస్‌బోర్న్ చైనా పరిస్థితి ఆందోళనకరంగా వుందన్నాడు. 2008 నాటి సంక్షోభం అమెరికాలో

పుట్టింది. ఇప్పటి పతనానికి చైనా మూలం. కాకపోతే అప్పటిది అధిక రుణాల వల్ల ఏర్పడిన సంక్షోభంకాగా, తాజా కల్లోలం ఉత్పత్తి మంద గమనంతో వచ్చింది. ప్రపంచ ఆర్థికాభివృద్ధి అంతంతగానే ఉండటంతో చైనా ఉత్పత్తులకు డిమాండ్ పడిపోతున్నది. ఈ సమస్యల్ని అధిగమించ డానికి చైనా ఒక్కసారిగా తన కరెన్సీ యువాన్ విలువను తగ్గించడంతో చైనా ప్రమాదంలో పడిందన్న అంశాన్ని ఇన్వెస్టర్లు గమనించారు. ఇప్పుడు ప్రపంచమంతా చైనా మీద... చైనా ప్రపంచం మీద ఆధారపడటంతో అన్ని దేశాల స్టాక్ మార్కెట్లు కలిసికట్టుగా భారీగా పడిపోయాయి. దీనితో వర్ధమాన దేశాల ఆర్థిక వ్యవస్థలు ఘోరంగా దెబ్బతిన్నాయి.

లేమన్ బ్రదర్స్ పతనం తరువాత ఇదే అత్యంత పెద్ద స్టాక్ మార్కెట్ పతనం. ప్రపంచ ఆర్థిక వ్యవస్థను పీడిస్తున్న సమస్యల కారణంగా స్టాక్ మార్కెట్ ఉద్ధాన పతనాలు ఇక మీదట ఎలా కొనసాగుతాయో చెప్పటం కష్టం. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల ప్రయోజనాలకు భిన్నంగా ఆర్థిక వ్యవస్థను సమతౌల్యం దిశగా నడిపేందుకు చైనా ప్రయత్నించటం వల్ల ఆ దేశ వృద్ధి రేటు బాగా దెబ్బతిన్నది. పెద్ద ఎత్తున పోగుపడిన పెట్టుబడి సంచయం స్థాయి ఇక ఏమాత్రం అనుకూలంగా లేదు. ఐరోపాలో మితవ్యయ విధానం (ఆస్టిరిటీ), అమెరికాలో వేతన స్తంభనలతో ప్రజల కొనుగోలుశక్తి బలహీనపడింది. తత్ఫలితంగా చైనా సరుకుల ఎగుమతికి పరిమితి ఏర్పడింది. 2008 సంక్షోభం నుంచి గట్టెక్కేందుకు ఆరాటపడుతున్న ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థకు ఈ రూపంలో మరో సంక్షోభం రావటంతో అది మరింతగా కుంగి కృషిస్తున్నది. ప్రస్తుత పరిస్థితులలో చైనా మాంద్యం ప్రపంచ ఆర్థిక వ్యవస్థను మరింతగా మాంద్యంలోకి తోస్తుంది.

2008 తరువాత చైనా ఆర్థిక వ్యవస్థ 10 శాతం అభివృద్ధితో ప్రపంచ ఆర్థికవ్యవస్థకు ఇంజన్‌లా పనిచేసి నడిపించింది. ప్రపంచ పెట్టుబడులను ఆకర్షించింది. ఉత్పత్తి కేంద్రంగా మారింది. వస్తువులను ప్రపంచాని కంతటికీ ఎగుమతి చేసింది. కానీ ఇప్పుడు ఆ దేశమే సమస్యల నెదుర్కొంటోంది. షాంఘై స్టాక్‌మార్కెట్ ఆగస్టు ఆరంభంలో 11.5 శాతం పతనం కావటంతో ప్రభుత్వం జోక్యం చేసుకుంది. అయితే ఆ జోక్యం ఏమాత్రం ప్రభావం చూపించలేకపోయింది. మార్కెట్‌లో డబ్బు ఎంతగా గుప్పించినప్పటికీ అస్థిరత ఆగలేదు. 2007 ఫిబ్రవరి తరువాత అగ్ర స్థానంలోవున్న చైనా ఆర్థిక వ్యవస్థ నాటకీయంగా మాంద్యంలో పడిందనే భయంతో ఈ స్టాక్ మార్కెట్ సంక్షోభం ఆరంభమయింది. పారిశ్రామిక వృద్ధి, ఎగుమతులు సన్నగిల్లాయి. పరిస్థితిని చక్కదిద్దటానికి ఆగస్టు 11వ తేదీన చైనా తన కరెన్సీ యువాన్ విలువను తగ్గించింది.

యువాన్ విలువ తగ్గించటంవల్ల చైనా అంతర్గత డిమాండ్ పెరుగు తుందన్న ఆశలేదు. ఎందుకంటే, చైనాది ఎగుమతి ఆధార ఆర్థిక వ్యవస్థ. అమెరికన్ లెహ్‌మాన్ బ్యాంక్ దివాలా షాక్ తర్వాత చైనా ఎగుమతులు తగ్గుతూ వచ్చాయి. ఇ.యు. ప్రధాన మార్కెట్లు డిఫ్లేషన్ (రుణాత్మకత)లో మునిగి ఉన్నాయి. అమెరికా అస్థిర స్థితిలో ఉంది. ప్రపంచ ఆర్థిక మాంద్యం అంటువ్యాధి ప్రభావం కొనసాగుతూ వుంది. అందువల్ల చైనా కరెన్సీ విలువ తగ్గింపు దాని ఎగుమతులకు ప్రోత్సాహకం కాకపోవచ్చు. చైనా 2013లో ప్రపంచంలో మూడవ అతిపెద్ద విదేశీ పెట్టుబడిదారు అయింది. దాని పెట్టుబడులు ఇంతవరకు ప్రధానంగా ప్రకృతి వనరులు సరఫరా చేసే ఆస్ట్రేలియా, ఆఫ్రికాల్లో కేంద్రీకరించింది. ఎగుమతులకు డిమాండ్ తగ్గడంతో ఇప్పుడు విదేశాల్లో ఉత్పత్తి రంగంలో పెట్టుబడులవైపు దృష్టి మళ్లించింది. వచ్చే ఐదేళ్లలో మన దేశంలో 20 బిలియన్ అమెరికన్ డాలర్లు పెట్టుబడి పెట్టనుంది. ఏ దేశమైనా స్వావలంబన కోల్పోయి ఎగుమతి దిగుమతులపై, సేవారంగంపై ఆధార పడి బతకడం మంచిది కాదు. అభివృద్ధికి సుఖమయ జీవనమే కొలమానం కావాలె తప్ప షేర్‌మార్కెట్ సూచీలు, 'స్పెక్యులేషన్'లు కాదు.

చైనా తన ఎగుమతులకు లక్ష్యంగావున్న పెట్టుబడిదారీ దేశాల ఆర్థికవ్యవస్థలు మాంద్యం నుంచి కోలుకుని బలమైన వృద్ధి సాధిస్తాయని ఆశించింది. అయితే 2008 సంక్షోభం ఏవో అనుకోని పరిస్థితుల ప్రభావంతో వచ్చింది కాదు. అది వ్యవస్థీకృత వైఫల్యానికి ఆరంభం. ఐరోపా దేశాలలో ఉత్పత్తి 2007 పూర్వస్థితికి ఇంకా చేరుకోలేదు. అమెరికా, జపాన్‌లలో వృద్ధి రేట్లు చరిత్రలో ఎన్నడూలేనంత కనిష్ఠ స్థాయిలో వున్నాయి. 2008కి పూర్వస్థితికి వృద్ధిరేట్లు చేరుకోబోవటం లేదని అంతర్జాతీయ ద్రవ్యసంస్థ గత ఏప్రిల్‌లో తెలిపింది. దీనితో ఐరోపా దేశాలకు చైనా చేస్తున్న ఎగుమతులు అంతకుముందు సంవత్సరంకంటే 12శాతం తగ్గిపోయాయి. జపాన్‌కి చేస్తున్న ఎగుమతులలో తగ్గుదల 10శాతంగా నమోదయింది. ప్రపంచంలో రెండవ అతి పెద్ద ఆర్థిక వ్యవస్థగా వున్న చైనా తన కరెన్సీ విలువను తగ్గించటంతో స్టాక్ మార్కెట్లు, సరుకుల ధరలు ప్రభావితమయ్యాయి. పారిశ్రామిక సరుకుల ధరలు కూడా పతనమయ్యాయి. ప్రపంచ పారిశ్రామిక కార్యకలాపాలకు సూచికగా వుండే రాగి ధర 4శాతం పడిపోయింది. ఇది ఆరు సంవత్సరా లలో అత్యంత కనిష్టం. అలాగే బ్యారెల్ చమురు ధర 40 డాలర్ల దిగువకు పడిపోయింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ మొత్తంలో మాంద్యం ధోరణి మరింతగా ప్రబలుతుందనే అంచనా సర్వత్రా ఉండడంతో ఈవిధమైన ప్రతిస్పందనలు వస్తున్నాయి.

చైనా ఆర్థిక రంగంలో లుకలుకలు మొదలై ఏడాది దాటింది. దీన్ని దాచి పెట్టింది. తమ ఆర్థిక రంగం పచ్చగా ఉందని చాటేందుకు చైనా యధేచ్ఛగా సర్కారు సొమ్ము ఉద్దీపనగా గత ఏడేండ్లలో 586 బిలియన్ డాలర్లు ఖర్చు చేసింది. అవసరంతో సంబంధం లేకుండా భారీ ఎత్తున ఇళ్లను నిర్మించింది.అనేక అనుత్పాదక ప్రాజెక్టులను చేపట్టింది. స్టాక్ మార్కెట్లకు చౌకగా నిధులు లభించే వెసులుబాటు కల్పించింది. కృత్రిమ బూమ్‌తో చైనా స్టాక్‌మార్కెట్లు ఏడాదిపాటు ఊగిపోయాయి. ఉత్పత్తుల రంగం చతికిలబడింది. భారీ స్థాయిలో నిర్మాణమైన కర్మాగారాలు 60 శాతం సామర్థ్యాన్ని కూడా ఉపయోగించు కోవడం లేదు. పెద్ద సంఖ్యలో కార్మికులు ఉపాధి కోల్పోయి రోడ్డున పడుతున్నారు. చైనా అప్పులు ఆ దేశ జీడీపీకి మూడు రెట్లు పెరిగాయి. చైనా ఆర్థిక సంక్షోభం బయటకు కనిపిస్తున్న దానికంటే చాలా తీవ్రంగా ఉన్నట్టు చెబుతున్నారు. చైనా ఆర్థిక సంక్షోభానికి కారణం డిమాండ్ – సప్లయ్ సమీకరణే. అయితే డిమాండ్ ఆ దేశానికి వెలుపల ఉంది. వస్తు వినియోగానికి అవసరమైన మార్కెట్‌ను దేశీయంగా సృష్టించుకో గలిగితే చైనా ఉద్దీపన ప్రయత్నాలు ఫలించేవి. అందుకే ఇప్పుడు సరిహద్దుల ఆవల డిమాండ్‌ను ఆకట్టుకునేందుకు కరెన్సీ యువాన్ విలువను కుదించింది. విలువ తగ్గిన కరెన్సీ కారణంగా మరింత చౌకగా తన సరుకులను ప్రపంచమార్కెట్‌కు సప్లయ్ చేయాలన్నది చైనా ఎత్తుగడ.

చైనా పాలకుల ఆర్థిక విధానాల వల్ల,యువాన్ విలువ తగ్గించడం వల్ల బయటి ప్రపంచం కన్నా ఆ దేశంలోని బడుగు జీవులు నష్టపోయిందే ఎక్కువ. షేర్లలో పెట్టుబడులు పెడితే లాభాలు వస్తాయని చైనా పాలకులు ప్రచారం చేశారు. ప్రజలకు ఒకప్పుడు ఉచితంగా లభించే వైద్యం ఇప్పుడు భారంగా మారింది. సంక్షేమ పథకాలు లేకపోవడం వల్ల సామాన్య ప్రజలకు బతుకు పట్ల భయం ఏర్పడ్డది. ఇప్పుడు ఒక్క పూట తిన్నా వృద్ధాప్యంలో అవసరానికి కొంత దాచుకున్నారు. చైనా స్టాక్ మార్కెట్‌లో

ఎనభై శాతం మదుపర్లు సామాన్య ప్రజలే. రైతులు, కార్మికులు చెమటోడ్చి పొగుచేసుకొని దాచుకున్న సొమ్ముతో పోలిస్తే షేర్‌మార్కెట్‌లో విదేశీ పెట్టుబడుల శాతం అతి తక్కువ. షేర్ మార్కెట్‌లో మదుపు చేయాలంటూ ప్రభుత్వం చేసిన ప్రచారం ఎంత ప్రభావం చూపిందంటే కొందరు వడ్డీకి అప్పులు తెచ్చి షేర్లు కొన్నారు. ఇప్పుడు షేర్ మార్కెట్ కుప్పకూలటంతో నైరాశ్యంతో అనేకమంది మదుపర్లు ఆత్మహత్యలకు పాల్పడ్డారు.

ప్రస్తుత సంక్షోభానికి ఇతర కారణాలు కూడా ఉన్నాయి. ఒకటి గ్రీస్ సంక్షోభం. రెండు, యూరోపియన్ ఆర్థిక వ్యవస్థలో కలకలం. మూడు, వాల్‌స్ట్రీట్‌పై చైనా పరిణామాలు, దేశీయ వస్తూత్పత్తి తగ్గుదల ప్రభావం. నాలుగు, అమెరికా వడ్డీరేట్లు పెంచవచ్చునన్న ఊహాగానాలు బలపడటం. ఐదు, రెండు కొరియాల మధ్య యుద్ధ వాతావరణం. ఆరు, ఆయిల్ ధరలు బ్యారల్ 40 డాలర్ల దిగువకు పతనం చెందటం. ఏడు, ఇనుము, రాగి వంటి ఖనిజాల ధరలు పడిపోయాయి. ఈ క్రమంలో లాభాలే ధ్యేయం గల విదేశీ సంస్థాగత ఇన్వెస్టర్లు తమ పెట్టుబడులను ఎప్పుడు వెనుకకు తీసుకుంటారో తెలియని అనిశ్చితి. మరోవైపు ఏ దేశంలో నిలకడైన ఆర్థిక వృద్ధిలేదు. దీంతో ద్రవ్య పెట్టుబడులు ఏమాత్రం కాస్త పెద్దగాలి వీచినా వణికిపోయే చిగురుటాకులా ఉన్నాయి.

చైనా పాలకులు భారీ స్థాయిలో అప్పులు చేసి అనుత్పాదక రంగాలలో కుమ్మరించారు. చివరికి ఆ రుణమే పెనుభారంగా మారి ఆర్థిక వ్యవస్థను దెబ్బకొట్టింది. మొత్తం రుణం 25 లక్షల కోట్ల డాలర్లకు చేరింది. ఈ అప్పు జిడిపిలో 28 శాతం. చైనాలో కూడా స్థూల జాతీయోత్పత్తి వృద్ధి రేటు మందగిస్తున్నది. ఆ దేశంలోని పారిశ్రామిక రంగం దశాబ్ద కాలం పాటు బ్రహ్మాండమైన వృద్ధిని సాధించింది. లాటిన్ అమెరికాతో పాటు ప్రపంచవ్యాప్తంగా ముడిసరుకులు కొనే దేశంగా చైనా ఆవిర్భవించింది. చైనాలో పారిశ్రామిక వృద్ధి రేటు తగ్గుతుండటంతో ఆ దేశంలో గతంలో ఏర్పడిన బూమ్ కారణంగా లాభపడిన తృతీయ ప్రపంచ దేశాలన్నీ ఇప్పుడు ప్రతికూల ప్రభావానికి లోనవుతున్నాయి. క్లుప్తంగా చెప్పాలంటే అభివృద్ధి చెందిన దేశాల ఆర్థిక వ్యవస్థలు మెరుగుపడకపోవటంతో ఆర్థిక సంక్షోభం విశ్వవ్యాప్తమవుతున్నది. యూరో జోన్‌లో పరిస్థితి ఎలా ఉన్నదో అందరికీ తెలిసిందే. ఫ్రాన్స్‌తో పాటు దక్షిణ ఐరోపాను ఆర్థిక సంక్షోభం ముంచెత్తింది. కామెరాన్ ప్రభుత్వం విధిస్తున్న దారుణ పొదుపు విధానంతో బ్రిటన్ ప్రజలు పడుతున్న క్షోభ అత్యంత దారుణంగా ఉంది.

నేడు ప్రపంచంలో ఏఒక్క దేశమూ అప్పు లేకుండా లేదు. రోజు రోజుకీ ప్రభుత్వాలు అప్పుల్లో కూరుకుపోతున్నాయి. 2008 సంక్షోభం తరువాత దివాళా తీసిన ఆర్థిక సంస్థలను రక్షించడానికి బెయిలవుట్ ప్యాకేజీలు ప్రకటించిన ఆయా దేశాల ప్రభుత్వాలు మరింత అప్పుల్లో కూరుకుపోయాయి. ఉదాహరణకు, ఈ రోజు ప్రపంచ జిడిపి సుమారు 70 ట్రిలియన్ డాలర్లు కాగా అప్పు 200 ట్రిలియన్ డాలర్లు. అంటే ఉత్పత్తికన్నా అప్పు మూడు రెట్లు ఎక్కువన్న మాట. చైనా అప్పు జిడిపిలో 40 శాతం, భారత్ అప్పు 50 శాతం ఉంటే అమెరికా అప్పు 107 శాతం ఉంది. ఇటీవల దివాళా తీసిన గ్రీసు అప్పు జిడిపిలో 200 శాతం పైనే ఉంది. ఐర్లండ్, సైప్రస్‌లాంటి దేశాలు అప్పులతో దివాళా తీయగా స్పెయిన్, పోర్చుగీసు వంటి దేశాలు దివాళా అంచులకు చేరాయి. అమెరికా ఆర్థిక వ్యవస్థ పూర్తిగా అప్పుల్లో ఉండడం, వడ్డీ రేట్లు దాదాపు సున్నాకు చేరడం, 4 ట్రిలియన్ డాలర్ల వాణిజ్య లోటులో ఉండడం వల్ల దానికి మరో సంక్షోభాన్ని ఎదుర్కొనే సత్తా లేదని చెబుతున్నారు. 'వచ్చే సంక్షోభాన్ని ఎదుర్కొనే మంత్ర దండం అమెరికా దగ్గర లేదు' అని గత నెల వాల్ స్ట్రీట్ జర్నల్ ఒక వ్యాసంలో పేర్కొనడం గమనార్హం.

భారత ఆర్థిక వ్యవస్థ ప్రపంచ ఆర్థిక వ్యవస్థతో అనుసంధానం చేస్తున్న క్రమంలో చైనా సంక్షోభం నుండి భారత పాలకులు నేర్చుకో వలసిన పాఠం కూడా ఉంది. చైనా సంక్షోభాన్ని ఒక అవకాశంగా మల్చుకోవాలని ఆర్థిక మంత్రి జైట్లీ చెబుతున్నారు. ఏ రకంగా అవకాశంగా మల్చుకుంటారు? మేక్ ఇన్ ఇండియా ద్వారానా? సొంత పెట్టుబడులు, వనరులతో వస్తువులు తయారు చేసి అంతర్జాతీయ విపణిలో విక్రయించిన మేడ్ ఇన్ చైనా వ్యూహానికీ, విదేశీ పెట్టుబడులతో, స్వదేశీ వనరులతో వస్తువులు తయారు చేసి అంతర్జాతీయ మార్కెట్‌లో విక్రయించే పరిస్థితిని కల్పించే మేక్ ఇన్ ఇండియాకు తేడా లేదు. సంక్షోభానికి కారణం ఈ రెండు వ్యూహాల్లోనూ ఉంది. స్వావలంబన, స్వయంసమృద్ధికి పెద్దపీట వేసి, దేశీయ మార్కెట్‌ను విస్తృతపర్చి ప్రజల కొనుగోలు శక్తిని పెంచగల అభివృద్ధి వ్యూహాలు మాత్రమే సంక్షోభాలను అధిగమించే శక్తినిస్తాయి. చైనా సంక్షోభం నుంచి భారతపాలకులు నేర్చుకోవాల్సిన పాఠం కూడా అదే.

అంతర్జాతీయ ద్రవ్యసంస్థలు (ప్రపంచ బ్యాంక్, ఐఎంఎఫ్) వర్ధమాన దేశాల చేత అప్పులు చేయించి వాటిని తీర్చడానికి వీలుకాని వలయంలో పడేస్తాయి. విదేశీ పెట్టుబడులను ఆహ్వానిస్తే తప్ప పొద్దు గడవని పరిస్థితిని సృష్టిస్తాయి. చివరికి అప్పులు తీర్చే క్రమంలో ఆర్థిక క్రమశిక్షణ పేర సమాజ అవసరాలకు కోత పడుతుంది. ఇది క్రమంగా ఆర్థిక, సామాజిక అనిశ్చితికి దారి తీస్తుంది. ఏ మాత్రం సంక్షోభం వచ్చి నా విదేశీ పెట్టుబడులు వెనక్కు మళ్ళుతాయి. మరోవైపు అన్ని దేశాల్లోనూ కార్మికుల సంక్షేమం, వేతనాల్లో విచ్చలవిడిగా కోతలు విధిస్తున్నారు. ప్రయివేటు ఫైనాన్స్ సంస్థలను రక్షించేందుకు బెయిలవుట్ ప్యాకేజీలు ప్రకటించిన ప్రభుత్వాలు దాని వల్ల తడిసి మోపెడైన అప్పుల నుండి బయట పడేందుకు పొదుపు చర్యలకు పాల్పడుతున్నాయి. సెంట్రల్ బ్యాంకులు, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు దేశాలకు అప్పులిచ్చే ముందు పొదుపు చర్యలను షరతుగా విధిస్తున్నాయి. ఫలితంగా కార్మికుల వేతనాలు, వారి జీవన ప్రమాణాలు మరింత కుంచించుకు పోతున్నాయి.

ఒకవైపు నిరుద్యోగం, మరోవైపు వేతనాల కుదింపు, సంక్షేమంలో కోత వల్ల ప్రజల కొనుగోలు శక్తిని గణనీయంగా తగ్గించి వేస్తున్నాయి. వారికి అప్పులిచ్చి (క్రెడిట్) ఆర్థిక వ్యవస్థను చురుకుగా నడిపే శక్తి, అవకాశాలు ప్రపంచ దేశాలకు ఇప్పుడు లేవు. దీని ఫలితమేమంటే రానున్న కాలంలో ప్రపంచ ఆర్థికవ్యవస్థ మరింతగా మాంద్యాన్ని ఎదుర్కొంటుందే తప్ప పునరుద్ధరణ జరగడం అసంభవం. ఒకవైపు నిరుద్యోగం, దారిద్ర్యం పెరుగుతుంటే, కార్పొరేట్ యజమానులు మరింత ధనికులవుతున్నారు. వాళ్ల దురాశ వల్లనే ప్రపంచానికి ఆర్థిక సంక్షోభం వచ్చింది. అయినా సంక్షోభం నుండి బయటపడే బెయిలవుట్ ప్యాకేజీల వల్ల వాళ్లే మరింత లాభం పొందారు. ప్రభుత్వాలు ప్రకటించే పొదుపు విధానాలు కార్పొరేట్ లాభాలను ఇబ్బడి ముబ్బడిగా పెంచాయి. నేడు మాంద్యం ఏర్పడిన పరిస్థితుల్లో కార్పొరేట్ పెట్టుబడి ఉత్పత్తి శక్తుల పెంపుదలకు ఉపయోగిస్తే, పరిశోధనా అభివృద్ధి సాధ్యమవుతుంది. కానీ వారు ఆ పని చేయకపోగా డబ్బునంతటినీ మెర్జర్లకూ, స్టాకులు తిరిగి కొనుక్కోడానికి ఖర్చు చేస్తున్నారు. అందువల్ల కంపెనీల లాభాలు పెరిగి ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక అసమానతలు విపరీతంగా విస్తరించాయి.

ఇవాళ ఆర్థిక సంక్షోభంతో పాటు రాజకీయ సంక్షోభాలు

# పడిలేస్తున్న ప్రపంచ శ్రామిక వర్గ విప్లవం

***పీడిత ప్రజల నాయకత్వాన విప్లవకర స్ఫూర్తితో ఫ్రాన్స్‌లో ఏర్పాటైన పాలన నుండి రష్యా, చైనాలో జరిగిన మహత్తర విప్లవాలను, అవి సామ్రాజ్యవాద దురాక్రమణలకు గురైన తీరును వివరిస్తున్నారు బి. ఎస్. రాజు***

ప్రతి సంవత్సరం సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ మాసాలు వచ్చాయంటే మన దేశం నలుమూలలా పండగల వెల్లువ, వాటి సందడి కనిపిస్తుంది. శ్రామికుల జీవనంలో భాగంగా పుట్టుకొచ్చిన పండగలను దైవం, బ్రాహ్మణ్యం, భూస్వామ్యం; కుల-మత మౌఢ్య భావజాల కషాయం పండుగల రూపురేఖలను మార్చివేసాయి. వీటి అర్థాన్ని మార్చివేసాయి. నమ్మిక, ఆచార సాంప్రదాయాల మేళవింపైన పండగల మోతలో ఇప్పుడు సమాజం హేతువును కోల్పోయింది. దీనికి భిన్నమైన సహేతుక సమాజ నిర్మాణ భావజాలం సాంప్రదాయ భావజాలపు రథచక్రాల కింద పడి నుజ్జు నుజ్జై లేచి నిలబడలేక పోతోంది.

ఇళ్లల్లో కొలుచుకునే దేవుళ్లను వీథుల్లోకి తేవద్దంటే ఈ దేశంలో అదొక నేరమై కూర్చుంది. దేవుళ్లను నిమజ్జనం చేయొద్దంటే, నీళ్లను కలుషితం చేయొద్దంటే; హేతుబద్ధంగా, జ్ఞానబద్ధంగా ఆలోచిద్దామంటే ఈ దేశంలో తలలు తెగి పడుతున్నాయ్! కలలు కనాలన్నా, కలంతో స్వతంత్రంగా రాయాలన్నా, సాంప్రదాయపు పెత్తనం ముందు తలవంచి చేతులు కట్టుకు అనుమతులు పొందాల్సి వస్తోంది; లేకపోతే కుత్తుకలు ఉత్తరించ బడుతున్నాయ్!

ఈ జిలుగు వెలుగుల, రంగు రంగుల పండుగల మాయ జలతారు తెరలమాటున; పూజా పుష్పాల, పసుపు కుంకుమల మంత్రోచ్చాటనల మాటున దాగి ఉన్న హింస-అణచివేతల, అంధకారపు అజ్ఞాన అగాధాల లోతులు ఎంతటివో, అర్థం చేసుకోవాలంటే, ఈ సంవత్సరం పండగల పర్వదినాలకు ఆహ్వానం పలుకుతూ రాజ్యం తెలుగునేల మీద కొనసాగించిన అమానుష బూటకపు ఎన్‌కౌంటర్ల హత్యలే ఉదాహరణ. రాజ్యం, రాజ్యాంగం, చట్టాలు, చట్టసభలు, ఎన్నికలు, పాలకులు ఎవరి కోసమో, ఎందుకోసమో ఈ పండగల పబ్బాల బ్రాహ్మణ్య భావజాలాన్ని, ఏ దోపిడీ పీడనలను ఎత్తిపట్టడాటానికి, ఏ పెట్టుబడి విన్యాసానికో, పాదసేవకో, కొంచెం మనోనేత్రాన్ని తెరిస్తే ఎవరికైనా అర్థమయ్యే విషయమే!

ముఖ్యంగా అక్టోబర్ నెల వస్తోందంటే- ఈ బూటకపు మాయా వినోదపు పండగలకు భిన్నమైన, విరుద్ధమైన మరొక ప్రపంచం, ఓ హేతుబద్ధ ప్రపంచం, ఓ విజ్ఞాన వికాసాల ప్రపంచం, మానవ చరిత్రలో రక్తతర్పణతో దోపిడీ పీడనల బానిస సంకెళ్లు తెంచుకుని లేచి నిలబడ్డ ఓ శ్రామిక సమసమాజ ప్రపంచం తళుక్కున మెరిసి కనుమరుగైన ప్రపంచం ఒకటి కనులలో కదులాడుతుంది. మనసును ఒక కొత్త ఎత్తుకు తీసుకెళుతుంది.

కనుమరుగైన అటువంటి ప్రపంచం తిరిగి ఈ మాయదారి దండుగ మారి పండుగల దేశంలోనే, దండకారణ్య జనతన సర్కార్ పేరుతో రూపు దిద్దుకుంటున్న సందర్భం- తిరిగి కనులకు కడుతోంది, మనసను నింపుతోంది. ఈ దేశపు యువతను, శ్రామిక శక్తిని ఉత్సాహ పరుస్తోంది. ఓ కొత్త ఆశను చిగురింప చేస్తోంది. ప్రపంచ మానవాళికి తిరిగి ఓ కొత్త ఆశారేఖను అందిస్తోంది. ఇప్పటి అల్లకల్లోల ప్రపంచం లో, పెట్టుబడి-సామ్రాజ్యవాదం, యుద్ధం-దురాక్రమణల ఇనుపబూట్ల కిందపడి నలుగుతున్న మానవాళికి వేలుగురేఖై ప్రత్యామ్నాయ కాగడా అయి నిలుస్తోంది.

ప్రపంచంలో మొట్టమొదటి సారి 1871 మార్చ్ నెలలో కొద్దికాలం పాటైనా పారిస్ నగరంలో కార్మికులు ధనస్వామ్య పాలనకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసి విప్లవకర శ్రామిక పాలనను స్థాపించారు. ఇది చరిత్రలో పారిస్ కమ్యూన్ తిరుగుబాటుగా ప్రసిద్ధి కెక్కింది. ధనికుల 'చట్టబండ' పార్లమెంటు స్థానంలో పారిస్ కార్మికులు 'కమ్యూన్' అనే కార్మికవర్గ పాలనా అంగాన్ని స్థాపించారు. 'కమ్యూన్' శాసన, పాలనాధికారాలు రెండింటినీ కలిగి ఉంటుంది. కమ్యూన్ సభ్యులు ప్రజలచే ఎన్నుకోబడి, ప్రజల తరఫున అధికారికంగా పనిచేస్తారు. అలానే, ప్రజాబాహుళ్యం ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు ఈ సభ్యులు అధికార హోదానుండి తప్పించ బడతారు. బూర్జువా సైన్యాన్ని రద్దుచేసి, దాని స్థానంలో ప్రజా మిలీషియాను ఏర్పర్చారు. ప్రజలు సాయుధులై పోలీసులను వారి చెప్పుచేతల్లో పెట్టుకున్నారు. న్యాయాధికారులు, ప్రజాపాలనాధికారులు ప్రజలచే ప్రత్యక్షంగా ఎన్నుకోబడ్డారు. వారికి సాధారణ కార్మికునికిచ్చే జీతబత్యాలే ఇచ్చారు. ఇట్లా మానవ చరిత్రలో మొట్టమొదటి సారిగా శ్రామికులు బూర్జువాల రాజ్యాన్ని కూలదోసి తమ రాజ్యాన్ని అంటే శ్రామికవర్గ నియంతృత్వాన్ని నెలకొల్పారు.

---

కొనసాగుతున్నాయి. ఉపాధి రహిత వృద్ధితో పెరుగుతున్న నిరుద్యోగం కూడా సంక్షోభాలు సృష్టిస్తున్నది. కేవలం ఎగుమతి ప్రధాన లేక దిగుమతి ప్రధాన ఆర్థిక వ్యవస్థలు, ఎక్కువగా విదేశీ పెట్టుబడులపై ఆధారపడిన మార్కెట్లు సహజంగానే పెద్ద కుదుపులకు గురవుతూనే ఉంటాయి. కాబట్టి బహుముఖ అభివృద్ధిపై కేంద్రీకరించిన దేశాలు ఆటుపోట్లను సాపేక్షికంగా తట్టుకోగలుగుతాయి. మరోవైపు నేడు మిత వ్యయ విధానం, వాస్తవ వేతనాలలో కోతలు వుండటంతో వినియోగానికి ప్రతిబంధకం ఏర్పడింది. దీనితో బూర్జువా వ్యవస్థకు ఆయువుపట్టైన పెట్టుబడి నీరసపడుతోంది. దీనితో పెట్టుబడిదారీ వ్యవస్థ వైరుధ్యాలన్నీ మళ్లీ ముందుకొస్తున్నాయి. రాబోయే దృశ్యం మరో మాంద్యదే అవుతుంది. అయితే అది ఇప్పటికంటే మరింత తీవ్రంగా ఉంటుంది. కాబట్టి నేటి సంక్షోభం స్థల-కాలాలలో ముగింపులేనిది. కుదించుకు పోతున్న మార్కెట్ల కోసం జరిగే పోటీలు కరెన్సీ యుద్ధాలకు దారి తీసే ప్రమాదం ఉంది. గ్లోబలీకరణ చెందిన నేటి ప్రపంచంలో వ్యవస్థీకృతంగా వచ్చిన సంక్షోభం వ్యవస్థ మార్పుతో మాత్రమే అంతమవుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ దిశను మార్చే ఏదైనా గొప్ప మార్పు సంభవిస్తే తప్ప ఇది ఒక మహా సంక్షోభంగా మారే ప్రమాదం పొంచివుంది.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

శ్రామికవర్గ నియంతృత్వం ఎలా ఉంటుంది అనే ప్రశ్న తలెత్తినప్పుడు, ఓసారి ఎంగెల్స్ ఇలా సమాధానమిచ్చాడు: 'అయ్యా! పెద్దమనుషులారా! శ్రామికవర్గ నియంతృత్వమంటే ఎట్లుంటుందో అడుగుతున్నారు కదా! పారిస్ కమ్యూన్ వైపు చూడండి! అదే శ్రామికవర్గ నియంతృత్వం అని తెలుసుకోండి!' అని అన్నాడు.

అయితే పారిస్ కమ్యూన్ కొద్ది వారాల పాటే నిలబడగల్గింది. ఈ కొద్దిపాటి కాలంలోనే అది ధనస్వామ్యానికి ప్రత్యామ్నాయం సాధ్యమని నిరూపించింది. కార్మికవర్గ పాలన ఎలా ఉంటుందో రుచి చూపించింది. అయితే పాత బూర్జువా రాజ్యవ్యవస్థను పూర్తిగా రద్దు చేయాలనే అవగాహనను గాని, అటువంటి అవగాహనకు అవసరమైన సైద్ధాంతిక పునాదిని గాని, వ్యూహం-ఎత్తుగడలను గాని అది ఆనాడు సంతరించుకోలేక పోయింది. దానికున్న చారిత్రక పరిమితి అటువంటిది.

తన పునాదులే కూలిపోతున్నప్పుడు బూర్జువా రాజ్య వ్యవస్థ ఎంతకైనా తెగించి శ్రామిక తిరుగుబాటును, ప్రజాస్వామిక ఆకాంక్షలను పాశవికంగా అణచి వేస్తుందని కమ్యూనార్డ్ల ఊచకోత, పారిస్ కమ్యూన్ రక్తపాతం ద్వారా రుజువు చేసింది. కమ్యూనిస్ట్ విప్లవోద్యమానికి ఇదొక ప్రాథమిక గుణపాఠంగా నిలిచింది. ఈ గుణపాఠం నుండి ఉదయించిన రాజకీయ సిద్ధాంతమే మార్క్సిజం-లెనినిజం. శ్రామిక రాజ్యం స్థాపించాలన్నా, దాన్ని నిలుపుకోవాలన్నా బలమైన, అంకిత భావంతో స్వార్థరహితంగా, త్యాగనిరతితో, ఉక్కు క్రమశిక్షణతో పూర్తికాలం పనిచేసే కార్యకర్తలు కల్గిన పార్టీ ఉండాలనీ; బూర్జువాల సైనిక శక్తిని ఎదుర్కోవాలంటే కార్మికులకు సొంత సైన్యం ఉండాలనీ; పారిశ్రామిక కార్మికులు, పలు రంగాల్లో పనిచేసే శ్రామికులు, రైతులు, బుద్ధిజీవులు ఐక్యమై బూర్జువా వ్యవస్థపై బహుముఖమైన దాడిని కొనసాగిస్తూ శాంతియుతంగానూ, సాయుధంగానూ బూర్జువా రాజ్యంపై పోరాడి గెలవాల్సి ఉంటుందనే విప్లవ సిద్ధాంతం పలు ప్రజా ఉద్య మాల సారగ్రహితంగా రూపుదిద్దుకుంది.. ఈ మార్గంలో నడిచి గెలిచినదే రష్యన్ బోల్షివిక్ విప్లవం. 'సోవియెట్ల కే సర్వాధికారాలు' అనే నినాదం పారిస్ కమ్యూన్ స్ఫూర్తితో, దాని కొనసాగింపుగా తిరిగి రష్యన్ కార్మికులు, విప్లవకారులచే 1917 అక్టోబర్/నవంబర్ మాసాల్లో ఆవిష్కరించబడింది. ప్రపంచ శ్రామిక మానవాళి తిరిగి తమ రాజ్యం స్థాపించుకోవడానికి నాలుగున్నర దశాబ్దాల కాలం పట్టింది.

1917 నుండి 1957 వరకు సోవియెట్ శ్రామిక రాజ్యం కొనసాగింది. ఈ నాలుగు దశాబ్దాల చరిత్ర పొడవునా అది ఎన్నో ఒడిదుడుకులు, సామ్రాజ్యవాద యుద్ధాలు ఎదుర్కొన్నది. కోట్లాది సోవియెట్ పౌరుల ప్రాణాలను ఫణంగా పెట్టి హిట్లర్ ఫాసిజాన్ని ఓడించింది. అద్భుతమైన శాస్త్ర సామాజిక ప్రగతిని సాధించింది. సమసమాజ నిర్మాణంలో పెద్ద అంగలు వేసింది. వలసవాదం, సామ్రాజ్యవాదం ఉక్కు పాదాల కింద పడి నలుగుతున్న, అణగారి ఉన్న ఎన్నో దేశాలకు విముక్తి మార్గాన్ని స్నేహ హస్తాన్ని అందించింది. ప్రపంచ శ్రామిక మానవాళికి ఓ ఆశాజ్యోతిగా వెలిగింది. ఇదీ నిలవలేదు. ఉక్కు క్రమశిక్షణతో, మార్క్సిస్ట్ - లెనినిస్ట్ సైద్ధాంతిక బలంతో నిర్మించబడి సోవియెట్ ప్రజలను నడిపించిన బోల్షివిక్‌పార్టీ బ్యూరాక్రసీకి, రివిజనిస్ట్ ద్రోహానికి గురై కుప్పకూలింది. ఇప్పుడు మాఫియా ముఠాల విషకోరల బారినపడి రష్యన్ సమాజం రక్తమోడుతున్నది. ఇక్కడ మరో విప్లవ ప్రభంజనం బాకీ.

1949 అక్టోబర్లో చైనా కమ్యూనిస్ట్ పార్టీ నాయకత్వంలో విప్లవం విజయవంతమై 'జనచైనా' ఆవిర్భవించింది. తొలి అక్టోబర్ విప్లవ స్ఫూర్తితో, సోవియెట్ రష్యా స్నేహహస్తంతో 'జనచైనా' సోషలిస్ట్ నిర్మాణపు తొలి అడుగులు వేసి, మావో నాయకత్వంలో తనదైన పద్ధతిలో కమ్యూన్ల స్థాపన అనే అద్భుత విజయాన్ని సాధించింది. విద్య, వైద్య రంగాల్లో, పరిశ్రమల నిర్వహణలో కొంత వరకు శ్రామిక వర్గదృక్పథంతో నడవ గలిగింది. సోవియెట్ రష్యా రివిజనిస్ట్ పతనం నుండి గుణపాఠాలు తీసుకుని సాంస్కృతిక విప్లవాన్ని ఆచరించి, చైనా కమ్యూనిస్ట్ పార్టీలో పుట్టుకొచ్చిన పెట్టుబడిదారీ పంథా చీడను వదిలించుకోవాలని గట్టి ప్రయత్నం చేసినా, 1976 తర్వాత అది మార్కెట్ సోషలిజమనే ముసుగులో పరమ పెట్టుబడి దారుగా, శ్రామిక వర్గ ద్రోహిగా మిగిలి కొనసాగుతోంది. ఇక్కడా మరో శ్రామిక వర్గ విప్లవ ప్రభంజనం బాకీనే.

జన చైనా సాంస్కృతిక విప్లవంతో ఉత్తేజితులైన కొన్ని భారత కమ్యూనిస్ట్ శ్రేణులు రివిజనిస్ట్ భారత కమ్యూనిస్ట్ పార్టీల బూర్జువా పార్లమెంటరీ పంథాతో విసుగుచెంది నక్సల్బరీ ఉద్యమానికి నాంది పల్కారు. ఉవ్వెత్తున ఎగసిన ఈ ఉద్యమం అతి స్వల్ప కాలంలోనే చీలికలు, పీలికలై నాలుగు దశబ్దాల పైబడి కొట్టుమిట్టాడింది. ఎందరో విప్లవ కారులు, ప్రజలు తృణప్రాయంగా ఈ ఉద్యమానికి తమ ప్రాణాలను అర్పించారు. త్యాగనిరతకి మారుపేరుగా ఈ ఉద్యమం కొనసాగింది. గత దశాబ్దకాలంగా భారత కమ్యూనిస్ట్ (మావోయిస్ట్) పార్టీగా కూడుకున్న విముక్తి ఉద్యమ శక్తులు దండకారణ్యంలో ప్రజా గెరిల్లా విముక్తి సైన్యాన్ని, జనతన సర్కార్లనే నూతన సోవియెట్ ప్రజాపాలనను ఉనికి లోనికి తీసుకు రాగలిగారు. పారిస్ కమ్యూన్, అక్టోబర్ సోవియెట్ సోషలిస్ట్ విప్లవం, జనచైనా సాంస్కృతిక విప్లవాల స్ఫూర్తిని, వాటి వైఫల్యాలను అధిగ మించి ఈ విప్లవ శక్తి పురోగమిస్తుందని, ప్రపంచ మానవాళికి కొత్త దారి చూపిస్తుందని ఆశపడటంలో తప్పు లేదనుకుంటా.

ఈ రోజు సోషలిస్ట్ శిబిరాలనేవేమీ లేవు. ఒకప్పుడు ఉండినవన్నీ కనుమరుగైనాయి. పెట్టుబడిదారీ విధానం, సామ్రాజ్యవాదం ఎంతగా సంక్షోభంలో కూరుకుపోయిందో; అంతకు మరింతగా విప్లవ శక్తులు కూడా సంక్షోభంలో కూరుకుపోయి ఉన్నాయనేది కాదనలేని వాస్తవం. అయితే, ఎన్ని ఎదురు దెబ్బలు తిన్నా, ఎంతగా సంక్షోభంలో ఉన్నా, ప్రపంచ ప్రజలు పెట్టుబడితో, సామ్రాజ్యవాదంతో చేతనాచేతనంగా యుద్ధం చేస్తూనే ఉన్నారు. ఇది ప్రజా యుద్ధమే! ఇవి వీధి పోరాటాలు కావచ్చు, అస్తిత్వ పోరాటాలు కావచ్చు, సాయుధ పోరాటాలు కావచ్చు, ఎన్నికల యుద్ధాలు కావచ్చు - ఇవన్నీ శ్రామిక వర్గ పోరాటాలుగా మలచబడి, పెట్టుబడిని, సామ్రాజ్యవాదాన్ని మట్టి కరిపించి, శ్రామిక వర్గ రాజ్యాలు ఎక్కడికక్కడ స్థాపించుకునే దిశగా కొనసాగవలసి ఉంది. అప్పుడే మానవాళికి నిజమైన విముక్తి.

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)*

# వ్యక్తుల హత్యతో సత్యశోధన ఆగదు

***హేతుబద్ధంగా ఆలోచించే వ్యక్తుల్ని మతోన్మాదులు హత్య చేయడం ప్రజాస్వామిక లక్షణం కాదనీ, దీని వల్ల సత్యశోధన ఆగిపోదనీ, మానవ సమాజం కోసం సత్యశోధన అవసరమనీ అంటున్నారు బైరెడ్డి సతీష్***

మనిషి కంటే మతమే ఉన్నతమైనది అనే ఉన్మాదం మారణ హోమాన్ని సృష్టిస్తున్నది. మతం ప్రశ్నించకూడనిదని, విమర్శలకు అతీతమైనదనే గుడ్డి విశ్వాసం వికృతరూపం తీసుకున్నది. మతం ద్వారా దర్శించే ప్రపంచమే నిజమైన ప్రపంచమని, మరో కోణంలో ప్రపంచాన్ని అర్థం చేసుకునే ప్రయత్నమే చేయవద్దనే, మనిషి జీవితాన్ని మతమే నిర్దేశిస్తుందని, ఎలా బతకాలో, ఏం మాట్లాడాలో, ఏం ఆలోచించాలో మతమే చెప్పుతున్నదని, మతాతీతంగా మనిషి బ్రతకకూడదని, స్వేచ్ఛా స్వతంత్రాలు మతం తర్వాతేనని, ప్రశ్నిస్తే ప్రాణాలు ఉండవని అనేక దేశాల్లో మతోన్మాదులు మారణకాండ సృష్టించడం మానవ చరిత్రలో కొత్తేమీ కాదు. మతోన్మాదానికి మనిషి బలవటం, నెత్తురు నేలరాలడం గతమే కాదు, భవిష్యత్తు కూడా! మతాన్ని ప్రశ్నించకూడదు అన్న అంశమే మతానికున్న అత్యంత ప్రమాదకరమైన లక్షణం. భూమి గుండ్రంగా ఉందంటే కాళ్లు చేతులు నరికేయమన్నారు, విశ్వంలో భూమి రేణువంత మాత్రమే అంటే కళ్లు పొడిచెయ్యమన్నారు, మానవ పురోభివృద్ధికి మనిషే కేంద్ర బిందువంటే గొంతు నులిమేయమన్నారు. సహజంగానే ప్రశ్నను సహించదు రాజ్యం. మత విశ్వాసులేమో మతము ప్రశ్నకు, విమర్శకు అతీతమైనది అనుకుంటారు. మనిషి మతాన్ని విశ్వసించడం, ఆచరించడం మానవ హక్కు అయినప్పుడు అదే మత విశ్వాసం పట్ల అభిప్రాయాన్ని (అది ఏదైనా) కలిగి ఉండడం కూడా మానవహక్కే. మత స్వేచ్ఛ ఎంత ప్రధానమో, మతంనుండి స్వేచ్ఛ కోరుకోవడం కూడా అంతే ప్రధానం. మత స్వేచ్ఛ ఒక ప్రజాస్వామిక సమాజ లక్షణం, మతం నుండి స్వేచ్ఛనూ పొందడం అంతే ప్రజాస్వామికం కావాలి. మతాన్ని ప్రశ్నించినందుకు, హేతుబద్ధంగా విమర్శించినందుకు మనుషులను మరణ శాసనాలు వెంటాడుతుంటాయి. మరీ కవులు, కళాకారులు, రచయితలకైతే ఆ ప్రమాదం మరింత తీవ్రంగా ఉంటుంది. మత విశ్వాసాన్ని విమర్శించినందుకు మనిషిని చంపమని ఏ మత సిద్ధాంతం చెప్పకపోవచ్చు. కానీ ఆ పని చేస్తున్నది ఆయా మతాలను ఆచరిస్తున్నవారే కదా. వర్తమాన చరిత్రలో 'సటానిక్ వర్సెస్' రాసినందుకు సల్మాన్ రష్డి కంఠంపై కత్తి వేలాడుతూనే ఉంది, 'లజ్జా' రాసి తన అభిప్రాయాలను చెప్పుకున్నందుకు తస్లీమా నస్రీన్‌ని ఇంకా వేటాడుతూనే ఉన్నారు.

**కన్నడనేలపై కల్బుర్గి దారుణ హత్య**

మతోన్మాద తూటాలకు మరో మేధా శిఖరం కూలిపోయింది. స్వతంత్రంగా, హేతుబద్ధంగా ఆలోచించినందుకు, సామాజిక జీవితంలో ఆచరణలోఉన్న అశాస్త్రీయ భావనలను ప్రశ్నించినందుకు మనిషినే మట్టుబెట్టారు మూర్ఖులు. తము విశ్వసించిందే అంతిమ సత్యమనుకునే అసహన శక్తులు ఈ కిరాతక చర్యకు పాల్పడ్డారు. 77ఏళ్ల మల్లేశప్ప కల్బుర్గి కన్నడ వచన సాహిత్య దిగ్గజం. చరిత్రకారుడు, పరిశోధకుడు హేతువాది, ప్రాచీన సాహిత్యాన్ని, శాసన సాహిత్యాన్ని శోధించిన బుద్ధిజీవి. హంపిలోని కన్నడ విశ్వవిద్యాలయం ఉపకులపతి. పరిశోదనాత్మకంగా, కార్యకారణ సహితంగా శాస్త్రీయ విజ్ఞానం జోడించి ప్రాపంచిక విషయాల్ని చెప్పడమే ఆయన నేరమయ్యింది. మత విశ్వాసాలను దైవత్వ ఉనికిని ప్రశ్నించేవాళ్లను భౌతికంగా నిర్మూలించడం చరిత్రలో కొత్తేమీ కాకపోయినా కన్నడ నేలమీద వర్తమాన చరిత్రలో ఇది మొదటిదే. ఆగస్టు 30న ఇద్దరు ఉన్మాదులు కల్బుర్గిని ఆయన ఇంటి వద్దనే కాల్చి చంపేశారు. అందవిశ్వాసాలను ప్రశ్నించినందుకు, విగ్రహారాధనపై వ్యాఖ్యానించినందుకు, 12వ శతాబ్దంలోనే మూడనమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడిన బసవన్న వరవడిలోనే ప్రజలను చైతన్యవంతం చేసే క్రమంలో మతోన్మాదులకు కంఠగింపైనాడు. బసవన్న సాహిత్యం, తాత్విక చింతనపై పరిశోధలను చేసి అది ఎట్లా వక్రీకరించబడుతుందో నిరూపించే ప్రయత్నం చేసిండు. బసవన్న వారసులమని చెప్పుకుంటున్నవారు మతవిశ్వాసాల్లో కూరుకుపోతున్నారని, తన సామాజిక వర్గమే అయిన లింగాయత్‌కు హిందూయిజంతో సంబంధంలేదని, అసలు హిందూయిజం మతమే కాదని స్వేచ్ఛగా తన అభిప్రాయాలను వెల్లడించడం మహాపాపమైపోయింది. నిజానికి ఇలాంటి అభిప్రాయాలను చెప్పడం ఆయనకు కొత్తకాదు. మూడు దశాబ్దాల క్రితమే చెన్న బసవన్న దైవత్వ ఉనికిని ప్రశ్నించినాడు. ప్రశ్నించడం సహించలేని శక్తులు, సమాధానం చెప్పలేని బహీనమైన భావజాలం కల్గిన మూకలే ఇటువంటి దాడులకు పాల్పడుతుంటాయి. గత దశాబ్దకాలంగా మతతత్వ శక్తులు కన్నడ నేలమీద కరాలనృత్యం చేస్తూనేఉన్నాయి. తొలిసారిగా దక్షిణ భారతదేశంలో కర్ణాటక రాష్ట్రంలో బి.జె.పి. అధికారంలోకి రావడంతో అధికారం అండతో శ్రీరాం సేన, బజరంగదళ్ వంటి మతోన్మాధ సంస్థలు చెలరేగిపోతున్నవి. దార్వాడ్, మంగళూర్ వంటి ప్రాంతాల్లో పబ్‌లపై దాడిచేసి విచక్షణారహితంగా హింసించటం, ప్రేమికుల దినంగా చెప్పబడుతున్న ఫిబ్రవరి 14 వంటి రోజుల్లో అయితే పార్కుల, హోటల్లలో గడిపే యువతీయువకులపై దాడిచేసి బలవంతము పెళ్లిళ్లు చేసే వికృత చర్యకు ప్పాడుతున్నారు. ఎలాంటి వస్త్రాలు ధరించాలి, ఏ సమయాల్లో బయటికి వెళ్లాలి అనే అంశాలను నిర్దేశిస్తూ పౌరుల వ్యక్తిగత స్వేచ్ఛను హరించివేస్తూ సాంస్కృతిక పోలీసింగ్‌కు ప్పాడుతున్నాయి. ఈ మతవాధ శక్తులే యు.ఆర్. అనంతమూర్తి వంటి సుప్రసిద్ధ రచయితను బెదిరించటమే కాకుండా, కల్బుర్గిని హత్యచేసిన సందర్భంలో బహిరంగంగానే ఆనందాన్ని వ్యక్తంచేసి తమ ఉన్మాధ, అనాగరిక, అమానవీయ స్వభావాన్ని బయటపెట్టుకున్నాయి. ఎం.ఎస్. భగవాన్

అనే మరో రచయితకు కూడా ఇదే గతి పడుతుందని హెచ్చరికలు కూడా జారీచేసినాయి. మత మార్పిడులు చేస్తున్నారంటూ అనేక చర్చీలపై దాడిచేసి భయభ్రాంతులకు గురిచేసాయి. ఈ సంస్థలే ఉత్తరాన లేని లవ్ జీహాద్‌ను సృష్టించి సామాజిక జీవితంలో చిచ్చురేపుతున్నవి. ఘర్‌వాపసీ పేరుతో మైనార్టీలను బెదిరించటం, అంటరానితనం మంటలను భరించలేక మతమార్పిడి చేసుకున్న దళితులను మళ్లీ కులవ్యవస్థ కూపంలోకి నెట్టేసే ప్రయత్నాలు చేస్తున్నవి. కల్బుర్గిని చంపుతామంటూ ముందుగా బెదిరించినా, కొంతకాలం పోలీస్ రక్షణ కల్పించిన ప్రభుత్వాలు ఈ ఉన్మాద మూకలను అదుపుచేయలేక పోయినవి. అవేవీ తీవ్రనేరాలు కావన్నట్లు వ్యవహరిస్తున్నాయి. నరేంద్ర మోడీ నాయకత్వంలో బి.జె.పి. అధికారంలోకి వచ్చింది మొదలు మతోన్మాధ శక్తులు రెచ్చిపోతున్నాయి. చరిత్రను తిరిగి రాసి ఇతిహాసాలను, పుక్కిటి పురాణాలను అస్లైన చరిత్రగా చెప్పే ప్రయత్నం పైస్థాయిలో జరుగుతుండగా కిందిస్థాయిలో మతవాదులు ప్రజల్లో ప్రగతి భావనలను, హేతుబద్ధ ఆలోచనలను పెంచే వ్యక్తుల, సంస్థలపై దాడులుచేసి ప్రశ్నించే గొంతుల్ని నులిమేసే దుర్మార్గపు చర్యలకు పాల్పడుతున్నారు. ఆ పరంపరలో భాగమే కల్బుర్గి దారుణ హత్య. ఇంకా అనేకమంది లౌకిక, ప్రజాస్వామిక, శాస్త్రీయ విలువకై పోరాడే వారిపై మతోన్మాధ కత్తులు వేలాడుతూనే ఉన్నవి.

2013 ఆగస్టులోనే అనేక సామాజిక విప్లవకారులకు పురిటిగడ్డ అయిన పూణెలో ఇటువంటి ఉన్మాద చర్యే జరిగింది. ప్రజాభ్యుధయ ఉద్యమాలకు ఊపిరిలూదిన పూణెలోనే సామాజిక ఉద్యమకారుడు, వైద్యుడు, హేతువాది, అంద శ్రద్ధా నిర్మూలనా సమితిని స్థాపించి ప్రజల్లో పేరుకొనిపోయిన మూడవిశ్వాసాలను కూకటివేళ్లతో పెకిలించి శాస్త్రీయ భావనలను పాదుకొల్పేందుకు తమ జీవితాంతం శ్రమించిన నరేంద్ర దబోల్కర్‌ను పాశవికంగా హత్య చేయించారు. ఆధ్యాత్మిక ముసుగులో ప్రజలను చీకట్లోనే మగ్గిపోయేలా చేస్తున్న తిరోగమన శక్తుల అసలు రంగు బయటపెట్టే సాహసం దబోల్కర్ చేసిండు. తన సంస్థ ద్వారా నిరంతరం ప్రజా చైతన్య కార్యక్రమాలు చేపట్టిండు. రాజకీయ సిద్ధాంతాలు, అధికార రాజకీయాలు, వ్యాపార లావాదేవిలేమీ దబోల్కర్‌కు లేవు. రాజ్యాంగ ఆదేశిక సూత్రాల్లో పేర్కొన్న ప్రజల్లో శాస్త్రీయ దృక్పదాన్ని పెంపొందించాలి అనే పనిలో మాత్రమే నిమగ్నమయ్యిండు. ప్రజలు ప్రశ్నించడం నేర్చుకోవద్దని, మధ్యయుగాల కాలంనాటి దైవభీతి కల్గి ఉండాలని, ఆధిపత్యం, అసమానతలు సహజమని, ప్రజల కష్టాలు దుఃఖాలు లలాటలిఖిత ప్రాప్తమని నమ్మించే అత్యంత అశాస్త్రీయ భావజాలాన్ని ఎదిరించినందుకే దబోల్కర్ మతోన్మాధ శక్తుల తూటాలకు బలైపోయిండు. ఆయన జీవితాంతం కృషిచేసినా స్పందించని మహారాష్ట్ర ప్రభుత్వం ఆయన దారుణ హత్యోదంతం నేపథ్యంలో ప్రజల నిరసనలకు జడిసి తూతూమంత్రంగా మూఢాచారాల నిరోధక బ్లిలును తీసుకువచ్చింది. సనాతన భావజాలానికే వంతపాడే సర్కార్లు వాటిని ఏలాగు అమలుచేయవనుకోండి!

ఇంకా నెత్తుటి తడి ఆరని మరో హత్యోదంతం గోవింద్ పన్సారేది. నిరుపేద నేపథ్యంలోంచి వచ్చిన గోవింద్ పన్సారే 21 పుస్తకాల రచయిత. శివాజీ ఎవరు? అనే పుస్తకం ద్వారా ప్రాచుర్యంలోకి వచ్చిన వ్యక్తి. మూఢనమ్మకాలపై అలుపెరుగని పోరాటం చేస్తూ కులాంతర, మతాంతర వివాహాలను ఉధ్యమ స్ఫూర్తితో ప్రోత్సహించి సామాజిక సమానత్వం కోసం నిరంతరం తపించిన ఉన్నతమైన వ్యక్తిత్వం కల్గిన ప్రజానాయకుడు. న్యాయవాదిగా కార్మికులకు బాసటగా నిలిచి కార్మికోద్యమాలను నిర్మించిన కార్మికోద్యమనేత. టోల్‌టాక్సీ పేరుతో కార్పోరేట్ సంస్థలు చేస్తున్న దోపిడికి వ్యతిరేకంగా పోరుసల్పిన ధీశాలి. 84 ఏళ్ల వయస్సున్న ఈ ప్రజల మనిషిని దబోల్కర్‌ను చంపిన పద్ధతిలోనే మహారాష్ట్ర కొల్హాపూర్‌లో 2015 ఫిబ్రవరి 16న కాల్చివేశారు. పన్సారే లాంటి వ్యక్తులను కాల్చిచంపాల్సిన అవసరం ఎవరికి ఉంది? కూలిపోతున్న సనాతన సౌధాన్ని ఎత్తిపట్టాలనుకున్న మతోన్మాధ మూర్ఖులకు తప్ప. ఈ మూడు హత్యలు జరిగిన పద్ధతి (వీశీసబం రాజూవతీ%బి%అసఱ) ఒకే రకంగా ఉన్నది. ఇప్పటివరకు ఈ మూడు నేరాల్లో హంతకులు పట్టుబడలేదు. ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు సి.బి.ఐ.కి కేసును అప్పగిస్తూ చేతులు దులుపుకున్నాయి. సి.బి.ఐ. ఏదో తనకు అప్పగించిన కేసులన్నింటిలో నేరస్తులను వెంటనే పట్టుకొని శిక్ష విధించేలా చేసినట్టు? ఈ హత్యలన్ని అధికారం అండతోనే జరుతున్నాయనేది నిస్సందేహం. నిత్యం నీతిబోధలు చేసే పాలకనేతలు మాత్రం నోరు మెదపడం లేదు. ప్రజాఉధ్యమాన్ని అణిచివేసే పనిలో అత్యుత్సాహం చూపే పాలక, పోలీసు యంత్రాంగం ఇలాంటి ప్రజల మనుషుల ప్రాణాల విషయంలో ఎందుకు చేతులెత్తేస్తున్నారో అర్థం చేసుకోలేనిదేమీ కాదేమో?

## అంతటా అదే ఉన్మాదం

స్వతంత్ర్య ఆలోచనలను, భావప్రకటనా స్వేచ్ఛను, ప్రగతి కాముక భావనలను అణిచి వేసే ఉన్మాధచర్యలు భారత్‌కే పరిమితమైనవి కావు. ప్రశ్నలను సహించలేని పాలకులున్నచోటల్లా, వందల ఏళ్లనాటి మతం గుప్పిట్లోనుంచి బయటపడలేని చాందస శక్తులున్న ప్రతిచోట బుద్ధిజీవులు, కవులు, రచయితలు, కళాకారులు, పాత్రికేయులు నిరంతరం ప్రమాదపుటంచున సంచరిస్తూనే ఉంటారు. భారత్‌కి పొరుగునే ఉన్న బంగ్లాదేశ్‌లో సహితం ఈ వికృత పోకడలే విపరీతంగానే ఉన్నాయి. గడిచిన ఆరునెలల కాలంలో నలుగురు హేతువాద రచయితలను, స్వతంత్ర్య ఆలోచనాపరుల్ని ఇస్లామిక్ ఉన్మాదులు పాశవికంగా హత్యచేశారు. దేశమేదైనా కావచ్చు, మతమేదైనా కావచ్చు ప్రశ్నించటం, చర్చించటం అభిప్రాయాల్ని వెల్లడించడం నేరమైపోయింది. మతం ప్రశ్నించకూడదని అంతిమ సత్యమైపోయింది. కొత్త ఆలోచన, భిన్నమైన అభిప్రాయం అంటేనే సహించలేని చాందసత్వం పేరుకొనిపోయింది. ముఖ్తో-మోనో (స్వేచ్ఛా ఆలోచన) అనే అంతర్జాల చర్చావేదికకు బ్లాగ్‌ను అంధించిన సామాజిక కార్యకర్త, అనేక సామాజిక ఉద్యమాలకు బాసటగా నిలిచి బంగ్లాదేశ్ సైన్స్ & రేషనలిస్ట్స్ అసోషియేషన్ స్థాపించి బంగ్లా ప్రజల్లో వైజ్ఞానిక దృక్పథాన్ని పెంపొందించే పనిచేస్తున్న నీలాయ్ నీల్‌ను ఆగస్టు 7న హత్యచేసింద్రు మతోన్మాదులు. ఇదే మతమూకలు అభ్యుదయవాది జర్నలిస్టు, బ్లాగర్ అయిన అనంత బిజోయిదాస్‌ను, ముక్తో-మోనోను పర్యవేక్షిస్తూ మతమౌద్యంపై పోరాటం చేస్తూనే, ఆలోచనలను, తర్కాన్ని శాస్త్రీయ అవగాహనను పెంచేందుకు ప్రయత్నంచేసి మతరాజకీయాలను తీవ్రంగా నిరసించిన అవిజిత్‌రాయలను మతమూకులు చంపివేసాయి. అల్‌ఖైదా కు అనుబంధంగా ఉన్న అన్సర్ అల్ ఇస్లాం అనే మత చాందస సంస్థ ఈ ఉన్మాదానికి ఒడిగట్టింది. మహమ్మద్ రజబ్ హైదర్ అనే నాస్తిక బ్లాగర్‌ను, ఒయాసికర్ రహమాన్ అనే స్వతంత్ర ఆలోచనాపరున్ని కూడా తక్కువ వ్యవధిలోనే ఉన్మాదులు బలితీసుకున్నారు. 84 మంది ఇటువంటి

# కన్నీటి కడలి అల అలన్ కుర్దీ

***సామ్రాజ్యవాద దేశాలు గల్ఫ్ దేశాలలోని చమురును దోచుకోవడానికి వాటిపై దాడిచేసి, అంతర్గత సంక్షోభాన్ని సృష్టించి స్థానికులను విస్థాపనకు గురిచేస్తూ, వారు వలసవెళ్లేలా చేస్తున్న విషాదగాథను వివరిస్తున్నారు* షేక్ కరిముల్లా**

కెమెరా దృశ్యాన్ని బంధిస్తుంది. ఆ దృశ్యం అందమైనది కావచ్చు, ఉల్లాసపరిచేది కావచ్చు, ఆకట్టుకునేది అవ్వొచ్చు. కానీ గుండెలో తడి ఉన్న ప్రతి హృదయాన్ని కన్నీరు పెట్టించే దృశ్యాలు మాత్రం అరుదుగానే ఉంటాయి. అవి ఆ సమాజపు స్థితి గతులను కూడా ప్రతిబింబిస్తాయి. అలా తీయగలగడమే గొప్ప ఫోటోగ్రఫీ! ఒక వాస్తవం తాలూకు చిత్ర రూపం. గత కొద్దిరోజులుగా దేశ దేశాలకు అతీతంగా ఆలోచింప చేస్తున్న చిత్రం టర్కీ సముద్రతీరానికి కొట్టుకువచ్చిన అలన్ కుర్దీది. ఈ చిత్రం యావత్ ప్రపంచాన్ని కన్నీరు పెట్టించి కదిలించి వేసింది. మానవత్వం ఉన్న ప్రతి ఒక్కరిని కంపించేస్తుంది. రచయిత అన్న వాడిని ప్రశ్నిస్తుంది. తన గురించి రాయమని, తమ వ్యధను ప్రపంచానికి తెలియజేయమని. ఇంకేముంది కలం పట్టుకుంటే కన్నీటి కడలి అలలు, సుడులు, మానవాళి బాధలు ఉప్పొంగే కెరటమైన అక్షరధార. కేవలం ఫోటోతో ప్రపంచాన్ని కదిలించి చరిత్రలో చిరస్థాయిగా సజీవ సాక్ష్యంగా నిలిచిన ఈ చిత్రాన్ని నీలోఫర్ డెమిర్ అనే పాత్రికేయురాలు తన కెమెరాలో బంధించి ప్రపంచానికి అందించింది. ఈ చిత్రం సొంత ఊరు, కన్నవారిని వదిలి కడుపు చేతపట్టుకుని పొరుగు దేశాలకు వలస వెళ్లే శరణార్థుల వెతల్ని చూపెడుతుంది. యూరప్ ద్వంద్వ వైఖరి ప్రపంచానికి తెలియజేసిన చిత్రం అది.

అదేమిటో, తుఫాను వచ్చినా గడ్డిపోచ బతికే ఉంటుంది. కానీ యుద్ధం వస్తే మాత్రం పసిపాపలే చనిపోతూ ఉంటారు. అలాంటి వాడే అలన్ కుర్ది. ఎర్రచొక్కా, నీలి నిక్కరుతో మధ్యధరా సముద్రం దాటే క్రమంలో టర్కీ సముద్ర తీరంలో ఆదమరిచి పడుకున్నట్లు పడున్న అలన్ కుర్దీ.

అంతర్గత యుద్ధంతో సిరియా నలిగిపోతుంది. పౌరులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని ఐరోపాకు వలసపోతున్నారు. సిరియాలోని కోబాని పట్టణానికి చెందిన అబ్దుల్లా కూడా తన భార్య రేహన్, కుమారులు గాలిప్ (5), అలన్ కుర్దీ (3)లతో దేశం వదిలాడు. టర్కీ వచ్చి గ్రీస్‌లోని కోస్‌కు వెళ్లేందుకు పడవ ఎక్కాడు. వీరి పడవ ఓవర్ లోడ్ అయి మధ్యధరా సముద్రంలో మునిగిపోయింది. అబ్దుల్లా లైఫ్ జాకెట్‌తో బయట పడ్డాడు. కానీ భార్యా పిల్లలు చనిపోయారు. అలన్ కుర్దీ మృతదేహం ఒడ్డుకు కొట్టుకొచ్చినప్పుడు నీలోఫర్ డెమిర్ ఫోటో తీయడంతో ఈ విషాదం బయటికొచ్చింది. ప్రపంచ దేశాలను కదిలించింది. కుటుంబ సభ్యుల మృతదేహాలతో టర్కీ చేరుకున్న అలన్ కుర్దీ తండ్రి అబ్దుల్లా గుండెలు బాదుకుంటూ కన్నీరు మున్నీరై విలపించాడు. ఇటువంటి బాధ శత్రువుకు కూడా రాకూడదన్నాడు. 'మా దేశంలో జరుగుతున్న యుద్ధం నుంచి తప్పించుకోవడానికి గాను వలస వెళ్లేందుకు సిద్ధమయ్యాం. కానీ విఫలమయ్యాం. ఐతే ఇటువంటి అనర్థం మరోసారి జరగకూడదు. ఇదే ఆఖరిది కావాలి' అన్నాడు. అలన్ కుర్దీ మరణంతో యావత్ ప్రపంచం దృష్టి మధ్య ప్రాశ్చ్యంలోని శరణార్థుల వైపు మళ్లింది. మధ్యధరా సముద్రం అత్యంత కల్లోల సముద్రం. నిరంతరం ఉత్పాతాలు సంభవించే సముద్రం. ఇందులో నాటు పడవ ప్రయాణం 50 నుంచి 55 మంది పట్టే పడవలో ఒక్కోసారి 70 నుంచి 80 మంది వరకు ప్రయాణిస్తారు. సిరియా తీరం నుంచి ఐరోపా తీరాన్ని చేరేందుకు సుమారు రెండు రోజులు ప్రయాణం చేయాలి. చుట్టూ నీరు, కటిక చీకటి, ఎటువెళుతున్నామో తెలియని స్థితిలో ప్రయాణం ఉంటుంది. హోరుగాలి, పెద్ద పెద్ద అలలు పడవను కుదిపేస్తుంటాయి.

---

ఆలోచనాపరులను చంపేస్తామని బహిరంగంగానే ప్రకటించాయి. భారత్ అయిన బంగ్లా అయినా అదే ఉన్మాదం, అదే అసహనం, అవే అనాగరిక, అమానవీయ చర్యలు, కాకపోతే ఇక్కడో మతం అక్కడో మతం. నిజానికి బంగ్లాదేశ్ కూడా అధికారికంగా లౌకిక రాజ్యమే. ఓటు బ్యాంకు రాజకీయ క్రీడలో విలువలు భావప్రకటనా స్వేచ్ఛ పౌర హక్కులన్ని మతోన్మాధ మంటలకు బలౌతున్నవి. మాట్లాడితే మరణ శాసనాలు లిఖించబడుతున్నాయి. దైవ దూషణ పేరుతో ఫత్వాలు జారీ అవుతున్నాయి. అధికారికంగా లౌకిక రాజ్యాల్లోనే ఇలాంటి స్థితి నెలకొని ఉంటే మత రాజ్యాల్లో పరిస్థితి ఏవిధంగా ఉంటుందో ఊహించుకోవచ్చు.

మన ఆలోచనలు సుదూర విశ్వాన్ని చేరుతున్నా విశ్వాసాలు పాతాళంలోనే పడి ఉంటున్నాయి. లౌకిక ప్రజాస్వామిక శాస్త్రీయ విలువలకోసం, ఉన్నతమైన సమాజంకోసం పోరాడే వారిపై ఉన్మాద శక్తులు, దోపిడి వ్యవస్థలు గురిపెడుతూనే ఉన్నవి. ఈ ఉన్మాదానికి అధికార అండదండలుంటే పట్టపగ్గాలుండవు. అన్ని స్వేచ్ఛలు అంతరిస్తాయి. మతము, మనోభావాల పేరుతో మనుషులపై నిరంతరం ఆధిపత్యం నెరిపే తిరోగమన శక్తులు ఎప్పుడూ పొంచి ఉంటూనే ఉంటాయి. సమాజం ఉదాసీనంగా ఉంటే ఉన్మాదం పెట్రేగి పోతుంది. సమాజ అభ్యున్నతికి పాల్పడుతున్న అన్ని శక్తులు ఏకతాటిపై రావాలి. ఏ భావజాలానికైనా ప్రజాస్వామిక లక్షణం ఉండాలి. విమర్శలకు దేన్నైనా అతీతంగా ఉంచాలనడం ఆధునిక ప్రజాస్వామిక వ్యవస్థ లక్షణం కాదు. వ్యక్తుల్ని అంతం చేస్తే సత్యశోధన ఆగిపోదు. మానవాళి ఉన్నతికోసం నిరంతరం విజ్ఞానపథంలో సాగిపోతూనే నిజంవైపే అంతిమ ప్రస్థానం ఉండాలి. మతములన్నియు మాసిపోవును జ్ఞానమొక్కటే నిలిచివెలుగును. ఆ నిలిచి వెలిగే జ్ఞానంకై గుండెనెత్తురును తర్పణ చేయాల్సిందే.

(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు) వీ

ఇటువంటి భయానక వాతావరణంలో ప్రాణాన్ని ఫణంగా పెట్టి పుట్టి పెరిగిన గడ్డను వదిలి పొట్ట చేతపట్టుకుని బతుకును వెతుక్కుంటూ సాగుతున్న భిన్న జీవన బాటసారుల గురించి...! సామ్రాజ్యవాదం మిగిల్చిన ఈ శరణార్థుల విషాదగీతం గురించి...! మసకబారుతున్న మానవత్వం గురించి ఏమని రాయను? అయినా కలం నుంచి జాలువారే కన్నీటి సిరాతో రాయాలి...! ఇంకా రాయాలి...! ఈ ప్రపంచంలోని రచయితల కలాలన్ని రాయాలి. ఈ విషాదం గురించి ఎలుగెత్తి చాటి చెప్పాలి. ఒకటా! రెండా!! ఈ మధ్యధరా సముద్రంపై ఈ ఏడాది ఇప్పటి వరకు నాటు పడవల్లో ఐరోపాను సురక్షితంగా చేరుకున్న వారి సంఖ్య అధికారికంగా మూడు లక్షలు. సముద్రంలో మునిగి చనిపోయిన వారి సంఖ్య 30 వేలకు పైగానే. ఒక్క ఆగస్టు నెలలోనే మృతి చెందిన వారి సంఖ్య 800 పై చిలుకు. మృతుల శరీరాలు చెల్లా చెదురుగా టర్కీ, ఇటలీ, గ్రీస్ తీరాలకు కొట్టుకు వస్తున్నాయి. రెండో ప్రపంచ యుద్ధం తరువాత ఇంతటి విషాదకర పరిస్థితులు ఇంత వరకు తలెత్తలేదు. ఒక్క సిరియా నుంచే ఇప్పటి వరకు 40 లక్షల మంది ప్రజలు వలస వెళ్లారు. 90వ దశకంలో యుగోస్లావియా యుద్ధం తరువాత ఐరోపాలో తలెత్తిన శరణార్థి సంక్షోభం ఇదే.

**విషాదం - కారణాలు**

ఇరాక్, సిరియాలు ముడి చమురు పుష్కలంగా ఉన్న దేశాలు. దశాబ్దాల పాటు సగం ప్రపంచానికి ముడిచమురును అందించే సామర్థ్యం ఉన్న దేశాలు. సకల రాజభోగాలు అనుభవించాల్సిన ఐశ్వర్యవంత దేశాలు రెండున్నర దశాబ్దాలుగా అమెరికా అనే రాబందు అక్కడ వాలింది. అక్కడి చమురు సంపదపై కన్నేసింది. ఇంకేముంది పశ్చిమాసియాలో అంతర్గత యుద్ధాలు, సంక్షోభాలతో ప్రజలకు రక్షణ లేకుండా పోయింది. చమురు బావులపై పాశ్చాత్య దేశాల పెత్తనాలు, ఆయా దేశాల్లో రాజకీయ సంక్షోభాలు సృష్టించబడ్డాయి. ఈ క్రమంలోనే తాలిబాన్, ఆల్‌ఖైదా వంటి సంస్థలను అమెరికా (రాబందు) సృష్టించింది. 2003లో ఇరాక్‌పై దాడికి తెగబడింది. ఇది రాబందు సామ్రాజ్యవాద బీభత్సకాండకు పరాకాష్ట. ఇప్పటికీ ఆ దేశం రావణకాష్టంలా మండుతూనే ఉంది. ఇవే పరిస్థితులు నేడు సిరియాలో తలెత్తాయి. సిరియాలో అంతర్గత సంక్షోభం నాలుగేళ్లుగా కొనసాగుతున్నది. ఇక్కడ ఐఎస్ఐఎస్ (ఇస్లామిక్ స్టేట్ ఆఫ్ ఇరాక్ అండ్ సిరియా) ఆవిర్భవించింది. దీనికి మూలం ఆల్‌ఖైదా, తాలిబన్ సంస్థలు. మొత్తం పశ్చిమ ఆసియాలోని ముస్లిం దేశాలను ఇస్లామిక్ స్టేట్‌గా ఏర్పాటు చేయడం ఈ సంస్థ లక్ష్యం. అమెరికాకు వ్యతిరేకంగా పోరాడుతుంది. ఈ నేపథ్యంలో ఐఎస్ సిరియాలోని చమురు బావులను ఆక్రమించుకుంది. మొత్తంగా సిరియా, ఇరాక్‌లలో రాబందును చావు దెబ్బ తీసింది. ఈ క్రమంలో పశ్చిమ ఆసియా దేశాల్లో తీవ్ర మహా మానవ సంక్షోభం తలెత్తింది. ఇది అమెరికన్ సామ్రాజ్యవాదం మిగిల్చిన పెను విషాదం. అమెరికా దాని సామ్రాజ్యవాద మిత్రులైన నాటో దేశాల ఆధిపత్యం గల్ఫ్ ప్రాంతంలోని చమురు సంపదను దోచుకోవడానికి అమెరికన్ సామ్రాజ్యవాద దేశాల కాంక్షయే నేటి ఈ దుస్థితికి ప్రధాన కారణమని ప్రపంచానికి తెలుసు. చమురు సంపదను దోచుకోవడానికి సద్దాం హుస్సేన్ విషపూరిత అణ్వాయుధాలు కలిగి ఉన్నాడనే మిషతో రాబందు అమెరికా ఇరాక్‌పై దాడి చేసి విధ్వంసం సృష్టించింది. ఐక్యరాజ్య సమితిని కూడా లెక్క చేయలేదు. రాబందు ఆరోపణలకు ఆధారాలు లేవని బ్రిక్స్ కమిషన్ తేల్చినా ఖాతరు చేయలేదు. అమెరికాతో చేయి కలిపిన బ్రిటన్, ఫ్రాన్స్, జపాన్, జర్మనీలు కూడా ఈ విషాదానికి పరోక్ష కారకులు. సామ్రాజ్యవాద ఆధిపత్యం కోసం ఒకే భాష, ఒకే సంస్కృతి గల జాతులు, తెగల మధ్య చిచ్చుపెట్టి, జాతి తెగల మధ్య విద్వేషాల్ని రెచ్చగొట్టి ఆయా దేశాలను వల్ల కాడుగా మార్చడం రాబందుకు కొత్తేమీ కాదు. ఉదాహరణకు 1963 వియత్నాం యుద్ధం. ఈ యుద్ధం ప్రపంచాన్నే నివ్వెరపరిచింది. ఆ సందర్భంలో అమెరికా యుద్ధోన్మాదాన్ని ప్రతిబింబించే ఫోటో చిత్రం ఒకటి సజీవ సాక్ష్యం. ఆ చిత్రం అమెరికా సైన్యం ప్రయోగించిన నాపాం బాంబు దాడిలో శరీరం కాలిపోవడంతో ఆ గాయాలతో నగ్నంగా ప్రాణ భయంతో పరిగెడుతున్న వియత్నాం బాలిక పాన్‌ది కిమ్‌పుట్‌ను ఫోటో తీసిన ఫోటోగ్రాఫర్ పేరు నిక్. ఫోటో తీయగానే అతను తన కోటును తీసి ఆ బాలికకు కప్పి ఆసుపత్రికి తరలించి కిమ్ ప్రాణాల్ని కాపాడాడు. అప్పట్లో ఈ చిత్రం ప్రపంచానికి అమెరికా యుద్ధోన్మాదం ఎలాంటిదో తెలియజేసింది.

ఇక నోబెల్ గ్రహీత ఒబామా ఆరు ఏళ్లలో తన పదవీ కాలంలో ఏడు దేశాలపై బాంబులతో దాడి చేయించి ఘనత చాటుకున్నాడు. ఐఎస్ఐఎస్‌కు వ్యతిరేకంగా అమెరికా వైమానిక దాడులు పెద్ద ఎత్తున సిరియాపై చేయించింది. అలాగే సోమాలియాపై కూడా వైమానిక దాడులు జరిగినాయి. ఈ దాడులకు భయపడిన కుర్దులు, పశ్చిమాసియా దేశాల ప్రజలు తమ ప్రాంతాలను వదిలి పారిపోతున్నారు. అమెరికా యుద్ధోన్మాదం కారణంగా తమ జీవితాలు ఏమాత్రం బాగుపడవని సిరియన్లు నిరాశా నిస్పృహలతో మెరుగైన జీవితాన్ని వెతుక్కుంటూ టర్కీ తదితర ఐరోపా దేశాలకు వలస బాట పడుతున్నారు. ఈ శరణార్థులు మధ్యధరా సముద్రం దాటడానికి స్మగ్లర్లను, బ్రోకర్లను ఆశ్రయిస్తూ జనం పోటెత్తడంతో రవాణా సమస్యలు ఏర్పడి సముద్రానికి బలైపోతున్నారు.

**శరణార్థుల పరిస్థితి**

పుట్టిన గడ్డను వదిలి పరాయి దేశంలో బిక్కు బిక్కుమంటూ జీవితాన్ని గడుపుతున్న శరణార్థులు గ్రీస్‌లో 2 లక్షల 30 వేలు, ఇటలీలో లక్షా పదిహేను వేలు, స్పెయిన్‌లో 21 వేలు, హంగేరిలో రెండు లక్షలు. వీరికి ఆహారం, రక్షణ ఇతర సదుపాయాలు కల్పించేందుకు ఐరోపా దేశాలు నానా తంటాలు పడుతున్నాయి. సామ్రాజ్యవాద భూతం మిగిల్చిన ఈ మానవ విషాదం నేడు మానవాళి మనుగడను ప్రశ్నిస్తున్నది.

అలన్ కుర్దీ-మధ్యధరా సముద్రాన్ని జయించలేని మూడేళ్ల బాలుడు.
అలన్ కుర్దీ-సిరియా సంక్షోభాన్ని ప్రపంచానికి చెప్పిన నిజం.
అలన్ కుర్దీ-ఇరాక్ సిరియాల శరణార్థులకు నిలువుటద్దం.
అలన్ కుర్దీ-వయస్సుతో సంబంధం లేని బతుకు పోరాటం.

**అలన్ కుర్దీ విన్నపం**

నా బాల్యాన్ని విజయవంతంగా నిద్రపుచ్చేసిన ఈ ప్రపంచం ఇప్పటికైనా మేల్కొంటుందా? మానవత్వం మసకబారుతుందని, ఈ ప్రపంచం మారాలని ఆశిస్తూ...! సెలవు. ఇట్లు మీ అలన్ కుర్దీ.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# పైశాచికానందం ర్యాగింగ్

*విద్యార్థులను మానసిక క్షోభకు గురిచేస్తూ ఆత్మహత్యలకు పురికొలుపుతున్న ర్యాగింగ్ సంస్కృతిని అరికట్టడానికి అటు కళాశాల యాజమాన్యం, ఇటు విద్యార్థుల తల్లిదండ్రులు కలిసి పిల్లలకు విలువల పట్ల అవగాహన కల్పించాలని అంటున్నారు* **ఎన్. రవిందర్**

**మా** బిడ్డలు ఎంతో కష్టపడి చదివి, మా కలలను సాకారం చేయబోతారని సంతోషంతో కళాశాలలకు పంపుతున్న తల్లిదండ్రులు ఏ క్షణాన ఏ కీడు జరుగుతుందో, ఏ దుర్వార్త వినాల్సి వస్తుందో తమ బిడ్డలు చదువును పూర్తి చేస్తారో అర్థాంతరంగా ఇంటికి తిరిగి వస్తారో అనే మానసిక క్షోభను ప్రతి తలిదండ్రులు అనుభవిస్తున్నారు.

ప్రతి సంవత్సరం ర్యాగింగ్ అనే విషసర్పం అనేక మంది విద్యార్థుల ప్రాణాలు తీస్తుంది. వేలాది మంది విద్యార్థులలో ఆత్మన్యూనతా భావాన్ని నెలకొల్పి, సమర్థులైన విద్యార్థుల్ని, అసమర్థులుగా, భవిష్యత్తుపై విశ్వాసం లేని పిరికివాళ్లుగా తయారు చేస్తుంది.

పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణ సంకటం అన్న చందంగా విద్యా సంవత్సరం ప్రారంభం అవుతుంది. నూతన విద్యార్థులు కళాశాలల్లో ప్రవేశించగానే వాళ్లకు సాదరంగా స్వాగతం చెప్పాల్సిన సీనియర్ విద్యార్థులు జూనియర్ విద్యార్థుల్ని హేళన చేస్తున్నారు. వారి మనో భావాలు దెబ్బతినే విధంగా వారిని మానసికంగా, శారీరకంగా హింసకు గురిచేస్తున్నారు.

ఏదో ఒక వంకతో వారిని ఇరుకున పెట్టి బాధిస్తూ, వేధిస్తూ, పైశాచిక ఆనందం పొందుతున్నారు. ఇందులో భాగంగా జూనియర్ విద్యార్థుల చేత బూతు పాటలు పాడించడం, బూతు జోకులు చెప్పడం, ఎలాంటి అచ్ఛాదన లేని మానవ శరీరాకారాన్ని వారి ముందుంచి, వివరించి చెప్పమని ఇబ్బంది పెట్టే ప్రశ్నలు వేయడం వారి నుండి సీనియర్లు కోరుకున్న సమాధానం రాబట్టడం కోసం వారిని నానా బూతులు తిట్టడం, ఇంకాస్త ముందుకెళ్లి వారిని కొట్టడం చేస్తున్నారు.

రాక్షస ఆనందం పొందడానికి ఇతరులను తిట్టించడం, రాత్రింబవళ్లు తమకు బానిసలుగా బట్టలు ఉతికించడం, ఇస్త్రీ చేయించడం, వారిచేత సిగరెట్లు తెప్పించుకుని తాగడం, వారిచే తాగించడం చేస్తున్నారు. ఈ పనులు చేయ నిరాకరించిన విద్యార్థులను మరింత హింసించే విధంగా వారు ధరించిన (వస్త్రాలు) దుస్తులను తీయించి (ఊడదీయించి) నగ్నంగా నృత్యాలు చేయించడం, బలవంతంగా వారిచేత డ్రగ్స్ తాగించడం చేస్తూ తోటి విద్యార్థులను నానా విధాలుగా హింసిస్తున్నారు. ఇవి కొన్ని ఉదాహరణలు మాత్రమే. ఇలాంటి హాస్యాస్పదమైన, హేయమైన పనులు ప్రతి వృత్తి విద్యాసంస్థల్లో, విశ్వవిద్యాలయాలల్లో, జాతీయ విద్యా సంస్థలలో నిత్యకృత్యాలుగా మారాయి.

సుదూర ప్రాంతాల నుండి తల్లిదండ్రులను, కుటుంబ సభ్యులను, స్నేహితులను వదిలి చదువు కోసం వచ్చి ఇలాంటి ఊహించని సంఘటనలతో షాక్‌కి గురయి ఎవరి నుండి ఎలాంటి సహాయం, ఓదార్పు అందక మానసిక వేదనకు గురై ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. కొన్ని సందర్భాలలో జూనియర్ల గౌరవం దెబ్బతినడం మూలంగా తిరగబడితే పరస్పర ఘర్షణలకు, కొన్నిసార్లు హత్యల వరకు దారి తీస్తున్నాయి. ఇలాంటి సంఘటనలలో ఆ నూతన కాళాశాల వాతావరణంతో పరిచయం లేని జూనియర్ విద్యార్థులే బాధితులవు తున్నారు. దీని ఫలితంగా అనేక మంది విద్యార్థులు తమ చదువులకు స్వస్తి పలికి ఇంటిదారి లేదా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఫలితంగా తల్లిదండ్రులు తీవ్ర మానసిక క్షోభకు గురవుతున్నారు. ఈ సమస్య రోజురోజుకూ మరింత తీవ్రమవుతుంది.

**ర్యాగింగ్ అంటే ఏమిటి?**

ఒక విద్యార్థిని కళాశాల ఆవరణలో గాని, బయట గాని దూషించడం, హేళన చేయడం, హింసించడం, ఇష్టం లేని పనుల ద్వారా అతన్ని లేదా ఆమెను శారీరకంగానైనా, మానసికంగానైనా హాని తలపెడు తున్నాడనే వాతావరణం ఆ విద్యార్థులకు కలుగ చేయడమే ర్యాగింగ్ అంటూ కేరళ, మహారాష్ట్ర, కర్ణాటక హైకోర్టు, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ హైకోర్టులు ర్యాగింగ్ నిషేధ చట్టం 26 తెలుపుతున్నాయి.

కాని ర్యాగింగ్ వల్ల విద్యార్థుల మధ్య ఉన్న అంతరం తగ్గి పరిచయాలు పెరిగి ఇద్దరి మధ్య పరస్పర స్నేహం పెంపొందుతుంది. కావున దీనిని ఆక్షేపించాల్సిన పని లేదనే వాదన ముందుకు తెస్తున్నారు.

అంతరం తగ్గించి స్నేహాన్ని పెంపొందించడం, పరిచయాలు పెంచు కోవడం ఇరువైపుల నుండి (జూనియర్స్, సీనియర్స్) జరగాల్సిన ప్రక్రియ. అలా జరిగితే ఎవరికీ అభ్యంతరం లేదు. కాని ఆచరణలో దీనికి పూర్తి విరుద్ధంగా జరుగుతోంది. ర్యాగింగ్ కొంత మంది అహం నుండి పుట్టి ఎదుటి వారి కాంక్ష, ప్రమేయం లేకుండా వారిని ఇబ్బందులకు గురిచేస్తూ, అఘాయిత్యాలకు దారితీస్తూ వైరాన్ని పెంచుతుంది తప్ప స్నేహాన్ని కాదు.

స్నేహం అనేది ఎదుటి వ్యక్తి మంచిని కోరుతుంది. కాని ఇక్కడ ర్యాగింగ్ ఎదుటి విద్యార్థి జీవితం నాశనం కావడానికి దారితీస్తుంది. కావున దానిని ఎట్టి పరిస్థితుల్లో ఉపేక్షించరాదు. వాస్తవంగా ఇరువురి మధ్య అవగాహనతో పరస్పరం పరిచయాలు పెంచుకుని స్నేహాన్ని పెంచుకోవడం అందరికి అభినందనీయమే. అయితే సమస్యంతా ఎదుటి వ్యక్తి శారీరక, మానసిక స్వేచ్ఛను హరించడం వల్లే!

ర్యాగింగ్ అనగానే సహజంగా ఆయా కళాశాల తరగతుల్లో బలహీనంగా ఉన్న వారిని పట్టుకుని వేధించే వారుంటారు. వారే ఇలాంటి వాటిని అడపాదడపా చేస్తుంటారని, ర్యాగింగ్ తీవ్రతను తక్కువ చేసి చూపే ప్రయత్నం చేస్తున్నారు. కాని ఇది వాస్తవం కాదు. మరి వాస్తవం ఏమిటి? బలహీనుల్ని వేధించేవారు, బయటి జీవితంలోనూ ఉన్నారు. అన్ని చోట్లలో ఎందుకు జరగడం లేదు! ర్యాగింగ్ ప్రక్రియపై వాదనలలో పేర్కొన్నట్లుగా బలహీనుల్ని పట్టుకుని బలవంతుడు ర్యాగింగ్ చేయడం

లేదు. జూనియర్ ఎంత బలవంతుడైనా సీనియర్లు సామూహికంగా అతనిపై దాడి చేస్తున్నారన్న వాస్తవాన్ని గమనించాలి.

**కాగితాలకే పరిమితమవుతున్న చట్టాలు**

రాజ్యాంగంలోని వ్యక్తి స్వేచ్ఛను, ఆర్టికల్ 21ని హేళన చేస్తున్న ర్యాగింగ్‌కు వ్యతిరేకంగా సుప్రీంకోర్టు ఇచ్చిన గైడ్‌లైన్స్‌ను అనుసరిస్తూ ర్యాగింగ్‌ని కట్టడి చేసేందుకు కర్ణాటక, మహారాష్ట్ర, కేరళ హైకోర్టులు తీర్పునిచ్చాయి. ఆయా ప్రభుత్వాలను చర్యలు తీసుకోవాలని ఆదేశించాయి. ఫలితంగా ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు ర్యాగింగ్‌ను నిషేధిస్తూ చట్టాలు చేశాయి.

1) ఏ విద్యా సంస్థల్లోనైనా ర్యాగింగ్ జరిగినట్లు ఆరోపణలు వస్తే ఆ సంఘటనకు ఆ విద్యా సంస్థల అధినేతలు బాధ్యత వహించడం.

2) ర్యాగింగ్‌లో అసాధారణ ప్రమాద సంఘటనలు చోటు చేసుకుంటే కళాశాలలకు గుర్తింపు, సంబంధిత యూనివర్సిటీ అనుబంధాన్ని, యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్, అఖిల భారత సాంకేతిక విద్యా మండలిచే పొందిన గుర్తింపు రద్దు చేయవచ్చు. (దీనిని అనుసరిస్తూ యుజిసిఎఐసిటిఇ సంబంధిత యూనివర్సిటీలకు కళాశాలలకు ఆదేశాలు జారీ చేశాయి)

3) ర్యాగింగ్‌ను సమర్ధవంతంగా అరికట్టేందుకు ఆయా కళాశాలల పరిధిలో ఒక సమీక్ష కమిటీని ఏర్పాటు చేయడంలో. దీని ఆయా కళాశాలల ప్రిన్సిపాల్స్, అధ్యాపకులు, విద్యార్థులు ఏరియా పోలీస్ ఆఫీసర్‌కి, విద్యార్థుల తల్లిదండ్రులకు ప్రాతినిధ్యం ఉండాలి.

4) ర్యాగింగ్‌కు పాల్పడ్డ విద్యార్థికి జరిమానా లేదా జైలు శిక్ష లేదా రెండింటినీ విధించవచ్చు. కర్ణాటక ప్రభుత్వం ఒక సంవత్సరం జైలు శిక్ష, రు. 2000 జరిమానా విధించగా, కేరళ ప్రభుత్వం మరో అడుగు ముందుకు వేసి 2 సంవత్సరాలు జైలు శిక్ష, రు. 10,000 జరిమానా విధిస్తూ చట్టం చేసింది. అప్పటికీ సరికాకపోతే ఆ విద్యార్థిని కళాశాల నుండి సస్పెండ్ లేదా డిస్మిస్ చేయవచ్చు.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ర్యాగింగ్ నిషేధ చట్టం 26ను 1996 సంవత్సరంలో తీసుకొచ్చింది. ఇది రాష్ట్రంలోని అన్ని విద్యా సంస్థలకు వర్తిస్తుంది. దీని ప్రకారం ర్యాగింగ్‌ను విద్యా సంస్థల పరిధిలో, బయటి వాతావరణంలో కూడా నిషేధించబడింది. ఎవరైనా ర్యాగింగ్‌కు పాల్పడితే వారికి ఒక సంవత్సరం జైలు శిక్ష లేదా రు. 2000 జరిమానా లేదా రెండింటిని కూడా విధించవచ్చు. ర్యాగింగ్‌లో అసాధారణమైన సంఘటనలు చోటుచేసుకుంటే 5 సంవత్సరాలు జైలు శిక్ష, రు. 10,000 జరిమానా విధించవచ్చు. ర్యాగింగ్ ఆత్మహత్యకు దారితీస్తే బాధ్యులకు 10 సంవత్సరాలు జైలు శిక్ష, రు. 50,000 జరిమానా విధించవచ్చు. వారిని కళాశాల నుండి సస్పెండ్ చేసే అధికారం, ఆరు నెలలు వేరే ఇతర కళాశాలలో అడ్మిషన్ ఇవ్వకూడదని ఈ చట్టం నిర్దేశించింది.

**యుజిసి హెచ్చరిక**

విద్యార్థులు కళాశాలలకు వచ్చినప్పుడు ర్యాగింగ్ వల్ల జరిగే నష్టాలు, పరిణామాలు ఒకవేళ ర్యాగింగ్ చేసేవారు అనుభవించబోవు శిక్షలు వారికి తెలియపరచాలి.

ర్యాగింగ్‌ను అరికట్టడానికి అన్ని యూనివర్సిటీల కళాశాలలు కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలని, ర్యాగింగ్‌ను అరికట్టడంలో విఫలమైతే ఆర్థిక వనరుల నిలిపివేతకు, కళాశాలల గుర్తింపు రద్దు చేయడానికి వెనుకాడబోమని హెచ్చరించింది. ఇన్ని చట్టాలున్నా ర్యాగింగ్ రోజురోజుకూ పెరుగుతూనే ఉంది. కారణం... చట్టాలు అమలు చేయడంలో ప్రభుత్వాలు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయి. చట్టాలు చేసి చేతులు దులుపుకుంటున్నారు తప్ప ఆచరణలో అమలు చేయడం లేదు. పెరిగిపోతున్న విద్యా వ్యాపారానికి ర్యాగింగ్‌కు అంతర్ సంబంధం ఉంది. అడ్డూ అదుపు లేకుండా వ్యాపారమవుతున్న ఉన్నత, సాంకేతిక విద్యా సంస్థలు తమ దృష్టిని లాభాలపైనే మళ్లిస్తూ పరస్పర విద్యార్థుల మధ్య, విద్యార్థి, ఉపాధ్యాయ సంబంధాల మధ్య, మానవ సంబంధాలను వ్యాపారమయం చేస్తున్నారు. ఈ విష సంస్కృతి ఇంతింతై వటుడింతై అన్నట్లు పెరుగుతూనే ఉంది. మరోవైపు మీడియా ర్యాగింగ్ జరిగిన సంఘటనను తమ లాభాల కోసం సెన్సేషనల్ వార్తలుగా ఉపయోగించుకుంటుంది తప్ప, దానికి దారి తీసిన సామాజిక, ఆర్థిక కారణాలను విశ్లేషించి అరికట్టడానికి తీసుకోవాల్సిన చర్యలను ముందుకు తీసుకురావడం లేదు. ఎలక్ట్రానిక్ మీడియా సినిమాలు, విశృంఖలత్వం, హింస, అశ్లీలాన్ని పెంచిపోషిస్తూ, మానవ సంబంధాలను దెబ్బతీస్తూ, చెడు ధోరణులను ఆదర్శాలుగా చూపిస్తున్నది. మీడియా ఈ వైఖరిని విడనాడాలి. అందుకు కావాల్సిన చర్యలను ప్రభుత్వం చేపట్టాలి.

**ప్రత్యామ్నాయం**

1) మానవ సంబంధాలను, విద్యలోని సృజన శీలతను దెబ్బతీస్తూ యాంత్రికతను ప్రవేశ పెడుతున్న విద్యా వ్యాపారాన్ని అరికట్టాలి.

2) సినిమాల్లో ప్రసారమవుతున్న అశ్లీలత, హింసా ప్రవృత్తిని అరికట్టాలి. ర్యాగింగ్ జాడ్యానికి వ్యతిరేకంగా ప్రచార కార్యక్రమాలు చేపట్టాలి.

3) సుప్రీంకోర్టు మార్గదర్శకాలను, రాష్ట్ర ప్రభుత్వాల నిబంధనలను విద్యా సంస్థలు అమలు చేయాలి. అమలు చేయని విద్యా సంస్థలపై తీసుకోవాల్సిన చర్యలను ప్రభుత్వాలు తీసుకోవాలి.

4) అన్ని కళాశాలల్లో ర్యాగింగ్ వ్యతిరేక కమిటీలను ఏర్పాటు చేయాలి.

5) ర్యాగింగ్ భూతాన్ని అంతమొందించాలంటే విద్యా సంస్థల్లో విద్యార్థి సంఘాలకు ఎన్నికలు నిర్వహించాలి.

విద్యార్థుల ఆత్మహత్యలు, హృదయాలను కలచివేసే సంఘటనలు, అందుకు దారితీసిన నికృష్టమైన దుర్మార్గ పరిస్థితులు ఈనాటి సమాజంలో పెచ్చు పెరుగుతున్న విషపు సంస్కృతికి ప్రతిబింబం. విద్యార్థిలో విశృంఖలంగా తలెత్తుతున్న బాధ్యతారహిత ధోరణి, కనీస మావతా విలువలు సైతం విస్మరించబడుతున్న దుస్థితికి ర్యాగింగ్ నిదర్శనం. ఇలాంటి రాక్షసక్రీడా ర్యాగింగ్‌కు ఎన్నో విద్యాకుసుమాలు బలైపోయాయి. ర్యాగింగ్ విషవలయంలో మొన్న నాగార్జున విశ్వవిద్యాలయంలో రిషితేశ్వరి, నిన్న కాజిపేట రైల్వే ట్రాక్‌పై సాయినాథ్, నేడు నల్లగొండలో భార్గవిలు బలైపోతున్నా మన పాలకుల్లో చలనం కలగడం లేదు. ఇంకా ఎందరి ప్రాణాలు బలికొంటే చట్టాలను అమలు పరిచి ర్యాగింగ్‌ను నిర్మూలిస్తారో వారే సెలవివ్వాలి.

ర్యాగింగ్ విష సంస్కృతికి వ్యతిరేకంగా విద్యార్థులు సామాజిక స్పృహ పెంపొందించుకుని మానవతా దృక్పథంతో నడుచుకోవలసిన బాధ్యత నేటి విద్యార్థులపై ఎంతైనా ఉంది.

ర్యాగింగ్ విష సంస్కృతికి బలై రైలు పట్టాలపై రెండు ముక్కలైన సాయినాథుని చూసి స్పందిస్తూ ఈ వ్యాసం.

*(రచయిత విద్యార్థి, యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ లా, కాకతీయ విశ్వవిద్యాలయం)* వీ

సమీక్ష

# శాంతిదూత నాయకురాలు - ఒక విశ్లేషణ

-కొసరాజు వెంకటేశ్వరరావు

పల్నాటి రతయితల అధ్యక్షులు వైహెచ్‌కె. మోహన్‌రావు ప్రచురించిన 'తొలి మహా మంత్రిణి నాయకురాలు నాగమ్మ' పుస్తకం తెలుగు పాఠకుల మన్ననలు అందుకున్న సంగతి తెలిసినదే. ఈ పుస్తకాన్ని గురించి శ్రీ మోహనరావు విశ్లేషణ మర్చ్ నెల 'మిసిమి' మాస పత్రికలో ప్రచురింపబడగా ఆంధ్రజ్యోతి దినపత్రిక 2014 ఏప్రిల్ 14న మోహనరావు విశ్లేషణాత్మక వ్యాసం 'నాయకురాలు నాగమ్మ ఉదాత్త చరిత్రకు వక్రీకరణ' ప్రచురింపబడి రచయితలను, విమర్శనాకారులను ఆలోచనలో పడవేసింది. ఆ పుస్తకం చదివిన తరువాత, నేను రాసిన నాయకురాలు నాగమ్మ-నిగ్గుతేలిన నిజాలు అనే విమర్శనాత్మక వ్యాసాన్ని ఆంధ్రజ్యోతి వివిధ సాహిత్య వేదికలలో 2014 ఏప్రిల్‌న ప్రచురించింది. నాయకురాలు నాగమ్మపై ఎన్నో పుస్తకాలు ప్రచురింపబడినా, వాటిలో నాగమ్మను గురించి పక్షపాత ధోరణిలోనే ప్రచురింపబడినాయి. మోహనరావు పుస్తకంపై ఎన్నో విమర్శలు, ప్రతి విమర్శలు వచ్చాయి. ఈ పుస్తకంలో ఆయన నాగమ్మ నిజస్వరూపాన్ని సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన ఆమే పలనాటి వీరవణితగా, శాంతి కాముక మూర్తిగా, మత సామరస్య ధీశాంతిగా, బహు భాషా నిష్ణాతురాలిగా, మంచి పరిపాలనా దక్షురాలినిగా, సంగీత ప్రావిణ్యురాలిగా చరిత్ర పుటలలో నిలిచిందని చాటి చెప్పారు.

ఆ పుస్తక రచనతోనే సంతృప్తి చెందక నాయకురాలిని గురించి ఇంకా ఒన్నో విషయాలు నిగ్గ తేల్చాలనే ఉద్దేశ్యంతో మోహణరావు తన రెండవ పుస్తకం 'శాంతి దూత నాయకులరాలు' (పలనాటి వీరగాధ ప్రామాణిక దర్పణం-2) లో వీరవనిత, గుర్రపు స్వారిలో దిట్ట, ఖడ్గధారిణి అయిన యోధ, మహా మంత్రిణి నాగమ్మ పల్నాటి యుద్ధ భూమిలో రెండు వైరి పక్షాలు తమ సేనలతో ఏ క్షణంలో అయినా ఢీ కొనడానికి తయారుగా ఉన్నప్పటికీ, తనకు జరిగిన వైధవ్యాన్ని తలచుకుని యుద్ధంలో ఉద్రిక్త పరిస్థితుల నుండి ముందు చూపుతో, దేశ క్షేమాన్ని ఆకాంక్షించి, యుద్ధంలో తెగిపడబోతున్న తలలు, రాలిపోతున్న వారి స్త్రీల నల్లపూసలు దూరం కాబోతున్న వారి ఇదవతనాలను గురించి దీర్ఘంగా ఆలోచించి, యుద్ధ భేరీలను ఆపి, సైన్యాన్ని బుజ్జగించి, తన చాకచక్యంతో శత్రువుల గొంతెమ్మ కోర్కెలన్నింటినీ అంగీకరించి, యుద్ధానికి కళ్లెం వేసి, మొత్తం యుద్ధ వాతావరణాన్ని శాంతి వనం వైపు నడిపించిన ధీశాలిగా అనేక దృష్టాంతరాలతో సహా నిరూపించారు. నాగమ్మను గురించి రాసిన అనేక మంది కవులు శ్రీనాధుని పలనాటి వీర చరిత్రకు వక్ర భాష్యం ఆపాదించి, నాగమ్మకు ద్రోహిగా, యుద్ధ పిపాసిగా పల్నాటి యుద్ధానికి నాగమ్మే కారణమయినట్లుగా పక్షపాత ధోరణిలో తమ రచనలు సాగించినట్లుగా తోస్తున్న సంగతి ముమ్మాటికి నిజమే అని అనిపిస్తున్నది. మోహన్‌రావు తన పుస్తకంలో పల్నాటిలో ప్రతిష్టించిన నాగమ్మ విగ్రహం, ఆమె పల్నాడులోని నిర్మించిన దేవాలయాలు, ఆమె జన్మ స్థలమైన కరీంనగర్ జిల్లా ఆర్వెల్లి గ్రామంలో




**'తొలి మహామంత్రిణి-నాయకురాలు నాగమ్మ'** పుస్తకం పుటలు 80, వెల రు. 100లు రెండు పుస్తకములు కొనుగోలు చేసిన వారికి కొరియర్ / పోస్ట్ చార్జీలు రాయితీ గలదు. ప్రతులకు : వై.ఎచ్.కె. మోహన్‌రావు, పల్నాడు రచయితల సంఘం అధ్యక్షులు, ఇ.నెం. 11-61/3, జె.పి. రోడ్, పిడుగురాళ్ల - 522 413, గుంటూరు జిల్లా

నాగమ్మ పేర గ్రామస్థులు నిర్మించిన నాయకురాలి గుడి, మొదలైన రంగు రంగుల చిత్రాలను తన పుస్తకంలో నిక్షిప్తం చేశారు. రచయిత ఈ పుస్తకంలో నాయకురాలపై కొందరు కవులు, రచయితలు చేసిన అసత్య ప్రచారాలను తేర్పారబడుతూ, నాయకురాలిపై కమ్ముకున్న చీకటి తెరలను తొలగించే ప్రయత్నం చేశారు. నాయకురాలి నిండైన వ్యక్తిత్వం మోహన్‌రావు పుస్తకాల ద్వారా ప్రజలకు చేరువై వారిలో నాగమ్మ వ్యక్తిత్వాన్ని సరిగా అర్థం చేసుకునే అవకాశం కలిగించింది. నాయకురాలిపై కరుడుగట్టిన వ్యతిరేక ముద్ర సడలిపోతున్నది మొదటి పుస్తకం ప్రచురింపబడిన తరువాత మోహన్‌రావు అనేక విమర్శలకు గురైనా ఏమాత్రం భయపడక ఎంతో ధైర్యంగా తన రెండవ పుస్తకం ముద్రించడం ముదావహం. ఈ పుస్తకంలో నాగమ్మను గురించి వక్రీకరణకు గురైన ఇంకెన్నో సంఘటనలను, సత్య దూరం వీడిన మరెన్నో వాస్తవాలను వెలుగులోకి తెచ్చిన ఘనత మోహన్‌రావుకే దక్కుతుంది. మొదటి పుస్తకంలో నాగమ్మను గురించి పొందుపరచని అంశాలను కొన్నింటిని తన రండవ పుస్తకంలో నిర్మొహమాటంగా విశదీకరించారు. తన తొలి పుస్తకంలో మంచాల పల్నాటి యుద్ధంలో పాల్గొన్నట్లుగా తెలిపానని కాని అనేక గ్రంధాలు చదివిన తరువాత ఇది యధార్థం కాదని తెలిసిందని తన రెండవ పుస్తకంలో తెలియ జేశారు. ఇదే విధంగా కొన్ని అంశాలు పరస్పర విరుద్ధంగానే ఉండవచ్చు అని ఆయనే నిర్మొహమాటంగా అంగీకరించారు. నాయకురాలు నాగమ్మను శాంతి దూత అని అనడానికి ఎన్నో దృష్టాంతరాలు

చూపించవచ్చు. కారంపూడి యుద్ధంలో నాగమ్మ సైన్యం ఎక్కుపెట్టిన విల్లు, సారించిన నారి అంబుల పొదిలో రణావేశంతో దూసుకు రాబోతున్న శరం మోగడానికి సిద్ధంగా ఉన్న రణ భేరీలు అన్నీ తమ తమ సథా స్థానానికి చేరుకోవడం, శాంతి మంత్రం జపించడం, యుద్ధ భూమి నుండి అన్నమరాజు, కోటకేత మహారాజు, మాడ్గుల వీరారెడ్డి, మేడిగం కోటిరెడ్డి బృందాన్ని సంధిరాయ బారానికి పంపి బ్రహ్మనాయుడు వరీయుల షరతుల నన్నింటిని అంగీకరించి యుద్ధాన్ని నివారించిన నాగమ్మ శాంతి దూత కాక యుద్ధోన్మాది ఎలా అవుతుందో విజ్ఞులైన పాఠకులే గమనించగలరు. బ్రహ్మన్న కోరిన అన్ని షరతులను, కోర్కెలను నాయకురాలు ఆమోదించి తన విశిష్టమైన వ్యక్తిత్వాన్ని చాటుకుని ధర్మానిరతి కలిగిన మహా నాయకురాలిగా ప్రపంచం గుర్తించింది. నాగమ్మను కుట్ర దారుగా, వంచకిగా, దోషిగా, నేరస్థురాలిగా, హంతకురాలిగా కొందరు రచయితలు ఆమెను ఇతిహాసపు చీకటి కోణాల అట్టడుగుకు చేర్చారు. ఈ చీకటి కోణాలను మోహన్‌రావు దృష్టాంతరాలతో సహా వెలుగులోకి తెచ్చారు. నాగమ్మ తన పాదాలకు పారాణి పెట్టుకున్నా, చేతి వెళ్లకు గోరింటాకు పెట్టుకున్నీ, తాంబూలం వేసుకున్నా ఆమెను దోషిగా చిత్రీకరించారు. ఆమెలో మూర్తీభవించిన అమ్మతనం, సాటివారి పట్ల విలువలు, నూరు మంది మేధావుల మేదస్సు, నూరు మంది యోధుల ధైర సాహసం, నూరు మంది శూర్యుల ప్రతాపం కలిసి ఆమెను నాయకురాలిగా రూపం తీసుకున్నాయి. పల్నాటి యుద్ధానంతరం మళ్లీ సింహాసనం చేపట్ని నలగామరాజు వారించినా, నాయకురాలు విరాగిని అయి తన ఆస్థులను ప్రజలకు పంచిపెట్టి తిరిగి సామాన్య స్త్రీగా తన పుట్టిన గడ్డకే తిరిగి వెళ్లిపోయి అక్కడే తన చరమ జీవితాన్ని సాదాసీదాగా గడిపిన నాగమ్మకు చరిత్రలో సరియైన స్థానం కల్పించకపోవడం మన దురదృష్టమే అవుతుంది.

శ్రీనాథ మహాకవి రచించిన 'పలనాటి వీర చరిత్ర' గ్రంథంలో మనకు కొన్ని ఘట్టాలు మాత్రమే లభించాయి. మొత్తం కావ్యం లభించి ఉంటే నాయకురాలు మరింత పునీతగా లోకం ముందు సాక్షాత్కరించి ఉండేది అని ఈ రచయిత అభిప్రాయం. నాయకురాలు బ్రహ్మనాయునిపై సాధించిన విజయాలను కొందరు రచయితలు ఆమోదించకపోగా ఆమెను కుట్రదారు రాలిగా, వంచకిగా చిత్రీకరించారు. ఆమె విజయాలను కుట్రల ఫలితాలని, అక్రమ మార్గాల ఫలాలని అభివర్ణించారు. కోడిపోరు సంఘటనను కొందరు రచయితలు పలు విధాలుగా అభిప్రాయపడ్డారు. పింగళి లక్ష్మికాంతం తన పల్నాటి వీర చరిత్రలో గెలుపుకోసం నాయకురాలు బ్రహ్మనాయుడి పుంజుపై మంత్రాక్షతలు చల్లించి మట్టుపెట్టించిందని రాయగా, త్రిపురనేని రామస్వామి చౌదరి తన 'కవిరాజు సాహిత్యం-2 భగవద్గీత'లో నాయకురాలు తన పుంజుకు కట్టిన కత్తికి విషం పూయించిందని రాయగా, కోడూరి ప్రభాకరరెడ్డి తన 'పల్నాటి భారతం'లో నాయకురాలు తన పుంజుకు ఉక్కు కవచాన్ని తొడిగించిందని, ఆచార్య యార్లగడ్డ బాల గంగాధరరావు తన పుస్తకంలో గంగవరం గ్రామ కట్టుబోతుల వాళ్లు నాగమ్మ పుంజుకు కవచం అమర్చారని రాశారు. కాని ఈ అభిప్రాయాలు చరిత్రను వక్రీకరిస్తున్నాయి. యధార్థంగా జరిగినదేమిటంటే నాయకురాలు తన పుంజు వరుసగా ఓడిపోవడంతో, ఆమె కొత్త పుంజులను ప్రవేశపెట్టిగా, బ్రహ్మనాయుడు పుంజు చిట్టి మల్లునే మళ్లీ మళ్లీ పందెంలో దించగా అది తన శక్తిని కోల్పోయి, అలసిపోయి, కొత్తగా బరిలోకి దిగిన నాయకురాలి పుంజుపై ఓటమి పాలైంది. కొందరు రచయితలు అలరాజును హత్య చేయించడానికి నలగామరాజుతో నాయకురాలు చర్చించినట్లు తెలిపారు. ఇది మూల కథకు భిన్నంగా ఉన్నది. అలగామరాజు తల్లిదండ్రులైన చెల్లమదేవి, కొమ్మరాజు అలగామరాజు మరణానికి బ్రహ్మనాయుడిపై సందేహం విలిబుచ్చారని మోహన్‌రావు అభిప్రాయం.

నాయకురాలు మహా మంత్రిణిగా పల్నాటి అభివృద్ధికి పటిష్టమైన ప్రణాలికలు రూపొందించి అమలు పరిచినట్లు చారిత్రక ప్రమాణాలు మద్దతుగా నిలుస్తున్నాయి అని ముప్పాళ్ల హనుమంతరావు తన గ్రంథం 'సమగ్రాంధ దేశ చరిత్ర-సంస్కృతి 2వ భాగం'లోని హైవాయ రాజుల పాలన అనే అధ్యాయంలో రాశారు. నాగమ్మ తన దృష్టిని పరిపాలనపై పెట్టి అనేక చెరువులు తవ్వించి, నాగులేరుకు ఆనకట్ట కట్టించి కారంపూడి, పేటసన్నిగండ్ల పరిసర ప్రాంతాలకు నీటి కరువు లేకుండా చేసి, అనేక దేవాలయాలు నిర్మించి ప్రజా సంక్షేమం కార్యక్రమాలు అమలు పరిచి ప్రజల మన్ననలు చూరగొంది. ఆమె గ్రామ గ్రామాన తిరుగుతూ ప్రజల కష్ట సుఖాలు తెలుసుకుంటూ పటిష్టమైన పరిపాలనా వ్యవస్థను ఏర్పరచింది. ఆమె అచిరకాంలోనే ప్రజాభిమానాన్ని సంపాదించి, ప్రజలచే నాయకురాలిగా అభిమానంగా పిలవబడింది. పల్నాటిలో ఆడ పిల్లలకు నాగమ్మ అని, మగ పిల్లలకు నాగయ్య అని పేరు పెట్టుకునే ఆచారం నిలిచి ఉన్నది. ఆనాటి ప్రజలు ఆమెను దేవతగా కొలిచారని, ఆమె అంతులేని ప్రజాభిమానాన్ని సంపాదించిందని స్పష్టంగా తెలియ వస్తున్నది.

నాగమ్మ భారత మహిళ్యా రాజకీయాలకే ఆద్యురాలు. ఆమెకు ముందు కాలంలో, ఆమె సమకాంలో, ఆమె తరువాతి కాంలో నేటి వరకూ మరోస్త్రీకి దక్కని నాయకురాలు అనే గౌరవం ఆమెకు లభించింది. ఆమె తొలి మహిళా మంత్రిణి. శాంతి దూత. ఇన్ని ప్రతిభా విశేషాలుండి, భావి ప్రపంచానికి మార్గదర్శి అయిన నాయకురాలిని, తనకంటూ ఏమీ మిగుల్చుకోని దానశీలి. రాయప్రోలు సుబ్బారావు 'కాలమా మాదు నాయకురాలి వంటి బిడ్డనే దేశమందైనా బెంచినావే' అంటూ ప్రశ్నిస్తూ నాయకురాలి గురించి ఉప్పొంగి ఊగిపోయి తన గళం నిండా, కలం నిండా అమృతాక్షరాలను కూర్చి కీర్తించాడు. బ్రహ్మనాయుడు విజయం సాధిస్తే అది ధర్మ యుద్ధం అని, నాయకురాలు గెలుపొందితే అది అధర్మపోరు అని కొందరు రచయితలు భావిస్తూ, ఆ మేరకే కోడి పోరు, మందపోటు, కారంపూడి యుద్ధాలను చిత్రీకరించారు.

నాయకురాలి వ్యక్తిత్వాన్ని, ఆమె నీతివంతమైన జీవన గమనాన్ని, అజేయమైన ఆమె ధీరత్వాన్ని తెలుగువారు నిజాయితీగా అర్థం చేసుకోవాలనే అభిప్రాయంతో ఉన్న మోహన్‌రావు ఆశయంలో మనం కూడా పాలుపంచుకుందా. 112 పుటలు ఉన్న ఈ పుస్తకం వెల రు. 100 మాత్రమే. దీనిని పల్నాడు రచయితల సంఘం, పిడుగురాళ్ల, గుంటూరు జిల్లా వారు ప్రచురించారు. ఈ పుస్తకం నవోదయ బుక్ హౌస్ హైద్రాబాద్, ఏలూరు, స్ఫూర్తి పబ్లిషింగ్ హౌస్, గుంటూరు, ప్రజాశక్తి, విశాలాంధ్ర అన్ని బుక్ షాపుల్లో లభిస్తుంది. రచయితకు అభినందనలు.

*(రచయిత పురావస్తు శాఖ సంచాలకులు)* వీ

# ప్రభుత్వ పాఠశాలల్లో హేతుబద్ధీకరణ

***ప్రభుత్వ పాఠశాలల హేతుబద్ధీకరణ పేరుతో పాఠశాలల, హాస్టళ్ల తగ్గింపు - ఉపాధ్యాయుల బదిలీల వెనుక ఉన్న ప్రపంచ బ్యాంకు ప్రైవేటీకరణ ఆదేశాన్ని వివరిస్తున్నారు* తక్కళ్లపెల్లి సూరి**

నేడు ఉభయ తెలుగు రాష్ట్రాల్లో విద్యపై విస్తృత చర్చ జరుగవలసిన అవసరం ఉన్నప్పటికీ, తెలంగాణ రాష్ట్రంలో హేతుబద్ధీకరణ జరిగింది. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో హేతుబద్ధీకరణకు రంగం సిద్ధమైంది. నిజానికి ప్రభుత్వ విద్యలో రేషనలైజేషన్ ప్రక్రియ చాలా ప్రమాదకరమైన అంశమైనప్పటికి మేధావుల మౌనం కారణంగా రేషనలైజేషన్‌పై ప్రజలకు సరైన అవగాహన పెరగలేదు. దీనిని అవకాశంగా భావించిన పాలకులు గత 15 సంవత్సరాల నుండి విద్యలో ఈ ప్రమాదకర రేషనలైజేషన్ ప్రక్రియను కొనసాగిస్తున్నారు. స్థూలంగా చెప్పాలంటే ప్రభుత్వ విద్యను ప్రైవేట్ పరం చేయడానికి ప్రపంచ బ్యాంక్ విసిరిన ఆకర్షణీయ, అతిప్రమాదకర పాచికగా ఈ హేతుబద్ధీకరణను అభివర్ణించవచ్చు. దేశంలో అనేక రాష్ట్రాల్లో, పార్టీలకతీతంగా, జెండాలతీతంగా, దాదాపు అన్ని రాష్ట్రాల పాలకులు అధికార ఆమోదంతో, ఐక్య ఎజెండాగా ప్రభుత్వ విద్యలో రేషనలైజేషన్ దూసుకుపోతుంది.

ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య క్రమంగా తగ్గడాన్ని కారణంగా చూపుతూ, రేషనలైజేషన్‌ను ముందుకు తెస్తున్నారు. కాని నిజానికి చాలా నమ్మకంగా, ఆరోగ్యంగా, విశ్వాసంగా జీవిస్తున్న మంచి కుక్కను, శత్రువు చంపాలంటే, ఆ కుక్కను పిచ్చికుక్క అనే గ్లోబల్ ప్రచారాన్ని అస్త్రంగా ఉపయోగించినట్లే, ఇక్కడ ప్రభుత్వ పాఠశాలలు ఆరోగ్యంగా, నాణ్యంగా, నడుస్తున్న పాఠశాల విద్యా వ్యవస్థను, అనేక ప్రయోగాల పేరుతో, వివిధ స్కీంల పేరుతో, సామ్రాజ్యవాద శక్తులు, తమ స్వార్థ దీర్ఘకాల ఆర్థిక ప్రయోజనాల కోసం ప్రకటించిన నిధులు, విరాళాలు, ప్రభుత్వ ఉపాధ్యాయుల విధులను నిర్దేశించే దౌర్భాగ్యపు పరిస్థితుల పరాకాష్టగా రేషనలైజేషన్ ప్రక్రియను పేర్కొనవచ్చు. పటిష్ఠమైన సామ్రాజ్యవాదుల కుట్రల ఫలితంగా నేటి ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థులు క్రమంగా తగ్గిపోతున్నారనేదే అసలు నిజం. కాని దీనికి ప్రభుత్వ ఉపాధ్యాయులను మాత్రమే బాధ్యులను చేయడం, సామ్రాజ్యవాదుల ఎత్తుగడలో భాగంగానే గుర్తించాలి.

విద్యను అమ్మకం, కొనుగోలు అనే ఆకర్షణీయ ఆర్థికపర మార్కెట్ వస్తువుగా మార్చి, అటువంటి ఆకర్షణనే నిజమైన నాణ్యతగా భావించే భ్రమను సామ్రాజ్యవాద శక్తులు కలిగిస్తూనే ఉన్నాయి. ప్రభుత్వాలు కూడ ప్రభుత్వ విద్యను సేవా రంగం నుండి తప్పించి, వ్యాపారంగా మార్చివేయడానికి సహకరిస్తూనే ఉన్నాయి. మన దేశం విద్య నాణ్యతను బలహీనపర్చి, మన యువత మేధస్సును దారిమళ్లించి, వారిని అనేక వ్యసనాలకు బానిసలను చేసి, కేవలం డబ్బు సంపాదనపై, విలాస సౌకర్యాలపై, ఖరీదైన వస్తువులపై ఎనలేని ప్రేమను పెంచి, మనుషులను చిల్లర వస్తువుల కన్నా హీనంగా ఖరీదైన విలాస వస్తువులను మనుషుల కన్నా గౌరవంగా చూసే సంస్కృతిని పెంపొందించడమే సామ్రాజ్యవాదుల ప్రధాన లక్ష్యం.

మానవులలోని సహజమైన విచక్షణ, సానుభూతి, జాలి, కరుణ, దయ అనే నైతిక అంశాలను ఛిన్నపరిచి బహుళజాతి కంపెనీల వ్యాపార వృద్ధికి మాత్రమే తోడ్పడే విద్యను మాత్రమే ఎక్కువగా అందుబాటులోనికి తెస్తున్నారు. అందులో భాగంగానే విశ్వవిద్యాయాల్లో సైతం నూతన కోర్సుల రూపకల్పన జరుగుతున్నా ఆ విశ్వవిద్యాయాలు బహుళజాతి కంపెనీలకు సంపద సృష్టించే గుమాస్తాలను మాత్రమే తయారుచేసే కర్మాగారాలవుతున్నాయి. బహుళజాతి కంపెనీలలో ఉద్యోగాలకై మాత్రమే చదువుకోవడం నైతిక విలువలు మరచి కేవలం డబ్బు సంపాదించే మర యంత్రాలుగా మనదేశ యువతను మార్చివేయడం ఆర్థిక దోపిడిగానే పరిగణించాలి. నేటి విద్య డాక్టర్లను, ఇంజనీర్లను, లాయర్లను, సైంటిస్టులను, మేధావులను, ఉద్యోగస్తులను మాత్రమే తయారుచేస్తుంది కాని, పరిపూర్ణమైన నైతిక విలువలుగల ఒక సంపూర్ణ వ్యక్తిగా మార్చడం లేదు.

మన భారతదేశంలో విద్య నాణ్యతను దారిమళ్లించే కార్యక్రమం పి.వి.నర్సింహారావు 1991లో ప్రవేశపెట్టిన నూతన ఆర్థిక సంస్కరణ కన్నా ముందే, 1984లోనే ప్రారంభమైనదని చెప్పవచ్చును. ప్రాథమిక విద్యా పథకం పేరుతో, బ్రిటన్ పూర్తి ఆర్థిక సహకారంతో, మనదేశంలోకి సామ్రాజ్యవాదుల కుట్రలు ప్రవేశించాయి. 1989లో నాటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యా పథకం పేరుతో, ప్రభుత్వ విద్యను, సక్రమంగా బోధించు ఉపాధ్యాయులను, ప్రయోగాల పేరుతో, ప్రణాళికల పేరుతో, మెరుగైన విద్య పేరుతో, విపరీతమైన నిధులు మంజూరు చేసి, మన విద్యా విధులను, అట్టి విదేశీ నిధులు నిర్ణయించే స్థానాన్ని క్రమంగా సామ్రాజ్యవాద శక్తులు ఆక్రమించుకొన్న కారణంగానే విద్యా నాణ్యత బలహీనమవుతూ వచ్చింది. ఈ పథకం ద్వారా ప్రాథమిక విద్యా (1 నుండి 5 వ తరగతి వరకు మాత్రమే) బోధనకు మాత్రమే నిధులు ఖర్చు చేయాలి. ఉన్నత పాఠశాల విద్యకు నిధులు ఉపయోగించుకునే అవకాశం కల్పించలేదు. అంటే మన ప్రజలకు ప్రాథమిక అక్షర జ్ఞానానికే ప్రాముఖ్యత నిచ్చారు. ఎందుకంటే జనాభా ఎక్కువగా ఉన్న భారతదేశం లాంటి ప్రాంతం, తక్కువ అక్షరాస్యత ఉన్నందున, సామ్రాజ్యవాద దేశాల వ్యాపారాలకు సారవంతమైన నేలా ఉపయోగపడుతుంది. అందుకే సామ్రాజ్యవాద శక్తులు సేవ, సంఘసేవ, సమాజసేవ పేర్లతో ప్రకటించి ఆర్థిక సహకారంలో తప్పకుండా వారి స్వార్థ దీర్ఘకాల వ్యాపార ప్రయోజనాలు దాగి ఉంటాయి.

మన దేశంలోని కొన్ని రాష్ట్రాల్లో 1984-1985 మొదటిదశగా,

1989-1996 వరకు రెండో దశగా అమలైన ప్రాథమిక విద్యా పథకం, ప్రాథమిక స్థాయిలో మాత్రమే భారతదేశ అక్షరాస్యతను పెంచాలనే విషయంలో బహుళజాతి సంస్థల వస్తువు వినియోగం పెంచుకొనుటకు భారతీయులను ప్రసార సాధనాల ప్రకటనకు ఆకర్షితులను చేస్తూ, బహుళ జాతి కంపెనీల వస్తువులు కొనుగోలుచేసే వినియోగదారుగా మార్చడమే ప్రాథమిక విద్య పథకం అంతర్గత లక్ష్యంగా చెప్పవచ్చును. దీని తర్వాత ప్రారంభమైన జిల్లా ప్రాథమిక విద్యా పథకం (డిపిఇపి) 1993-94లో భారతదేశంలో ప్రారంభమై, నాటి ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో 1996-1997 నుండి మూడు దశలుగా కొనసాగింది. ఇలాంటి విద్యా పథకానికి ప్రపంచబ్యాంక్ స్వయంగా ఆర్థిక సహాయాన్ని అందించింది. ఈ పథకం కూడా విద్యా వ్యవస్థను అస్థిరపరచడానికి, సంస్కరణల పేరుతో, నవీన బోధన పేరుతో ప్రవేశించి, దేశ విద్య, నాణ్యతా ప్రమాణాల పెంపు పేరుతో, వాటిని భంగపర్చి, ఛిన్నపర్చినారు.

ఇలాంటి సామ్రాజ్యవాద కుట్రలో మనదేశ, రాష్ట్రాల పాలకులు భాగస్వామ్య మవ్వడం దురదృష్టకరం. అంతేకాకుండా విద్యలో నిత్యం ప్రయోగాలతో ఎస్ఎస్ఏ (సర్వశిక్షా అభియాన్), ఆర్ఎంఎస్ఏ (రాష్ట్రీయ మాధ్యమిక శిక్షా అభియాన్)తో పాటుగా సిఎల్ఎపి, సిఎల్ఐపి, ఎల్ఇపి, వచ్చి విద్యలో నాణ్యత లోపించిందని నిర్ధారించుకున్న తర్వాత క్యూఐపి (క్వాలిటి ఇంప్రూవ్‌మెంట్ ప్రోగ్రాం) ముందుకు తెచ్చారు. ఇప్పుడు సిసిఇ (కంటిన్యూయస్ కాంప్రహెన్సీవ్ ఎవాల్యూషన్) పద్ధతిలో బోధన జరుగుతుంది. నిరంతర సమగ్ర మూల్యాంకనం అంటే విద్యార్థికి భయంలేకుండా, నిరంతరం తరగతిగది ఉపాధ్యాయుడు పాఠ్యవిషయ పరిజ్ఞానాన్ని మూల్యాంకనం చేయాలి. తద్వారా విద్యార్థికి భయం లేకుండా, పరీక్షలు అని తెలియకుండానే, మూల్యాంకనం జరిగిపోవాలి. అంటే స్థూలంగా చెప్పాలంటే సిసిఇ పద్ధతిలో అసలు పరీక్షలే ఉండకూడదు. కాని ఎఫ్ఏ (ఫార్మేటీవ్ అసెస్‌మెంట్), ఎస్ఏ (సమ్మేటీవ్ అసెస్‌మెంట్) పేర పరీక్షలు జరుగుతూనే ఉండడం ఆశ్చర్యం. నిత్యం విద్యలో ఆచరణ సాధ్యంగాని ప్రయోగాలతో కాలుష్యం చేస్తూ, ప్రభుత్వ విద్యను వాంఛనీయంగా దిగజారుస్తూ, అందుకు ఉపాధ్యాయులను బూచీలుగా చూపెడుతూ రేషనలైజేషన్‌ను ముందుకు తెస్తున్నారు.

ప్రభుత్వ పాఠశాలల్లో భారీగా తగ్గించబడిన, పాలక భాషలో తగ్గిపోయిన విద్యార్థిని విద్యార్థుల సంఖ్యను కేంద్రంగా చేస్తూ రేషనలైజేషన్‌ను అమలు చేస్తున్నారు. ప్రభుత్వ ఉపాధ్యాయులను విద్యార్థులు లేని లేదా విద్యార్థులు రాని పాఠశాల నుండి, ఎక్కువ విద్యార్థులున్న ప్రభుత్వ పాఠశాలల్లో సర్దుబాటు చేసే చర్యను ప్రభుత్వం హేతుబద్ధీకరణ అంటుంది. నిజానికి ఈ పద్ధతి సామాన్యులకు సరైనదిగానే తోస్తుంది. పైగా విద్యార్థులు లేకుండా, బోధన విధులు లేకుండా, ఉపాధ్యాయులకు ప్రభుత్వ వేతనాలివ్వడం, నిధుల దుర్వినియోగం గానే భావించాలి. కాని ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య భారీగా తగ్గిపోవడానికి, ప్రైవేట్ విద్య విస్తృతంగా బలోపేతమై అందుబాటులోకి రావడానికి, సామ్రాజ్యవాదుల కుట్రేనని గుర్తించాలి. ప్రభుత్వ విద్యపై నిత్య ప్రయోగాలను ఆహ్వానించడంలో ప్రభుత్వా పాత్రను విస్మరిస్తున్నాయి. అంటే పాలకపక్షాలు, కావాలనే ప్రభుత్వ విద్యను బలహీనపర్చి తద్వారా ప్రైవేటు విద్యను బలోపేతం చేసి, విద్యను సేవారంగం నుండి తప్పించే కుట్ర చేస్తున్నాయి. ప్రస్తుత విద్యపై రేషనలైజేషన్ ప్రక్రియ ప్రపంచబ్యాంక్ ప్రయోగించిన ఒక బలమైన వ్యూహాత్మక, అత్యంత ప్రమాదకర ఆయుధంగా అర్థం చేసుకోవాలి.

ఒక దేశం అభివృద్ధి కేవలం సంపూర్ణ అక్షరాస్యత వల్ల మాత్రమే జరుగదు. నైతిక విలువలతో కూడిన విద్యవల్లనే సాధ్యమవుతుంది. మనదేశంలో సామ్రాజ్యవాద శక్తుల కుట్రల ఫలితంగా ప్రస్తుత బానిస విద్యా విధానం అమలవుతూ, నైతిక విలువలులేని యువత పెరుగుతూ ఉంది. భారత రాజ్యాంగంలో సర్వసత్తాక, సామ్యవాద, లౌకిక, ప్రజాస్వామ్య పదాలను సమర్థవంతంగా ఆచరణలో చూపని పాలకులు, దేశ మనుగడకు, ముఖ్యమైన విద్యా నాణ్యతకు ప్రమాదం ఏర్పడే అనేక కార్యక్రమాలను మాత్రం ముందుండి, ఆచరణ కార్యనిర్వహణలో భాగస్వాములవుతారు.

విద్య రాజ్యాంగబద్ధంగా ఉచిత నిర్బంధపు హక్కులా గుర్తించినా ఆవిధంగా లభించడంలేదు. విద్య మన దేశంలోనూ, ఇటు ఉభయ తెలుగు రాష్ట్రాల్లోనూ అతి ఖరీదైనదిగా మారడానికి, పాలక పక్ష లక్ష్యాలే కారణంకాని, ప్రభుత్వ ఉపాధ్యాయులు కాదని తెలుసుకోవాలి. కేవలం ప్రభుత్వాల అసమర్థ వైఖరుల వల్ల, నిర్లక్ష్య ధోరణుల వల్ల, విద్యను వ్యాపారం చేయాలనే సామ్రాజ్యవాదుల కుట్రలో పాకు భాగస్వాము లవ్వడం వల్ల, విద్యను సేవారంగం నుండి తప్పించి, ప్రభుత్వ నిధుల, ప్రభుత్వ విద్యకు వృథా అనే నీచపు ఆలోచన వల్ల విద్య చాలా ఖరీదుగా మారి వర్ధిల్లుతుంది.

దేశంలో, వివిధ రాష్ట్రాల్లో ప్రైవేటు విద్యాసంస్థలు కార్పొరేట్ హంగులతో అక్రమంగా కొనసాగుతూనే ఉన్నాయి. ప్రభుత్వ నిబంధనలు పాటించని విద్యా సంస్థల మీద కఠినమైన చర్యలు తీసుకొని అక్రమ విద్యా సంస్థలన్నింటిని మూసివేస్తే, ప్రభుత్వ పాఠశాలలకు విద్యార్థులు తప్పకుండా వచ్చి తీరుతారు. అలా కాకుండా ప్రైవేటు రంగంలో విద్య ఉండడం వల్ల, తీవ్ర సామ్రాజ్యవాద కాంక్షగల పౌరులు ఉత్పత్తి దేశంలో పెరిగి, విలువలు అంతరించిపోయి, యువత అనేక వ్యసనాలకు బానిసలై, ఆర్థిక సామాజిక అసమానతలు పెరిగి సామాజిక అవగాహన, సమాజం పట్ల బాధ్యత నిర్లక్ష్యాలై, ప్రజాస్వామ్య ఆలోచనలు కనుమరుగై, దేశం మొత్తంగా విష సంస్కృతీ నిలయంగా మారుతుంది. విద్య రెండంచుల ఖడ్గంవలె చాలా ప్రమాదకరమైనది, శీలం, సమానత్వం, నైతికత, మానవత్వం నేర్చుకోని విద్యావంతులు, నేటి సమాజానికి క్రూరమృగాలకంటే ప్రమాదకరమైన వారుగా భావించవలసి ఉంది. విద్య బలోపేత చర్యలుగా, ప్రభుత్వ పాఠశాలల్లో ఆంగ్ల మాధ్యమంను ప్రవేశపెట్టాలని ప్రభుత్వాలు భావిస్తున్నాయి. మాతృభాషలోనే నాణ్యమైన విద్యను అందించలేని పాలకులు, ఆంగ్ల మాధ్యమాన్ని ఎలా నాణ్యంగా అందించగలరో ఆలోచించుకోవాలి. మాతృభాష విద్యా విధానం ద్వారానే ఇటలీ, జర్మనీ, జపాన్, ఫ్రాన్స్, చైనా, రష్యా దేశాలు అభివృద్ధిని సాధించాయి. వారి మాతృభాషలోనే అనేక పుస్తకాలను తర్జుమా చేసుకున్నాయి. కనుక కార్యచరణలేని, ఆచరణ సాధ్యంగాని విద్యా విధానాలను ప్రభుత్వం విడనాడి మాతృభాషలో విద్యను పరిష్ఠం చేయాలి. ఆంగ్లంపై పట్టుకు, మరో ప్రత్యేక స్పోకెన్ ఇంగ్లీష్ అదనపు విషయ నిపుణులను, పాఠశాల స్థాయి నుండి, విశ్వవిద్యాలయ స్థాయి వరకు నియమించి ఖచ్చితంగా అములు పరిస్తే ఆంగ్లంపై విద్యార్థులు పట్టు సాధిస్తారు. ఇలాంటివి కాకుండ కె.జి. టు పి.జి. అని, ఆంగ్ల

# విమర్శనారహిత విమర్శ

**- విద్యాసాగర్**

అయితే ఈ రిజర్వ్ సైన్యం గురించి ఎటువంటి కార్యాచరణ తీసుకోవాలో కూడా చరిత్ర అనేక ఉదాహరణలిచ్చింది. అందులో థేమ్స్ నది ఒడ్డున రేవు కార్మికుల రిజర్వ్ సైన్యాన్ని ఎలినార్ మార్క్స్ కదిలించిన ఆచరణ ఒక గొప్ప ఉదాహరణ.

ఇక నా ప్రకటిత అభిప్రాయంలో వలస ఒక సమస్య కాదు. సుదీర్ఘకాలం బయట ప్రపంచంతో సంబంధం లేకుండా విడి ఉత్పత్తి విధానంలో భాగస్వాములుగా ఉన్న శ్రామిక ప్రజానీకాన్ని ఒక సామూహిక ఉత్పత్తి విధానం (సోషలైజింగ్ ఆఫ్ లేబర్) లోకి మార్చే ఒక ప్రగతిశీల అడుగు. దేశీయ మార్కెట్ పెరగడానికి ఇది ఒక వనరు. అయితే ఈ క్రమంలో బాధలు, వేదనలు లేవని కాదు. ఉండవనీ కాదు. అయితే ఈ దశలో దీనికి విరుగుడు వలసలను నివారించడంలో లేదు. వలస వెళ్తున్న ప్రజానీకం తాము అంతవరకూ పొందుతున్న వేతనాలతో పోల్చితే నిశ్చయంగా 'మెరుగైన' వేతనం పొందుతున్నారు. (వాళ్ళ సాపేక్షక అర్థంలో) అయితే స్థిర జీతాలు, స్థిర సంపాదనల భద్రలోక దృష్టితో చూస్తే అది వేరే విధంగా కనబడుతుందనేది నా అంచనా. నేను రాసిన దళాయిపేట ఉదాహరణ ఈ క్రమానికే ఒక కొండగుర్తు. అలాగే 'తలదాచుకోవడానికి గ్రామం, పొట్ట పోసుకోవడానికి పట్నం' అనే నా పరిశీలన కూడా కనీసం పట్నంలో నిలవనీకుండా చేసి కూడా పట్నం తనకనుగుణంగా గ్రామీణ శ్రామిక ప్రజానీకాన్ని మార్చుకొంటోందని గుర్తించాలి. నిద్ర కన్నా పొట్ట ప్రధానమైనదని గుర్తించాలి.

(జి) స్వేచ్ఛా కార్మికులు అనే అంశం : ఈ మాట నేను ఉద్దేశ్యపూర్వకంగానే, తత్వ శాస్త్రవేత్తల బోధనకనుగుణంగానే వాడాను. ఎన్ ఇక్కడ మాత్రం మార్క్స్‌ను ఉదహరించారు. 'వారు తమ పూర్వ గ్రామీణ, వ్యవసాయ భూసంబంధాలన్నింటిలోనూ విముక్తులై స్వేచ్ఛననుభవించేవారు'? అని అర్థం చెప్పారు. నిజం! కానీ ఈ దేశంలో మార్క్సిస్టుల ఆచరణ అంతా 'భూమి – ఆత్మగౌరవం' చుట్టూనే సాగింది. నిజంగా భూసంస్కరణలు అమలు జరిగితే 1/2 ఎకరాల కన్నా భూమి రాదు. అయినప్పటికీ సర్వరోగనివారిణిగా 'భూమి' చుట్టూ ప్రచారం సాగింది. భూమి లేకుంటే జీవితమే లేదన్న స్థాయిలో ప్రచారం, ఆందోళనలు సాగిన తర్వాత ఈ దేశపు సన్నకారు, చిన్న కారు రైతాంగం భూమి నుంచి విడగొట్టుకొని స్వేచ్ఛను సాధించగలరా అనేదే ప్రశ్న. ఆ విధంగా 'భూమికి కట్టివేయాలనే ప్రచారం నిరంతరంగా సాగిన తర్వాత కూడా గ్రామీణ ప్రజలు ఈ 'భూమి' తమకిక ఎంతమాత్రమూ గౌరవప్రద ఉపాధిని కల్పించలేదనే అభిప్రాయానికి వచ్చారనేదే అసలు వాస్తవం. భూమి సమస్య గురించి, పంపిణీ గురించి ఎన్ కూడా ఈ దేశపు 'మార్క్సిస్టుల' ఆచరణవైపే స్పష్టంగా నిలబడి ఉన్నారు. ఈ ప్రాతిపదిక మీదనే, నేను మార్క్సిస్టు ఆచరణను తృణీకరించానని ప్రకటించారు. అనేక భూపోరాటాలను ఉదహరించారు. ఈ ఆరోపణ నిజంగానే నిజం. నేను విస్పష్టంగా ఆ ఆచరణను తిరస్కరిస్తున్నాను. ఇది మార్క్స్, ఎంగెల్స్, కౌట్స్కీ, లెనిన్‌లు ప్రకటించిన విధానానికి పూర్తిగా వ్యతిరేకమైనదని ప్రకటిస్తున్నాను. ఇది నిశ్చయంగా కార్మిక వర్గ ఆచరణ కాదని చెప్తున్నాను. నా రచనలన్నింటా ఈ విషయాన్ని ప్రస్తావిస్తాను. రైతాంగాన్ని విడి ఉత్పత్తిదారుల సమూహం నుంచి ఏకీకృత ఉత్పత్తి విధానంవైపుకు మార్చడం ద్వారానే చిన్న రైతుల సంక్షోభానికి (వ్యవసాయ సంక్షోభం కానేకాదు) పరిష్కారం ఉంది.

భూమి జాతీయకరణ అనే దానికి సమయం, సందర్భాలు ఉంటాయని ఎన్ చెప్పారు. ఆ సమయం, సందర్భాలేమిటో ఎన్ వివరించే శ్రమను తీసుకోలేదు. నిజానికి విజయవాడలో లెఫ్టిస్టు స్టడీ సర్కిల్ నిర్వహించిన సదస్సులో మార్క్స్, లెనిన్‌లను ప్రాతిపదికగా నేను భూమి జాతీయకరణ గురించి మాట్లాడాను. దీనిని ఎన్ ఆ సదస్సులో ఖండించారు. మార్క్స్ అని ఉంటే అని ఉండవచ్చుగాక కానీ లెనిన్ అలా అనలేదనే ప్రకటన చేశాడు. నేను లెనిన్ రచనల ఆధారంగా ఎన్ అభిప్రాయంతో / ప్రకటనతో విభేదించాను.(అయితే నా సమాధానం సమయానికి ఎన్ సదస్సులో లేరు). నిజానికి మార్క్స్ రచనను నేను ఉల్లేఖిస్తే అందులో పత్రిక పేరు తప్పుగా పడటాన్ని ఎత్తిచూపిన ఎన్ మార్క్స్ రచనలోని సారాంశంపై ఎటువంటి అభిప్రాయాన్నీ ప్రకటించలేదు. కాబట్టి ఎన్ భూమి జాతీయకరణకు కావాల్సిన సమయ సందర్భాలను గురించి సిద్ధాంత ప్రాతిపదికన వివరిస్తే ఎన్ నుంచి నేర్చుకోవాలనుకుంటున్న మాలాంటి వారందరికీ మేలు చేసిన వారవుతారు.

---

మాధ్యమమని, మోడల్ స్కూల్ అని, ఇప్పుడు కొత్తగా నియోజక వర్గానికి 10 ప్రత్యేక స్కూళ్లని పేర్లు మార్చి పెట్టడం వల్ల, ప్రస్తుతం అమలులోనున్న ప్రభుత్వ విద్య నాణ్యతలేనివిగా ప్రజలు భావించి విద్యార్థులను ప్రస్తుతమున్న ప్రభుత్వ పాఠశాలలకు పంపరు. నూతనంగా ప్రభుత్వం ప్రవేశపెట్టే పాఠశాలలో ప్రస్తుతమున్న ప్రభుత్వ పాఠశాల కన్నా నాణ్యమైన విద్య లభిస్తుందన్న భ్రమతో ప్రవేశాలకై ఎగబడతారు. వాటిలో ప్రవేశం దొరకనివారు ప్రభుత్వ పాఠశాలకు రాకుండా ప్రైవేటు విద్యకై మాత్రమే పరుగులు పెడుతారు. తద్వారా ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థులు తగ్గిపోతారు. దీనిని కారణంగా చూపి ప్రభుత్వాలు మళ్లీ రేషనలైజేషన్ ప్రక్రియను ఉధృతం చేసి, కొత్త ఉపాధ్యాయ నియామకాలకు స్వస్థిపలికి ప్రభుత్వ పాఠశాలలను కనుమరుగు చేస్తారు. కామన్ విద్యావిధానం శాస్త్రీయ విద్య మళ్లీ నినాదంగానే మిగిలిపోతాయి. కనుక ప్రభుత్వ విద్యను పరిరక్షించుకోవడానికి కార్మిక, కర్షక, విద్యార్థి మేధావులు ఐక్యంగా మరో ఉద్యమ రచన చేసి శాస్త్రీయతతో కూడిన కామన్ విద్యను కుల, మత, వర్గ, లింగ, బేదం లేకుండా, ధనిక, పేద వర్గ విభజన లేకుండా, అందరికి సమానంగా అందుబాటులోకి తేవాలి. ప్రజా ఉద్యమాలు మాత్రమే వీటిని సాధించగలవు.

*(రచయిత ప్రభుత్వ ఉపాధ్యాయులు)* వీ

(ఎచ్) గంప గుత్త సూత్రీకరణలు : ఎన్ ఒకే ఊపులో నేను చేసినవి గంపగుత్త సూత్రీకరణలు అని వాదారు. నిజానికి నేను నా స్వంత పరిశోధన, ఇతర పరిశోధకులు అదే అంశాలపై ఇతర ప్రాంతాలలో చేసిన పరిశోధనలు, మార్క్సిస్టు అర్థశాస్త్రవేత్తలు తమ అధ్యయనం ఫలితంగా చేసిన నిర్ధారణల నుంచి నేను సూత్రీకరణలు చేశాను. మరో అర్థంలో వ్యాధి లక్షణాలను మాత్రమే చూడగల్గిన నాకు ఆ వ్యాధి ఏమిటన్నది మార్క్సిస్టు తత్వవేత్తల నిర్ధారణ ద్వారానే కనుక్కునే ప్రయత్నం చేశాను. అతను 'పంట భూమిలో తోటలు పెంచడం పెట్టుబడిదారీ వ్యవసాయ లక్షణం' అని కౌట్స్కీ అన్నాడని అసందర్భంగా ఉటంకించానని ఎత్తిచూపారు. నేను నిర్దిష్టంగా భూమి సరుకుగా మారడం గురించి, అది చేతులు మారుతున్న శక్తులను గుర్తిస్తూ వాళ్లు ఆ భూమిని ఏం చేస్తున్నారనేది గణాంకాలు ఇచ్చాను. ఒకప్పుడు సంప్రదాయ పంటలైన కంది, గోగు, ఉలవలు పండే భూములు విశాల భూఖండాలుగా మారి అవి తోటల రూపంలోకి బదిలీ అయిన వాస్తవాన్ని నమోదు చేశాను. నిజానికి ఈ వాస్తవం ఏ లక్షణానికి / ఉత్పత్తి విధానానికి సంకేతమో కౌట్స్కీ వివరించారు. ఇక ఇందులో అసందర్భం ఏమున్నది. ఒక వేళ నేను కంది పంట పండుతున్న ప్రాంతాన్ని తోటలుగా లెక్కవేసి కౌట్స్కీని ఉదహరిస్తే అది అసందర్భం అవుతుంది. భూమి సరుకుగా మారడం పెట్టుబడిదారీ సంబంధాలను కాక ఏ సంబంధాలను సూచిస్తోందో ఎన్ చెప్పాల్సివుంది. వలసల గురించి, నీటిపారుదల సౌకర్యాల గురించి, యాంత్రీకరణ గురించి, ఎరువుల, పురుగు మందుల గురించి ఇలా రైతు తన ఇన్‌పుట్స్ కోసం మార్కెట్‌కు కట్టివేయబడిన పద్ధతుల గురించి వివరించాను. ఈ లక్షణాలలో ఏ వ్యాధికి కొండగుర్తులో మార్క్సిస్టు తత్త్వవేత్తల రచనల అధ్యయనంలోంచి తెలుసుకున్నాను. భూమి సరుకుగా మారడం గురించి కూడా ఎన్ గంపగుత్త సూత్రీకరణగా చెప్పారు. నిజానికి సృజన ఫిబ్రవరి 82 సంచిక 'బూర్జువా సమాజంలో తల్లీబిడ్డల అనుబంధాన్ని గుడ్డి డబ్బు గుర్తిస్తుందా, ప్రాణము, మానము, సహజవనర్లు, భూమీ అన్నీ వ్యాపార సరుకులే అయిపోయిన పవిత్ర భారతంలో శవాలు మాత్రం ఏం పాపం చేశాయి.' 1982లోనే భూమి సరుకుగా మారిందని సృజన పత్రిక చేసిన ప్రకటనపై ఎన్ ఏం స్పందించారో తెలుసుకోవాలనుంది.

ఇవి 'గంపగుత్త సూత్రీకరణల'ని గంపగుత్త విమర్శ చేయడంలో ఎన్ ప్రకటించిన పద్ధతి చర్చకు ఏమాత్రం ఉపకరించదు. నిజానికి కొంతమంది 'మార్క్సిస్టులు' సూత్రీకరణలేమీ చేయకుండా డాక్యుమెంటరీలాగా రాశాననే విమర్శ చేశారు. ముందుగా ఈ రెండు ధోరణుల వాళ్లు ఒక దగ్గర కూర్చుని మాట్లాడుకుంటే బాగుంటుంది.

అచ్చుతప్పులు – సాంకేతిక అంశాలు : ఎన్ ఒక సంపాదకుడిగా ఈ విషయంలో చాలా విలువైన విషయాలు చెప్పారు. రచనాశైలి గురించి ఆయన విమర్శ మాత్రం సరిగ్గా లేదు. ఈ మూడు పేరాలు కూడా భారతదేశంలో భూ యాజమాన్యంలో వచ్చిన మార్పుల గురించి భూమి శిస్తు ఎలా కారణమయిందో చెప్తాయి. అవి యథాతథంగా రాయడమే కాకుండా దాని నుంచి నిర్ధారణలను కూడా చేశాను. అంతవరకూ దాదాపుగా భూమి తెగల ఆధీనంలోనూ, గ్రామ సమాజపు ఉమ్మడి ఆధీనంలో ఉండేది. అయితే శిస్తు వసూలులో వచ్చే సమస్యలను అధిగమించడానికి బ్రిటిష్ ప్రభుత్వం భూమిపై ప్రయివేట్ ఆస్తి హక్కులను అటు రైత్వారీ ఇటు జమీందారీ పద్ధతులను ప్రవేశపెట్టిందని నిర్ధారణలను ఈ ఉల్లేఖనల నుంచి చేశాను. రచయిత నిర్ధారణల సారాన్ని తెలియజేశాను.

గణాంకాలలో మాయాజాలం : (పట్టిక 19 గురించి) గణాంకాలలో తప్పుల గురించి గ్రామీణ వ్యవసాయ జనాభాకు సంబంధించి నేనిచ్చిన పట్టిక 19 గురించి ఆసక్తికరమైన చర్చ చేయాల్సివుంది. ముఖ్యంగా 'ఈ పొరపాటు గణాంకాన్ని పట్టుకుని పెట్టుబడి విజృంభించిన ఈ దశాబ్దంలో రైతుల తగ్గుదల' అని నిర్ధారించారని చెప్పారని 'సరిగ్గానే' విమర్శించారు. అయితే ఒక రాజకీయ అర్థశాస్త్రవేత్తగా ఎన్ చేయాల్సిందేమిటంటే అసలు ఈ రైతులు, వ్యవసాయ కూలీల లెక్కలను ప్రభుత్వం ఎలా ఇస్తున్నదనే దానిమీద కేంద్రీకరించి ఉంటే బాగుండేది.

నిజానికి ఈ గణాంకాలను చూసి మొత్తం శ్రామికులలో (వర్కర్స్) రైతుల, వ్యవసాయ కూలీల శాతాలుగా నేను భ్రమించాను. అందుకనే 2011 లెక్కల (పుస్తకం అచ్చులోకి వెళ్తున్న ముందు అవి వెలువడ్డాయి)లో నేను రైతుల, వ్యవసాయ కూలీల శాతాలను మొత్తం 'శ్రామికుల'లోంచి శాతాలుగా లెక్కకట్టాను. అందుకని ఆ పొరపాటు వచ్చింది. నిజానికి లెక్క కట్టాల్సిన పద్ధతి ఇది మాత్రమే! ఇలా కట్టినపుడు మాత్రమే రైతాంగం లెక్కలు తెలుస్తాయి. ఈ లెక్కల గారడీని విప్పితే 1971 నుంచి గణాంకాలు–

| సం. | జన సంఖ్య | మొత్తం వ్యవసాయ జనాభా (శాతం) | రైతుల సంఖ్య | వ్యవసాయ కూలీల సంఖ్య | వ్యవసాయదారుల (శాతం) | వ్యవసాయ కూలీల (శాతం) |
|---|---|---|---|---|---|---|
| 1971 | 548 | 70.12 | 78.20 | 47.50 | 43.14 | 25.98 |
| 1981 | 683 | 68.35 | 92.50 | 55.50 | 42.33 | 26.02 |
| 1991 | 846 | 67.31 | 110.70 | 74.60 | 39.85 | 27.15 |
| 2001 | 1028 | 58.40 | 127.30 | 106.80 | 31.71 | 26.69 |
| 2011 | 1210 | 54.60 | 118.69 | 144.32 | 24.60 | 30.00 |

మరో అర్థంలో వ్యవసాయ జనాభాగా ఉన్న 70.12 శాతంలోంచి వ్యవసాయదారులను, కూలీలను లెక్కకడితే రైతాంగం శాతం ఎక్కువగా ఉన్నట్లు కనబడుతుంది. నిజానికి రైతులను, వ్యవసాయకూలీలను లెక్క కట్టాల్సింది దేశపు మొత్తం శ్రామికులలోంచి మాత్రమే! ఈ చిక్కుముడిని ఎన్ విప్పితే రైతాంగ జనాభా ఏ స్థాయిలో తగ్గుతుందో తెలుస్తుంది. దాదాపు 40 ఏండ్లలో 18.54 శాతం మంది రైతులు శ్రామిక జనాభాతో కలిసిపోయారన్నది రుజువైన సత్యం. విశాల ప్రజారాసుల చేతుల్లో పాత ఫ్యూడల్ విధానం గ్యారంటీ చేసిన కొద్దిపాటి ఉపకరణాలను లాక్కొని 'సామూహిక శ్రామిక జనాభాలోకి', తమదైన ఉత్పత్తి విధానంలోకి లాక్కోడమే పెట్టుబడిదారీ విజృంభణ అంటారు. నిజానికి నేను శ్రీకాకుళం జిల్లాకి సంబంధించి ఈ పద్ధతిలోనే గణించాను కాబట్టే అక్కడ కూడా రైతుల శాతం, కూలీల శాతం కలిపి 100 శాతంగా ఏ సంవత్సరంలోనూ లేదని గమనించాలి.

పట్టిక 33 పునరుక్తమయిన మాట వాస్తవం. నిజానికి పట్టిక 42లో

వివరణలలో తప్పులు దొర్లాయి. నిజానికి ఆ పట్టిక సారాంశంకి ఆ తప్పు నిజంగానే తప్పు చేసింది. నిజానికి గిరిజనేతరులకు అన్యాక్రాంతమైన భూమిని కొంచెం తక్కువగా చూపింది. పట్టిక 48 సరిగ్గానే ఉంది. పేజీ 287లో శాతం అంకెలు పట్టికలో ఇవ్వలేదు. కానీ కింద పేరాలో రాశాను. వివరణ కూడా ఇచ్చాను.

ఎన్ వ్యాస మకుటం గురించి : ఈ వ్యాసం 'అవసరమైన సమాచారం – పొసగని నిర్ధారణలు' అనే మకుటంతో వచ్చింది. నిజానికి ఎన్ నా పుస్తకంలో రెండవ భాగం గురించి 'అంతా బాగుంది' అనేట్లు రాశారు. నిజానికి ఆ నాలుగు అధ్యాయాలలో కూడా ప్రజానీకాన్ని పెట్టుబడి తన ఉత్పత్తి విధానంలోకి ఎలా భాగస్వామ్యం చేసుకున్నదీ చర్చించాను. వాళ్లు ఒకప్పటి ఉత్పత్తి విధానంలో ఎలా భాగస్వాములుగా ఉన్నదీ చర్చించాను. అంతిమంగా పెట్టుబడి వాళ్లను విడి / స్వతంత్ర ఉత్పత్తి విధానం నుంచి వేరుచేసి వాళ్లను 'సోషలైజ్డ్ లేబర్'గా మార్చిందీ చెప్పాను. వాటిమీద అసలు చర్చ చేయకపోవడమే విషాదం. దాదాపుగా ఆదివాసీ ప్రాంతాలకే పరిమితమైపోయిన వాళ్లు కూడా ఆదివాసీ ప్రాంతాలను పెట్టుబడి తనలోకి సంలీనం చేసుకున్న పద్ధతులపై దాదాపు ఏకాభిప్రాయం ప్రకటించారు. ఆ విధంగా ఈ మకుటం కనీసం పుస్తకంలోని రెండవ భాగానికి వర్తించదనే అభిప్రాయానికి పాఠకులు వస్తే ఎన్ విభేదించాల్సింది ఏమీ ఉండదు.

ఇక మొదటి భాగం గురించి : అర్థశాస్త్రం ఒక శాస్త్రమనీ, అది ప్రజానీకం జీవితంతో అత్యంత సన్నిహిత సంబంధం కలిగినదిగానూ నేను భావించాను. అంటే ఇక్కడ కూడా ఒక వ్యవస్థ / ఉత్పత్తి విధానం గురించి చర్చించేందుకు వాటిని నిర్వచించాలి. తాము తెచ్చిన అంశాలను, సమాచారాన్ని, అప్పటికే ఆయా అంశాలపై జరిగిన పరిశోధనలను తత్వశాస్త్రవేత్తలు నిర్ధారించిన విషయాలతో బేరీజు వేయాలి. ఈ సమాచారం ఏ సూత్రీకరణలను, ఏ నిర్ధారణలను బలపరుస్తోందో ఆ సూత్రీకరణలను నిర్ధారించాలి. నేను చేసిన పని అదే అనుకుంటున్నాను అయితే ఇక్కడే ఎన్ కి ఒక సౌలభ్యం ఉంది. అతనికి విశాల ప్రాతిపదిక మీద నా సమాచారంతో విభేదం లేదు. పైగా నిజాయితీగా నమోదు చేశాను, నిశితంగా పరిశీలన చేశానని కూడా ఎన్ ప్రశంసించారు. పేచీ అంతా నిర్ధారణలతోనే అయినపుడు అతను నా ప్రతి అధ్యాయంలోని అంశాలను ఉల్లేఖిస్తూ, మార్క్సిస్టు తత్వవేత్తల సూత్రీకరణల వెలుగులో వాటిని పరిశీలిస్తూ, తాను అనుకుంటున్న నిర్ధారణలు చేస్తూ కొంచెం ఎక్కువ పేజీలే రాస్తే పాఠకులకు మేలు చేసిన వారవుతారు.

ఇంత చెప్పిన తర్వాత నాకొక సందేహం వచ్చింది. ఇంతకీ ఎన్ కి నా నిర్ధారణలతో పేచీ ఎక్కడ వచ్చింది? ఈ దేశపు పల్లెలను ఇంకా పెట్టుబడి కబళించలేదని, ఇంకా కబళించాల్సే ఉందని అతను భావిస్తున్నాడా? ఈ దేశపు రైతాంగం ఇంతకు ముందెన్నడూ లేని ఆత్మహత్యల పర్వంలోకి కూరుకుపోవడానికి కబళిస్తున్న పెట్టుబడి కారణమా? లేక గ్రామీణ ప్రాంతాలలో ఉన్న లేదా ధ్వంసం కాని ఫ్యూడల్ / అర్థఫ్యూడల్ సంబంధాలు కారణమా? లేదా ఈ రెండింటి జమిలి బంధం కారణమా? ఒకవేళ అలా అయివుంటే ఏ అంశాలు రైతాంగాన్ని వ్యవసాయం నుంచి, చివరకు భూమి మీదనుంచి తరిమి వేస్తున్నాయో చెప్పాల్సి ఉంటుంది. మరీ ముఖ్యంగా 50 ఏళ్ల కాలంలో 'అర్ధ', అర్ధగానే ఉండిపోయేంత నిశ్చలంగా సమాజం ఉండిపోయిందనడానికి కారణాలు చెప్పాల్సేఉంది.

సాహితీ విమర్శకుడిగా ఎన్ : నేను నా పుస్తకంలో రచయితలను కేరికేచర్ చేసి రాశాననే ఆరోపణ చేశారు. తెలుగు నేలమీద ప్రతి కవితా, కథా, గ్లోబలైజేషన్ నేపథ్యంలో రైతు వెతలనే చిత్రించింది. తండ్రి పాత్రలు భూమి అమ్మవద్దనీ, భూమే తల్లి అని ఘోషిస్తుంటాయి. కొడుకు పాత్రలన్నీ భూమిని అమ్మి ఇతర రంగాలలోకి మారాలని వాదిస్తాయి. దాదాపుగా ఈ కథలన్నీ కొడుకు పాత్రలను విలన్‌లుగా చిత్రించాయి. మానవ సంబంధాలను మంటగలిపే వాళ్లుగా నిరసించాయి. గ్రామ స్వరాజ్యం గంగలో కలిసిందని వాగ్గేయకారులు వాపోయారు. మరి ఒక మార్క్సిస్టు సాహిత్య విమర్శకుడిగా ఈ సాహిత్యాన్ని మీరు ఎలా విశ్లేషించారో తెలుసుకోవాలని ఉంది. కొన్ని వ్యాసాలనైనా సూచిస్తే చదువుతాను. మీరు శ్రామికవర్గ దృష్టికోణంలో చేసిన అలాంటి సాహిత్య వ్యాసాలను ఈ సందర్భంగా ఉటంకించి ఉంటే బాగుండేది. ఇంకా చెప్పాలంటే గ్రామాల నైసర్గిక సౌందర్యం గురించి గ్రామీణ భవంతులలో నివశించే వారి దృష్టికోణం నుంచి కాకుండా 'ఉందర్రా మాలపేట' దృష్టిలోంచి చూడండి. చేనేత వృత్తి అంతర్ధానమైతే దానికి బదులుగా మరో వృత్తిని / ఉపాధిని వెదుక్కోవాలని బి.ఎస్.రాములు సూచిస్తూ సజ్జా వెంకటేశ్వర్లు కవితను దిద్ది 'ప్రవహించేపాట'లో వేశారు. దీనిపై సజ్జా అత్యంత వ్యంగ్యంగా బి.ఎస్.రాములును విమర్శిస్తూ,1996 ఆగస్టు–సెప్టెంబర్ అరుణతారలో ఆగ్రహించారు. వృత్తులను కాపాడాలనే దృష్టిని ప్రదర్శించారు. అప్పుడు మీరెటువైపు నిలబడ్డారో తర్వాత సంచికలలో ఎక్కడా రాలేదు. అయితే అల్లం రాజయ్య రాసిన మధ్యవర్తులు కథను సమీక్షిస్తూ మీరు రాసిన వాక్యాలను ఒక్కసారి గుర్తు చేస్తాను. 'గ్రామం ఏకశిలా సదృశం కాదనీ, గ్రామంలోనూ, పట్టణంలోనూ కూడా దోపిడీ, పీడన సమానంగానే ఉన్నాయని, కాకపోతే పట్నంలో లేని సన్నిహిత (మానవీయ) సంబంధాలు గ్రామంలో ఉండే అవకాశం ఉందని గుర్తించాలి'

ఇలా చెప్తూనే 'సొంత ఆస్తి అనేది మానవుని స్వీయ పరాయీకరణ'? అని మార్క్సుని ఉల్లేఖిస్తూ చెప్పారు. ఈ భావన / సిద్ధాంత ప్రాతిపదికకి భిన్నంగా గ్రామాల్లో సన్నిహిత (మానవీయ) సంబంధాలు ఎలా ఉండగల్గుతాయనేదే నా ప్రశ్న! నిన్నటి వరకూ వరుసలు పెట్టి పిలుచుకున్న వారినే కుల / వర్గ ఘర్షణల్లో శత్రుదేశంపై దాడి చేసి చంపినట్టు చంపిన గుర్తులన్నీ ప్రధానంగా పల్లెటూర్లలోనే అని గుర్తించాలి. 'మడిగట్టు' తగవుల్లో సొంత అన్నదమ్ముళ్ళే హత్య చేసే తీరు సొంత ఆస్తి పరాయీకరణకి నిదర్శనం అని గుర్తించాలి. అందుకనే చారెడు నేలకు రైతును బందీని చేసే 'సొంత ఆస్తి' నినాదాలను మార్క్సిస్టులయిన వాళ్లు వదలిపెట్టాలి.

ఏమైనా తెలుగు నేల మీద సామాజిక అంశాల మీద, శాస్త్రాలమీద చర్చిస్తున్న పత్రిక ఈ పుస్తకాన్ని సమీక్షించడం మాత్రం నాకు ఆనందం కలిగించింది. వీక్షణం సంపాదకుడిగా ఎన్ బాధ్యతల్ని తీసుకున్నందుకు ఎన్ ని అభినందిస్తున్నాను.

*(రచయిత పల్లెను మింగిన పెట్టుబడి పుస్తక రచయిత)* వీ

# వీక్షణం ఎపి రచయితల సమావేశానికి లేఖ

**- వి. హనుమంతరావు**

గుంటూరు వీక్షణం రచయితల సమావేశానికి నమస్కారం. నాకు కలం బలమేగాని గళం బలం లేదు. కాగా ఇంతమంది అధ్యాపకులు, విద్యార్థులు, వారి వారి వృత్తుల్లో నైపుణ్యతను సాధించిన వారి ముందు కేవలం మెట్రిక్ పాసైన నేను ఇటువంటి అభిజ్ఞుల ముందు నిలబడి మాట్లాడడం ఒక దుస్సాహసమే అయనా, టైపింగ్, షార్ట్ హాండ్ నేర్చుకోవడం అది నాకొక దారి చూపించడం వల్ల 63 ఏళ్లపాటు జర్నలిజంలో మునిగితేలడంతో ఆర్థిక విషయాల్లో లోతుగా విశ్లేషణ చేయలేకపోయినా, సామాన్య పాఠకుల స్థాయికి అందుబాటులో ఉంటే స్థాయిలో విశ్లేషణ చేస్తూ గత 63 సంవత్సరాల్లో ఐదు వేల వ్యాసాలు రాయగలిగానంటే నాకు నేనే గుండు తడుముకుంటూ ఆశ్చర్యపోతున్నా. భయం భయంగా 2003లో వీక్షణం పత్రికకు పునాదులు వేశాను. గత 12 సంవత్సరాలు అనుభవమే మీ ముందు నిలబడే ధైర్యాన్నిచ్చింది.

గుంటూరు మేధావుల పట్టణం అంటారు. మేధావులంటే ఒక విషయం గుర్తుకు వస్తోంది 1955 ఎన్నికల సందర్భంలో కమ్యూనిస్టు నాయకుడు ఎస్.ఎ. డాంగేతో వచ్చినపుడు పార్టీ కార్యకర్తలు మేధావుల సభ ఏర్పాటు చేశాం. అక్కడ కూడా మీరు మాట్లాడాలని అడిగితే ఈ పట్టణంలో మేధావులెవరని అడుగగా లాయర్లు, కాలేజీ లెక్చరర్లు, జర్నలిస్టులు, ఇతరులు అని చెప్పగా ఇంగ్లిష్ భాష వచ్చినంత మాత్రాన వారు మేధావులైపోతారా అని ఎదురు ప్రశ్నించారు? ఈ రోజున కూడా అలాంటి అభిప్రాయం చాలా మందిలో ఉంది. జర్నలిస్టుల యూనియన్ నాయకునిగా పలుసార్లు వచ్చాను. కాంగ్రెస్ మహాసభ జరిగినపుడుకూడా వచ్చాను.

వీక్షణం పత్రిక విషయానికి వస్తే 2003లో నేను ఈ పత్రికకు ప్రారంభించినపుడు ఇది ఇంగ్లిష్‌లో ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ ఆఫ్ ఎపిగా వృద్ధి చెందాలని కాంక్షించా. ఆ పత్రిక అంతర్జాతీయంగా గుర్తింపు పొందిన పత్రిక. నువ్వు పగటి కలలు కంటున్నావంటూ జర్నలిస్టు మిత్రులు, ఇతరులు స్నేహ పూరితంగా హెచ్చరించారు. అప్పటికే నాకు 25 సంవత్సరాల జర్నలిస్టుగా అనుభవం ఉంది. డేటా న్యూస్ ఫీచర్స్‌ని స్వతంత్రంగా నడిపించిన అనుభవం (ఉస్మానియా విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ జి. రాంరెడ్డి ఆధ్వర్యాన వివిధ రంగాలలో నిపుణులైన వారితో ఒక సలహా సంఘం ఏర్పాటు చేసుకొని కొంత మంది స్నేహితుల ఆర్థిక సహకారంతో డిఎన్ఎఫ్ ప్రారంభించా.

వీక్షణం పత్రికకు కూడా సంపాదక వర్గ సలహామండలిని ఏర్పాటు చేసుకున్నా. ఆ ప్రయత్నం విజయవంతం కాలేదు. కింద పడుతూ లేస్తూ, కొత్తలో ప్రముఖుల వ్యాసాల కోసం వాళ్ల ఇల్లకు వెళితే మళ్లారమ్మనడం జరుగుతూ వచ్చింది. ఈ పత్రిక ఎన్నాళ్లు నడుస్తుందో, ఎంత మంది తమ వ్యాసాలు చదువుతారు. తాము రాయడానికి ఈ సర్క్యులేషన్ ఏపాటిది అని వాళ్ల అభిప్రాయం కావచ్చు. అయినా దిన పత్రికల్లో నా వ్యాసాలు ప్రచురితం అవుతుండడం చూసిన వారు కావడంతో నా కోర్కెను కాదనలేకపోయారు. ఆ క్రమంలో వేణు ఆక్టివ్ పాత్ర తీసుకోవడం ప్రారంభించాడు. ఆర్థిక విషయాల్లో పాండిత్యం ఉండడంతో ఆ రంగంలోని పరిణామాల మీద వ్యాసాలు, వ్యాఖ్యానాలు ప్రచురితమవుతూ వచ్చాయి. ఆ మేరకు సర్క్యులేషన్ పెరుగుతూ వచ్చింది.

ఈ నేపథ్యంలో కొత్త ఆలోచన వచ్చి సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్ రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ అనే సంస్థకు పునాదులు పడ్డాయి. పబ్లికేషన్ రంగంలో అడుగుపెట్టి యాభై ఏళ్ల ఆంధ్రప్రదేశ్ అనే 570 పేజీల గ్రంథాన్ని వెలువరించాం. అపుడే పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షలు రాబోతుండడంతో ఆంధ్రప్రదేశ్ గురించి సమగ్ర సమాచారం లభించే ఈ గ్రంథాన్ని విద్యార్థులు తీసుకుంటుండడంతో తక్కువ ఖరీదుతో రెండు ముద్రణలు వేయగా వందల కాపీలు అమ్ముడయ్యాయి.

అమెరికా ప్రభుత్వం చిన్న రాజ్యాలను కుట్రపూరితంగా దేశాల అధిపతులను చంపడం, ఆర్థిక వ్యవస్థలను విచ్ఛిన్నం చేయడంలో కీలకపాత్ర వహించిన ఎనిమిది ఎడిషన్లు వేయాల్సివచ్చిందంటే అమెరికా పట్ల తెలుగు ప్రజల ఏహ్య బావానిక నిదర్శనం. వీక్షణం కొన్ని ఇతర ప్రచురణలను కూడా తీసుకొని రావడంతో ఇతర ప్రచురణ కర్తలు కొంతమంది వీక్షణం అభిప్రాయాలతో ఏకీభవించే ప్రచురణలను అమ్మి పెట్టమని అడిగిన వారికి వీక్షణం పత్రికలో ప్రచురణ స్థానం కల్పించింది.

కొన్ని దినపత్రికలు యాజమాన్యాల ఆలోచనల, లాభాల వేటలో ప్రభుత్వాలు తీసుకొనే నిర్ణయాల ప్రజావ్యతిరేక ప్రతికూల పరిణామాలను ప్రచురించక పోవడమో, లేదా ఒక చిన్న వార్తగా ప్రచురించడమో జరుగుతుంటుంది. ఆ దుష్పరిణామాల మూలంగా ప్రజలు ఆ దుష్పరిణామాల మూలంగా ఇబ్బందుల్లో పడతారు అలాంటి సందర్భాల్లో వీక్షణం ప్రజల పక్షాన నిలబడుతుంది. ప్రభుత్వ నిర్ణయాల వల్ల ఏర్పడే దుష్పరిణామాలను, ఆ నిర్ణయాల వెనుక ఉన్న కథా కమామిషును నిర్భయంగా ఎండగడుతూ వచ్చే వ్యాసాలను స్థానం కల్పిస్తుంది. రాష్ట్రంలో, దేశంలో, ప్రపంచంలో జరుగుతున్న అనేక సంఘనలు, పరిణామాలు జరుగుతుంటాయి. వీటి మీద వ్యాఖ్యానించడానికి ఒక్క సంపాదకీయం చాలదు. వాటిలో అతి ముఖ్యమైన పరిణామాల మీద సంపాదకీయ వ్యాఖ్యలకు స్థానం కల్పించుకొంది. కొత్త రచయితలను తీర్చిదిద్దింది. ప్రతీ సంచికలో కొత్తరచయితల పేర్లు కనబడుతున్నాయంటే ఈ ప్రోత్సాహమే కారణం.

రైతు ఆత్మహత్యలు, అత్యాచారాలు నిత్య వార్తలైపోయాయి. ప్రభుత్వం స్పందించదు కాని వీక్షణం స్పదిస్తుంది. ఉదాహరణకు కార్పొరేట్ సంస్థలు బ్యాంకుల నుంచి రుణం తీసుకొని చెల్లించకుండా సంవత్సరాల పాటు ఎగవేస్తున్నారు. రైతులు తీసుకుంటున్న రుణాలు అనేక కారణాల వల్ల చెల్లించలేక ఆత్మహత్యలకు పాల్పడుతుంటే, ప్రభుత్వరంగ బ్యాంకులు కూడా అటువంటి ఎగ్గొట్టే వారి మీద ఎందుకు చర్యలు తీసుకోదు?

# ఆంధ్రప్రదేశ్‌లో వీక్షణం రచయితల సమావేశం

వీక్షణం నిర్వాహకులు రచయితలతో, పాఠకులతో, అభిమానులతో కలిసి కూచుని పత్రిక బాగోగులు చర్చించుకునే, సలహాలూ సూచనలూ స్వీకరించే విలక్షణమైన పద్ధతిని వీక్షణం గత తొమ్మిది సంవత్సరాలుగా నిరంతరాయంగా నిర్వహిస్తున్నది. ఉమ్మడి రాష్ట్రంలో ఈ వార్షిక సమావేశం హైదరాబాదులో జరుగుతుండేది. రాష్ట్ర విభజన జరిగి రెండు తెలుగు రాష్ట్రాలు ఏర్పడిన తర్వాత, తెలుగు సమాజం తనతో తాను జరుపుకునే సంభాషణకు వేదికగా, తెలుగు ప్రజలందరి రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికగా వీక్షణం తన రచయితల సమావేశాలను రెండు రాష్ట్రాలలోను విడివిడిగా జరపడం ఉచితమని భావించింది. ఈ సంవత్సరానికి గాను తెలంగాణ రచయితల సమావేశం మార్చ్ 8 న హైదరాబాదులో జరగగా, ఆంధ్రప్రదేశ్ రచయితల సమావేశం గుంటూరులో ఆగస్ట్ 9న జరగవలసి ఉండి, అనివార్య కారణాల వల్ల వాయిదా పడి సెప్టెంబర్ 6న జరిగింది. రాష్ట్రంలోని 13 జిల్లాలలో 8 జిల్లాల నుంచి దాదాపు యాభై మంది వీక్షణం రచయితలు, పాఠకులు, అభిమానులు పాల్గొన్న ఈ సమావేశం చాల ఆసక్తిదాయకంగా, ఆలోచనాస్ఫోరకంగా జరిగింది. హాజరైనవారిలో దాదాపు పది మంది రచయితలతో పాటు, ఏడెనిమిది మంది ఆర్ టి సి కార్మికులు ఉండడం విశేషం.

సహాయ సంపాదకుడు వై రామచంద్రం సమావేశానికి హాజరైనవారిని ఆహ్వానిస్తూ, సమావేశ ఉద్దేశాన్ని వివరిస్తూ, సమావేశంలో పాల్గొనాలని ఎంతగానో అకాంక్షించి, ఆరోగ్యకారణాల వల్ల రాలేకపోయిన వ్యవస్థాపక సంపాదకులు వి హనుమంతరావు పంపించిన సందేశాన్ని చదివి వినిపించారు.

అధ్యక్షత వహించిన పి వి రమణ (విశాఖపట్నం) సమావేశాన్ని ప్రారంభిస్తూ తెలుగులో వీక్షణం వంటి ప్రజాపక్షపాతం ఉన్న, విలువైన సమాచారం, విశ్లేషణ అందిస్తున్న పత్రిక మరొకటి లేదని, అందువల్ల దీన్ని మరింత మెరుగు పరచడానికి సలహాలూ సూచనలూ ఇవ్వడం, ఇది చిరకాలం సమర్థంగా నడవడానికి అవసరమైన వనరులు సమకూర్చడం ప్రగతిశీలంగా ఆలోచించే తెలుగు ప్రజలందరి బాధ్యత అని అన్నారు. వీక్షణం కలెక్టివ్ తరఫున మాట్లాడుతూ ఎ నరసింహారెడ్డి వీక్షణం సాగిస్తున్న కృషిని వివరించి, కొత్త ఆంధ్రప్రదేశ్ మేధావులు, ప్రజా ఉద్యమాల కార్యకర్తలు వీక్షణం కృషిలో పాలు పంచుకోవాలని ఆహ్వానించారు.

వీక్షణం ప్రారంభమైన నాటినుంచి సాగివచ్చిన చరిత్రను, జయాపజయాలను వివరిస్తూ సంపాదకుడు రచయితల సమావేశం నిర్వహణ, వ్యాసరచనా తరగతి ద్వారా వ్యాస రచనకు ప్రోత్సాహం, పుస్తక ప్రచురణ, ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలపై ఎప్పటికప్పుడు వ్యాసాల ప్రచురణ, క్రమం తప్పకుండా వెలువడడం, అసహజ మరణాల సూచి, అనువాదాలు, చర్చలు, ఉత్తరాలు వంటి ఏడెనిమిది రంగాలలో వీక్షణం చెప్పుకోదగిన విజయం సాధించిందని అన్నారు. కొన్ని ముఖ్యమైన విషయాల మీద తగిన సమయంలో వ్యాసాలు ప్రచురించలేకపోవడం, మహిళల రచనలు తగినన్ని లేకపోవడం, కార్మికవర్గ సమస్యల మీద వ్యాసాలు తక్కువగా ఉండడం, పుస్తక సమీక్షలు లేకపోవడం వంటి రచనాసమస్యలతో పాటు ఆర్థిక సమస్యలు, పంపిణీ సమస్యలు కూడ వీక్షణం అధిగమించవలసి ఉన్నదని అన్నారు. ప్రధాన స్రవంతి పత్రికలలో పూర్తిగా విస్మరణకు గురయ్యే అంశాల మీద, ప్రధాన స్రవంతిలో చోటు దొరికినప్పటికీ ప్రజల కోణం బైటికి రాని అంశాల మీద, ఏ విషయంలోనైనా సరైన వైఖరి తీసుకోవడానికి అవసరమైన దృక్పథం మీద వ్యాసాలు వేయడం వీక్షణం తన బాధ్యత అనుకుంటున్నదని, ఈ మూడు రంగాలలో వీలయినంత వైవిధ్యాన్ని, విశాలత్వాన్ని, బహుళత్వాన్ని ప్రోత్సహిస్తామని అన్నారు. ప్రజల, అభిమానుల, పాఠకుల, రచయితల ఆదరాభిమానాలతోనే పదమూడు సంవత్సరాలకు పైగా పత్రిక నిరంతరాయంగా వెలువడుతున్నదని, ప్రజల పత్రికగా దీన్ని కొనసాగించడంలో తమ శక్తివంచన లేకుండా కృషి చేస్తామని అన్నారు.

ఆ తర్వాత దాదాపు ఇరవై మంది తమ అభిప్రాయాలు, సూచనలు, సలహాలు తెలియజేశారు. వాటిలో కొన్ని:

**సి. పటేల్ (గుంటూరు) :** ఇంతకాలంగా స్థిరంగా, ప్రమాణాలతో పత్రిక వెలువరిస్తున్నందుకు అభినందనలు. కొన్ని వ్యాసాలు క్లిష్టంగా ఉంటున్నాయి. ఇంకా సరళం చేయాలి.

**పోలేశ్వర రావు (తెనాలి) :** వీక్షణంలో వచ్చే వ్యాసాలు మనబోటివాళ్లకు సమంజసంగానే ఉంటాయి కాని ప్రజలందరికీ సమంజసంగా ఉండేట్టు రాయాలి. తెలంగాణ పత్రిక అనిపించేట్టు

---

కొత్త కేంద్ర ప్రభుత్వ ఆర్థిక శాఖ మంత్రి బ్యాంకు అధికారులతో డజను సమావేశాలు జరిపారు కాని సమస్య ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే ఉన్నట్టుంది. అంతేకాక వారికి పరోక్షంగా గత ఆరేడు సంవత్సరాలుగా పరోక్షంగా సంవత్సరానికి ఐదున్నర కోట్లు సబ్సిడీనిస్తోంది. ఈ విషయాం మీద వీక్షణం పలు వ్యాసాలు ప్రచురించి ప్రభుత్వ రెండు నాలక్కల దోరణిని ఎండగట్టింది. ఇదొక ఉదాహరణ మాత్రమే.

వివాదస్పద వ్యాసాల ప్రచురణ జరుగుతుంది. సంపాదకుడు వేణు వ్యాసాన్ని విమర్శిస్తూ వచ్చిన వ్యాసాన్ని తాజా సంచికలో ప్రచురించి ప్రచురించిన వ్యాసాల మీద క్రిటికల్ లేఖను ప్రచురించి విషయం మీద చర్చకు దోహదం చేస్తుంది. వయో భారంతో పత్రిక సంపాదక, ఆర్థిక బాధ్యతను వేణు చేతుల్లో పెట్టాను. గుంటూరు జిల్లా ధనవంతుల జిల్లా. ఈ పత్రిక మీది వేణు బరువు భాధ్యతలను మీరు మీ శక్తి మేరకు పంచుకోండి. నమస్కారం.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

వ్యాసాలు వేశారు. వ్యాసాలు ఇంకా ఎక్కువ కార్మికవర్గ దృక్పథంతో ఉండాలి. కనీసం ఒక కథకూ, గేయాలకూ అవకాశం ఇవ్వాలి.

**హజరత్ అలీ (వేమూరు) :** పత్రిక పుట్టినప్పటినుంచీ చదువుతున్నాను. ఆర్థిక రంగానికి సంబంధించిన వ్యాసాలు కష్టంగా ఉంటున్నాయి గాని అవి అందరికీ అందవలసిన పాఠాలు. ఒకటికి రెండు సార్లు చదువుతాను. వీక్షణం అందరికీ చేరడానికి మరింత ప్రచారం చేయాలి. కాలేజీల్లో వీక్షణం పరిచయ సభలు ఏర్పాటు చేయాలి.

**చిమ్మె జాన్ బర్నబాస్ (కర్నూలు):** అన్ని అభిప్రాయాలను ప్రతిబింబించే, ఏ రంగం వారికైనా అవగాహన ఇచ్చే ఇటువంటి పత్రిక మరొకటి లేదు. ఆంధ్రప్రదేశ్ లో వీక్షణం సర్క్యులేషన్ ఎట్లా పెంచాలని, ఎక్కువ చందాలు, విరాళాలు ఎలా సేకరించాలని మనం ఆలోచించాలి.

**డా. ఇమ్మానేని సత్యసుందరం (మచిలీపట్నం) :** వీక్షణంను విద్యారంగానికి అనువుగా, పాఠ్యాంశాల మీద అవగాహన ఇచ్చేలా మార్చాలి. బాలెన్స్‌డ్ గా ఉండేలా దృక్పథం మార్చుకోవాలి.

**ఎన్.వి.ఎస్. నాగభూషణ్ (పాలకొల్లు) :** సమకాలీన రాజకీయాల్లో నూతన దృక్పథం ఇస్తున్న పత్రిక వీక్షణం. ఈ పత్రికను అభివృద్ధి చేయడం, ఎక్కువమందికి చేరేలా చేయడం మనందరి బాధ్యత. ఇది విడివిడి రాజకీయ బృందాలకు అతీతమైన పత్రిక. ఆయా బృందాల పత్రికలు తమ పరిమితుల్లో రాస్తున్నాయి గనుక వీక్షణంను కాపాడుకునే బాధ్యతను అన్ని రాజకీయ బృందాలు తీసుకోవాలి. పుస్తక సమీక్షలకు అవకాశం ఇవ్వాలి. విమర్శలలో పరుషమైన, అమర్యాదకరమైన భాషను రచయితలు రాసినప్పటికీ ఎడిట్ చేయాలి. ఇటీవల ఒక రచనలో మార్క్స్ గురించి 'గెడ్డపాడు' అని ఒక రచయిత రాశారు.

**వై.ఎచ్.కె. మోహన్‌రావు (పిడుగురాళ్ల) :** లోతైన అవసరమైన విషయాలు అందిస్తున్న పత్రిక. కాని ఆ విషయం చదువరులకు తెలియాలి. గ్రంథాలయాల చందాలు ప్రయత్నిస్తే ఎక్కువమంది చదువరులకు పత్రిక గురించి తెలుస్తుంది. అప్పుడు చందాలు పెరుగుతాయి. ప్రతి చందాదారు కూడ తన ప్రతిని తాను చదివిన తర్వాత మరొకరికి ఇవ్వాలి. అలా కూడ చందాలు పెరుగుతాయి.

**షేక్ కరిముల్లా (చిలకలూరి పేట) :** వీక్షణంను పదమూడేళ్లుగా చదువు తున్నాను. రెండేళ్లుగా రాస్తున్నాను. వీక్షణం చదవడం, వీక్షణంకు రాయడం సామాజిక బాధ్యత అనుకుంటున్నాను. ఇది ప్రజలకు ఉపయోగపడే, చైతన్యపరిచే పత్రిక. నిజాలు చెప్పే పత్రిక. రచయితలుగా మనకు కూడ ప్రజల సమస్యలు తెలుసుకోవాలనే, రాయాలనే తపన ఉండాలి. ఇటీవల ప్రచురించిన ఒక రచన ఒక బాధిత సమూహాన్ని అవమానించేలా, అన్యాయంగా ఉంది. అది వీక్షణంలో రావలసింది కాదు.

**జి. శ్రీనివాస్ (రావులపాలెం) :** మా స్థాయిలో మేం పత్రికను ఆర్ టి సి కార్మికులకు చేరుస్తున్నాం. వీక్షణం మాకొక రిఫరెన్స్ బుక్. మా కార్మిక కార్యకలాపాల్లో వీక్షణం రచనలు ఎంతగానో ఉపయోగ పడుతున్నాయి. కాని దీన్ని ప్రజలకు మరింత చేరువ చేయడం ఎలా అని మనం ఆలోచించాలి. వీక్షణంకు రాయమని మమ్మల్ని అడుగుతూనే ఉన్నారు గాని వీక్షణం స్థాయి పెద్దదనే ఏదో న్యూనతాభావం మమ్మల్ని ఆపుతోంది.

**ఇ.ఎస్. బ్రహ్మచారి (ఒంగోలు) :** మిత్రులు ప్రస్తావించిన రచన అభ్యంతరకరమైనదే. కాని ప్రచురించకుండా ఉండాలనడం సరికాదు. అలాగే రచనలు ఎడిట్ చేయడానికి, సవరణలు చేయడానికి కూడ చాల మంది రచయితలు అంగీకరించడం లేదు. నా రచనలను ప్రచురణకు సిద్ధం చేయడంలో సంపాదకవర్గం ఎంత కృషి చేసిందో నాకు తెలుసు. కాని అది అన్ని సందర్భాల్లోనూ సాధ్యం కాదు.

**సి ఎచ్ వెంకటేశ్వర్లు (గుంటూరు) :** 'మార్క్సిజానికి కాలం చెల్లింది, ప్రత్యామ్నాయం లేదు – దేర్ ఈజ్ నో ఆల్టర్నేటివ్ – టీనా' అనే భావజాలం వ్యాపిస్తున్నప్పుడు వీక్షణం పుట్టింది. అది ఒక ప్రత్యామ్నాయ ఆలోచనల వికాస క్రమం. అందువల్ల దీన్ని కాపాడుకోవడం చాల అవసరం. అయితే దీన్ని ప్రజలలోకి ఏ మేరకు తీసుకు వెళ్లగలుగుతున్నాం, ఎవరికి చేరాలో వారికి చేరుతోందా, ప్రజల భాషలోనే రాస్తున్నామా ఆలోచించుకోవాలి. నిర్వాహకులు వీక్షణం మీద ఇటువంటి సమీక్షా సమావేశాలు బహిరంగంగా పెట్టాలి. వర్గరాజకీయాలకు భిన్నమైన ఆలోచనలను ప్రచురించ వద్దని కాదు గాని, అప్పుడు నిర్వాహకులు అక్కడికక్కడే దాని మీద వివరణ ఇవ్వాలి.

వై ఎస్ కె మురళి (రామచంద్రాపురం): వీక్షణం ప్రత్యేకత సమాజంలో జరుగుతున్న అన్యాయాలను చెపుతూ మార్పు అవసరాన్ని చెప్పడం. ప్రత్యామ్నాయాలు చూపే రచనలు కూడ ఎక్కువగా రావాలి.

**ఉపేంద్ర (విజయవాడ) :** గతంలో హైదరాబాదులో జరిగిన సమావేశానికి హాజరై ఎడిటోరియల్ కలెక్టివ్ ఉండాలని సూచన ఇచ్చాను. సంపాదక బాధ్యతల నిర్వహణ సమష్టిగా జరగడం సంతోషం. వీక్షణంలో తప్పనిసరిగా పుస్తక సమీక్షలు ఉండాలి. అలాగే ప్రజాబాహుళ్యంలో ఉన్న సంస్కృతి మీద ఉదాహరణకు సినిమాల మీద, క్రీడల మీద ప్రగతిశీల దృక్పథం నుంచి సమీక్షలు ఉండాలి. ఆ నెలలో రానున్న ముఖ్యమైన ఘటనల గురించి వ్యాసాలు ఉండాలి. సంపాదకుడు ప్రస్తావించిన పంపిణీ సమస్యలను అధిగమించడానికి రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న మిత్రుల ద్వారా పంపిణీ చేపట్టాలి. అమ్మకాల వసూళ్లకు రాష్ట్రమంతటా తిరిగే ఉద్యోగిని నియమించుకోవాలి.

**కె.ఎస్. ప్రకాశరావు (కాకినాడ) :** ఆర్‌టిసి కార్మికులుగా మేం పనిచేస్తున్న నిర్బంధ, నిరాశామయ పరిస్థితులలో మాకు ఎప్పటికప్పుడు భరోసా నిస్తున్నది వీక్షణం. మాకూ రచనలు చేయాలనే ఆసక్తి ఉంది గాని కాస్త బెరుకు ఉంది. కార్మికవర్గం నుంచి, కార్మికవర్గం గురించి రచనలు పెంచాలి.

**సూర్యనారాయణ (పార్వతీపురం) :** వీక్షణం చందాదారులలో, అభిమానులలో శక్తి ఉన్నవారిని ఇతరులకు కానుకగా చందాలు చెల్లించమని కోరాలి. అలా చందాలు పెరుగుతాయి. ప్రస్తుత పాఠకుల బాధ్యత వ్యక్తమవుతుంది.

**రాధ (విజయవాడ) :** సమయానికి వెలువడడం వీక్షణం ప్రత్యేకత. జాతీయ, అంతర్జాతీయ, ప్రాంతీయ అంశాలు మరిన్ని రావాలి. కొన్ని అంశాల మీద వ్యాసాలు ఉండడం లేదు. మహిళల రచనలు, మహిళా సమస్యల గురించి రచనలు పెరగాలి.

సభికులు వెలిబుచ్చిన అభిప్రాయాలలో కొన్నిటికి సంపాదకుడు వివరణలు ఇవ్వడంతో సమావేశం ముగిసింది. వీ

## చలసాని ప్రసాద్ సంస్మరణ సభ

విప్లవ రచయితల సంఘం ఆధ్వర్యంలో చలసాని ప్రసాద్ సంస్మరణ సభ హైదరాబాద్‌లోని బాగ్‌లింగంపల్లి సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సెప్టెంబర్ 6న నిర్వహించారు. చలసాని ప్రసాద్ రాజకీయ జీవితం-ఉద్యమ ఆచరణ అనే అంశం పై విరసం సభ్యులు వరవరరావు మాట్లాడారు. చలసాని ప్రసాద్ సాహిత్య కృషి-సాంస్కృతిక వ్యక్తిత్వం అనే అంశంపై పాత్రికేయులు సతీష్‌చందర్ మాట్లాడారు. ఈ సభలో అరుణతార చలసాని జ్ఞాపకాల ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. ఈ సభకు తెలుగు రాష్ట్రాల కవులు, రచయితలు, విప్లవాభిమానులు, చలసాని స్నేహితులు హాజరయ్యారు.

## నూతన ఎక్సైజ్ పాలసీకి నిరసనగా ధర్నా

బెల్టు షాపులన్నింటినీ ఎత్తివేయాలని, మద్యాన్ని నియంత్రించాలని మహిళా సంఘాల ఐక్యకార్యాచరణ కమిటీ ఆధ్వర్యంలో సెప్టెంబర్ 22న హైదరాబాద్‌లోని ఎక్సైజ్ కార్యాలయం ముందు ధర్నా నిర్వహించారు. మహిళా సంఘాల ప్రతినిధులు గుడులు, బడులు, ప్రజలు ఎక్కువగా ఉన్న ప్రాంతాలలో మద్యం షాపులను ఎత్తివేయాలని డిమాండ్ చేశారు. సెలవు దినాల్లో మద్యం షాపులు బంద్ చేయాలని, జాతీయ రహదారుల వెంట మద్యం షాపులను రద్దు చేయాలని డిమాండ్ చేశారు. బెల్టు షాపులను ఎత్తివేయకపోతే ఉద్యమాన్ని ఉధ్రుతం చేస్తామన్నారు. జనాభా ప్రాతిపదికన మద్యం షాపులను ఏర్పాటు చేయడమంటే మద్యం వ్యసనాన్ని ప్రభుత్వం ప్రోత్సహించడమేనన్నారు.

## పంట రుణాల కోసం రైతుల ధర్నా

పంట రుణాలు అందకపోవడంతో ఆదిలాబాద్ జిల్లా బెజ్జూరు మండల కేంద్రంలోని తహసీల్దార్ కార్యాలయం ఎదుట పలు గ్రామాల రైతులు సెప్టెంబర్ 4న ధర్నా నిర్వహించారు. ఖరీఫ్ సీజన్ ముగుస్తున్నా బ్యాంకు అధికారులు కొత్త రుణాలను మంజూరు చేయలేదని అవేదన వ్యక్తం చేశారు. సరైన సమయంలో రుణం అందకపోవడంతో వడ్డీ వ్యాపారులను ఆశ్రయించాల్సి వస్తోందని అన్నారు.

## పోలీసు కాల్పుల్లో ఇద్దరు మావోయిస్టుల మృతి

వరంగల్ జిల్లా తాడ్వాయి అడవుల్లో సెప్టెంబర్ 15న జరిగిన ఎన్‌కౌంటర్‌లో శృతి అలియాస్ మహిత, విద్యాసాగర్‌రెడ్డి అలియాస్ సాగర్ మృతిచెందారని పోలీసులు తెలిపారు. ఈ ఎన్‌కౌంటర్‌పై పలు ప్రజా సంఘాల ప్రతినిధులు, హక్కుల సంఘాల ప్రతినిధులు అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు. మహిత, సాగర్‌ల మృతదేహాలపై ఆసిడ్‌పోసి, చిత్రహింసలకు గురిచేసి అమానుశంగా హత్యచేశారని హక్కుల సంఘాలు ఆందోళన వ్యక్తం చేస్తున్నాయి. ఈ ఎన్‌కౌంటర్‌పై న్యాయవిచారణ జరిపించాలని డిమాండ్ చేశాయి.

## బీల భూముల్లో పారిశ్రామిక మండలి

శ్రీకాకుళం జిల్లా సోంపేట మండలంలో థర్మల్ విద్యుత్ కేంద్రం ఏర్పాటును ఏపి ప్రభుత్వం రద్దు చేసింది. గతంలో జారీ చేసిన జి.ఓ 1107ని రద్దుచేస్తూ రెవెన్యూ అధికారి జె.సి. శర్మ సెప్టెంబర్ 9న మరో జి.ఓ 329ని జారీచేశారు. థర్మల్ విద్యుత్ కేంద్రానికి కేటాయించిన స్థలంలో ఇప్పుడు బహుళ ఉత్పత్తుల పారిశ్రామిక మండలి (మల్టీ ప్రొడక్ట్ ఇండస్ట్రీయల్ జోన్) ఏర్పాటుకు నాగార్జున కన్‌స్ట్రక్షన్ కంపెనీ లిమిటెడ్‌కు అవకాశం కల్పించారు. వచ్చే మూడేళ్లలో పారిశ్రామిక మండలి ఏర్పాటు పూర్తికావాలని షరతు విధించారు. దీనికి సంబంధించి ఏటా మార్చి 31 లోపు జిల్లా కలెక్టర్‌కు నివేదిక అందించాలని నిర్దేశించారు.

## ఆశా కార్యకర్తల కలెక్టరేట్ల ముట్టడి

ఆశా వర్కర్లు కనీస వేతనాలు ఇవ్వాలని, అర్హులైన వారిని రెండో ఎఎన్ఎంగా తీసుకోవాలని, ఉద్యోగ భద్రత కల్పించాలని డిమాండ్ చేస్తూ 22 రోజులుగా తెలంగాణ వ్యాప్తంగా సమ్మె చేస్తున్నారు. సెప్టెంబర్ 23న కరీంనగర్, నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లా కలెక్టరేట్ల ముట్టడి, ధర్నాలకు ప్రయత్నించడంతో పోలీసులు వీరిని అదుపు చేయడానికి ప్రయత్నించడంతో తోపులాట జరిగింది. నల్గొండలో మహిళలపై మగ పోలీసులు దాడి చేయడంతో ఇద్దరు మహిళలు స్పృహ కోల్పోయారు. 20 మంది గాయపడ్డారు. కలెక్టరేట్ వద్దకు పెద్దఎత్తున ఆశా కార్యకర్తలు చేరుకొని ధర్నాకు సిద్దమయ్యారు. వీరిని పోలీసులు చెదరగొట్టడంతో కలెక్టరేట్ ద్వారం వద్ద బైటాయించి ఆందోళనకు దిగారు. మహబూబ్‌నగర్‌లో కలెక్టరేట్ రెండు గేట్లను ముట్టడించారు. కరీంనగర్‌లో జరిగిన ధర్నాలో కొద్ది మంది అస్వస్థతకు లోనయ్యారు.

## 20 ఏళ్ల చైతన్య మహిళా సంఘం ప్రస్థానం

చైతన్య మహిళా సంఘం తన 20 ఏళ్ల ఉద్యమ ప్రస్థానం సందర్భంగా సెప్టెంబర్ 24న హైదరాబాద్‌లోని బాగ్‌లింగంపల్లి వద్ద గల సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో బహిరంగ సభ నిర్వహించింది. ఈ సభలో నాగ్‌పూర్ యూనివర్సిటీ ప్రొఫెసర్ సోమాసేన్ స్త్రీ విముక్తి పోరాటాలు ముందుకు సాగాలని, సమసమాజ స్థాపన కోసం ప్రతి ఒక్కరు ముందుకు రావాలని పిలుపునిచ్చారు. సుదర్శన్ మాట్లాడుతూ ప్రజలకు మేలుచేసే నూతన ప్రజాస్వామిక విప్లవం వచ్చేదాక పోరాడాలన్నది శృతి కోరికన్నారు. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన జయ పాలకులు ప్రవేశపెడుతున్న మహిళా వ్యతిరేక విధానాలను అడ్డుకోవాలన్నారు. మహిళామార్గం-25 సంవత్సరాల సంపాదకీయాలు, చైతన్య మహిళా సంఘం-20 సంవత్సరాల ఉద్యమ ప్రస్థానం డాక్యుమెంటరీలను ఆవిష్కరించారు. ఈ సభకు రెండు తెలుగు రాష్ట్రాల నుండి మహిళా సంఘం కార్యకర్తలు అభిమానులు పాల్గొన్నారు.

## మృత్యువులోకి నెట్టిన కల్తీ కల్లు

కల్తీ కల్లుకు అలవాటు పడి అది దొరకక అస్వస్థతకు గురై తెలంగాణలోని జిల్లాల్లో పదుల కొద్ది జనం చనిపోతున్నారు. ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. వందల మంది ఆస్పత్రుల్లో అస్వస్థతకు గురై చికిత్స పొందుతున్నారు.

## భూసేకరణపై రైతుల ఆగ్రహం

బందరు పోర్టుతో పాటు అనుబంధ పరిశ్రమలకు ప్రభుత్వం విడుదల చేసిన భూసేకరణ నోటిఫికేషన్‌పై రైతులు సెప్టెంబర్ 7న ధర్నా నిర్వహించారు. బందరు మండలం కోన, పోలాటితిప్ప, కరగ్రహారం, బుద్దాలపాలెం, పోతేపల్లి, మేకవానిపాలెం, పెడన మండలం కాకర్లమూడి గ్రామాలపై రైతులు వైసిపి, సిపిఐ, కాంగ్రెస్, సిపిఐ (ఎంఎల్), వివిధ ప్రజాసంఘాల ఆధ్వర్యంలో ధర్నా చేశారు. 31,800 ఎకరాల భూసేకరణకు ప్రభుత్వం విడుదల చేసిన నోటిఫికేషన్‌ను వ్యతిరేకిస్తూ ఆందోళన బాట చేపట్టారు.

## కేశవరెడ్డి కుంభకోణం

కేశవరెడ్డి విద్యాసంస్థల కరస్పాండెంట్ డిపాజిట్‌దారుల నుంచి దాదాపు నాలుగు వందల కోట్ల రూపాయలకు పైగా వసూలు చేసి ఎగవేశారు. ఆర్నెల్ల క్రితమే కరస్పాండెంట్ కేశవరెడ్డి అజ్ఞాతంలోకి వెళ్లి పోయారు. దీంతో డిపాజిట్‌దారులు ఆందోళనలు చేశారు. దశాబ్దకాలం క్రితం కేశవరెడ్డి కర్నూల జిల్లాలో తొలి బ్రాంచిని నెలకొల్పారు. వీ

### రిజర్వేషన్ల కోసం పటేల్‌ల పోరాటం

గుజరాత్‌లోని పాటిదార్ అనమత్ ఆందోళన్ సమితి (పాస్) ప్రభుత్వ విద్య, ఉద్యోగాల్లో పటేల్ కులస్తులకు రిజర్వేషన్ కావాలని ఉద్యమిస్తోంది. పాస్ కన్వీనర్ హార్దిక్ పటేల్ అరెస్టుకు నిరసనగా ఆగస్టు 26న రాష్ట్ర వ్యాప్త బంద్‌కు పిలుపునిచ్చింది. బంద్ సందర్భంగా వివిధ ప్రాంతాల్లో ఆందోళనకారులపై పోలీసులు జరిపిన కాల్పుల్లో ఆరుగురు మృతిచెందారు. 50 బస్సులకు ఆందోళన కారులు నిప్పు పెట్టారు. రైళ్లను ఆపేందుకు పట్టాలను తప్పించారు. ఆందోళనను అదుపు చేసేందుకు పోలీసులు అహ్మదాబాద్, సూరత్, మోహసానా, విస్‌నగర్, ఉంజిలో కర్ఫ్యూ విధించారు. కొద్ది మంది ప్రజా ప్రతినిధులకు చెందిన ఆస్తులను ఆందోళన కారులు ధ్వంసం చేశారు. గుజరాత్‌లోని పటేల్ కులస్తులను ఒబిసి జాబితాలో చేర్చాలని రెండు నెలలుగా పాస్ ఆధ్వర్యంలో ఆందోళన నిర్వహిస్తోంది.

### నాగా మిలిటెంట్ల కాల్చివేత

నాగాలాండ్‌లోని టుయెన్‌సాంగ్ జిల్లాలో అంతర్జాతీయ సరిహద్దు వద్ద పోలీసులు జరిపినకాల్పుల్లో ఎన్ఎస్‌సిఎన్(కె)కు చెందిన నలుగురు మిలిటెంట్లు మృతిచెందారు. ఆగస్టు 28న పాంగ్లా ప్రాంతంలో విధులు నిర్వహిస్తుండగా ఒక ద్విచక్ర వాహనంతో పాటు రెండు కార్లు తమను సమీపించాయని ఆపడానికి ప్రయత్నించగా వారు కాల్పులకు దిగారని, దీంతో ఎదురు కాల్పులు జరపాల్సి వచ్చిందని అసోం రైఫిల్స్ అధికార ప్రతినిధి తెలిపారు.

### భూ సేకరణ ఆర్డినెన్స్ వెనక్కు

బిహార్ భూసేకరణ ఆర్డినెన్స్‌ను ప్రభుత్వం నాలుగోసారి జారీ చేయకుండా కేంద్ర ప్రభుత్వం ప్రత్యామ్నాయ మార్గాన్ని ఎంచుకుంది. భూసేకరణ చట్టం కింద భూమిని కోల్పోయిన వారికి నిర్దేశిత ప్రయోజనాలు అందించడానికి వీలుగా 13 చట్టాలను భూసేకరణ చట్టం పరిధిలోకి తిరిగి తీసుకొస్తూ ఆగస్టు 28న ఆదేశాలు జారీ చేసింది. ఈ 13 చట్టాల పరిధిలోని భూసేకరణ కేసులన్నిటిలో పరిహారం, పునరావాసం తదితర అంశాలపై నిబంధనల వర్తింపునకు దీనివల్ల అవకాశం లభిస్తుంది. ఇప్పుడు చేర్చిన 13 చట్టాలను 2013 నాటి భూసేకరణ చట్టం నుంచి నాడు మినహాయించారు. వీటిలో జాతీయ రహదారులు, రైల్వేలు, రక్షణ, జాతీయ భద్రత తదితర అంశాలకు చెందినవి ఉన్నాయి. కేంద్రం వీటిని తిరిగి చేరుస్తూ ఆదేశాలు జారీ చేసింది.

### హేతువాది కల్బుర్గీ హత్య

కర్ణాటకకు చెందిన ప్రముఖ హేతువాది, హంపి యూనివర్సిటీ మాజీ వైస్‌చాన్సలర్ మల్లేశప్ప మడివాళప్ప కల్బుర్గీ(77) ఆగస్టు 30న హత్యకు గురయ్యారు. ధార్వాడ్‌లోని కల్బుర్గీ ఇంటివద్దే ఇద్దరు గుర్తుతెలియని వ్యక్తులు తుపాకీతో కాల్చిచంపారు. హేతువాద భావాలు కల కల్బుర్గీ విగ్రహారాధన వంటి మూఢ నమ్మకాలను వ్యతిరేకిస్తూ రచనలు చేశారు. కల్బుర్గీ హత్యకేసును సిబిఐకి అప్పగించాలని కర్ణాటక మంత్రి వర్గం ఆగస్టు 31న తీర్మానించింది. కన్నడ భాషాభివృద్ధికి కల్బుర్గీ విశేషంగా కృషి చేశారు. 2006లో ఆయన కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డుకు ఎంపికయ్యారు. ఆయన రచించిన మార్గ 4 అన్న పరిశోధనాత్మక వ్యాసాలకు కర్ణాటక సాహిత్య అకాడమీ అవార్డు, జనపథ్ అవార్డులు అందుకున్నారు. ఇంకా ఉన్నతమైన రాష్ట్రీయ గీతం అవసరం అన్నందుకు 2007లో ఆయనపై విమర్శలు వచ్చాయి.

### మరణ దండన రద్దు చేయండి

ఉగ్రవాద నేరాల్లో మినహా మరణ దండనను రద్దుచేయాలని పేర్కొంటూ న్యాయ కమిషన్ ఆగస్టు 31న ప్రభుత్వానికి నివేదిక సమర్పించింది. చట్టాల్లో నుంచి ఉరిశిక్ష తొలగింపును సమర్థిస్తూ న్యాయ కమిషన్ ముసాయిదా నివేదిక రూపొందించినట్లు తెలుస్తోంది. దీని నుంచి ఉగ్రవాదులను మాత్రం మినహాయించినట్లు సమాచారం. అయితే కమిషన్ సభ్యుల్లో ఇద్దరు దీన్ని వ్యతిరేకించినట్లు తెలుస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా మరణ శిక్షలు అమలు చేస్తున్న 59 దేశాల్లో భారత్ ఒకటి.

### మణిపూర్ ప్రజా ప్రతినిధుల ఇళ్లకు నిప్పు

మణిపూర్ శాసన సభలో ఆమోదం పొందిన కొన్ని బిల్లుల పట్ల ఆగ్రహం వ్యక్తం చేస్తూ ఆగస్టు 31న ప్రజాప్రతినిధుల ఇళ్లకు నిప్పుపెట్టారు. చురాచంద్‌పూర్ జిల్లాలో రాష్ట్ర మంత్రి, ఒక ఎం.పి, ఐదుగురు శాసన సభ్యుల ఇళ్లకు నిప్పుపెట్టారు. చురాచంద్‌పూర్ పట్టణంలోని ఓ పోలీస్ స్టేషన్‌ను తగులబెట్టారు. మణిపూర్ స్థానిక ప్రజల్ని పరిరక్షించే ఉద్దేశ్యంతో మూడు బిల్లుల్ని ఆమోదించడం దీనికి కారణమైంది. రెండు రోజులుగా జరుగుతున్న ఈ సంఘటనల్లో ఐదుగురు మృతి చెందారు.

### విజయవంతమైన సార్వత్రిక సమ్మె

బిహార్ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేపడుతున్న కార్మిక, కర్షక, ప్రజావ్యతిరేక విధానాలకు నిరసనగా 11 జాతీయ స్థాయి కార్మిక సంఘాలు సెప్టెంబర్ 2న సమ్మెలో పాల్గొన్నాయి. దేశ వ్యాప్తంగా 15 కోట్ల మంది కార్మికులు, ఉద్యోగులు సమ్మెలో పాల్గొన్నారు. సమ్మె కారణంగా దేశంలో అన్ని ప్రభుత్వ రవాణా, ఆఫీసులు స్థంభించి పోయాయి. కార్మిక చట్టాలకు మోడీ ప్రభుత్వం చేపడుతున్న సవరణలను వ్యతిరేకించడమే సమ్మెలో ప్రధానమైన అంశం. కార్మికులకు ఉన్న ట్రేడ్ యూనియన్ హక్కులను, ప్రయోజనాలను తొలగిస్తూ, యజమానుల ఇష్టానుసారం నియామకాలు, రిట్రెంచ్‌మెంట్‌లు జరిపేందుకు హక్కులు కల్పిస్తూ ప్రభుత్వం కార్మిక చట్టాలకు సవరణలు చేస్తోంది.

### బీహార్‌లో అసెంబ్లీ ఎన్నికలు

బీహార్ 243 అసెంబ్లీ స్థానాలకు అక్టోబర్ 12న 49 నియోజకవర్గాలు, 16న 32 నియోజకవర్గాలు, 28న 50 నియోజకవర్గాలు, నవంబరు 1న 55 నియోజకవర్గాలు, 5న 57 నియోజకవర్గాల్లో ఎన్నికలు నిర్వహించనున్నట్లు కేంద్ర ప్రధాన ఎన్నికల కమిషనర్ నసీంజైదీ సెప్టెంబరు 9న విలేకరుల సమావేశంలో తెలిపారు. ఓట్ల లెక్కింపు నవంబరు 8న చేపట్టనున్నట్లు ఎన్నికల సంఘం ప్రకటించింది. రాష్ట్రంలోని మొత్తం 62,779 పోలింగ్ కేంద్రాల్లో కేంద్ర సాయుధ పోలీసు బలగాలను మోహరిస్తున్నట్లు తెలిపారు. ప్రస్తుత అసెంబ్లీ గడువు నవంబరు 29న ముగియనుంది.

### కశ్మీర్‌లో ఎన్‌కౌంటర్ - నలుగురు మృతి

ఉత్తర కశ్మీర్‌లో సెప్టెంబర్ 11న కుప్వారా జిల్లా లరిబర్ గ్రామం వద్ద జరిగిన ఎన్‌కౌంటర్‌లో ఇద్దరు కశ్మీర్ మిలిటెంట్లు, ఇద్దరు జవాన్లు మృతి చెందారని సైనికాధికారి తెలిపారు.

### మాలేగావ్ కేసు నుంచి వైదొలగిన న్యాయమూర్తి

మాలేగావ్ పేలుళ్ల కేసులో ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్ తొలగింపునకు వ్యతిరేకంగా దాఖలైన పిటిషన్‌ను విచారించకుండా సుప్రీంకోర్టు జడ్జి జస్టిస్ యు.యు. లలిత్ స్వచ్ఛందంగా సెప్టెంబర్ 23న వైదొలిగారు. ఈ కేసులో ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను ఎన్ఐఎ తొలగించడానికి వ్యతిరేకంగా దాఖలైన అభ్యర్థనను తాను విచారించలేననీ, ఇదే కేసులో నిందితుల తరపున ప్రాతినిధ్యం వహించడమే కారణమని అన్నారు. ఈ కేసులో కాస్త చూసీ చూడనట్లుగా పోవాలంటూ ఇంతకు ముందు ఉన్న ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌పై జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఎ) అధికారులు ఒత్తిడి తెచ్చారని ఆరోపిస్తూ హర్ష్ మందిర్ అనే వ్యక్తి ప్రజాప్రయోజన వ్యాజ్యం దాఖలు చేశారు.

### తీస్తా సెతల్వాద్‌ను వెంటాడుతున్న పాలకులు

సామాజిక కార్యకర్త తీస్తా సెతల్వాద్, ఆమె భర్త జావెద్ ఆనంద్‌లను కస్టడీలోకి తీసుకునేందుకు అనుమతించాలని సిబిఐ సెప్టెంబర్ 25న సుప్రీంకోర్టును ఆశ్రయించింది. వీరికి ముంబై హైకోర్టు ఆగస్టు 11న ఇచ్చిన ముందస్తు బెయిల్‌ను సవాల్‌చేస్తూ సిబిఐ ఈ మేరకు పిటిషన్ దాఖలు చేసింది. విదేశీ విరాళాల నియంత్రణ చట్టం (ఎఫ్‌సిఆర్ఎ) నిబంధనల ఉల్లంఘనల ఆరోపణలు ఎదుర్కొంటున్న సెతల్వాద్, ఆమె భర్త దర్యాప్తుకు సహకరించడం లేదని కావున వారిని అదుపులోకి తీసుకొని విచారించేందుకు అనుమతించాలని కోరింది. దీనిపై సెతల్వాద్ స్పందిస్తూ గుజరాత్‌లో బాధితులకు న్యాయం జరగాలని ప్రారంభించిన పోరాటం అధికార పక్షం ఆగ్రహానికి కారణమౌతోందని, ఇదంతా కక్ష సాధింపు చర్య అన్నారు. వీ

## లిబియాలో నౌక మునక

లిబియా తీర ప్రాంతంలో ఆగస్ట్ 27న నౌక మునిగిపోవడంతో వంద మందికి పైగా ప్రయాణికులు మరణించారు. ఆ సమయంలో నౌకలో దాదాపు నాలుగు వందల మంది వరకు ఉన్నారు. రెండు వందల మందిని రక్షించారు. మిగతా వారి ఆచూకి ఇంకా తెలియరాలేదు. అంతర్గత యుద్ధాల వల్ల ప్రజలు దేశం నుండి పారిపోవడానికి సముద్ర మార్గాన్ని ఎంచుకోవడం ఈ ప్రమాదాలు సంభవిస్తున్నాయి.

## యూరప్‌లో తీవ్రమవుతున్న శరణార్థుల సమస్య

మధ్య ప్రాచ్య దేశాల నుంచి వస్తున్న వలసల వల్ల యూరప్‌లోని పలు దేశాలు తీవ్ర ఆందోళన చెందుతున్నాయి. శరణార్థులను కాపాడడంలో యూరప్ దేశాలు బాధ్యత వహించాలని ఫ్రాన్స్ విదేశాంగ మంత్రి లారెంట్ ఫాబియస్ అన్నారు. స్కాండేవియన్ దేశాలైన హంగేరి సరిహద్దులో ఇనుప కంచెను కట్టడం, మాసిడోనియా ఏకంగా ఎమర్జెన్సీ విధించడంపై ఆగ్రహం వ్యక్తం చేశారు. సిరియా, ఇరాక్, అఫ్ఘనిస్తాన్, లిబియా దేశాల నుంచి శరణార్థుల తాకిడి ఎక్కువవుతోంది. శరణార్థులు యూరప్‌లోకి ప్రవేశించడానికి చేస్తున్న ప్రమాద ప్రయాణాలు, సరిహద్దులు దాటడం కోసం ఎంచుకుంటున్న మార్గాలు ప్రమాదకరంగా మారాయి వందలాది ప్రాణాలు హరిస్తున్నాయి. గ్రీస్, ఇటలీ, జర్మనీ వంటి దేశాలు ఈ శరణార్థులపట్ల కొంత ఉదారంగా వ్యవహరిస్తున్నాయి. సాధ్యమైనంత ఎక్కువ మందికి ఆశ్రయం కల్పించడానికి జర్మనీతో సహా ఇతర యూరప్ దేశాలు అంగీకరించాయనీ, శరణార్థులకు సంఘీభావం తెలపాలని జర్మనీ ప్రభుత్వ అధికార ప్రతినిధి స్టీఫెన్ సైబర్ట్ అన్నారు.

## సోమాలియాలో శాంతి సైన్యంపై దాడి

సోమాలియాలో శాంతిని నెలకొల్పేందుకు ఏర్పాటు చేసిన శాంతి పరిరక్షక దళం క్యాంపుపై అల్-షబాబ్ అనే తీవ్రవాద సంస్థ సెప్టెంబర్ 1న దాడి చేసింది. ఈ దాడిలో యాభై మంది సైనికులు చనిపోయారు. దాడి చేసిన అనంతరం భారీ సంఖ్యలో ఆయుధాలు ఎత్తుకుపోయారు. మరో వందికి పైగా సైనికుల ఆచూకి తెలియడం లేదు. జనాలె జిల్లా లోయర్ షెబెల్ ప్రాంతంలో ఉన్న అమిసమ్ (ఆఫ్రికా యూనియన్ మిషన్ సోమాలియా) క్యాంపు మెరుపు దాడి చేయడంతో మృతుల సంఖ్యగా భారీగా నమోదయింది.

## ప్రపంచాన్ని కుదిపేసిన అలన్ కుర్దీ మృతదేహం

సిరియా నుంచి వలస బాట పట్టి సముద్రంలో మునిగి చనిపోయిన మూడేళ్ల బాలుడు అలన్ కుర్దీ మృతదేహం సముద్ర తీరానికి కొట్టుకు రావడం, ఆ మృతదేహం ఫొటో సోషల్ మీడియాలో రావడంతో మొత్తం ప్రపంచమే నివ్వెరపోయింది. సిరియాలోని కొబానే పట్టణం నుంచి పారిపోయి టర్కీకి చేరుకుని, అక్కడి నుంచి కెనడాకు వలస వెళ్లాలనే ప్రయత్నంలో పడవలో ప్రయాణిస్తుండగా ఈ ప్రమాదం జరిగింది. తండ్రి అబ్దుల్లా, తల్లి, సోదరుడుతో కలిసి పడవలో సముద్ర ప్రయాణం సమయంలో పడవలో నుంచి జారిపోవడంతో తల్లి, సోదరుడు గాలిబ్, అలన్ కుర్దీలు మరణించారు. అలన్ కుర్దీ మృతదేహం సముద్ర తీరంలో కొట్టుకు వచ్చి ఒడ్డున పడి ఉన్న దృశ్యం ప్రచారం కావడంతో ప్రపంచం మొత్తం తీవ్ర భావోద్వేగానికి గురైంది.

## సిరియాలో చారిత్రక కట్టడాల కూల్చివేత

సిరియాలోని చారిత్రక కట్టడాలను ఇస్లామిక్ స్టేట్ తీవ్రవాదులు కూల్చివేస్తున్నారు. పామీరా నగరంలో క్రీ.శ. ఒకటి - రెండు శతాబ్ద కాలం నాటివిగా ఉన్న మూడు చారిత్ర పురాతత్వ కట్టడాలను సెప్టెంబర్ మొదటి వారంలో కూల్చివేశారు. పామీరా నగరంపై పట్టు సాధించిన తరువాత వరుసగా చారిత్రక కట్టడాలను ఇస్లామిక్ స్టేట్ దళాలు కూల్చివేస్తున్నాయి. మరో వక్క ఇస్లామిక్ స్టేట్ దళాలు, తిరుగుబాటుదార్లకు మధ్య జరుగుతున్న పోరులో సామాన్య ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు. సెప్టెంబర్ 5న అలెప్పో ప్రావిన్స్‌లో జరిగిన భీకర దాడిలో 47 మంది చనిపోయారు. తిరుగుబాటు దారుల ఆధీనంలోని మారియా అనే పట్టణాన్ని స్వాధీనం చేసుకోవడానికి ఇస్లామిక్ స్టేట్ చేసిన దాడిలో తిరుగుబాటుదారులు 20 మంది, ఐఎస్ తీవ్రవాదులు 27 మంది చనిపోయారు.

## సింగపూర్‌లో ఎన్నికలు

సింగపూర్ పార్లమెంట్‌కు సెప్టెంబర్ 11న సాధారణ ఎన్నికలు జరిగాయి. దాదాపు ఇరవై ఐదు లక్షల మంది ఓటర్లు తమ ఓటు హక్కును వినియోగించుకున్నారు. 1965లో స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఒకేసారి 89 పార్లమెంట్ స్థానాలకు ఎన్నికలు నిర్వహించడం ఇదే తొలిసారి. సింగపూర్ వ్యవస్థాపక ప్రధాని లీక్వాన్ యూ లేకుండా జరుగుతున్న మొదటి ఎన్నికలు కూడ. ఈ ఎన్నికల్లో అధికార పీపుల్స్ యాక్షన్ పార్టీ (పిఏపి) విజయం సాధించింది. 89 పార్లమెంటరీ స్థానాల్లో 83 స్థానాలను కైవసం చేసుకుంది. ప్రతిపక్షం వర్కర్స్ పార్టీ (డబ్ల్యుపి)కి ఆరు స్థానాలు మాత్రమే వచ్చాయి. దీంతో ప్రధానిగా లీసియాన్ లూంగ్ మరోసారి ఎన్నికయ్యారు.

## మక్కాలో ప్రమాదాలు

సౌదీ అరేబియాలోని మక్కా మసీదులో జరిగిన రెండు ప్రమాదాల్లో వందలాది యాత్రికులు మరణించారు. మక్కా మసీద్‌లోని ప్రాంగణాన్ని విస్తరించేందుకు భారీ క్రేన్లతో పని జరుగుతోంది. సెప్టెంబర్ 11న వందలాది మంది ప్రార్థనలు చేస్తుండగా ఉరుము పడి ఒక్కసారిగ ఒక భారీ విరిగి పడడంతో 107 మంది మరణించారు. రెండు వందల మందికి పైగా గాయపడ్డారు. సెప్టెంబర్ 24 పవిత్ర బక్రీద్ పండుగ రోజున జరిగిన తొక్కిసలాటలో వెయ్యి మందికి పైగా మరణించారు. మక్కా మసీద్ మీనా జమారత్ బ్రిడ్జి వద్ద ఒకే సారి రెండు వైపుల నుంచి భక్తులు తరలి రావడంతో ఈ తొక్కిసలాట జరిగింది. మరో వెయ్యి మందికి పైగా గాయాల పాలయ్యారు. మృతుల్లో ఎక్కువగా ఆఫ్రికా, ఇరాన్ దేశస్తులు ఉన్నారు.

## జపాన్ రక్షణ బిల్లు

జపాన్ ప్రభుత్వం రక్షణకు సంబంధించిన రాజ్యాంగ బిల్లును సెప్టెంబర్ 18న ఆమోదం పొందింది. విదేశాల్లో తమ సైనిక కార్యకలాపాలకు ఉద్దేశించిన కీలకమైన రాజ్యాంగ బిల్లుపై గత వారం రోజులుగా దేశవ్యాప్తంగా నిరసన ప్రదర్శనలు జరుగుతున్నాయి. ఈ బిల్లు అమెరికాకు అనుకూలమంటూ పౌరుల నుంచి, ప్రతిపక్షాల నుంచ తీవ్ర వ్యతిరేకత పెల్లుబికింది.

## లౌకిక, ప్రజాస్వామ్య దేశంగా నేపాల్

నేపాల్‌లో నూతన రాజ్యాంగం అమలులోకి వచ్చింది. సెప్టెంబర్ 20న పార్లమెంట్‌లో స్వల్ప నిరసనల మధ్య నూతన రాజ్యాంగం ఆమోదం పొందింది. మొత్తం దేశాన్ని ఏడు ప్రావిన్సులతో కూడిన సమాఖ్య వ్యవస్థగా విభజించారు. నూతన రాజ్యాంగంలో 37 డివిజన్లు, 304 ఆర్టికల్స్, 7 అనుబంధాలున్నాయి.

## మళ్లీ సిప్రాస్ గెలుపు

గ్రీస్ పార్లమెంట్‌కు సెప్టెంబర్ 20న జరిగిన ఎన్నికల్లో మాజీ ప్రధాని అలెక్సిస్ సిప్రాస్ నేతృత్వంలోని సిరిజా పార్టీ విజయం సాధించింది. యూరోజోన్ ఉద్దీపనల సాయం అందుకునేందుకు అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు విధించిన షరతులకు తలొగ్గి చేసుకున్న ఒప్పందాల నేపథ్యంలో వచ్చిన విమర్శలతో తన పదవికి రాజీనామా చేసి సిప్రాస్ తిరిగి ఎన్నికల్లో స్పష్టమైన మెజారిటీ సాధించడంతో మరోసారి ప్రధాని అయ్యారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(ఆగస్టు 1 నుండి ఆగస్టు 31, 2015 వరకు తెలంగాణలోని 9 జిల్లాలు (984), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (793) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1777)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 4 | – | 23 | 18 | 8 | 13 | 14 | 3 | 3 | 3 | 4 | – | 1 | 28 | 32 | – | – | – | 3 | 4 |
| హైదరాబాద్ | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| కరీంనగర్ | – | 4 | 3 | 8 | 18 | 3 | 5 | 4 | 2 | 2 | 4 | 1 | 1 | 11 | 16 | 15 | – | – | – | – | – |
| ఖమ్మం | – | 1 | – | 5 | 10 | 3 | 9 | 7 | – | 1 | 5 | 1 | – | 2 | 9 | 16 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 15 | – | 13 | 14 | 2 | 4 | 1 | 6 | 5 | 2 | 11 | 13 | 13 | 48 | 1 | – | – | – | – | 12 |
| మెదక్ | 3 | 19 | 2 | 9 | 14 | 22 | 14 | 1 | 13 | 22 | 15 | 19 | 9 | 11 | 39 | 16 | – | – | – | 3 | 5 |
| నల్గొండ | – | 6 | – | 1 | 10 | 1 | 2 | 2 | – | 3 | 1 | 4 | – | 9 | 15 | 17 | – | – | – | – | 4 |
| నిజామాబాద్ | – | – | – | 6 | 17 | – | – | – | – | – | 3 | – | – | 2 | 15 | 11 | – | – | – | – | – |
| వరంగల్ | – | 7 | – | 4 | 14 | 5 | 8 | 3 | – | 1 | 1 | 5 | – | 5 | 12 | 16 | – | – | – | – | 3 |
| రంగారెడ్డి | – | 1 | – | 2 | 2 | – | 4 | 1 | 3 | 2 | 2 | 5 | 1 | 6 | 14 | 8 | – | – | – | – | 4 |
| **తెలంగాణ** | **4** | **49** | **5** | **71** | **117** | **44** | **59** | **33** | **27** | **39** | **36** | **50** | **24** | **60** | **196** | **132** | **-** | **-** | **-** | **6** | **32** |
| అనంతపురం | – | 15 | – | 14 | 11 | 2 | 2 | 3 | – | 3 | 3 | – | 9 | 5 | 44 | 2 | – | – | – | – | – |
| చిత్తూరు | – | 2 | – | 4 | 3 | 9 | 12 | – | 4 | 8 | – | – | 12 | 1 | 21 | 12 | – | – | – | – | – |
| కడప | – | 3 | – | 4 | 3 | – | – | 2 | – | 2 | 2 | 3 | 1 | 2 | 10 | 7 | – | – | – | – | – |
| గుంటూరు | – | 2 | – | 2 | 4 | – | 1 | 1 | – | 2 | 1 | 3 | – | – | 7 | 12 | – | – | – | – | 3 |
| కృష్ణా | – | – | – | 3 | 5 | 1 | 4 | 2 | – | – | – | – | 1 | – | 18 | 8 | – | – | – | – | – |
| కర్నూలు | – | 3 | 1 | 5 | 3 | 5 | 6 | 8 | 5 | 2 | 2 | 4 | 7 | 4 | 15 | 20 | – | – | – | – | 5 |
| తూర్పు గోదావరి | – | 2 | – | 2 | 8 | – | – | 2 | 1 | – | – | – | 3 | 1 | 22 | 17 | – | – | – | – | – |
| ప్రకాశం | – | – | – | 4 | 8 | – | 3 | 6 | – | 2 | – | 1 | – | 3 | 10 | 11 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | 2 | – | 9 | 9 | 5 | 6 | 3 | – | 1 | – | 1 | 3 | 1 | 22 | 7 | – | – | – | – | 2 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 3 | 5 | – | 6 | 1 | 1 | 2 | – | – | – | 3 | 11 | 15 | – | – | – | – | 1 |
| నెల్లూరు | – | – | – | 2 | 3 | 1 | 4 | 1 | – | 4 | – | – | 1 | 5 | 12 | 7 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 2 | 1 | 1 | 8 | – | – | 2 | 1 | – | – | 5 | 7 | 9 | – | – | – | – | 1 |
| విశాఖపట్నం | – | – | – | 4 | 13 | 3 | 3 | – | 3 | 5 | 2 | 1 | 3 | 1 | 15 | 17 | – | – | – | 5 | 1 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **29** | **1** | **58** | **76** | **27** | **55** | **29** | **14** | **33** | **11** | **13** | **40** | **31** | **214** | **144** | **-** | **-** | **-** | **5** | **13** |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 171 - October 2015 • **ISSN 2231-6892**
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/9/2014 • Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

Date of Posting : 29th, 30th

# ‘వీక్షణం’ను ఆదుకుందాం
# ‘వీక్షణం’ నాలుగు కాలాల పాటు నిలిచేందుకు చేయూతనిద్దాం

తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి పత్రిక ఉండాలనే ఆలోచనతో, సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు సంపాదకులుగా 2003లో ప్రారంభమై, 2005 నుంచి ఎన్. వేణుగోపాల్ సంపాదకత్వంలో నడుస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక ‘వీక్షణం’ తెలుగు సమాజానికి అవసరమైన చర్చావేదికగా పనిచేస్తున్నదని, మనందరితో పాటు ఎందరో పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నదని మనకు తెలుసు. పదమూడు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ దినదిన గండంగానే ఉంటున్నది. ఎప్పుడు ఆగిపోతుందో తెలియదని దాదాపు ప్రతినెలా పత్రికలో అచ్చవుతున్న ఆందోళనాకరమైన ప్రకటన, ఈ పత్రికను నిలబెట్టడానికి తోడ్పడమనే అభ్యర్థనలు మా ఈ బహిరంగ ప్రకటనకు కారణం. ఇంతకాలంగా నిర్వాహకులు కష్టనష్టాలు భరిస్తూ సాగించిన కృషికి ఇప్పుడు మన సహకారం అవసరమని చెప్పడానికే ఈ ప్రకటన.

‘వీక్షణం’ ఈ పదమూడు సంవత్సరాలలో మూడువేలకు పైగా వ్యాసాలను ప్రచురించి ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలెన్నిటి పైననో తెలుగు సమాజానికి అత్యవసరమైన సమాచారాన్నీ, వివరణలనూ, విశ్లేషణలనూ అందించింది. సంపాదకుడి అభిప్రాయాలే వైనప్పటికీ, తెలుగు సమాజంలో ఉన్న ప్రగతిశీల భావాలకూ, ధోరణులకూ అన్నిటికీ ప్రజాస్వామిక స్ఫూర్తితో వేదిక కల్పించింది. ప్రతిష్ఠాత్మకమైన ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు సంపాదించి పరిశోధక విద్యార్థులకు, విశ్వవిద్యాలయ అధ్యాపకులకు అవకాశాలు కల్పించింది. ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు, సంభాషణలు ఏర్పాటు చేసి తెలుగు సమాజంలో సామాజిక శాస్త్ర రచనను ప్రోత్సహించింది. వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించి వ్యాసప్రక్రియ ప్రమాణాలు పెంచడానికి తన వంతు కృషి చేసింది. పత్రికలో లబ్ధప్రతిష్ఠుల రచనలు ప్రచురించడంతో పాటు, విషయమే ప్రధానంగా ఐదారు వందలమంది కొత్త వ్యాసకర్తలకు అవకాశం కల్పించింది. ‘ఒక దళారీ పశ్చాత్తాపం’ వంటి విస్తృత ప్రచారం పొందిన పుస్తకంతో సహా దాదాపు డజను పుస్తకాలు ప్రచురించింది.

తెలుగు సమాజానికీ, మేధో ప్రపంచానికీ, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణకూ ఇంత దోహదం చేసిన ‘వీక్షణం’ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, ఆ దీపం కొడిగట్టిపోకుండా కాపాడడం సమాజం బాధ్యత. ఇతోధిక పాఠకులను తయారు చేయడం, విరివిగా చందాలు చేర్పించడం, వ్యాపార ప్రకటనలు సేకరించిపెట్టడం, విరాళాలు అందించడం మన కనీస కర్తవ్యం. ‘వీక్షణం’ శ్రేయోభిలాషి, చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ ‘వీక్షణం’ రచయితల సమావేశాల్లో సూచించినట్టుగా ఆర్థిక ఇబ్బందుల నుంచి సుస్థిరమైన పద్ధతిలో గట్టెక్కాలంటే ‘వీక్షణం’కు ఒక మూలనిధి కూడ ఏర్పాటు చేయవలసి ఉంది. మనంతట మనం మన శక్తి మేరకు గాని, విరాళాలు ఇవ్వగలిగిన మిత్రుల ద్వారా గాని ఈ మూలనిధి విరాళాలు సేకరించి మనందరికీ, మొత్తంగా సమాజానికీ అవసరమైన ‘వీక్షణం’ రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికను కాపాడుకుందాం. ఈ చైతన్యజ్వాల ఆరిపోకుండా మన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు నిరంతరం ప్రసరించనిద్దాం.

ఎం. కోదండరామ్
వరవరరావు
R. నారాయణ మూర్తి
ఎం. గంగాధర్

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao